

# భారతి

## సాహిత్య మాసపత్రిక


వ్యవస్థాపకులు:
**దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు**

**1961 ఆగస్టు**

సంపుటి: 38

సంచిక: 8

**వెల ఒకరూపాయి**




ఇంకా అనేక వ్యాసాలు, కథానికలు, నాటిక, కలగూరగంప, గ్రంథవిమర్శనలు.

# భారతి

సాహిత్య మాసపత్రిక



సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్

ఆగస్టు 1961

సంపుటము 38 : : సంచిక 8

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## ఆగస్టు 1961



## గమనిక

ప్రచురింపబడని రచనలు తిరిగి పంపగోరువారు తగినన్ని తపాలాబిళ్ళలు జతపరచవలెను. రచయితలు తమ చిరునామా మార్పులు వెంటనే తెలియజేయ ప్రార్థితులు.

# సౌందర్యలహరి

శ్రీ కాటూరి వెంకటేశ్వరరావు

*తనుమధ్య క్వణకింకిణీ రశన
మాద్యత్కుంభికుంభోపమ
స్తనభారానత దేహావల్లిక,
శరద్రాకాశశాంకాస్యయై
ధనువున్ దూపులు పాశ మంకుశము
నుద్యత్పాణులందాల్చి మా
కనువిందై పురదాహకాహమికయా
కళ్యాణి మమ్మేలుతన్

చక్కెర విల్లు, వింటికిని
షట్పదశింజినియంట! తూపులున్
లెక్కకు నైదటామనియె
నెయ్యుడుగా, వలినాలిగాలి తే
రెక్కి యనంగు డెక్కటి
జయించెడునంట జగమ్ము, లేదయా
దృక్కిరణమ్ము సుంత ప్రసరించెనొ
నీ కడకంట వానిపై!

పలుకన్ లేక కవుల్ చతుర్ముఖముఖుల్
పల్కోకలన్ గల్పనల్
సలుపంబూనుదు, రచ్చరల్ గనుల
గాంచన్ లేక కాంక్షింత్రు శ్రీ
గళసాయుజ్యము మానిదుర్లభము,
నింకన్ జెప్పగా జూడ గా
దలమే యొడ్లకు సద్రిరాట్సుత,
భవత్సౌందర్య సర్వస్వమున్

---

* సౌందర్యలహరిలో కొన్ని శ్లోకాలు మాత్రమే ఈ శీర్షికలో పరివర్తితములు.

పరువంబేటికి, ప్రాయమేమిటికి,
రూపంబేల, నర్మక్రియా
సరసత్వంబదియేల నీదగు
కటాక్షంబున్నచో వృద్ధ వా
నరునేని మరులూని ప్రాయపు
నెలంతల్ పయ్యెదల్ జార, పె
న్నెరి కొప్పుల్ విరబార,
కాంచికలున్ జీరాడ వెన్నాడరే!

కరముల బుస్తకమ్ము, స్ఫటిక
మ్ములపేరు, వరాభయమ్ములున్
వరల, శశాంక కోరక విభాసి
జటామకుటమ్ముతో శరత్
స్ఫుర దభిరామచంద్రికను బోని
నినుం గనుగొని వారికిన్
దొరలునె గోస్తనీరస మధు
ద్రవతుల్యవచఃప్రసారముల్

వరదాభీతిదపుస్తకస్ఫటిక
మాలాపాణివై, పూపచం
దురునిం జెర్విన మౌళిచెల్వున
శరజ్జ్యోత్స్నారుచిన్ వెల్గు ని
న్నరయన్నేరని వారి కెట్లొదవు
జిహ్వాగ్రమ్మునన్ గోస్తనీ
సరసమ్ముల్ మధుబిందుపాయన
వచఃస్యందమ్ము లందమ్ములై

*సరసకవీంద్రహృత్కమల
షండ నవాతపరోచివైన ని
న్నరుణను గొల్వ కెట్లొదవు
నంబరో! పల్కులకల్కిపూప ని

---

* వేరొక అనుసరణ.

# సౌందర్యలహరి

బ్బరపు మిటారపు న్వలపువాకల
లోతుల కించుమించులౌ
పరువపు పొందులన్ రసికపాళికి
విందులు పెట్టు నేరుపుల్?

అమృతాంశూపల రోచిరంచిత వశిన్యాదుల్ వచోజాల మూ
లము, లాయమ్ములతో నినుంగొలువ కేలా కల్గు వాగ్దేవతా
రమణీయాస్య సుగంధ బంధురములున్, రామాయణాద్యాది కా
వ్యమహాభంగి మనోహరమ్ములగు వాక్ప్రాగల్భ్యముల్ కొల్లలై?

మనుమిన్నేకముగా దిగంతరమునన్ బంగారు నీరూదు నూ
తన సూర్యద్యుతివోని నీ తనురుచిన్ ధ్యానింపగా నేర్చినన్
దనకున్ మేల్పడి భీతభీతమృగనేత్రల్, మేనకాద్యప్సరోం
గన లెల్లన్ బడికాపులుంద్రు పడకింటన్ గొల్చి కన్సన్నలన్.

"భవాని! నను దాసు బ్రోవు"మని భక్తు డర్థించుచో
"భవాని! నను" నంటయే తడవు; పంకజాక్షాంబుజో
ద్భవామరశిరః కిరీటమణిధామనీరాజితం
బవాప్యపదమిచ్చె దంబరో! త్వదంఘ్రి సాయుజ్యమున్.

షట్కమల పీఠికాగ్రనిషణ్ణ, మగ్ని
మిహిరచంద్ర మయమ్మును, మించుదీవ
బోని నీతేజు నిర్మలమైన మనసు
నందు గనుగొంటయే మహానందరసము.

అమృతపుటూటలైన సకలాంగకకాంతుల నొప్పు చంద్రకాం
త మణివలెన్ నినుందలచు ధన్యుల చల్లనిచూపు లెల్ల తా
పముల నడంచునోజనని! పాపకొలమ్ముల దర్పమార్పద
క్షములు నగుంగదమ్మ వరగారుడమంత్రములై సుధామయీ!

సశేషం.

# ప్రశ్నోత్తరావళి

## స్వర్గీయ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

ఈ క్రింది ప్రశ్నలూ, ఉత్తరాలూ కంఠస్థం చేసుకునే వాడు మంచి సమర్థుడై ఇహపరాలు రెండూ కూడా పూర్తిగా సాధించుకోగలుగుతాడు.

ప్రశ్న—గురుదేవా ! గ్రహించుకోవలసిం దేమిటి ?

ఉత్తరం—గురుని ఉపదేశం.

విడిచిపెట్టవలసిం దేమిటి ?

చెడ్డపని.

అయితే, గురుడంటే యెలాంటివాడు ?

తత్వం బాగా తెలిసినవాడూ, శిష్యుల క్షేమం కోరేవాడున్ను.

బుద్ధిమంతు లయినవారు త్వరపడి చెయ్యవలసిందేమిటి?

సంసారమోహం తెంచుకోడం.

మోక్షం అనే చెట్టుకి విత్తనం యేమిటి ?

వర్ణాశ్రమధర్మాల ననుసరించి కర్మలు చేస్తే చిత్తశుద్ధి కలుగుతుంది. చిత్తశుద్ధివల్ల తత్వజ్ఞానం లబ్బుతుంది. కనక, మోక్షానికి చిత్తశుద్ధే బీజం.

శ్రేయస్సుకలిగించే దేమిటి ?

ధర్మం.

శుచి లయినవా డెవడు ?

నిర్మలమైన హృదయం కలవాడు.

పండితు డెవడు ?

వివేకం కలవాడు.

విషం యేది ?

గురుని యెడల తిరస్కారభావం చూపించడం.

సంసారంలో సారం అయిన దేమిటి ?

ఈ సంగతులే తరచు చర్చించుకోడం.

మనుష్యు లేమి కోరుకుంటూ రెక్కువగా ?

తమకూ, యితరులకూ గూడా మేలు చెయ్యడానికి తగిన జన్మ.

కల్లులాగ మోహం కలిగించేదేది ?

స్నేహం.

దొంగలెవరు ?

విషయాలే.

సంసారపాశం యేది ?

తృష్ణ.

శత్రు వెవడు ?

సోమరి.

దేనివల్ల భయం కలుగుతుంది ?

చావువల్ల.

పుట్టుగుడ్డికంటే గుడ్డివా డెవడు ?

విషయసుఖాలు మరిగినవాడు.

శూరుడైనవా డెవడు ?

స్త్రీలచూపులతో గాయపడనివాడు.

జుర్రుకోతగిన అమృతం యేది ?

మంచి ఉపదేశం.

గొప్పతనానికి మూలం యేమిటి ?

ఎవరినీ యేదీ యాచించకపోడం.

అర్థంకాని దేది ?

స్త్రీల చిత్తం.

నిపుణుడైనవా డెవడు ?

స్త్రీలకు లోబడనివాడు.

దుఃఖాలు కలిగించే దేది ?

తృప్తి లేకపోడం.

తేలికతనం కలిగించే దేది ?

అధము లైనవారిని యాచించడం.

చెప్పుకోతగిన బతుకేది ?

ఏ దోషమూ లేనిది.

జడత్వం అంటే యేమిటి ?

ఎంత చెప్పినా బోధపడకపోడం.

జాగ్రత్తగా ఉండగలవా డెవడు ?

బుద్ధిమంతుడు.

నిద్ర అంటే యేమిటి ?

మూఢత్వమే.

తామరాకులో నీటిచుక్క లాగ చంచలం యేది ?

పడుచుదనమూ, డబ్బూ, ఆయువున్ను.

వెన్నెలలాగ స్వచ్ఛమైనవా రెవరు ?

సజ్జనులు.

నరకం అంటే యేమిటి ?

పరులపాలబడి ఉండడమే.
సౌఖ్యం యేది ?
సర్వమూ విడిచివుండడం.
శ్రమపడి సంపాదించుకోవలసిం దేమిటి ?
అందరికీ యిష్టంగా వుండడం.
ప్రాణికోటికి చాలా యిష్టమైన దేది ?
ప్రాణం.
మనిషికి చెరుపు కలిగించే దేది ?
అభిమానం.
సుఖం కలిగించే దేది ?
సజ్జనులతో మైత్రి.
వ్యసనాలు పోగొట్టుకో గలవా డెవడు ?
త్యాగి.
చావంటే యేమిటి ?
మూర్ఖత్వమే.
ఇంత అని వెలకట్టరాని దేది ?
అత్యవసరమైనప్పుడు చేసిన దానం.
బతికి ఉన్నంతకాలమూ శల్యం అయి పీడించే దేమిటి ?
పరమరహస్యంగా చేసిన పాపం.
బాగా శ్రద్ధ పట్టవలసిం దే విషయంలో ?
చదువుకోడానికీ, మంచి ఔషధం తెచ్చుకోడానికీ, దానమ్ము చెయ్యడానికిన్ని.
శ్రద్ధ చెయ్యగూడని దేది ?
చెడ్డవాళ్ల విషయమూ, పరస్త్రీల విషయమూ, పరులడబ్బు విషయమున్ను.
రాత్రీ పగలూ కూడా యోచించుకోవలసిం దేమిటి ?
సంసారం అన్నమాట.
చాలా యిష్టంగా చూసుకోవలసిన దేమిటి ?
దీనులయెడల దయగా ఉండడమూ, సజ్జనులతో మైత్రి చేసుకోడమున్ను.
ప్రాణాలు పోతా యన్నప్పుడైనా మనసు మారనివా ళ్లెవరు ?
మూర్ఖుడూ, నిత్యశంకితుడూ, దుఃఖితుడూ, కృతఘ్నుడున్ను.
సాధు వెలాంటివాడు ?
మంచి పనులే చేసేవాడు.
నీచు డెవడు ?
చెడ్డపనులు చేసేవాడు.
జగత్తంతా యెలాంటివాడు జయించగలడు ?
సత్యమే పలికేవాడూ, యేమి వచ్చినా సహించుకోగలవాడున్ను.
దేవతలు కూడా ఎలాంటివాణ్ణి చూసి దండం పెడతారు ?
దయగలవాణ్ణి.
సంసారం అంటే జడిసేవా డెవడు ?
బుద్ధిమంతుడు.
లోకు లెవడు చెప్పినట్టు వింటారు ?
సత్యమే పలికేవాడు చెప్పినట్టూ, ఇష్టంగా మాట్లాడే వాడు చెప్పినట్టూ, వినయంగలవాడు చెప్పినట్టున్ను.
నిలవతగిన స్థలం యేది ?
న్యాయమార్గం.
గుడ్డివా డంటే యెవడు ?
చెడ్డపని చేసేవాడు.
చెవిటివా డంటే యెవడు ?
హితం చెప్పినా విననివాడు.
మూగవా డంటే యెవడు ?
సమయం వచ్చినప్పుడు మంచి చెప్పలేనివాడు.
దానం అంటే యేమిటి ?
ఒకరు కోరకుండా స్వయంగా చేసేది.
మిత్రు డెవడు ?
పాపపనులు చెయ్యకుండా అడ్డుతగిలేవాడు.
అలంకరించుకోవలసిన నగ యేది ?
మంచి నడవడి.
మాటకి విలవతెచ్చే దేది ?
సత్యం.
మెరుపులాగ మెరిసిపోయే దేది ?
దుర్జనుల మైత్రీ, స్త్రీలున్ను.
కులమూ, శీలమూ చెరుచుకోనివా రెవరు ?
సజ్జనులు.
చింతామణిలాగ కష్టసాధ్యమైన దేది ?
చతుర్భద్రం.
చతుర్భద్రం అంటే యేమిటి ?
మంచిమాట లాడుతూ యెవరి కయినా యే మయినా యివ్వడమూ, గర్వంలేని జ్ఞానమూ, ఓరిమిగల శౌర్యమూ, త్యాగబుద్ధి గల ఐశ్వర్యమూ—ఈ నాలుగున్ను.
దుఃఖించవలసిం దేమిటి ?
డబ్బున్నా పీనాసి కావడం.
చాలా మంచి దేది ?
ఔదార్యం.
పండితులచేతగూడా పూజించతగ్గవా డెవడు ?
సహజంగా వినయం గలవాడు.
వంశానికి పేరు తెచ్చేవా డెవడు ?
చాలా గుణవంతు డయ్యుండిన్నీ అడకువ కలవాడు.

జగత్తంతా యెవడికి వశపడుతుందీ ?
ప్రియంగా మాట్లాడేవాడికీ, హితంగా మాట్లాడే వాడికీ, ధర్మం తప్పనివాడికిన్నీ.
పాండిత్యానికి వన్నెతెచ్చే దేది ?
సత్యవిత్వమూ, ఎప్పుడూ యెవరికో ఒకరికి, ఏదో ఒక సంగతి బోధచేస్తూ ఉండడమున్ను.
ఆపదలపాలు కానివా డెవడు ?
పెద్దలు చెప్పినట్టు నడుచుకునేవాడూ, ఇంద్రియాలు లోబరుచుకున్నవాడున్ను.
ఎలాంటివాడికి పడుతుందీ ఐశ్వర్యం ?
అలసభావం లేనివాడికీ, నీతిగా నడుచుకునే వాడికిన్నీ.
ఎలాంటివాణ్ణి సిరి విడిచిపెట్టి పోతుందీ ?
బ్రాహ్మలను ద్వేషించేవాణ్ణీ, గురువుని తిరస్కరించేవాణ్ణీ, దేవతలను నిందించేవాణ్ణీ, అలసభావంకలవాణ్ణిన్నీ.
దుఃఖాలపాలు కానివా డెవడు ?
తన చెప్పుచేతల్లో ఉండే భార్య కలవాడూ, స్థిర మైన ఐశ్వర్యం కలవాడున్ను.
జాలిపడ తగినవా డెవడు ?
సిరీ సంపదా ఉండినా దానాలు చెయ్యనివాడు.
నివసించతగిన స్థల మేది ?
సజ్జనుల సన్నిధి, కాశీనగరమున్ను.
విడిచిపోవలసిన దేశం యేది ?
పీనాసితనం కలవాళ్లు చాలామంది వున్నదీ, చెడ్డరాజు ఏలుబడిలో ఉన్నదిన్నీ.
తేలికతనం కలిగించే దేది ?
మూర్ఖులైనవారిని యాచించడం.
రాముడికంటే గొప్ప శూరు డెవడు ?
ఆడవాళ్లను చూసి పిచ్చివాడయిపోనివాడు.
రాత్రీ పగలూ అనకుండా యెప్పుడూ ధ్యానించుకో వలసిం దేమిటి ?
భగవంతుని పాదారవిందం.
కళ్లుండిన్నీ గుడ్డివాళ్లకింద లెక్కలోకి వచ్చేవాళ్లెవళ్లు ?
నాస్తికులు.
కుంటివా డెవడు ?
ముసలితనంలో తీర్థయాత్రలకు బయలుదేరేవాడు.
తీర్థక్షేత్రాల్లో గొప్పదేది ?
మనోమాలిన్యం పోగొట్టేది.
పురుషులెప్పుడూ స్మరించవలసిం దేమిటి ?
హరినామం. మ్లేచ్ఛభాష కాదు.
బుద్ధిమంతులు చెప్పరాని దేమిటి ?
ఇతరుల దోషమూ, అబద్ధమున్ను.
మనిషయినవాడు గడించుకోదగిన దేమిటి ?
విద్యా, డబ్బూ, బలమూ, కీర్తీ, పుణ్యమున్నూ.
మంచితనం పోగొట్టేదేమిటి ?
లుబ్ధత్వం.
పురుషునకు పగవా డెవడు ?
మన్మథుడు.
ఎలాంటి రాజసభకు వెళ్లగూడదు ?
వయసుమళ్లిన మంత్రులు లేని రాజసభకు.
మనిషి బాగా జాగ్రత్తగా ఉండవలసిం దెందులో ?
రాజసేవలో.
ప్రాణాలకంటే గొప్ప దేది ?
కులధర్మమూ, సజ్జన సహవాసమున్నూ.
జాగ్రత్త పెట్టుకోవలసిం దేమిటి ?
కీర్తీ, పాతివ్రత్యమూ, స్వబుద్ధిన్నీ.
లోకంలో, కల్పవృక్షం అనిపించుకోతగ్గ దేది ?
మంచి శిష్యునకు చెప్పిన చదువు.
అక్షయ వటవృక్షంవంటి దేది ?
మంచివాడికి యథావిధిగా చేసిన దానం.
శాస్త్రం అంటే యేమిటి ?
యుక్తి.
అందరికీ తల్లి యేది ?
ఆవు.
బలం అంటే యేమిటి ?
ధైర్యం.
చావంటే యేమిటి ?
గుర్తు లేకపోవటం.
విషం యెక్కడ ఉంది ?
దుర్జనుల దగ్గిర.
ఆశౌచం అంటే యేమిటి ?
ఋణం.
అభయం అంటే యేమిటి ?
వైరాగ్యం.
భయం అంటే యేమిటి ?
డబ్బు.
మనిషికి దుర్లభం యేది ?
హరిభక్తి.
పాపం అంటే యేమిటి ?
ఒకర్ని పీడించడం.
భగవంతునకు ప్రియు డెవడు ?
తాను కంగారుపడనివాడూ, ఇతర్లను కంగారు

పెట్టనివాడున్నూ.
కార్యసిద్ధి దేనివల్ల అవుతుంది ?
తపస్సువల్ల.
బుద్ధి యెక్కడ నిలపాలి ?
బ్రాహ్మలమీద.
బుద్ధి యెలా కలుగుతుంది ?
పెద్దలను సేవించడంవల్ల.
అయితే పెద్ద లెవరు ?
ధర్మతత్వం బాగా తెలిసినవారు.
గౌరవంకలవాడికి మరణాన్ని మించిన దేమిటి ?
అపకీర్తి.
సుఖం ఎవడి కబ్బుతుంది ?
ధనం కలవాడికి.
ధనం అంటే యేమిటి ?
కోరుకున్న వస్తువు జతపరిచేది.
సుఖాల కన్నిటికీ మూలం యేమిటి ?
పుణ్యం.
దుఃఖా లెందు క్కలుగుతాయీ ?
పాపాలు చేసుకుంటేను.
ఎలాంటివాడి కైశ్వర్యం పడుతుంది ?
శంకరుణ్ణి ఆరాధించేవాడికి.
ఎవడు బాగుపడతాడు ?
వినయం గలవాడు.
ఎవడు చెడిపోతాడు ?
గర్వం కలవాడు.
నమ్మదగినవా డెవడు ?
అబద్ధా లాడనివాడు.
ఎందుకోసం అబద్ధం ఆడినా పాపంరాదు ?
ధర్మంకోసం.
ధర్మం యేది ?
వంశపరంపరగా పెద్ద లాచరించినది.
సాధువులకు బలం యేమిటి ?
దైవం.
సాధువంటే యెవడు ?
తృప్తి కలవాడు.
దైవం అంటే యేమిటి ?
చేసుకున్న పుణ్యం.
పుణ్యం గలవా డెవడు ?
సజ్జనుల పొగడ్త లందినవాడు.
గృహస్థు ఆయినవాడికి మిత్రం యెవ్వరు ?
భార్య.
గృహస్థు అంటే యెవడు ?
యజ్ఞం చేసినవాడు.
యజ్ఞం అంటే యేమిటి ?
వేదం చెప్పినది.
ఎలాంటివాడు చేసిన యజ్ఞం సఫలం అవుతుంది ?
శిష్టుడూ, ఆచారవంతుడూ చేసింది.
శిష్టు అంటే యెలాంటివాడు ?
వేదం చెప్పినట్టు నడుచుకునేవాడు.
చెడిపోయేవా డెవడు ?
నైతిక కర్మలు చెయ్యనివాడు.
ధన్యుడైనవా డెవడు ?
సన్యాసి.
గౌరవించతగ్గవా డెవడు ?
సాధువైన పండితుడు.
సేవించతగ్గవా డెవడు ?
దేహీ అంటూ వచ్చేవాళ్లని తృప్తిపరచేవాడు.
మనిషికి భాగ్యం యేమిటి ?
ఆరోగ్యం.
కృతకృత్యు డెవడు ?
కృషిచేసేవాడు.
పాపం అంటనివా డెవడు ?
జపం చేసేవాడు.
పూర్ణపురుషు డెవడు ?
బిడ్డలు కలవాడు.
మనిషికి అసాధ్యం యేమిటి ?
మనస్సు నిగ్రహించుకోడం.
బ్రహ్మచారి అంటే యెవడు ?
రేతస్స్ఖలనం యెరగనివాడు.
పరదేవత యెవరు ?
చిచ్ఛక్తి.
జగన్నాథు డెవరు ?
సూర్యుడు.
జనుల కందరికీ జీవనం కల్పించేవా డెవడు ?
మేఘుడు.
శూరు డెవడు ?
భయగ్రస్తులను రక్షించేవాడు.
రక్షకు డెవడు ?
గురువు.
జగత్తు కంతకూ గురు వెవరు ?

శంభుడు.
జ్ఞానం యెవరిస్తారు ?
శివుడు.
మోక్షం దేనివల్ల వస్తుంది ?
విష్ణుభక్తివల్ల.
విష్ణుమూర్తి అంటే యెవరు ?
అజ్ఞానం పోగొట్టేవాడు.
అజ్ఞానం అంటే యేమిటి ?
ఆత్మబోధ లేకపోడం.
శోకా లెవడికి రావు ?
కోపం లేనివాడికి.
సుఖం అంటే యేమిటి ?
తృప్తి.
రాజంటే యెవడు ?
జనులకు సుఖం కలిగించేవాడు.
కుక్కతో పోల్చతగ్గవా డెవడు ?
నీచులను సేవించేవాడు.
మాయగలవా డెవడు ?
ఈశ్వరుడు.
గారడీవంటి దేమిటి ?
ప్రపంచం.
స్వప్నంవంటి దేది ?
మెళుకువ.
సత్యం యేది ?
బ్రహ్మపదార్థం.
మిథ్య అంటే యేమిటి ?
విద్యవల్ల నశించేది.
తుచ్ఛమైన దేది ?
కుందేటికొమ్ము మొదలైనవి.
చెప్ప శక్యంకాని దేది ?
మాయ.
కల్పితం యేది ?
ద్వైతం.
పారమార్థికమైన దేది ?
అద్వైతం.
అజ్ఞానం యెప్పణ్ణుంచీ ఉంది ?
అనాదినుంచీ.
శరీరం నిలబెట్టేదేది ?
ప్రారబ్ధం.
అన్నం పెట్టే దేమిటి ?
ఆయువు.
బ్రాహ్మడైనవా డెవర్ని పూజించాలి ?
గాయత్రీద్వారానూ, సూర్యునిద్వారానూ, అగ్నిద్వారానూ శంభుణ్ణి.
గాయత్రియందూ, సూర్యునియందూ, అగ్నియందూ, శంభునియందూ ఉన్న దేమిటి ?
తత్వం. అంటే సత్యవస్తువు.
ప్రత్యక్షదేవత యెవరు ?
కన్నతల్లి.
పూజించతగిన గురు వెవరు ?
కన్నతండ్రి.
సర్వదేవతాస్వరూపు డెవడు ?
*జ్ఞానమూ, కర్మానుష్ఠానమూ గల బ్రాహ్మడు.*
వంశం నశింపచేసే దేది ?
సజ్జనులను పీడించడం.
ఎవరిమాట అమోఘంగా జరుగుతుంది ?
సత్యమే పలికేవాళ్ల మాటా, మౌనంగా ఉండేవాళ్ల మాటా, ఇంద్రియాలు అడచుకున్నవారి మాటానూ.
ఈజన్మ యెందు క్కలుగుతుంది ?
విషయాసక్తివల్ల.
ఉత్తరజన్మ అంటే యేమిటి ?
కొడుకు పుట్టడం.
తప్పని దేది ?
చావు.
అడుగు తీసి అడు గెక్కడ పెట్టాలి ?
బాగా పరిశీలించినచోట.
అన్నదానం యెవడికి చెయ్యాలి ?
ఆకొన్నవాడికి.
ఎవరిని పూజించాలి ?
భగవదవతారాన్ని.
భగవంతు డెవడు ?
మహేశ్వరుడు. హరిహరస్వరూపం అన్నమాట.
భగవద్భక్తి ఫలం యేమిటి ?
భగవంతుడు కనపడ్డం. అంటే, ప్రత్యక్షం కావడం.
మోక్షం అంటే యేమిటి ?
అవిద్య అంతరించిపోడం.
వేదాల కన్నిటికీ ఉత్పత్తిస్థానం యేది ?
ఓంకారం.
ఈ ప్రశ్నోత్తరాలు కంఠస్థం చేసుకోగలవారు ఆణి ముత్యాల్లా ప్రకాశిస్తారు.

[శంకర భగవత్పాదుల కృతి కనుకృతి]

# ఆకలి

## శ్రీ రాచకొండ విశ్వనాథశాస్త్రి

అన్నారావుని శనిలా వెంటాడుతున్నాడు ముష్టివాడు.

ఆకల్లో అతీతం కనిపించదు. ఆకల్తో ఉన్నవాళ్లు బొత్తిగా బావుండరు చూడ్డానికి. వాళ్ల నసలు చూడరు చాలామంది. ఇక్కడ 'ఆకలి' అంటే ఆకలే కాని మరొకటి కాదు. పుస్తకాలంటే ఆకలి, పరస్త్రీ అంటే ఆకలి, పరాయి సొమ్మంటే ఆకలి, ఆ తరహాది కాదు. ఆకలంటే అసలైన ఆకలి. అంటే ఏమిటో చాలామందికి తెలిసుండాలి.

అత నసలు ఆదినుంచీ ఆకల్తో ఉన్నవాళ్లా ఉన్నాడు. అంతకాలం అలా ఉంటే మనిషిరూపు మారిపోతుంది. అతను, చెదపుట్టలోంచి తీసిన వస్తువులా ఉన్నాడు. అయితే, అతన్లో మనిషి పోలిక ఇంకా అక్కడక్కడ లేకపోలేదు. వంట్లో, ఎమికలు చాలా ఉన్నాయి, ఎన్నున్నాయో తెలుసుకోడానికి వీలయినన్ని ఉన్నాయి. ముక్కు కనిపించక పోయినా కన్నొకటి మాత్రం కనిపిస్తోంది. పటుత్వం లేకపోయినప్పటికీ, పుల్లలా ఉన్నప్పటికీ, ఏనుగంత ఎత్తున్నాడు. ఎమికలమీద సాగి సడలిన చర్మం కురుపులతో నిండింది, తెగింది, ఈగలతో చింకి పేలికలతో మూయబడింది, మూయబడకుండా ఉంది. మొత్తంమీద ( మనిషా ? ముష్టివాడా ?) అతగాడు ఆకలీ రోగమూ ఈగలూ తప్ప మరేమీ తెలియనివాళ్లా ఉన్నాడు. చూడ్డానికి చాలా బీభత్సంగా ఉన్నాడు. కాలీకాలని శవాలు అలానే ఉంటాయి.

సాయంకాలం ఆరుగంటలకి అయిదేళ్ల కొడుకును వెంటబెట్టుకొని యింటికి వచ్చేస్తున్నాడు అన్నారావు. ఆదివారం కూడా అతనికి తెరిపి లేదు. ఇంట్లో బోలె డుండిపోయింది ఆఫీసుపని. పదిహేనేళ్ల ఆఫీసు జీవితం చూస్తే అది గొర్రె తోకలా ఉంది. సంతానం చూస్తే, ఒకరు, ఇద్దరు, ముగ్గురు నలుగురు నలుగు రాడపిల్లలు. లేడు లేడనుకొని ఆశంతా వదులుకున్నాక ఆఖర్న ఓ కొడుకు. అన్నారావుని చూస్తే అతనికి ఆశలన్నీ ఉడిగిపోయినట్టుగా స్పష్టంగా తెలుస్తుంది. వచ్చిన చిక్కేమిటంటే ఆ సంగతి అతనికి మాత్రం ఇంకా పూర్తిగా తెలీదు. అందుచేతనే, చీటికీ మాటికీ చిరాకు పడి పోతూ ఉంటాడు.

సిగరెట్టుపెట్టె కొనుక్కుందికి, అన్నారావు కిళ్లీకొట్టు దగ్గరికి వెళ్తే, అతన్ని అక్కడకూడా వెంటబెట్టాడు అతగాడు.

"నాయనగారూ ! మూడు దినాలనించీ కూడు మొహం చూళ్లేదు. ధర్మం చెయ్యండి నాయనగారూ !" అంటూ అంతదూరంలో నిల్చున్నాడు. అతగాడు ముక్కుతో మాట్లాడడం లేదు. ముక్కులోంచి మాట్లాడుతున్నాడు. మనిషి కంటే మాట ఎక్కువ భయంకరంగా ఉంది. అదేదో లిపి లేని భాషలా ఉంది. లోపల్నించి పాములు బుసలుకొట్టి పలుకుతూన్నట్టుగా ఉంది.

"ధర్మం చెయ్యండి నాయనగారూ !"

"చెయ్యను" అని టూకీగా అన్నాడు అన్నారావు.

"మూడ్రోజుల్నించీ తిండిలేదు నాయనగారూ ! ఆకలవుతోంది, ఒక్కణా ...."

"ఇవ్వను"

"మాడిపోతున్నాను నాయనా."

"పోరా బాబూ !"

అన్నారావు అసహ్యించుకొని కోపగించాడు.

కిళ్లీదుకాణంలో గడియారం ఆరయిందని అయిదు నిమిషాలు ఆలస్యంగా చెప్తోంది. సూర్యుడు అస్తమించేస్తున్నాడ్రో అని పడమటిదిక్కు ఎర్రగా ఏడుస్తూ చెప్తోంది. ఎండ తగ్గినా, వేసవికాలం సుమా ఇది అని వేడి అందర్నీ కుమిల్చి చెప్తోంది. వీధిలో శరవేగంతో వెళ్లిపోయే కార్లు 'కారులు గలవాడె రాజు గదరా సుమతీ' అని పొగలు కక్కి దుమ్మెత్తి చెప్తున్నాయి. ముష్టివాళ్లంతటా 'రోగమో రోగమో, ఆకలో ఆకలో' అని కేకలేసి చెప్తున్నారు. సినీమావాళ్ళు ఆడబొమ్మల బొమ్మగుండెలు చూపించి సినిమాకి రమ్మని ఊరించి చెప్తున్నారు. అన్నారావు కొడుకు ముష్టివాడి వైపు చూస్తూ "రా నాన్నా ఇంటికి పోదాం" అని చెప్పలేక చూస్తున్నాడు.

"ఒక్క కాణీ, నాయనగారూ !"

"నీకో దండంరా బాబూ! ఫో ఇక్కణ్ణుంచి."

అన్నారావు కొడుక్కి ఈగలమనిషిని చూస్తే భయం వేసినట్టుంది. అయినా ఆ ముష్టివాణ్ణి చూడ్డం మాత్రం మాన్లేదు. అంతలో ఈగలతో ఆ మనిషి "చిన్నతండ్రీ ! ఒక్క నయాపైస" అంటూ కుర్రాడివైపు ముందుకి కొంచెం జరిగాడు.

నల్లవాళ్లని తెల్లవా డొకంతట వదలనట్టు, దారిద్ర్యాన్ని ఈగ లొదలవు.

అన్నారావు కొడుకు అన్నారావుకి ముద్దు. పిల్లడిమీద ఈగపిల్ల నయినా వాలనివ్వ డతను. అటువంటిది, అన్ని ఈగలు అంత దగ్గరగా వచ్చేసరికి అతనికి గాభరా వేసింది. కోపం ఎక్కువయింది.

"పోరా వెధవా ! పోతావా పోవా ? పోకపోతే తంతాను. ఫో ముందిక్కణ్ణించి" అని వాణ్ణి తిట్టి "అయినా నిన్ను

ఒనేం లాభం. కాలం అలా ఉంది. ప్రభుత్వం అలా ఉంది. పరిపాలనలా ఉంది'' అని కేకలు వేసుకుని, అప్పుడు దుకాణం వాడివేపు తిరిగాడు అన్నారావు.

''ఓయ్, ఏదీ నా బర్కిలీ పెట్టె ? ఇక్కణ్ణిల బడితే ముష్టివాళ్లు భక్షించేస్తారు. తే, వేగిరం తే! చిల్లరేదీ ? రూపాయిచ్చాను. మంచివాడివే ! అవునవును, జ్ఞాపకా లుండవు. నాకు తెలుసు. కాలం అలానే ఉంది మరి.'' అంటూ సిగరెట్టుపెట్టె చిల్లరా తీసుకొని డబ్బులు లెక్కపెట్టుకుంటూ నడిచాడు అన్నారావు.

కిళ్లీకొట్టు దగ్గర ''రుచికరమైన ఈ మార్కు సిగ రెట్టునే వాడుడు. మిక్కిలి ఉల్లాసము నిచ్చును'' అని చెప్పే బోర్డొకటుంది. దానికి మరో పది గజాల దూరంలో మరో బోర్డుంది. ''ఈ మార్కు గల అసలైన అమృతమునే సేవిం చుడు. ఆకలి కలిగించి బలము నిచ్చును'' అని అది నొక్కి వక్కాణిస్తోంది. అన్నారావూ అతని కొడుకూ ఓ బోర్డు నుంచి ఓ బోర్డుదాకా నడిచారు. అప్పటికి చేతిలోని చిల్లర డబ్బుల చిల్లు చెల్లులు సరిచూసుకోడం పూర్తిచేసిన అన్నా రావు, పిల్లడు బితుకూ బితుకూ వెనక్కి చూస్తూ నడ వడం గమనించి, ''ఏం, రాజుబాబూ! ఆ వెధవ కాని ఇంకా ఒస్తున్నాడేమిటి ?'' అంటూ వెనక్కి తిరిగాడు.

వెనకనే ఉంది సగం కాలిన శవం.

''నాయనగారూ! బాబూ! కన్నతండ్రీ! ఒక్కపైస.''

వాణ్ని చూడగానే, కొడుకుని దగ్గరగా తీసుకొని ''పోరా రాస్కెల్ ఫో! దమ్మిడీ ఇవ్వను ఫో'' అని ముష్టి వాణ్ని తిట్టి వాడిమీద కేకలువేసి ''ఇలాటి రాస్కెల్స్‌ని షూట్ చెయ్యాలి. చెయ్యకపోతే లాభంలేదు'' అని కేకలు వేస్తూ తొందరగా ముందుకి నడిచాడు అన్నారావు. ముష్టి వాళ్ల మధ్య బతకడమే బ్రహ్మాండంగా ఉంది.

రాజుబాబు మరొకసారి వెనక్కి తిరిగాడు. ఈగల మనిషిని ఆపాదమస్తకం మళ్లీ ఓసారి చూశాడు. కుర్రవాడి కళ్లూ అవతలమనిషి ఒంటికన్నూ క్షణంలో సగంపాటు కలిశాయి. చూపు కలియగానే అతగాడు చెయ్యి ముందుకి జాచి, ప్రార్థనాపూర్వకంగా కొంచెం బరువుగా ముందుకి వంగాడు. అంతలో ''పదపద'' అంటూ జనప్రవాహంలోకి ముందుకి తీసుకుపోయాడు రాజుబాబుని అన్నారావు. పిల్ల వాడు మరోసారి వెనక్కి తిరిగాడు. ఈగలమనిషి అక్కడే అలాగే ప్రార్థనాపూర్వకంగా నిల్చున్నట్టనిపించింది. మళ్లీ చూస్తే, లేడు.

అన్నారావు తన స్వంతగొడవలగురించి ఆలో చిస్తున్నాడు. చిరాకులు ఎక్కువవడంతో ఆలోచనలు కూడా ఎక్కువయాయి. ప్రపంచంలో అతనికి మానవులకంటే పుగాలే ఎక్కువ కనిపిస్తున్నాయి. దృష్టి దోషమా ? కాదు. పరిస్థితే అసలలా ఉంది. ఎవరికివాళ్లు దోచేసుకోడం, ఎవరి వాళ్లకి వాళ్లు దోచిపెట్టేడం, అవతలవాణ్ణి నిలువునా గోతులో తోసేయడం! ఇలా, లోకంలో అంతమందీ కూడా స్వార్థ పరులు, సెల్ఫిష్ రాస్కెల్స్! ఆ ఇంగ్లీషు ముక్కల్ని గట్టిగా పైకే అన్నాడు అన్నారావు. తండ్రిమాట విని కొడుకు తలెత్తిచూసి ''ఏమిటి నాన్నా ?'' అనడిగాడు.

''ఏంలేదురా బాబూ! నడునడు'' అన్నా డన్నారావు. ఉద్యోగంలో ప్రమోషన్‌కి పాసవ్వలసిన టెస్టులన్నీ అన్నా రావు నాలుగేళ్లయి పాసయి కూర్చున్నాడు. కాని, అలా కూర్చొనే ఉన్నాడు. పైకి వెళ్లలేదు. వెళ్లడానికి అవకాశం దొరకలేదు. 'సరిసరి, మర్లాభంలేదు. మంచంమీంచి దించీ వలసిందే' అనుకొనే సమయంలో అనుకోకుండా మంచి ఛాన్సొచ్చింది. ఇంకా బతికే ఉన్నానంటూ అన్నారావు లేచి కూర్చున్నాడు. కాని, ఎక్కడో ఉన్న పెద్ద సెక్రెటరీ గారి కొకరికి ఇక్కడ ఆఫీసులో దూరపుబంధు వున్నాడు. అతను చాలామందికి ముద్దుకొడుకు కూడాను. అతడు అంతలో తెర వెనక్కి వెళ్లి మీటలు నొక్కడం, తీగెలు లాగడం, ఇటువంటి చేయకూడని పనులన్నీ అతి సునాయాసంగానూ బహు చమత్కారంగానూ చేశాడు. ఆఫీసర్లు ఎత్తుకు ముద్దు లాడి వాడికి ప్రమోష నిచ్చారు. సరిసరి పరిస్థితిలో అన్నా రావు యథాప్రకారం కొట్టుమిట్టాడుతున్నాడు.

ఒకరి కూట్లో రాయి వెయ్యడానికి అందరూ తయారే. మరొకరి అన్నపుగిన్నె తన్నుకుపోడానికి అందరూ సిద్ధమే. పైవాణ్ణి తొక్కిపారేడమే. వా డేడుస్తే ఏడవడం, లేకపోతే చావడం. వాళ్లవాడు కాబట్టి వాడికి ప్రమోషను! వాడూ మనిషే, తనూ మనిషే. ఏం? వాళ్లాటి ఆకలి కాదూ తనాకలి ? కాని ఎవడాకలి ఎవడిక్కావా లీ రోజుల్లో !

అన్నారావు మనసులాగే వీథంతా కంగాళీగా ఉంది. దుమ్ముగా దొమ్మిగా ముష్టిగా ఉంది. అసహ్యంగా ఉంది. కలకల్లా డుతూన్న పెద్దపెద్ద మేడలుకూడా అసహ్యంగా సిగ్గు విడిచి నిల్చున్న ఆడవాళ్లలా ఉన్నాయి. అన్నారావు కంటికి ముష్టివాళ్లు విపరీతంగా అదేపనిగా కనిపిస్తున్నారు. ఓ కార్లోంచి ఎవరోకాని గోల్డు ఫ్లేక్ సిగరెట్టుపెట్టె ఖాళీది పైకి విసిరేశారు. దానికోసం పదిమంది ముష్టిపిల్లలు, అదే మంచి బంగారంలా, దానిమీద వాలి దానికోసం తన్నుకు చస్తున్నారు. వాళ్లని చూసి చీద రించుకొని నాలు గడుగులు తొందరగా ముందుకి వేశాడు అన్నారావు.

అంతలో అన్నారావుని ఎవరో ఆపారు. ఎవరని చూస్తే, ఆపినది రాజుబాబు.

''ఏరా బాబూ ?'' అనడిగాడు అన్నారావు.

రాజుబాబువి కళ్లు ఆడకళ్లూ, మనసు వేల మన సూను. పిల్లడికి రెండోయేటిదాకా గిరజా లుండేవి. ఆడ పిల్లలా అందంగా చక్కగా ఉండేవాడు. చూసినవాళ్లు ముద్దు లాడకుండా విడిచిపెట్టేవారుకారు. వాళ్లంతా కూడా కుర్రాడికి దిష్టిపెట్టేస్తారేమోననే అన్నారావు భయం. ఆఖరికి, తక్కువ తిండివల్లా, ఎక్కువ దోమలవల్లా (''దిష్టమ్మా దిష్టి! దిష్టివల్ల'') రాజుబాబు జబ్బు పడిపోయాడు. రెండేళ్లపాటు—టాబ్లెట్సు, కాప్సూల్సు, ఇంజెక్షన్సు, వైటమిన్సు, ప్రొటీన్సు, టానిక్సు, హాస్పిటల్సు, డాక్టర్సు— చాలాడబ్బు ఖర్చయింది అన్నారావుకి. ఖర్చయితేనేం ? బాబు బుగ్గలు మళ్లీ సొట్టలు పడుతున్నాయి.

"ఏరా బాబూ ?" అనడిగా డన్నారావు.

"ఆకలేస్తోంది" అన్నాడు రాజు.

"ఇప్పు డాకలేమిట్రా ?" అని ఆశ్చర్యపడ్డాడు అన్నారావు.

"ఆకలేస్తోంది. ఇప్పుడే" అన్నాడు రాజు.

కొడుక్కి ఆకలేసిందని ఆశ్చర్యపడ్డందుకు తనని తను నిందించుకున్నాడు తండ్రి. ఆకలి ఎప్పుడైనా వేస్తుంది. ఎవరికైనా ఎక్కడైనా వేస్తుంది. నాలుగురోడ్ల జంక్షన్ దగ్గర ఉడిపీ, లక్ష్మి బ్రాహ్మణ భోజన కాఫీ ఫలహారశాల దగ్గర కొచ్చేసరికి రాజుబాబుకి ఆకలేసినట్టుంది.

"దా, రా, బాబూ ! ఇడ్లీ తిందువుగాని రా !" అన్నాడు అన్నారావు.

రాజుబాబు తండ్రి చేతిని విడిపించుకొని ఒకడుగు వెనక్కివేసి నిల్చున్నాడు. "మావాడి నోరు చక్కగా 'గ' లా ఉంటుంది" అంటుంది వాళ్లమ్మ. బుగ్గలు పూరించి చిన్న విల్లులాటి నోరు ఇంకా చిన్నది చేసి,

"నాకు ఇడ్లీ ఒద్దు" అన్నాడు రాజుబాబు.

"మరేం కావాలి ? దోసె తింటావా ?"

"తిన్ను."

"పోనీ, కోవాబిళ్ల తిందువుగాని, రా."

"నా క్కోవా బిళ్లొద్దు."

"మరేంకావాలి ? చెప్పు !"

"ఆకలేస్తోంది. నాకు అణా ఇయ్యి." అనడిగాడు రాజుబాబు. ఆ అడిగినప్పుడు, 'ఇస్తాడా ఇవ్వడా నాన్న ?' అనే ఆవేదన కుర్రవాడి ముఖంలో జాయగా కనిపిస్తోంది.

"అణా ఎందుకూ ?" అని అడిగిన అన్నారావు, కొడుకు ముఖం చూసి, వెంటనే జేబులోంచి డబ్బులుతీసి, "పోనీ, ఇంద. ఇదుగో అణా ! ఏం చేస్తావ్ ? అరిటిపళ్లు కొనుక్కొంటావా ?" అంటూ అణాకాసు ఇచ్చాడు.

అణా పుచ్చుకొని, రాజుబాబు అలా నిల్చుండిపోయాడు. అణాకాసుని ఎడంచేతో పట్టుకుని, కుడిచేతి వేళ్లతో దాన్ని రాస్తూ తుడుస్తూ నిల్చున్నాడు. ఏం చెయ్యాలో తోచ నట్టుగా ఉంది కుర్రవాడికి.

"ఏరా బాబూ ? ఏంచేదాం ? పోనీ, పిప్పరమెంట్లు కొనుక్కుంటావా ?" అని అడిగాడు అన్నారావు.

పెద్దవాళ్ల మేడలు చూడ్డానికి ఆఖర్న మరొక్కసారి వెలిగాడు సూర్యుడు. రోడ్డుమీద రాజుబాబునీడ పొడవుగా పడింది. ఆ నీడ మెల్లిగా ముందుకి నడిచింది. అన్నారావు కూడా నీడ వెనక నడిచి కొడుకుని కలుసుకున్నాడు.

"ఏరా బాబూ ? ఏంకావాలంటావ్ ?"

"నా కణా ఒద్దు. ఇంద, తీసుకో" అంటూ తండ్రి వేపు చెయ్యి జాచాడు, ఆ తండ్రివేపు ముఖం తిప్పకుండా.

అణా తీసుకొంటూ, "మరి, ఆకలేస్తోందన్నావు ?" అన్నాడు అన్నారావు.

రాజుబాబు మాట్లాడలేదు.

"ఏమిరా బాబూ ? నిజంగా ఆకలెయ్యడంలేదుట్రా ?" అని ముద్దుగా అడిగాడు అన్నారావు.

రాజుబాబు అయి దడుగులు ఊరుకొని, ఆతర్వాత "మరి, నువ్వు, ఇందాకా ఎందు కివ్వలేదూ ?" అన్నాడు.

"ఇందాట్లా నువ్వడిగావా ? ఎప్పు డడిగావురా ?" అని ఇంకొంచెం ముద్దుగా ప్రశ్నించాడు అన్నారావు.

"ముష్టోడ్ని అడిగాడు కదూ !" అన్నాడు రాజు. దాగి ఉన్న ప్రశ్నకి వెంటనే సమాధానం ఇచ్చేశాడు అన్నారావు.

"వాడు ముష్టివాడూ" అన్నాడు. ముష్టివాళ్లకి అణా లివ్వకూడదని రూలున్నట్టు.

"మరి వాడి కాకలేస్తోందిట!?"

"వెయ్యనీ. ఏం చేస్తాం ?"

"మరి, నా కిచ్చావు !"

"పదపద. అణా దాచుకుందువుగాని. ఇంటి కెళ్లాక దాచమని అమ్మకిస్తాను" అంటూ సంభాషణ ఆపేయ జూశాడు అన్నారావు.

శ్రీరాములుగారి కున్నంత మొండితనం ఉన్నట్టుంది రాజుబాబుకి. దాదాపు ఇంటివరకూ వెళ్లేదాకా ఆకల్నీ అణానీ ముష్టివాణ్ని పట్టుకు విడువకుండా అలా ప్రశ్నలు వేస్తూనే ఉన్నాడు.

అన్నారావు కాఖరికి విసుగేసింది. "నువ్వు నా కొడు కువిరా బాబూ ! అందుకూ ! అందు కిచ్చాను. మరింక మాటా డక నడు !" అని ఫైనల్గా అన్నాడు. అతని చీదరింపు చూసి మరి మాటాడక ఊరుకున్నాడు రాజుబాబు.

ఇంటికి వెళ్లగానే అన్నారావు భార్య,

"రెండు రూపాయలుంటే ఇద్దురూ !" అనడిగింది.

"చిల్లరకాయితాల్లేవు" అని విసుక్కున్నాడు అన్నారావు.

"పోనీ, వో అయిదుంటే అదే యివ్వండి" అందతని భార్య.

అయిదు రూపాయల కొత్తనోటు జేబులోంచి తీసి దాన్ని మరో కొత్తనోటు అంటుకోలేదని వేళ్లతో రాసి రూఢి చేసుకుని భార్యచేతి కిచ్చా డతను.

రాత్రి ఏడున్నర గంటలకి తమ్ముడూ అక్కలూ భోజనాలు చేసేక, ఆడపిల్లలు నలుగురూ డాబామీదికి, చాపలూ, దుప్పట్లూ, తలగడాలూ పట్టుకు వెళ్లిపోయారు. రాజుబాబు మాత్రం ఏ బి సి డీ లు దిద్దుకొంటూ కూర్చు న్నాడు, గదిలో బల్లదగ్గర. వాలుకుర్చీలో పక్కనే ఉన్న అన్నారావు ఆఫీసు కట్టల్లో మునిగిపోయున్నాడు.

ఎనిమిది గంటలు కొట్టేసరికి అన్నారావుకి కడుపులో దేవేసినట్టయింది. గుండెల్లో చిరుమంట వేసింది. కళ్లముం దున్న అకౌంటు కాయితాలు చూపుకి దూరమయాయి. కాయితాలని పట్టుకున్న చేతులు వజవజ వణికాయి. కాయి తాలు కిందని పడేసి, గప్పున కుర్చీలోంచి లేచా డన్నారావు. భార్య, వారపత్రిక చదువుతోంది.

"ఆకలేస్తోందే పూర్ణా! అన్నం వడ్డించు వేగిరం! వేగిర వేగిర!" అంటూ తొందరపెట్టాడు, అన్నారావు.

"మీదే ఆలస్యం, పదండి" అంటూ పూర్ణమ్మ, పత్రిక పడేసి, లేచి వంటింటివేపు నడిచింది. వంటింట్లోకి, ఆమెని దాటి ఆమెకంటె ముందే వెళ్ళాడు అన్నారావు. వాళ్ళ నలా చూస్తూ కూర్చున్నాడు రాజుబాబు.

భోజనం చేశాక, అన్నారావు మళ్ళీ కాయితాల్లో కలిసి పోయాడు. తల్లీ, పిల్లలూ డాబామీద పడుక్కున్నారు. అక్కడ రాజుబాబు, "అమ్మా! నాన్న నీకు కొడుకా?" అని తల్లిని అడగడం, "అవేం మాటల్రా నాయనా! కళ్ళు మూసుకు పడుకో" అని పూర్ణమ్మ కొడుకుని ముద్దుగా మందలించడం అన్నారావుకి తెలియలేదు. రాత్రి పదిగంటలకి అతను డాబామీదికి వెళ్ళేసరికి అతని భార్యా పిల్లలూ ఆ వెన్నెల్లో వరసగా 'క్యూ' లోలా పడుక్కునున్నారు.

అన్నారావుండే మురికియిల్లు చాలా ఇరుకుల్లో ఉంది. ఆ యింటికి అటుపక్కా యిటుపక్కా రెండు మురికి సందులు పాముల్లా వంకలు తిరిగున్నాయి. దగ్గర్లో ఉన్న ఇళ్ళన్నీ పాడుపడి పోతున్నవి, కూలిపోతున్నవీను. డాబా ఎక్కి చుట్టూ చూస్తే దూరంలో కొత్త మేడలూ, దగ్గర్లో పాత పెరళ్ళలోని పొడవాటి కొబ్బరిచెట్లూ, వేప చెట్లవి నల్లని కొమ్మలూ, ఇటికలే మిగిలిన గోడలూ, ఊచలే లేని కిటికీలు కనిపిస్తాయి.

అన్నారావు, డాబామీద పిట్టగోడని ఆనుకొని, సిగరెట్టు కాలుస్తూ, నిల్చొని పిల్లలవైపొకసారి చూశాడు. రాజుబాబు నిద్రలో కొంచెం కదిలి ఏవో కలవరించాడు. అణా అన్నాడా? ఆకలన్నాడా? ఏదో అనడం మాత్రం అన్నాడు. దగ్గరగా వెళ్ళి చూసొచ్చాడు అన్నారావు. వెన్నెల జాలులో కుర్రవాడి లేతముఖం జాలిగా ఉంది. అన్నారావుకి భయం వేసింది. ముష్టివాణ్ణి చూసి పిల్లడు జడుసుకొన్నట్టున్నాడు.

ఏమో! రోజు లిలాగే ఉంటే అందరం ముష్టివెధవల మైపోయేట్టున్నాం!

అన్నారావుకి భయంతోపాటు ఏదో అసంతృప్తి కూడా కలిగింది. పిల్లడి ప్రశ్నలన్నీ అతనికి గుర్తుకొచ్చాయి. తన ప్రమోషన్ విషయమై అర్జీ పెట్టుకొంటే అధికార్లు జవాబివ్వకపోడం, రాజుబాబు వేసిన ప్రశ్నలకి తను సరైన జవాబివ్వలేకపోడం, అన్నీ అతణ్ణి ఆలోచనలో ముంచాయి. సిగరెట్టు విసిరేసి పిట్టగోడని రెండు చేతులూ ఆన్చుకొని అతను నిల్చోడం మాత్రం నిశ్చలంగా నిల్చొనున్నాడు.

ఆ పాతకొంపల్లో ఎక్కడో కాని ఓ చిన్న పిల్లడిదో, పిల్లదో "వ్వా! ఉవ్వా!" అనే ఏడుపు అదోక పక్షి కేకలా, వినిపిస్తోంది. ఆకలికా? అనుకున్నా డన్నారావు. తల్లో ఎవరో పాడే జోలపాట ముక్క ముక్కలుగా తెగిపోయి దీనంగా అస్పష్టంగా కొంచెం కొంచెంగా చెవిని పడుతోంది. ఓ ఫర్లాంగు దూరంలో, ఓ పాడుబడ్డ పాత మేడమీది కిటికీ, కురుపువేసిన కంటిలా, ఎర్రగా కనిపిస్తోంది. గది లోపల హరికేన్‌లాంతరు వెలుగులో, ఆరిపోయిన మని షెవడో పడుకోలేక జాబోలు పచారు చేస్తున్నాడు. గుడ్డి వెలుక్కి అడ్డంగా అతను పచారు చెయ్యడంతో, ఆ కన్నులాటి కిటికీ రెప్ప వేసుకొని తెరుస్తున్నట్టుగా ఉంది. పక్కన సందులో "వెన్నెలా! కన్నతల్లీ! పేదవాడి దీపమా!" అనుకొంటూ ముసలా డెవరో టక్కూ, టక్కూ వెళ్ళాడు. అతని కర్ర కాళ్ళ చప్పుడు దూరమయింది, చిన్నదయింది, చివరికి విని పించకుండా పోయింది. అంతలో రెండోపక్క సందులో దడ దడ చప్పుడైంది. చెత్తడబ్బాలోని కాయితాలకోసమూ, ఎంగిలాకులకోసమూ అక్కడ నాలు గావులు పులుల్లా పోట్లాడుకుంటున్నాయి. వాట్లో రెండావులు దెబ్బలాగ్లేక తొందరగా పారిపోయి, సందు చివరకు పోయి, అక్కణ్ణించి చెత్తడబ్బావైపు ఆశగా చూస్తూ వెర్రిముండల్లా నిల్చు న్నాయి. సందుల్లోని గాలంతా, కుళ్ళు కాలవల మురికి వాస నలో మత్తెక్కిపోయి మతి చెడిపోయి సొమ్మసిల్లిపోయి మెదలకుండా పడుంది.

వర్షం కరిగి సన్నని తుంపరై, చల్లని ఆవిరైనట్టుగా వెన్నెల మాత్రం అంతటా జాలికి జారిపడుతోంది. పాత మేడలు, మొండిగోడలు,, వేపకొమ్మలు, కొబ్బరాకులు, సందు లోని రాళ్ళు, కాలవల్లోని మురికినీళ్ళు అన్నింటినీ ఆ వెన్నెల తాకుతోంది. రానక్కర్లేదని రావద్దు రావద్దని అడ్డపెట్టు కొంటే తప్ప ఆ వెన్నెల వెళ్ళని చోటంటూ లేదు. అక్కర లేదనిచెప్పి దాగుంటేనూ, దాచేస్తేనూ తప్ప ఆ వెన్నెలజాలు పడని ప్రాణి లేదు, పదార్థం లేదు.

తలెత్తి చంద్రుణ్ణోసారి చూసిన అన్నారావు, "తండ్రీ! చంద్రశేఖరా! సర్వేశ్వరా!" అనుకున్నాడు. ఇలా అనుకున్నాడు, అలా అదిరిపడ్డాడు. ఆ రాత్రి సమయంలో ఏ తెరవని గుమ్మం దగ్గరో ఎక్కడో నిల్చొని ఏ ముష్టివాడో ఎవరో వేసిన, "అమ్మా! అన్నపూర్ణేశ్వరీ!" అనే పెనుకేక అతని చెవిని బద్దలు చేసింది. ఆ పిలుపులోని బలం, ఆ పిలుపులోని నైరాశ్యం అతణ్ణి భయకంపితుణ్ణి చేశాయి. ఊరుదాటి ఊళ్ళన్నీ దాటి పాలకుర్తీ, సాతకుర్తీ అందర్నీ దాటి అడవులు, కొండ లెడారు లన్నింటినీ దాటి ఆవిడ ఎక్కడుంటే అక్కడికి ఎంత దూరమైనా వెళ్ళి ఆ తల్లి చెవిని దూసుకుపోవాలాకేక. అదంతటి కేక!

భయంతో ఏవేవో ఆలోచిస్తూ పడుక్కున్నాడు అన్నారావు.

ఆ రాత్రి రెండు జాములవేళప్పుడు రాజుబాబు నిద్రలేచి, పూర్ణమ్మని నిద్రలేపి, "అమ్మా! అమ్మా! ఆక లేస్తోందే!" అన్నాడు. ఆవిడ కళ్ళు నులుపుకొని చటుక్కున లేచి కూర్చుని "కిందకెళ్ళి పాలు—పాల్లేవు—కాస్త మజ్జిగ తెస్తానుండ్రా నాయనా!" అంది.

రాజుబాబు ఒక్క క్షణం ఊరుకొని, "నాకొద్దు నాకొద్దు!" అంటూ మళ్ళీ పడుక్కున్నాడు.

# నన్నిచోడుని నాటి యుద్ధపద్ధతి

శ్రీ తిమ్మావజ్ఝల కోదండరామయ్య

క. వనజలకేళీ రవి శశి
తనయోదయ మంత్రగతి రతక్షితిప రణాం
బునిధి మధు ఋతు పురోద్వా
హనగ విరహదూత్య వర్ణనాష్టాదశ మై—1ఆ. 44 ప.

కుమారసంభవము కృత్యవతరణికలోని పద్యమున ఈ నన్నిచోడుడు కావ్యమునం దుండనగు నష్టాదశ వర్ణనలను బేర్కొనినాడు. వనము, జలకేళి, సూర్యోదయము, చంద్రోదయము, పుత్ర జననము, మంత్రాలోచనము, ప్రయాణము, సురతము, రాజు, యుద్ధము, సముద్రము, మధుపానము, ఋతుషట్కము, పురము, ఉద్వాహము, పర్వతము, విరహము, దూత్యము నను నవి కావ్యమునం దభివర్ణింపబడవలెనని యాలంకారిక సంప్రదాయము. దండి కావ్యాదర్శమునందీ యష్టాదశవర్ణన ప్రశంస యిట్లు కలదు.

నగరార్ణవ శైలర్తు చంద్రార్కోదయ వర్ణనైః
ఉద్యాన సలిల క్రీడా మధుపాన రతోత్సవైః
విప్రలంభై ర్వివాహైశ్చ కుమారోదయ వర్ణనైః
మంత్ర ద్యూత ప్రయాణాజి నాయకాభ్యుదయై రపి.

కొఱవి గోపరాజకవి కూడ దన సింహాసన ద్వాత్రింశికలో నీ యష్టాదశ వర్ణనల నీ క్రింది పద్యమున బేర్కొనియున్నాడు. చూడుడు :

క. పుర మధు జల లీలాంబునిధి
పరిణయ నయ విప్రలంభ పతి గుణ సుత భా
స్కరచంద్రోదయ రణగతి
గిరివన 'ద్యూత'ర్తు రతుల గృతి జెప్పదగున్.
—1 ఆ. 37 ప.

కావ్యమునందు నియతముగా నుండవలసినవని పేర్కొనబడిన యీ పదునెనిమిది విధములగు వర్ణనములును నన్నిచోడుని కుమారసంభవమునందు నెక్కొని యున్నవి. కృత్యవతరణికలో "........వర్ణనాష్టాదశ మై పరిపూర్ణం బై' అని చేసిన రచన కనుగుణముగానే నన్నిచోడ డేయొక్క వర్ణనమును గూడ విడువక యన్ని వర్ణనలను బరిపూర్ణముగానే నిర్వహించినాడు.

బలవంతముగా దెచ్చిపెట్టవలసినట్లు కాక కుమార సంభవ కథయే తెలుగున బారిజాతాపహరణ కథవలె నష్టాదశ వర్ణనలకును నానుకూల్యమును సహజముగానే కల్పించి పెట్టినది. అందుచేతనే కథాసరణినిబట్టి యానుషంగికముగా జేయబడిన వర్ణనలవలెనే యందలి వర్ణనలు తోచును గాని యసందర్భములుగా గాని, యస్థానికములుగా గాని యవి మనకు దోచుటలేదు.

నన్నిచోడుడు తన కావ్యమునం దీయష్టా దశ వర్ణనలను యథాసంభవముగా, యథోచితముగా దత్తదుచిత స్థలముల నెక్కొలిపియున్నను యుద్ధవర్ణనమునందు మాత్ర మాతడు ప్రత్యేక శ్రద్ధను గైకొని యందు దనకుగల ప్రజ్ఞా ప్రాభవములను బ్రదర్శించినాడు. కుమారసంభవమునందు శృంగార రస మంగిరసమును, వీరము ప్రధానాంగరసమును, దక్కినవి యంగరసములునుగా నన్నిచోడడు నిర్వహించినాడు. అందు బ్రధానాంగరసమయిన వీరరసము కాలంబ మాతని యుద్ధ వర్ణన ఘట్టములే. ఇంచుమించుగా రెండువేల పద్యములతో గూడిన యీ మహా కావ్యమునందు గొంచె మెచ్చు తక్కువగా అయిదు వందల పద్యములలో యుద్ధ వర్ణనము గావింపబడిన దనగా నా కావ్యమునందు శృంగార రసమునకు దరువాత వీరమునకే యెక్కువ ప్రాధాన్య మొసగబడిన దన్నమాట. నన్నిచోడడు సంస్కృత కుమార సంభవము నందలి యుత్తరభాగమునుగూడ జూచి కొంత యనుసరించియున్నను దేవాసుర యుద్ధ విషయమున దాని ననుసరించినట్లు కానవచ్చుటలేదు. సంస్కృత కుమార సంభవమున గుమార తారకుల యుద్ధము దేవదానవ యుద్ధముగా మానవాతీత లక్షణములతో గూర్పబడినది. పురాణములయందును గుమార తారక యుద్ధములు వర్ణింపబడినవిగాని వానికక్క వేరుగా నున్నది. కుమార సంభవమునందలి యుద్ధము దేవదానవ యుద్ధమయినను మానవ యుద్ధమువలె నందలి వర్ణనలు కలవు. నన్నిచోడడు తాను రాజై యనేక యుద్ధములు చేసి యుండుటచే దన ప్రత్యక్షానుభవమును గూడ నిందు బ్రదర్శించినాడు. కన్నడమునందలి విక్రమార్జున విజయ కావ్యము లోని యుద్ధ వర్ణనము కూడ నితనికి గొంత దోడుపడి యుండవచ్చును. ఈతని యుద్ధ వర్ణనలు గందర గోళముగా జేయబడిన సంకుల సమరములుగాక యొక పద్ధతిగా దీర్చి దిద్దబడి ద్వంద్వ యుద్ధములు, చతురంగ బలముల సజాతీయ యుద్ధములుగా రచింపబడినవి. ఈతని యీ యుద్ధ వర్ణనమును తిక్కన సోమయాజి చాలవరకు ననుకరించినాడు. తిక్కనకు యుద్ధము నేర్పినవాడు నన్నిచోడడనిన నతిశయోక్తి కాజాలదు. కుమార సంభవమునందు నన్నిచోడడు చేసిన యుద్ధము నాధారముగా జేసికొని యా కాలమునాటి యుద్ధపద్ధతు లెట్టివో కొంత యెఱుగదగును. అలనాటి యుద్ధమర్యాద తెలుగుటకు ముందు దేవదానవయుద్ధ క్రమము సంగ్రహముగానేని దెలిసికొనుట యుచితము.

ఇది మూడు దినములు జరిగిన యుద్ధము. దేవతలు పరమేశ్వరానుగ్రహమున గుమారుని దమకు సేనాధిపతిగా బడసిరి. పరమేశ్వరానుమతంబున మహాసేనుడు సేనాధిపత్యము చేకొనినాడు. అంత నతడు బృహస్పతివలన గ్రౌంచాసురు మాహాత్మ్యము నెఱిగి యతని నవ్రశమమున నిజ భుజ శక్తి చేత జెఱిచి, తారకాసురునిపై నెత్తిపోవ నిశ్చయింపగా జక్రపాణి 'వాని నెఱింగించి పంపక పైఁ జనుడనుచితం' బనిన దాని కొడబడి బృహస్పతి పౌత్రుని సుమతిని దారకునికడకు రాయబార మంపినాడు. అతడును నప్పటికి బోయి—

గీ. భక్తి గీడ్పడి సేనాని పనుపు సేసి
నడవు మొండేని గలనికి నడవు మొండె
సెరవు సేయక దివిజుల చెఱలు వేగ
విడువు మొండేని మన్నాన విడువు మొండె.

—10 ఆ. 142 ప.

అని కుండ బ్రద్దలుకొట్టినట్లు చెప్పినాడు. ఆ మాటలు విని తారకాసురుడు కోపించి—యందును 'చెఱలు విడుమనిన పలు కెద గొఱవిం గొని చూడినట్లు' కాగా నా మాటకు సహింపక—

చ. విడు మని వేడ నావలన వేల్పులు ముందఱ వీరిడెచ్చి యి
ల్లడ యిడి పోయిరే భుజ బలంబున నెమ్మెయి నాచికొంటినే
నడరగ దారు నెమ్మెయి రయంబున గ్రమ్మఱ గొంటయొప్పుగా
కడుగుట యొప్పునే యడిగినంతన యిచ్చుట నాకు నొప్పునే?

—10 ఆ. 148 ప.

అనినాడు. ఈ దురాలాపములకు గోపించి సుమతి కుమారకు విశేషించి తారకుని నిరాకరించి పలుకగా దారకు డాతని వధింప నాజ్ఞాపించెను. అంత దూతవధ కూడదని శుక్రుడు నివారింపగా దనుజవరులు మన్నించి యాతని బరిభవింపక వెలువడ ద్రోపించిరి. అంత దారకాసురుడు పంపిన దూత కుమారుని సభ కరిగి తారకు విశేషించి చెప్పిన విని వానిని బరిభవింప నెత్తిన గణముఖ్యుల నచ్యుత ప్రార్థితుడై నివారించి సత్కృతునిజేసి పీడు కొలిపినాడు. దానవదూతయు హిమవంతము నుత్తరమున గలను చెప్పి చనెను. దానవదూతవలన విషయ మెఱిగి సురచయము పయికి దెరల నెత్త సమకట్టిన తారకుని శుక్రుడు తత్కాలోచితనయాలాపముల ననునయించి కార్యధారకు నూలు కొలిపినాడు.

ఇట గుమారుడు 'ప్రస్థానభేరి' సఱవబంచినాడు. ఆ మహాధ్వని కమరకటక మంతయును మహాసముద్రమువలె ఘూర్ణిల్లినది. కుమారు డేనుగు నెక్కి యుద్ధమునకు బయలుదేరినాడు. అతనివెంట దిక్పాలకులు తమతమ వాహనములు నెక్కి నడచిరి. వారివెంట సైన్యములు నడచినవి.

క. ధరణీధర శోభిత మై
నిరుపమ మై యమరవాహినీసంయుత మై
హరిభూషిత మై పరమే
శ్వరు నంబుధి బోలి గుహుని వాహిని నడచెన్.

—11 ఆ. 14 ప.

'వెన్నెలపయనము నడచిన చెన్నున' నమరసేన యమరీ సమేతముగా నట్లు నడచి నడచి వచ్చి మహానదీ తీరమున విడిసినది. గుళ్ళు, మండీయలు, గూడారములు, బందిళ్ళు నెల్తిరి. తమ పీడు తెలుగ దమ తమ చిహ్నములు పట్టించిరి. ఇంతలో సాయంకాల మయినది. దేవతల స్కంధావారమున గరదీపికా సహస్రములు వెలిగినవి. మండలికమహాసామంతదండనాయకామాత్యభృత్యాద్యఖిలజనపరివృతులై దేవేంద్రాది దిక్పాలకులు తమ తమ వేలములయందు బేరోలగ ముండిరి. అపుడు సుభటకటకములయందు వీరపురుషులు తమతమ యధీశ్వరుల కుత్సాహముగా బోటు మాటలు పలికిరి. అంత 'ధరాంగనా నర్తకి నర్తన స్థానంబును బోలిన స్కందు స్కంధావారము నందు నృత్య గీత వాద్య వినోదములు వెలసినవి. కొందఱు భటులు సమరము కోరుచు ఱొమ్మున బేయిడి నిద్రపోయిరి. వీర సన్న్యాసుల పుణ్యసతులు, రణమరణ పరిచ్ఛేదులయిన పతులతో మరణ పరిచ్ఛేదు లగుచుండిరి. విరాగాన్వితులయిన సుభటోత్తములు కొందఱు 'కశ్కే నార్థీ కో దరిద్ర'యని యెలుగెత్తి పిలుచుచు సర్వస్వదానులయిరి. అర్థికోటికి గుంకుమ కింకిరాతకోజ్జ్వల శిఖి బంధుజీవ సమవర్ణ సువర్ణము లిచ్చిరి. అంత గుమారాదులు నిజవాహనాయుధాదులకు నీరాజనాదికము లొనర్చి పరమేశ్వర ధ్యానము చేసిరి. ఇంతలో దెల్లవాఱినది.

కుమారుడు కాలకృత్యములు తీర్చుకొని సమరోద్యుక్తుడై 'సన్నాహభేరి' సఱవ బంచినాడు. చతురంగబలములును ముందునకు సాగినవి. కుమారుడు పార్వతీపరమేశ్వరుల స్మరించి యుద్ధసన్నద్ధుడై మహామాత్ర పుత్రులు తెచ్చిన గంధ గజము నెక్కి బయలుదేరినాడు. అంత దేవేంద్రాది దిక్పాలకులు తమ తమ వాహనము లెక్కి జయచామీని జేకొని యొడ్డణములు దీర్చుచుండిరి. అటువైపు తారకాసురుని చతురంగబలములును సిద్ధమయినవి. అతడు సమర రంగమున బ్రతిఘటించి నిలిచి యొడ్డణములు దీర్చినాడు. ఇట్లుభయ బలములును ఘూర్ణిల్లుచున్న సమయమున దారకాసురుడు సురనరోరగ గరుడ గంధర్వ సిద్ధ విద్యాధరాద్యఖిల భువన భవనాధీశ్వరులు పూర్వ పరిచయంబు లైనం దదీయానం తైశ్వర్య

# నన్నిచోడునినాటి యుద్ధపద్ధతి

ప్రభావిభవాతిశయంబుల భేదింప నేరక విభ్రాంతాంతరంగుం డగుచు నీ పన్ని నిలిచిన గీర్వాణానంత సామంతు లెవ్వ రెవ్వ రిందుధరనందనుండగు కుమారుం డెవ్వం డని దనుజగురు నడుగగా వారిని భావించి చూచి యాతడు 'వీరేకాదశరుద్రు లష్టవసువుల్' ఇత్యాదిగా వారి వారిని బేర్కొని చూపెను. ఇట్లే దేవసేనలో గుమారు డమరగురుని గనుగొని యీ పన్ని నిల్చిన దనుజ సామంతు లెవ్వరెవ్వ రిందుం దారకాసురుం డెవ్వం డెఱిగింపు మనగా 'మహాప్రసాద'మని 'కాలనేమి యితడు మరుల డితడు.....ఉగ్రదంష్ట్ర డితడు, సహస్ర కవచు డితడు... వాడు చిరుండు' ఇత్యాదిగా వారి వారిని దెలిపెను.

అంత గుమార తారకులు విజృంభించి తమతమ బలములకు జేతులు వీచిరి. అంత నిరువాగుల సైన్యములును గలయబడి ఘోరయుద్ధ మయ్యెను. భయంకరమయిన యా సంకుల సమరమున వికలములగు రూపములతో సేనలు నేల గూలెను. అంత వరుసగా రథగజతురగపదాతి బలముల యుద్ధములు జరిగినవి. పిదప రణరంగమున బడిన తమ పతుల యవయవములను ప్రోవుచేసి పాడవులుగా గూర్చి వీరసతులు దుఃఖించుచుండిరి. గ్రద్దలాడుట, నక్కలు మూగుట, పిశాచములు నృత్యము చేయుట మొదలగునవి వరుసగా దరువావాత బ్రదర్శింపబడినవి. ఇంతలో సూర్యుడస్తమించెను. సాయంకాలమయినది. ఉభయ బలములవారును గైవీగి తమ తమ శిబిరములకు బోవుచు దమ భృత్య బంధువర్గములను వెదకికొని క్షతగాత్రులయినవారికి మందులు, మంత్రములు పెట్టుకొనుచు నాయాయి యౌషధప్రకారములచేత నా రాత్రిలోనే విక్షతవేదనావిముక్తు లయిరి.

మరునా డుదయ మయ్యెను. కుమారుడు పరమ భక్తియుక్తితో బరమేశ్వరు నారాధించి 'సన్నాహభేరి' నఱవ బంచినాడు. కుమారతారకు లిరువురును బట్టవర్ధన గజముల నెక్కి తమ తమ గజములకు జేయి వీచిరి. ఉభయ సైన్యములును, యుద్ధరంగమున దారసిల్లినవి. కుంజరాక్షుడు — ఈశానుడు, ఉగ్రదంష్ట్రుడు-కుబేరుడు, మందారుడు—వాయువు, మహాబాహుడు—వరుణుడు, ఆరణి దుర్వారులు—నిర్ఋతి, కేతుమాలి—యమధర్మరాజు, మహాకాయుడు—అగ్నిదేవుడు, జంభాసురుడు—దేవేంద్రుడు, త్రిశిరుడు—ఇక్ష్వాకుడు, నరకాసురుడు—విష్ణుదేవుడు, సహస్ర కవచుడు—నరుడు, మొదలగు వారలకు ద్వంద్వయుద్ధములు జరిగినవి. ఆ యుద్ధములందు దారకుని సామంతవర్గమంతయు నశించిపోగా నాతడు తన మూలబలములకు జేయివీచినాడు. అపుడు దేవ పక్షమున గణనాథుడు వీరభద్రాది రుద్రగణములకు జేయివీచినాడు. పిదప నయుత సుతా యుతానుజ దనుజవరుల గజవదనుడు రూపుమాయింపగా దారకుడు మహా బలంబున భుజబలంబు నిజ బలంబుగా గైకొని యా క్షణముననే యతి రౌద్రాకారుడై యెత్తివచ్చినాడు. కుమారతారకులకు బాణయుద్ధము జరిగినది. అందు గుమారుని బాణహతిచే దారకుని విల్లు విఱిగినది. దానవసేనలును విఱిగినవి. తారకుని సామంతులతోబాటు సూర్యుడును నస్తమించెను. అంత గుమారుడు సంగ్రామ విరామము చేసినాడు.

మఱునా డుదయము తారక కుమారులు సమర సన్నాహముతో బట్టవర్ధన గజముల నెక్కివచ్చి నిజ బలములకు జేయి వీచిరి. తారకుని గజమును, గుమారుని గజమును నొండొంటితో దలపడినవి. పిదప దారకాసురుడు విజృంభింపగా గుమారు డాతని మద మడగసేసినాడు. అంత దానవేంద్రుడు నిజ భుజబలాయుధాఖిల విద్యాబలంబుల నిర్జింప నేరక తన యాపద్ధనంబగు రూక్ష రాక్షస మాయా బలంబుల నిర్జింప నుద్యుక్తుడై పిడుగులయి తాకుట, జడ నిధులై ముంచుట మొదలగు నానావిధ మాయాప్రయోగంబులు ప్రయోగించి యుపద్రవకరుడుకాగా గుమారుడు హరచరణ స్మరణ పరిణతాంతఃకరణుడై దానికి బ్రతీకారముగా దన దివ్యశక్తిని బ్రయోగించెను. అంత నా తారకుని మాయలన్నియు నదృశ్యము లయ్యెను. తుద కా శక్త్యాయుధము చేతనే తారకాసురుడు నేలగూలెను. అంత దారకాసురు నామాక్షరములు సకలదిక్తటశిలా పట్టంబుల శక్తిధరు ముఖ విజయ ప్రశస్తి శాసన లిఖితాక్షరంబు లయ్యెను. విజయ భేరి మ్రోగినది.

నన్నిచోడ డభివర్ణించిన యీ దేవాసుర సంగ్రామము మానవ యుద్ధముగానే యున్న దనుటకు సందేహములేదు. దేవతాస్త్రీల కిందు బాష్పోద్గమము, నిద్ర, మరణము మొదలగు మానవగుణము లున్నట్లు చిత్రింపబడినది. ఈ దేవాసుర సంగ్రామ మాధారముగా మనకు నన్నిచోడుని కాలమునాటి కొన్ని యుద్ధ సంప్రదాయములు తెలియవచ్చుచున్నవి.

యుద్ధమునకై సిద్ధపడుటకు ముం దిరువాగుల వారును సామమున దమ వైరస్యముల బరిష్కరించుకొనుటకు యత్నించెడివారు. రాయబారములు నడచెడివి. రాయబారి యెట్టివాడుగా నుండవలెనో యందు దెలుపబడినది. చూడుడు:

క. పతిహితు గుల విప్రోత్తము
జతురుపధాశుద్ధు గార్యసంవేది బరేం
గితవిదు ధైర్యాన్వితు ని
ర్గతమతియుతు రాయబారిగా బంపదగున్.

—10 ఆ 123 ప.

దూతవధ యిరుపక్షములవారికిని నిషిద్ధము. రాయబారి యెట్టివాడయినను నాతనిని సత్కరించుట రాజునకు విధేయము. సభనుండి వెడల నడచుట యాతని నవమానించుటయే. యుద్ధము జరగు స్థలము రాయబారులచేతనే నిర్దేశింపబడును. అది 'కలను చెప్పుట' యని పేర్కొనబడినది. యుద్ధమునకై తరలిపోవునపుడు 'ప్రస్థాన భేరి' నతిచుచుండిరి. గజారూఢుడై రాజు యుద్ధమునకు దరలును. అతని సామంతులు వారి వారి కుచితములయిన వాహనములపై నెక్కి యతనివెంట బోయెడివారు. వానిలో శిబికలు, నాందోళికలుగూడ గలవు. సాధారణముగా నీ సైన్యములు నదీ తీరములయందు విడిసెడివి. అక్కడ జలాది సౌకర్యము లుండును గనుక. ఆ చోటు చేరుకొని యచట గుళ్ళు, మండియలు, గుడారములు, పందిళ్ళు నెత్తించెడివారు. సైన్యాధికారులకు ప్రత్యేకమయిన శిబిరములుండినవి. వారును దమ శిబిరములని తెలియుటకై తమ తమ చిహ్నములను వానిపై బెట్టించెడివారు. రాత్రులు కరదీపిక లుపయోగించుచుండిరి. మండలిక సామంత దండనాయకాదులతో సైన్యాధికారులు కొలువుదీరి వినోదించుచుండగా నంతకు దక్కువవారు 'సుభట కటకము'లయందు గూడి గగ్గోలు నెట్లో యడచుచు దమ తమ వీర కృత్యముల నుగ్గడించుచు బ్రగల్భములు పలుకుచు బ్రతిజ్ఞలు చేసెడివారు. పిదప వారందఱును నృత్య గీతాది వినోదములలో బాల్గొనుచుండిరి. యుద్ధ వీరులతో గూడ వారి సతులును యుద్ధభూమికి బోవుచుండిరి. విరాగులయిన వీరులు జీవితముపై విరక్తితో దమ కున్న సర్వస్వమును నడిగిన వారికి లేదనకుండ నర్థికోటికి దానము చేసెడివారు. యుద్ధ ప్రారంభ దినము తెల్లవారుజామున 'ఆయుధపూజ' చేసెడివారు. ఆ పిదప భగవంతుని ధ్యానించి యుద్ధమునకు దరలుచుండిరి.

'సన్నాహ భేరి' ప్రమోగించుటతో యుద్ధము ప్రారంభమయ్యెడిది. సైన్యాధిపతి చేయి వీచుటతోడనే సైన్యములు ముందునకు నడచెడివి. పిదప నిరువాగులవారును దమ తమ సైన్యముల నొడ్డణముల దీర్చెడివారు. ఒడ్డణములు తీర్చుట యనగా వ్యూహనిర్మాణము కావించుట. దానికిముందు 'జయచూళి' చేకొనెడివారట! ఆ సంప్రదాయమేమో మనకు దెలియదు. పిదప నుభయపక్షములయందును నెవరెవ రేయే స్థలములయందు నిలిచియున్నారో, వారి నామధేయాదిక వివరము లెట్టివో తెలిసికొనబడును. యుద్ధము రెండు విధములుగా జరిగెడిది. ఒకటి సంకులసమరము. రెండవది ద్వంద్వ యుద్ధము. సాయంకాలమగుటతోడనే యుద్ధము విరమింపబడుచుండెను. ఆ యా సైన్యముల కధిపతులు 'కై వీగు'టతో యుద్ధ విరామము సూచింపబడుచుండెను. రాత్రులయందు క్షతగాత్రులయిన సైనికులకు నౌషధాది చికిత్సలు జరిగెడివి. వీరపత్నులు యుద్ధభూమికివచ్చి తమ తమ పతుల శరీరావయవములను గుర్తించి ప్రోగుచేసి పొడవులుగా జేసికొని వాపోయెడివారు. ద్వంద్వ యుద్ధములో నెవడైన వీరుడు బడలినప్పుడుకాని, ప్రతివీరు డతనికంటె మిక్కలి బలవంతుడయినప్పుడుకాని లేక యాతడు తన యంతరమునకు దక్కువ యయినప్పుడుకాని యతనికి మారుగా నతని స్థానమును గ్రహించి మరొక వీరుడు యుద్ధమాడును. ఈ మార్పిడి యుభయ పక్షములయందును జరగుచుండును. విజయమును పొందినవారు తమ విజయ వృత్తాంతమును శాసనములుగా శిలలపై జెక్కించుచుండిరి. విజయలబ్ధి సూచకముగా గడపట 'విజయ భేరి' ప్రమోగించెడివారు. దానితో యుద్ధము పరిసమాప్తియగుచుండెను. పిదప విజయులగువారు నిజపురములకు వచ్చి, 'విజయోత్సవము' జరపుకొనెడివారు. సామంతుల సైన్యముకాక, రాజులకు ప్రత్యేకముగా మూలబలము లుండినట్లు తెలియుచున్నది. ముందుగా గొంత సైన్యమును శత్రువాహినిమీదికి బంపుచుండిరి. దానికే 'ఎలగోలుమూక' యనియు 'దలతంత్ర'మనియు బేరు. యుద్ధములో బాఱిపోయినవానిని బట్టుకొని తక్కిన వారికి వానిజూపుచు శిక్షించెడివారు. అట్టి వానికి 'ఓగులవా'డని పేరు. చతురంగ బలములును యుద్ధమున బాల్గొనుచుండినవి. ముఖ్యముగా బాణములును, గత్తులును నెక్కువగా వాడబడుచుండినవి. బాకులు, ఈటెలు మొదలగు నితరాయుధములను గూడ వా రుపయోగించుచుండిరి.

ఇట్లు కుమారసంభవములోని దేవాసురయుద్ధమును బట్టి యాకాలమునాటి యుద్ధపద్ధతులు కొన్ని తెలియవచ్చుచున్నవి. అభిలషితార్థచింతామణిలో నీ యుద్ధ పద్ధతులు వివరింపబడియున్నవి. ప్రమొక్కబడి తీర్చినట్లుగా, లాంఛనము నెఱవేర్చుటకయికాక యుద్ధఘట్టము నభినివేశముతో, ననుభవముతో జిత్రించి నన్నిచోడు డీ పట్టున దరువాతి కవులకు మార్గదర్శకుడయ్యెను.

# స్వేచ్ఛాపహారం

శ్రీ బాలగంగాధర తిలక్

సరుగుడు చెట్లనీడలలో
సరదాగా తిరుగుదాం
సగం మబ్బు సూర్యుడి మీద
శాటిన్ తెరలా కప్పుకుంది.
సంజ మెరుపు సెలయేటిమీద
చల్లిన తొలిసిగ్గులా వుంది
ఒక్కసారి యిల్లు విడిచి
ఉత్సాహంగా రా చెలీ !

జామెట్రీ, కాలిక్యులస్,
అక్కయ్యకి రెండో కానుపు,
తమ్ముడికి మోకాలి వాపు
చింతపండు ధర హెచ్చింది
చిన్నాన్నకు మతిభ్రమ కలిగింది
లేచిన మరుక్షణంనుండి ఎన్నో ప్రశ్నలు
గోరుచుట్టులా సలిపే లక్షలు సమస్యలు .

ఆనందాన్ని చంపేందుకు
అనంతంగా ఉంది లోకం
క్యూబా వుంది కాంగో వుంది
గోవా వుంది జావా వుంది
అడుగడుగునా యుద్ధభయం
మలుపు మలుపునా మృత్యుముఖం
ఆకలి నిరాశ రోగం
అసూయ ద్వేషం స్వార్థం
రోతపోని చాతకాని
ప్రభుత్వాలు ఉద్రేకాలు
కులాసాని చెడగొట్టేందుకు
అలాస్కాదాకా అవకాశం ఉంది !

కొంచెం సేపు స్వప్నంలోకి
గోర్వంకల రెక్కలతో
ఎగిరిపోదా మన్నీ మరచి
అబద్ధాన్ని ఆశ్రయించిన సుఖం
నిజాన్ని నిరూపించే నరకం
కన్న వెయ్యిరెట్లు నయం !
కల ఎప్పుడూ మనిషికి బలం
మిథ్యాజీవన రథ్యలలో
స్వప్నం ఒక సుందరతనుమధ్య
మనసూ మనసూ కలిసిన మైమరపుంటే

మద్యం వృథా మాధుర్యం సదా
మనం కట్టుకున్న గాలిమేడల్ని
ఏ భూకంపం పడగొట్టలేదు
మనం విరియించుకున్న తోటలలో
ప్రతిపుష్పా అనార్తవం నవం నవం

నన్నూ నిన్నూ బలహీనులనీ
ఎస్కేపిస్టులనీ నిందిస్తుంది
ఊపిరాడక గిజగిజలాడే యీ లోకం

ఎవరెస్టుకన్న ఎత్తైన నా
ఊహా శిఖరాల్ని వీళ్లెక్కలేరు
సిందూరం కన్న ఎరుపైన నా
హృదయాన్ని వీళ్లు చదవలేరు
ఇల్లు విడిచి ఒళ్లు మరిచి
ఒక్కసారి రాచెలీ !

ఒకరినడుం ఒకరుచుట్టి
ఉల్లాసంగా తిరుగుదాం
సరుగుడుచెట్ల నీడలలో
విరుగుడు చేవ తోటలలో
మునిమాపువేళ రెండు నక్షత్రాలు
ముద్దుపెట్టుకుంటూన్నప్పుడు !
మునికాళ్ళమీద నిలిచి దేవతలు
మనని అసూయగా చూస్తూన్నపుడు !

# ఉదయశ్రీ కావ్యపరిశీలన

శ్రీ యస్. సత్యనారాయణమూర్తి

కరుణశ్రీ అన్న గుప్తనామముగల శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి గారు 'ఉదయశ్రీ' ప్రథమ భాగంలో ముప్పైనాలుగు ఇతి వృత్తాలమీద కలిగిన వివిధమైన భావనలను ఖండ కావ్యంగా కూర్చారు. కవి కరుణశ్రీ. కావ్య మంకితము చేయబడినది కరుణ మూర్తి *అరుణ చరణాలపై. ఆరాధ్యదేవి బుద్ధదేవుని గారాబు* పుత్రి కరుణా కుమారి.

కవిదృష్టి జీవితములోని కరుణామయమైన సన్నివేశ ముల మీదికే పోయినది. గౌతముడు అర్ధాంగినీ, అనుంగు పుత్రుణ్ణి వీడి మెట్లు దిగుతూ కన్పిస్తాడు. కుంతి కడుపు తీపితో, తెంచుకోబోతున్న పుత్రబంధంతో కుమిలిపోతూ దర్శన మిస్తుంది. సావిత్రి పతివియోగశోకంతో చేసిన ఆక్రంద నలు విన్పిస్తాయి. ఊర్మిళ మనోనాథునికి దూరమై, వ్యథా కులితమైన మానసంతో ప్రత్యక్షమవుతుంది. ఇలాంటి చిత్ర ణలతో పాఠకుడికి కరుణరసంమీద అభిమానం కలిగించి జాలిని, ఆర్ద్రతను రేపుతాడు కవి. అయితే పాఠకునిలో కరుణ రసోత్పాదనంచేసి సంపూర్ణ రససిద్ధిని కల్గించిన నిదర్శనం ఈ కావ్యంలో కన్పించదు. బహుశః ఖండికలలో అది సాధ్యం కాకపోవచ్చును.

కవి కావ్యం ప్రారంభిస్తూ, సృష్టి కర్తకు అంజలి ఘటి స్తాడు. విధాత పుట్టబోయెడి బుల్లి బుజ్జాయికి పొదుగు నిండుగా పాలుపోస్తాడు. తెల్లవారకుండా మొగ్గలలో దూది వింత వింత రంగులు వేస్తాడు. పూల కంచాలలో రోలంబము లకు రేపటిభోజనం సిద్ధపరుస్తాడు. చీమ కదలికకు కారణం అతడు! ఆయన జోక్యం లేకపోతే అఖిలవిశ్వం నిశ్చలమై స్తంభీ భూతమవుతుంది. ఆ తీరికలేని విశ్వసంసారిని, బహుముఖ వ్యాపారిని 'ఒక్క నిముషం విశ్రాంతి తీసుకుందువుగాని' రమ్మని తన కుటీరం తలుపు తెరుస్తాడు. సర్వేశ్వరుడికి సముచితమైన ఆతిథ్యం ఇవ్వలేనేమోనని కవికి భయం. తన దగ్గర ఏమీ లేవు. ప్రణయాంకంమీద కూర్చోపెట్టుకుంటాడు. కన్నీళ్ళతో కాళ్ళు కడిగి, ప్రేమాంజలులు సమర్పించి, హృద యం చేతి కందిస్తాడు. ఇది ఆత్మార్పణం, దీనికి మించిన ఆతిథ్యంలేదు. కాని కవి లేమి కారణంగా ఇది సాధ్యమైంటం టాడు. 'నైవేద్యమిడ మాకు నారికేళములేదు హృదయమ్మే చేతి కందీయనుంటి' అని. ఇది కలిమి లేముల కట్టడిలో బ్రతు కుతున్న మానవుడు చేసిన ఊహలోని బలహీనత. దీనికి కవి కొంత బాధ్యుడు. అనాలోచితంగా, అప్రయత్నంగా ఆత్మార్పణం జరిగిందనుకోలేము. ఈ బలహీనత ఆఖరి పద్యంలో మరీ స్పష్ట గా కన్పిస్తుంది. లోకంలో చీకట్లు తొలగించటానికి ఆకాశాన రవిచంద్ర దీపాలు తిప్పలేక, నేలను మింగివేసే సముద్ర తరంగాల్ని చెలియలి కట్ట దగ్గరకు మడిచిపెట్టలేక, ప్రతి రోజూ కోట్లకొలది ప్రాణుల గుండెగడియారాల కీలు కదపలేక, నీలాకాశంమీద చుక్కల ముగ్గులు చెక్కలేక— 'ఎంత శ్రమ *నొందుచుంటివో ఏమొ స్వామి' అని కవి జాలి పడతాడు. సానుభూతి* కన్పరుస్తాడు. నిజానికి విధాతకు శ్రమ ఏమిటి? అనవరతం సుళ్ళు పెట్టి మహావేగంతో ప్రవహించే గంగానది అలసి సొక్కిపోతోంది—అనుకోవట మేమిటి ? ఎండకు వానకు కదల కుండా, నిశ్చలంగా నిల్చున్న మహాద్రి కోతపడి పోతోందని బాధపడి పోవటమేమిటి? దాని క్కారణం మానవులం కాబట్టి. మన చుట్టూ గీసిన పరిధిని దాటిపోలేము కనుక. సుఖ మొచ్చి నప్పుడు పొంగిపోతూ, కష్టానికి వడిలిపోతూ, తీరికలేని పని, శ్రమ, విశ్రాంతి, ఇత్యాద్యవస్థలు పొందుతున్నవాళ్ళం గనుక. విశ్వసంసారకర్త—భర్త మీద కూడా 'అలిసిపోయావా స్వామీ' అని సానుభూతి. కవి ఎంత మానవాతీతమైన పాత్ర చిత్రణ చేసినా, మానవ జీవితపు ఛాయ వాటిమీద పడక తప్పలేదు. వరూధిని ఎంత అప్సరసైనా, మానవులవలె మాటి మాటికి కన్నులు మూసికొన్నట్లు, చెమర్చినట్లు.

'కరుణమూర్తి' శీర్షికకింద 'మహాభి నిష్క్రమణము' వర్ణించబడినది. 'ఈ ప్రగాఢ నిగూఢ మధ్యే నిశీథి గడియ కది లించుచున్న సవ్వడి ఇదేమి?' అని పాఠకుడి ఉత్సుకతను రేకె త్తిస్తూ, గంభీరంగా ప్రారంభమవుతుంది. 'ప్రగాఢ నిగూఢ మధ్యే నిశీథిని' సవ్వడి కలిగినదనటంలో సువృత్తమైన బ్రతుకులో కలిగిన చలనం ధ్వనిస్తోంది. 'ఇప్పు డంతఃపురమ్మునం దెవరు మీరు? మూసియున్నట్టి తలుపుల దీసినారు' అనటంతో మానవ హృదయాంతరాలలో జ్ఞానదీపికా ప్రసారానికి వీలుగా తెరిచిన వాకిళ్ళ చప్పుడు విన్పిస్తుంది. ఆ తెర తొలగదోసికొని వచ్చిన ముగ్ధమోహన కారుణ్యమూర్తి మోము కళ తరిగిపోయివుంది. ప్రణయమయిన శాశ్వత ప్రేమ బంధనాలు తెంచుకుని బైట పడే ప్రయత్నంలో కాళ్ళు తడబడుతున్నాయి. ఆ సమయంలో

ప్రణయ భాగ్యేశ్వరీ బాహుపాశ మట్లు
జారిపోలేక ముందుకు సాగనీక
వెంట జీరాడుచు బుజమ్ము నంటివచ్చు
నుత్తరీయాంచలము చక్క నొత్తడేమి!

పైనున్న ఉత్తరీయం ప్రేయసీ బాహుపాశంలా ప్రతి బంధకంగా ఉంది. వెనక్కు జారిపోతే నడక చకచక సాగుతుంది. పోనీ తను చక్కనొత్తుకున్నా సవరించుకు వేగపోతాడు. ఇది ఆస్తి నాస్తి విచికిత్సల మధ్యని ఊగులాట. కాళ్ళకు చుట్టుకునే

ప్రేయసీ కల్పనా ప్రతిబింబాలు చూచి నిస్తబ్ధుడవుతాడు. అయినా ముందుకే మొగ్గు.

పడియు ముందుకు వెనుకకే ప్రాకులాడు
ప్రభుని చరణాలు స్ఫటిక సోపాన పంక్తి
గాలి కెదురుగ సెలయేటి జాలులోన
పయనమగు రాజహంస దంపతుల భంగి

ప్రభుని పాదాలు వెనుక ప్రాకులాట గిలిగినవై ఎదురుగాలికి సెలయేట్లోపోయే రాజహంసల్లా ఉన్నా యట. ఇక్కడ రాజహంసలకు వెనుక ప్రాకులాట లేదు. ఎదురు గాలిలో పోవటం మాత్రమే ఉపమించబడిందంటే 'పడియు ముందుకు వెనుకకే ప్రాకులాడు' పాదం అర్థం కోల్పోతుంది.

'కరుణా కుమారి' శీర్షిక కింద బుద్ధదేవుని గారాబు పుత్రి కరుణాకుమారిని అభివర్ణిస్తాడు కవి. 'ఆమెవంటి అందముల రాణి లేదు బ్రహ్మాండమందు' ఆమె నిట్టూర్పుతో మందర పర్వతాలు కరిగి నీరవుతాయి. ఆమె మృదుల పాదాంతికమున బ్రహ్మాంతవాడు అవనతశిరస్కుడౌతాడు. ఈరకంగా కరు ణకు రూపమిచ్చి, ఆ భావప్రభావాన్ని, శక్తిని, తీవ్రతను సుస్పష్టం చేశారు. రాధికా విరహాన్ని వర్ణిస్తూ, వ్రాసిన పద్యా లకు కూడా 'కరుణామయి' అని పేరు పెట్టారు. దానికి అను గుణంగా రాధ చేత 'ఈ కరుణామయియా హృదయమే......'అని పిస్తారు. ఇక్కడ కవి కరుణ శబ్దానికి చాల విశాలమైన అర్థం చెప్పుకున్నాడు. విరహోద్విగ్న అయిన రాధను కరుణా మయి అనటం అనుకున్నంతగా అతకటంలేదు. ఇలాగే కవి విశాలమైన అర్థం చెప్పుకున్న మరొక పదం 'ప్రేమ' 'ఏ ప్రేమ మహిమచే ఈ ధారుణీ చక్ర మిరుసు లేకుండనే తిరు గుచుండు' అన్నప్పుడు సకలభువనాలను నడిపించే మహా శక్తిని 'ప్రేమ' అని నిర్వచించటం అసంపూర్ణంగానూ వెలితి గానూ కన్పిస్తుంది.

కావ్యం మొత్తంమీద రాధికావిరహము, కృష్ణ సమా గమము మీద వ్రాసిన పద్యాలు అపాత మధురాలు. వీటికి శీర్షి కలు వరుసగా కరుణామయి—పారవశ్యము.

రాధ ఎదురు చూస్తోంది. ఆ అర్ధరాత్రి సమస్తము నిద్రవోయిన వేళ కృష్ణచరణారుణాబ్జాలు 'తపియించు గుండెపై నద్దుకొనంగ వచ్చినది'

చిన్నవలె చందురుడు పైకి వచ్చినాడు
పెచ్చరిలినాడు గాడుపు పిల్లగాడు
రాడు మోహనమురళీ స్వరాలవాడు
తప్పకేతెంతునని మాట తప్పినాడు.

హృదయంలో ప్రఫుల్ల మురళీ రవళీ రమణీయ భావనా వీచికలు ఎడా పెడా కొడుతున్నాయి. దృగంచలమ్ములు ద్రవించి స్రవించు మనోనురాగముల్ దాచుకొనంగలేని పసిదాననురా— విసిగింపబోకురా' అంటుంది. రాధిక ఆపుకోలేని అనంతమైన ప్రేమానురాగాలను మోయలేకపోతోంది. ప్రియునికి వ్యక్తం చేసి తేలిక పడదామనుకుంటుంది. కొండలను స్పైతం ద్రవింప చేయగల కామాగ్నికి తట్టుకోలేని పసిదానను. నన్ను విసిగింప బోకని ప్రాధేయపడి తన అబలత్వాన్ని ముగ్ధత్వాన్ని ప్రకటి స్తుంది. 'ఇది యది' యంచు తెల్పి వచియింపగరాని విషాద మేదియో హృది గదిలించుచున్నది' అని తనకు కలిగిన స్థితికి భాష్యం చెప్పుకోలేని అశక్తతను వెల్లడిస్తుంది. 'దహింపగ సాగె నిరాశ శుష్కమౌ బ్రదుకును' అని దిగులు పడుతుంది. తనలో కలిగే భావపరంపరను తనలో ఇముడ్చుకోలేక పోతుంది.

'హృదయమే ఒక ప్రేమ మహాసముద్రమై లోకము నిండెరా' అని తనకుగల అవధులులేని ప్రేమ వెల్లువై పొంగినట్లు రూపకల్పన చేస్తుంది. ప్రేమకంతకు తాను మూలమై, జగత్తులోని ప్రేమ అంతా రనలో పొంగి పొరలిన ప్రేమ ప్రవాహమంటుంది.

అంతలో కృష్ణుడు అల్లనల్లన అడుగుల వేస్తూ, రాధ వాల్గన్నుదోయి చేతులతో మూస్తాడు. కస్తూరి తావులు తులసీ పరిమళాలు చెలరేగినవి. రాధ చేతివ్రేళ్ళు తడివిచూచి, గుర్తు పట్టి, ఆనందం పట్టలేక 'కృష్ణుడో! కృష్ణుడో' అని కేక వేస్తుంది. రాధ మొట్ట మొదటి ప్రశ్న మెల్లగా సూటిగా అడుగుతోంది—'యామున తరంగ నౌకావిహారమునకు నన్ను రమ్మనిచెప్పి బృందావనమున కింటిలో హాయిగా కూరుచుంటి వేమి?' అని.

ఎంత తడవయ్యె నే వచ్చి— ఎంతనుండి
వేచియుంటిని—పొదరిండ్లు పూచి—వలపు
వీచికలులేచి—హృదయాలు దోచికొనెడి
యీ శరజ్జ్యోత్స్నలో—పుల్కరించి పొంగి
మ్రోతలెత్తెడి యమునానదీ తటాన

ప్రేయసి నుపేక్ష సేతువే.....' అని చిన్నబుచ్చు కుంటుంది. ఇదిమామూలుగా ప్రేయసియందు చేసిన ఉపేక్ష అయితే 'పోనీ' అని సర్దుకుపోవచ్చు. పొదరిండ్లు పూచి, వలపు వీచికలు లేచి, హృదయాలు దోచికొనెడి యీ శరజ్జ్యోత్స్న లో—ముఖ్యం పుల్కరించి పొంగి మ్రోత లెత్తెడి యమునా తటాన, ప్రకృతి అంతా విరహోద్దీపన కారకమైన పరిస్థితిలో ప్రేయసిని ఉపేక్ష చేయటం దారుణం అని రాధ భావం.

సరస సంగీత శృంగారచక్రవర్తి తప్పు ఒప్పు కున్నాడు. శిక్షగా నిరిదండ సంకెళ్ళు వేయమన్నాడు. పూబంతితో మోద మన్నాడు. మొల నూలుతో కట్టివేయమన్నాడు. రాధ అలుక తీరింది.

రాధికా క్రోధమధురాధరమ్మొకింత
నవ్వెనో లేదో? పకపక నవ్వె ప్రకృతి
నవ్వుకొన్నది బృందావనమ్ము, యమున
నవ్వుకొన్నది, చంద్రుడు నవ్వినాడు.
విరగబడి తమ పొట్టలు విచ్చిపోవ
నవ్వినవి రాధ తలలోని పువ్వులెల్ల!

# ఉదయశ్రీ కావ్యపరిశీలన

ఇక్కడ రాధ కొద్దిగా నవ్వగానే ప్రకృతి, బృందావనం, యమున, చంద్రుడు, పువ్వులు వేర్వేరుగా వేర్వేరు కారణాలతో నవ్వటం జరిగింది. రాధికాక్రోధమధురాధర మ్మెకింత నవ్వినది. ప్రకృతి పకపక నవ్వింది. రాధ ప్రకృతి స్వరూపం. రాధ నవ్వు ఛాయగా, ప్రతిధ్వనిగా ప్రకృతిలో పకపకమంది. బృందావనం, యమున నవ్వుకొన్నవి—అంటే తమలో తాము సన్నగా—యమునా తటాన బృందావనంతో రాధ ఎన్నిసార్లు కోపం అభినయించలేదు. కృష్ణుడు తనచాతుర్యంతో ఎన్నిసార్లు ఆ అలుక తీర్చలేదు. ఇది నిత్యము, నూతనము. విషయం తెలిసిన బృందావనం, యమున తమలో తాము నవ్వుకున్నాయి. చంద్రుడు నవ్వినాడు. నవ్వకేంజేస్తాడు? ప్రకృతి పురుషుల సమాగమం సిద్ధించినప్పుడు, నిండుగా నవ్వి వెన్నెల వాకలు కురిపించాడు. తత్ఫలితంగా రాధ తలలోని పువ్వులు పొట్టలు విచ్చిపోయేటట్లు నవ్వి వికసించాయి.

> వాలు కన్నుల బాష్పాలు జాలువార
> నంత రాధిక వివశయై అంఘ్రియుగళి
> వ్రాలిపోయిన ప్రియుని కెంగేలనెత్తి
> చిక్కుపడిన ముంగురులను చక్కనొత్తి

కృష్ణుడిచేత మొక్కించుకోగల మహద్భాగ్యం సత్యభామకే పట్టిందనుకున్నాం. ఇప్పుడు రాధికకు కూడా నట!

> ఎంత నిర్దయురాలనో పంతగించి
> కృష్ణ, నీ చేత నిట్లు మొక్కించుకొంటి
> నవ్య వనమాల కంఠాన నలిగి పోయె
> చెక్కుటద్దాల తళుకొత్తె చిగురు చెమట
> కొదమకస్తూరి నుదుటిపై చెదిరిపోయె
> బర్హి బర్హంబు చీకాకు పడియె మౌళి—

అని ఖేదంపొంది,

> పొందనేర్తునె నిన్ను నా పూర్వజన్మ
> కృత సుకృతమై భవమున దక్కితివి నాకు

అని పొంగి పోతుంది.

సాంధ్యశ్రీ అనే ఖండికకింద 'సంజె వెలుంగులో పసిడి చాయల ఖద్దరు చీరగట్టి నారింజకు నీరు వోయు శశిరేఖవె నీవు—ఖద్దరు చీరగట్టి నారింజకు నీరుపోయునది బలరాముడి కూతురు ఎట్లా అవుతుంది?—అని అనుకోవటానికి వీల్లేదు. 'సుభద్రసూతినై రంజితపాణిపల్లవము రాయుదునా' అంటున్నాడు కవి. కాబట్టి తప్పదు. ఆమె శశిరేఖ, అభిమన్యుడి ప్రియురాలు. ఆతరువాత 'నిను మౌళిదాల్చి మృత్యుంజయమూర్తినై జమునితో తొడగొట్టి సవాలు చేతునా!'—ఇలాంటిదేమీ అభిమన్యుడు చేసినట్లు ఆధారాలు లేవు. వేరే అర్థం చెప్పుకుంటే మహాదేవుణ్ణై యముణ్ణి ధైర్యంగా ఎదుర్కొంటాను అని. శివుడు యముణ్ణి ఎదుర్కోవడానికి '.....మౌళి దాల్చటానికి' సంబంధంలేదు. 'నువ్వు నాతో ఉంటే మృత్యువుని లెక్క చేయను' అన్నది కవిభావన అయి ఉండవచ్చును. ఈ అర్థం ఆ పాదానికి చాలా దూరంగాఉంది. ఈ సమన్వయ కాఠిన్యం అభిలషణీయంకాదు. అలాగే 'వైశాఖి' శీర్షిక కింద కూడా అఖండ చండమార్తాండుడు అగ్నికణాలు చేటలతో చెరిగేవేళ 'శయనింత మీలతా మంటపమందు' అని ప్రేయసిని ఆహ్వానిస్తూ—'సుషమా సుకుమారమైన నీ గండయుగమ్ము వాడె వడ గాలికి' అంటూ మరుక్షణంలో 'ఊయలలోన వచ్చి కూర్చుండుము, స్వేచ్ఛమై కలిసి యూగుద మాశలు మిన్నుముట్టగన్' అంటాడు. పద్యం మధ్యలో ఒక భావం తెగిపోయి అక్కడితో ఆగిపోయి, నిగతా సగభాగంనుండి వేరొకభావం ఆరంభమవుతుందని ఆశించలేము. భావ సమగ్రత్వం కావాలి. ఏ ఖండికకు ఆ ఖండిక సంపూర్ణమై సమగ్రమైనది కావాలి. లేకపోతే అర్థ అస్పష్టత, కవి చెప్పదలుచుకున్నది సూటిగాపాఠకుడికి చేరలేకపోవటం జరుగుతుంది. 'ఉషస్సు' అనే శీర్షిక కింద ఉన్న పద్యాల్లో కేవలం అంధకారం మాత్రము వర్ణించబడింది. వాటిని ప్రక్కపుటలోని 'ఉదయశ్రీ' శీర్షికతో కలిపి చదువుకుంటేనేగాని సమగ్రత్వం కుదరదు. లేదా చీకటిని మాత్రమే చెప్పటం కవి ఉద్దేశం అనుకుంటే 'ఉషస్సు' అనే మకుటం అనవసర మవుతుంది.

తపోభంగం అన్న ఖండికలో శివతపోభంగం వర్ణించబడినది. శివుడు తపస్సు చేసుకొంటూంటే శైలరాణ్నందన ఉపచారం చేస్తోంది. భక్తి, వలపు పెనవైచుకుని ఆమెను ముప్పొద్దు భక్తిమై పరిచరించేటట్లు చేసినవి.

> 'వచ్చుచునున్న సూర్యభగవానుని చక్కలిగింత కప్పుడే
> విచ్చుచు విచ్చుచున్న అరవిందములందున పొంగి వెల్లువై
> వెచ్చని తియ్యదేనియలు భృంగకుమారిక లంటకుండగా
> తెచ్చితి దొన్నెలందు నిడి దేవర వారికి ఆరగింపుకై'

ఉచితోపహారాన్ని కష్టపడి సాధించి తెచ్చి నివేదించింది.

.......'పూలందు కొనుండటంచు సుమనోంజలి ముందుకు జాచి శైలరాణ్నందన వంగె—చెంగున అనంగుని చాపము వంగె—వంగె బాలేందుధరుండు కాన్కలు గ్రహింపగ'.... .

> 'తియ్య విల్కాడు వింట సంధించి విడిచె
> అక్షయమ్మైన సమ్మోహనాళుగమ్ము,

చకచక జరిగిన పూలందుకొమ్మని పార్వతి వంగడం, అదనుకి అనుగుణంగా చెంగున అనంగుని చాపం వంగడం (అప్పటికింకా అనంగుడు కాలేదు) బాలేందుధరుడు కాన్కలు గ్రహింపవంగడం, తక్షణమే మన్మథుడు సమ్మోహనాస్త్రం సంధించి విడవటం, ఇలా కన్నుమూసి తెరిచినంతలో జరిగిన సంఘటనల్ని, అతివేగంగానూ, అంత తీవ్రంగానూ చిత్రంగీసి చూపించాడు కవి.

శివుడు నిగ్రహం తెచ్చుకున్నాడు. చుట్టూ చూశాడు. '...ఫాలనేత్రంపు టగ్గిలోన భగ్గుమన్నాడు క్షణములో ప్రసవశరుడు మంచుగుబ్బలి గుహలలో మారుమ్రోగె, జేటి జవరాలి జాలి కన్నీటి పాట.'

చివరకు 'ఆ అనంత విరహ విశ్వసంగీతమే పంచమ స్వరాన గాన మొనరించినది మన కాళిదాస కోకిలమ్ము వియోగినీ

కూజితముల' అని కవి కాళిదాసుమీదగల గౌరవాన్ని, తపోభంగం ఇతివృత్తచిత్రణవల్ల కలిగిన కాళిదాసస్మృతిని వ్యక్తం చేశాడు.

పుష్పములగురించి కవికి చిత్రమైన భావనలున్నవి. కవి పువ్వులు కోయబోతే, 'జాలిగ నోళ్ళు విప్పి మా ప్రాణము తీతువా' అని బావురు మంటాయి.

'తల్లి యొడిలోని తలిరాకు తల్పమందు.
ఆడుకొను మమ్ములను బుట్టలందు చిదిమి
అమ్ముకొందువె! మోక్షవిత్తమ్ముకొరకు
హృదయమేలేని నీ పూజ లెందుకోయి'

అని మానవుడి సహృదయతను ప్రశ్నిస్తాయి.

ఊలు దారాలతో గొంతు కురిబిగించి
గుండెలోనుండి సూదులు గ్రుచ్చి కూర్చి
ముడుచుకొందురు ముచ్చట ముడులమమ్మ
అకట దయలేనివారు.....

ఆత్మ సుఖమ్ము కోసమయి అన్నుల గొంతుల కోసితెచ్చు పుణ్యాత్ముడు......నెత్తురు చేతి పూజ విశ్వాత్ముడు స్వీకరించునె.........

గుండె తడిలేక నూనెలో వండి పిండి
అత్తరులు చేసి మా పేద నెత్తురులను
కంపు దేహాలపై గుమాయింపుకొరకు
పులుముకొందురు—హంత.....'

అని ఈ విధంగా మానవ జాతినంతనూ హంతకులుగా రాక్షసులుగా, దాక్షిణ్యరహితులుగా, స్వార్థపరులుగా నిందించి 'నరజాతికి నీతి యున్నదా?' అని 'ఛీ'త్కారం చేస్తాయి. పువ్వుల గొంతుకలలో మోగిన ఈ ఆవేదన, మానవులమీద మోపిన నేరారోపణలు, మానవలోకం సుమ ప్రయోజనాన్ని ఊహించిన రీతిమీద తెలిపిన తీవ్ర నిరసనను ఉన్న దున్నట్లుగా అంగీకరించలేని నా అశక్తతకు విచారించడంలేదు. కవి పువ్వులను చూసి ఆర్ద్రతను తీవ్రతరంచేసికొన్నాడు. పువ్వును 'టప్పున' తెంపితే తొడిమనుంచి కారిన బిందువులు చెట్టు పుత్రికా వియోగంతో కార్చిన కన్నీరనో—లేకపోతే గొంతు కోసినప్పుడు పొంగి పొర్లిన నెత్తురనో అనుకున్నాడు. సృష్టిలోని కొన్ని వస్తువులమీద ఈ రకమైన దృష్టి ఉంటే బ్రతుకు అసాధ్యం కావచ్చును. 'కఠినమైన ఇనుప నాగలితో భూమాత గుండె చీల్చి పంట పండిస్తున్నావా' అంటే జీవనం అసాధ్యమవుతుంది. మరి పుష్పం ప్రయోజనం ఏమిటి? అన్న ప్రశ్నకు కవి పువ్వులచేతనే ఇలా అనిపిస్తాడు. 'దైవం తలమీద కూర్చోవాలని మాకు కోరికలేదు. మిళిందబృందాల కౌగిళ్ళలో నలిగిపోవాలనే ఉత్కంఠలేదు. ప్రేయసీ ప్రియుని వలపు కౌగిళ్ళ సందున నలిగి పరవశత చెందాలనే సంబరంలేదు.

ఒకప్రశాంతప్రభాతాన, ఒక్క మంద
మలయ మారుత వీచిలో పులకరించి
మెల్లగా తల్లి చల్లని కాళ్ళపైన
రాలి కనుమూసికొనుటె సార్థకత మాకు'

ఇలా మాట్లాడే పుష్పం తపస్విని. విశ్వమంతా కరుణామయమైంది కవికి. ఆ కరుణకు కించిత్తు లోపం జరిగినా విలవిలలాడిపోతాడు. ప్రయోజనము, సుఖము లౌకికానందము ఇత్యాద్యవస్థలకు అతీతమైనది కవి దృష్టి. కవి పండిన గుండె కల తాపసి. కాని పాఠకు లంతా తాపస హృదయాలు కలిగి ఉండాలని కోరుకోవటం అసమంజసం. కవి కున్న విలక్షణమైన దృష్టి సహజం కానప్పుడు హృదయాన్ని రంజింపలేదు. కరుణరసం ముఖ్యము చేయదలుచుకున్న కవితకు వస్తువు వస్తుత: కరుణరస ప్రతిపాదకమై ఉండాలి. కవి దృష్టిలోని కరుణామయమైన సన్నివేశమును పాఠకుడు అందుకొనలేని స్థితిలో రసాభాసం కలుగుతుంది. ఆ తాపసహృదయానికి చేతులెత్తి నమస్కరించగలం. ఆ భావం ఉదాత్తమైనదని అంగీకరించగలం కాని ఆచరించలేము. ఆచరణకు అసాధ్యం అని చెప్పటానికి కవి చిత్రించిన ఈ ఊహ ఒక నిదర్శనం. పువ్వు మొగ్గ తొడిగి వికసించి చెట్టుకిందనే రాలిపోవాలి తప్ప—వాటి గొంతు బిగించి దండకట్టి ఆనందించటం ఘోరం అన్న హృదయం గల కవి '......మహోదయమ్ములో పూచెను మొన్ననే పొగడ పూలవి మాలలు గ్రుచ్చి ఇత్తునా' అని పార్వతి చేత చెప్పించి, సౌందర్యం నెలకొల్పుతాడు.

'.....మమ్ము ముడుచుకొను మోహనాంగుల ముడుల మీద ఫేషనులు దిద్ద మా కభిలాషలేదు' 'ఫేషను' పదం వాడుకలోకి వచ్చేసింది. అసందర్భంగా లేదు అని ఎంత సరిపెట్టుకున్నా ఎబ్బెట్టుగానే కన్పిస్తోంది.

కుంతీకుమారి ఖండికలో కుంతి కానీనుణ్ణి గంగలో విడిచిపెట్టడం వర్ణించబడినది. అటు మాతృప్రేమ ఇటు లోకాపవాదం రెంటికీ మధ్య జరిగిన ఘర్షణలో కుంతి కన్న కొడుకుని గంగపాలుచేసి కన్యాత్వాన్ని కాపాడుకోజూచింది. ఇలా చేజేతులా కన్నబిడ్డణ్ని నీటి పాలు చేయటం ఎంత 'ఈశ్వరేచ్ఛ' అనుకున్నా—సమర్థింప వీలులేని అఘాయిత్యంగానే కన్పిస్తుంది. కరుణశ్రీ చిత్రణలో కుంతి అబలగా నిస్సహాయగా తన నెత్తురు పంచుకుని జన్మించిన బిడ్డకు తల్లి కాలేని అభాగ్యురాలుగా సాక్షాత్కరిస్తుంది. పాఠకుడు సానుభూతి చూపిస్తాడు. ఆమెకు కలిగిన దు:ఖంలో పాలు పంచుకొని 'అయ్యో' అనుకుంటాడు.

ప్రారంభిస్తూనే పాఠకుణ్ని కవి చెయ్యిపట్టి గంగ ఒడ్డుకి లాక్కుపోయి, 'అదిగో చూడు' అని చూపిస్తాడు.పదునయిదేండ్ల ఈడుగల బాలిక జంకొదవెడి కాళ్ళతో మెట్లు దిగటం కన్పిస్తుంది. 'కన్నియలాగె వాలకము కన్పడు చున్నది.... కాదు కాదు ఆ చిన్ని గులాబిలేత అరచేతులలో పసిబిడ్డడున్న యట్లున్నది.....ఎవరో అనరా దత డామె బిడ్డడే' అని స్థిరీకరిస్తాడు. అంతలో 'గాలి తాకున జలతారు మేలి ముసుగు జారె నొకింత' ఆమె ఎవరోకాదు. కుంతీకుమారి. అని కవి పరిచయం చేస్తాడు. అక్కడినుంచి కథ ఆరంభమవుతుంది. కుంతి గద్గద కంఠంతో—

ముని మంత్రమ్ము నొసంగనేల? ఇడెబో మున్ముందు మార్తాండు రమ్మని నే కోరగనేల? కోరితినిబో ఆతండు రానేల? వచ్చెనుబో కన్నియనంచు నెంచక ననున్ జేపట్టగానేల? వచ్చెనుబో పట్టి నొసంగ నేల?....' అనివాపోతుంది.

ఇది గతించిన దానికి వగచే స్వభావంతో తన్ను తాను నిందించుకోవటం. ఈ వగపులో పూర్వ కథా వివరణము చేయు బడినది. 'మార్తాండు రమ్మని నే కోరగనేల?' అని 'కోరితినిబో ఆతండు రానేల?' అంటుంది. సూర్యుణ్ని అప్రయత్నంగా పిలిచింది, పిలిచినా రాడనే విశ్వాసంతో. ఇది కుంతి బాల్య చేష్ట. కాని నిజంగా వచ్చాడు. 'వచ్చెనుబో కన్నియనంచు నెంచక ననున్ జేపట్టగా నేల?' కన్యను చేపట్టడం అనాచారంకాదు, కన్యను చేపట్టకపోతే మరెవరిని చేపడ్తారు?వచ్చెనుబో పట్టి నొసంగనేల, పోనీ చేపట్టాడయ్యా. కొడుకు నెందుకిచ్చాడు.? ఇది కూడా బాల్య చేష్ట అనుకోవడానికి వీల్లేదు. కుంతిచేసే ఈ విచారణ సహింప రానిది.

అందుకే కాబోలు పరిహారంగా 'గంగా భవాని—కలుష హారిణి ఈ తల్లి కడుపులోన కలిసిపోయెద నా కన్న కడుపుతోడ' అని నిశ్చయించుకుని నదిలోకి దిగుతుంది. అంతలో తరంగాలపై కొట్టుకుని వస్తున్న పెట్టెనుచూసి మనసు మార్చుకుని

ఆత్మహత్యయు శిశుహత్య యనక గంగ
పాలుగానున్న యీ దీనురాలిమీద
భువన బంధువుకే జాలి పుట్టెనేమొ

అని తన్ను తను సమాధాన పెట్టుకుంటుంది. ఈ ప్రకారం కుంతి ప్రక్కనుంచి కవి చేసిన సమర్థన ఒక రకంగా సమంజసం కాకపోలేదు. పెట్టెనిండా పూలగుత్తుల నెత్తుపెట్టి, పై చెరగుచింపి ప్రక్క పరిచి ఒత్తుకొనకుండ, చేతితో నొత్తి చూచి బిడ్డణ్ని పడుకోబెట్టింది.

చిన్ని పెదవుల ముత్యాలు చిందిపడగ
కలకల మటంచు నవ్వునేగాని, కన్న
యమ్మ కష్టము తన యదృష్టమ్ము కూడ
నెరుగడింతయు నా యమాయకపు బిడ్డ.

అని పాఠకుణ్ని పాత్రల సాన్నిహిత్యానికి లాక్కుపోయి గంగపాలు కానున్న పసిపాపమీద, పుత్ర విహీన కానున్న కుంతి మీద సానుభూతి కురిపించేటట్లు చేస్తాడు. భోజరాజు కూతుర్నయి భోగభాగ్యాలతో తులదూగుతూ 'కన్న వలునుకు పట్టెడన్నమైన పెట్టుకో నోచనైతి పాపిష్ఠి దాన' అని తిట్టుకుంటుంది. 'ఘోరము చేసినాను నా పుట్టుక మాసిపోను' అని తన్ను తను ఏవగించుకుంటుంది.

గంగకు అప్పగింత పలికి—
'దిక్కులనుజూచి భూదేవి దిక్కుజూచి
గంగదెసజూచి బిడ్డ మొగమ్ము చూచి
సజలనయనాలతో ఒక్కసారి 'కలువ
కంటి' తల యెత్తి బాలభాస్కరుని జూచె.'

దిక్కులను, భూదేవిని, గంగను చూసిందనటంలో 'మీరే బిడ్డకు రక్ష' అని చెప్తోంది. 'సజల నయనాలతో బాలభాస్కరుని జూచె' ఆ సమయంలో కుంతికి కలిగిన భావనలు పఠిత ఊహించుకోవలసిందే. ఎవరు ఈ క్రియకు బాధ్యుడో, తన్ను చేసిన ఈ పనిలోని తప్పొప్పులను చూపగల అర్హత, స్వతంత్రత ఎవరి కున్నవో ఆతనిని చూసింది. తన దౌర్బాల్యాన్ని క్షమించమంటూ, తన అశక్తతని వ్యక్తీకరిస్తూ, జగత్సాక్షిగా పుత్రప్రసాదానికి, పరిత్యాగానికి కారణభూతుడుగా అతని విధిని జ్ఞప్తికి తెస్తూ, ఇలా పఠిత హృదయాన్నిబట్టి అనేకంగా—అనంతంగా కలిగించింది..

కవి దృష్టి సీతమ్మ మీదకు పోలేదు. ఊర్మిళను చూచి జాలిపడ్తాడు. సీతమ్మ దేముంది! ధవునివెంట నున్నది కాబట్టి వనవాసం చిటికలో గడిపి వస్తుంది. కాని నీవు జీవితేశ్వరు నెడబాసి శూన్యమైన నగరంలో పధ్నాలుగేళ్ళు ఎలా ఉంటావు తల్లీ— అని బాధపడి, 'నీబోటి వధూటి బాష్పములు భూమి భరింపగ లేదు సోదరీ' అని సముదాయిస్తాడు. భర్తలేని ఒంటరితనంలో పొందే వేదనకు తోడు కైకమ్మ సాధింపులు. 'కమ్మని జవ్వనమ్మడవి గాచిన వెన్నెలజేసి భర్తృవాక్యమ్మున కడ్డు చెప్పక మహత్తర మౌపతిభక్తిలోన సీతమ్మను మించిపోయితివి.' ఇది సత్యము. నిత్యము.

'నలుగురు "నంగనాచి గహనాలకు కాంతునిగెంటి యింటిలో
కులుకుచు కూరుచున్న" దనుకొందురటంచు రవంతయేని
చింతిలకుము తల్లి!'......—అట్లా అని ఎవరనుకొంటారు?

ఎట్లా అనుకుంటారు? అనుకుంటారని కవి అనుకుంటున్నాడు.

సావిత్రి తన పతి ప్రాణాలను తీసికొనిపోతున్న యముణ్ని వెతుకుతూ

'నల్లనివాడు—రక్త నయనమ్ములవాడు భయంకర స్వరూపోల్లసనమ్మువాడు—గదనూని మహా మహిషమ్ముపై ప్రవర్తిల్లెడివాడు—నా ప్రణయ దేవుని జీవ ధనమ్ముతెచ్చె నో భిల్ల పురంధ్రులార! కనిపింపడుగా? దయచేసి చెప్పరే!

ఈ పై పద్యంలో భాగవతంలోని 'నల్లనివాడు పద్మ నయనమ్ములవాడు.....'ముద్ర స్పష్టంగా కన్పిస్తోంది. అక్కడ గోపి

కలు వెతుక్కుంటున్నారు. ఇక్కడ సావిత్రి. అక్కడపోయినది మాన ధనము. ఇక్కడ జీవ ధనము. అక్కడ ప్రశ్న వేస్తున్నది మల్లెలను. ఇక్కడ భిల్ల పురంధ్రులను. అక్కడ కృష్ణుడు నల్లనివాడు. ఇక్కడ యముడు నల్లన. అక్కడ శృంగారము. ఇక్కడ కరుణ. భాగవతంలోని పద్యంలో కృష్ణుణ్ని గురించి చెప్పిన వివరాల వెనుక వేరే విశేషార్థం తొంగి చూస్తూ ఉంటుంది. నల్లనివాడు—చీకట్లో కలిసిపోయి కన్పించనివాడు. పద్మ నయనమ్ములవాడు—విశాలమైన నేత్రాలు కలిగి ఎటు చూస్తున్నాడో తెలుసుకోవటానికి వీల్లేకుండా చూసేవాడు. కృపారసంబు పై జల్లెడివాడు—ముత్తు మందులా పైన చల్లి వశపర్చుకునేవాడు. మౌళి పరిసర్పిత పింఛమువాడు. తలకుచుట్టబడిన పింఛము కలవాడు. 'దొంగ దొరికా'డని జుట్టు పట్టుకుంటే జారిపోయి పారిపోతాడు. చేతిలో పింఛము మాత్రము మిగులుతుంది. 'మల్లియలార మీ పొదల మాటున లేడుగదమ్మ చెప్పరే' మీ పొదల మాటున ఉన్నాడు అంటే మల్లెలకు కోపం రావచ్చును. మల్లెలు స్త్రీలు. స్త్రీ మానధనచోరుణ్ణి దాచిపెట్టిన నేరం మోపినట్లవుతుంది. పోనీ లేడందామా— లేకపోలేదు. అడిగినట్లు అడగనట్లు, ప్రశ్నవేసినట్లు, కాదన్నట్లు—లేడుగదమ్మ చెప్పరే—అంటారు.

ప్రకృతంలో కవి యముణ్నిగురించి చెప్పిన పద్యంలో యముణ్ని గురించి చెప్పిన వివరాలలో అతని భీకరత తప్ప భావం ఎత్తులకుపోదు. ఈ పద్యం భాగవతంలోని పద్యానికి అనుకరణ అనడంలేదు. *భాగవతంలోని ఆపద్యం చదివాక ఆ ఛాయలోనున్న* ఈ పద్యం హృదయాన్ని అలంకరించలేదు. నిజానికి స్వతంత్రంగా వేరే పద్యమయితే బావుండి ఉండేది. కరుణశ్రీని తన ప్రభావంతో మలిచి తన పద్యం అడుగుజాడల్లో పద్యం వ్రాయించుకున్న పోతన కవితా శక్తికి జోహార్లు!

కరుణశ్రీ ప్రాచీనాంధ్ర కవులలో పోతనకు అగ్రస్థాన మిస్తారు. పోతన శీర్షికకింద' నీద అగ్రాసనమయ్య ఆంధ్ర కవులందు' అని కీర్తిస్తారు. 'ముద్దులు గార భాగవతమున్ రచియించుచు పంచదారలో నద్దితివేమొ గంటము మహాకవి శేఖర! పోతన కవితా మాధుర్యంవట్టి పంచదార తీపి కావటం అరుచి కల్గిస్తోంది. ప్రాచీనాంధ్ర కవితావనిలో విహరించే ఆంధ్ర విద్యార్థిగా కవి పోతనతో మొదలెట్టి వరుసగా తిమ్మన, పెద్దన, పింగళి కవులకు జోహార్లు చేస్తాడు. కవిత్రయంలో ఎవ్వరి ప్రస్తావన కన్పించదు. ఇది మనలోమనం అనుకోవాలి. కారణం కవిని అడక్కూడదు. అలాగే సంస్కృత కవులలో కాళిదాసు, బాణుడు, భవభూతి. తర్వాత ఆదికవి వాల్మీకిని సంస్మరిస్తాడు.

'అస్వతంత్రుడు' ఖండికలో 'నేనొక దగ్ధ జీవనుడనే అయినాను' అనే భావంలో నీళ్ళుపోసి పల్లవచేసి పదిపద్యాలలో చెప్తారు కవి. ముక్తసరిగా కుదించి క్లుప్తంగా చెప్పిఉంటే ప్రతిభావంతంగా ఉండి ఉండేది.

'తెనుగు తల్లి' శీర్షికక్రింద కాకతీయ సామ్రాజ్య జయపతాక నేడు కన్పింపదే, విద్యానగర రాజసభలోని విజయదుందుభుల మ్రోత నేడు విన్పింపదే, బొబ్బిలికోటపై తాండ్రపాపయ్య బాకు చెలరేగదే' అని దిగులుపడి కంగారు పడతారు. ఈనాడు శ్రీనాథులు, నన్నయభట్లు, పోతన్నలు లేరని విచారపడి

> పిసినిగొట్టు రాజులకును—పిలక బట్టు
> కుకవులకు— పిచ్చి పిచ్చి భక్తులకు—పిరికి
> పందలకు—తావుగాకుండ ముందు ముందు
> దిద్దుకోవమ్మ! బిడ్డల తెనుగుతల్లి.

అని హెచ్చరిక పలుకుతారు.

ఈ పద్ధతిలోనున్న కావ్యగానాన్ని మెచ్చుకోవటం చాలా కష్టం. ఆనాటి నన్నయ్యలేడు. ఆనాటి పలనాటి వీరములేదు. ఉన్నా నన్నయ్యగానూ, శౌర్యముగానూ మనం గుర్తించము. అది భవిష్యత్తు పని. పోనీ జాతి నిర్వీర్యమయిందేననుకొందాం. కవి ఆ అవ్యవస్థను వివరించి చెప్పడు. ప్రాచీనతలోని మహదంశాలు నేడు లేవు—లేవంటాడు. ఇది నిరాశావాదం. సమాజంలో నిజంగా అవ్యవస్థ ఉంటే, దాన్ని తలుచుకుని దిగులుపడి నీరసపడిపోవటంకాదు కవి చేయవలసిన పని. జాతిని జాగరితం చేసే ప్రయత్నం చెయ్యాలి. ఆ ప్రయత్నం లోపించిన 'తెనుగు తల్లి' ఖండికను అభినందించలేము. 'రాయిగ్రుద్దును' 'నీపురాశిల్పసంపత్తి అమరావతిస్తూపసముదయంబు' రాయి గ్రుద్దును అంటే స్థిరీకరించును అని అర్థం. ఆధారం వస్తువును స్థిరీకరిస్తుంది. కాని వస్తువు వస్తువునే స్థిరీకరించుకోదు.

మొత్తంమీద కరుణామయదృశ్యచిత్రణలతో నిండిన ఈ ఖండ కావ్య రచయిత కరుణ రస ముఖ్యమైన ఇతివృత్తాన్ని పెద్ద కావ్యంగా వ్రాస్తే మనోజ్ఞంగా ఉంటుంది. ఆ పని బుద్ధుడి చరిత్రతో ప్రారంభమైంది. దాన్ని సంపూర్ణంచేసి 'కరుణశ్రీ' మిగతా భాగాలను కూడా త్వరలో వెలువరిస్తారని ఆశిద్దాం.

ఈ పుస్తకం ఇప్పటికి ఇరవైమూడువేల కాపీలు అమ్ముడుపోయింది. (1958 జూలై నాటికి) ఇన్ని ప్రతులు అమ్ముడుపోవటం, ఆంధ్ర పాఠకులకుగల కవిత్వాభిరుచిని, ఉత్సుకతను తెల్పుతున్నది. అందమైన కాగితాలమీద అచ్చయిన ఈ వంద పేజీల ఖండ కావ్యం చదువుతుంటే, మంద మందంగా కలిగే తియ్యటి ఆలోచనలు, మృదువుగా దూరంగా విన్పించే సంగీతం, కళ్ళెదుట కన్పించే రూపచిత్రణలకు తోడుగా విడిచి పెట్టకుండా విన్పించే అపశ్రుతి వ. పా. బొమ్మలు!

# రంగుల పండుగ

## శ్రీ రాళ్లబండి సుదర్శనాచార్యులు

పండుగలంటే ఆబాలగోపాల మానందిస్తుంది. కానీ ....పిల్లలకు పండుగలంటే సరదా మాత్రమే కాదు. వారి కవి హుషా రెక్కించే దివ్యామృతాలు. కోరి కోరి రోజులు లెక్కేసుకుంటారు వాటికోసం. క్రితం సంవత్సరం కాల్చకుండా దాచుకున్న మందు సామానులను వినియోగం చేయడానికి దీపావళి వారం ముందునుంచే రోజా పండుగ చేస్తుంటా డొక్కొక్క కుర్రాడు.

ఒకొక్క పండుగలో ఒక్కో విశేషం. 'ఢాం! ఢాం' అని టపాకాయలను పేల్చటం, అంధకారాన్ని సవాలు చేస్తో వెలుగు కాగడాలను వెలిగించడం హృదయాని కెంతో వికాసాన్నిస్తుంది. కాకరపూవొత్తుల జిలుగు ముత్యాలకాంతులు కనుల విందులై కాలగమనాన్ని మరిపింపజేస్తాయి.

విజయదశమీ, సంక్రాంతీ, వినాయకచతుర్థి, శ్రీరామనవమి, కృష్ణాష్టమి వగైరా పండుగలు కడుపు తృప్తి నిచ్చినంతగా కనుల కుత్సాహా న్నివ్వవు. భౌతికమైన ప్రయోజనమే వాటికి. మనస్సును మధుర రోచిస్సులతో ఉద్దీపింపజేసే పండుగ దీపావ ళొక్కటే.

లోకమంతా యిదే పద్ధతైనా, ఆ వూరిలో మాత్రం ఇంకొక పండుగ కూడ దీపావళి లాగానే అతివేలమైన ఆనంద ప్రవాహంలో ముంచివేసేది చేసుకుంటారు. అది ఆనాది నుండి వారు పాటిస్తున్నారు.

'రంగుల పండుగ' అంటే బాలురకు చాల ఉత్సాహం. అది తమకు వీథుల్లో భేద మెరుగని సఖ్యంతో తిరగడానికి అవకాశమిచ్చే పండుగ. బాలుర జన్మహక్కు కూడ. బాలికలు ఇల్లు విడిచి రారాదు కాబట్టి అది తమ సొంత పండుగగా భావిస్తారు.

పెన్నేటితీరంలో ప్రత్యేకసంస్కృతి నుద్ధరించుకున్న ఆ వూరిలో 'కామదహనపు పండుగ' (హోలీ) చాల ఘనంగా జరుపుతారు. బాలురలో పాతవైషమ్యాలను పారద్రోలి నవ్యోత్సాహాన్ని పంచిపెట్టే పండుగ అది. అందుకే దాన్ని దీపావళికన్న ఘనంగా జరుపుతా రక్కడ.

బాలురకు బడినుండి విముక్తిపొందడమే ఆనందం; దానికి తోడు వారి అల్లరికి అన్ని అవకాశాలు ఇచ్చే పండుగ అది కావడం మరీ ఆనందం. గంతులేయుటం, రంగులు కొట్టుకోటం, సరదాగా గడపటం ఈ పండుగలో ప్రత్యేకత.

పండుగ జరుపుటలో పెద్దలఉద్దేశాలు వేరు. పార్వతీ పరమేశ్వరుల దాంపత్యానికి దోహదం చేయుటంలో అమరుల కోసం అలరువిల్తుడు అసువుల నర్పించిన త్యాగమూ, అతని అర్ధాంగి రతీదేవి హృదయశోకమూ వారీనాడు స్మరించి కొన్ని వేడుకలు చేయిస్తారు. మన్మథ మరణానంతరం మూడోరోజు రతీదేవికి మాంగల్యం దక్కి భర్త అనంగుడుగా లభించినట్లు కథ చెప్పించి ఆరోజు వేడుక చేస్తారు.

ఎవరి అనుమతీ లేకుండానే కామదహనం కార్య నిర్వాహకవర్గ మొకటి తెల్లవారేసరికి తయారవుతుం దారోజు. ఆ సమితిలో వాళ్లకు నాయకు డెవరో ఎవ్వరికీ తెలియదు. ఆ పండుగ జరపటానికి మాత్రం వాళ్లదే పెత్తనం. ఆరోజు చాటుమాటుగా కాక ప్రత్యక్షంగా మత్తుద్రవ్యాలు స్వీకరిస్తారు వాళ్లు. తప్పెటలవాళ్లకు త్రాగినంతా లభిస్తుంది.

పండుగరోజు ఉదయం నుండి సాయంకాలం దాకా వీథంతా తిరిగి వంటచెఱకు, కట్టెపుల్లలు వగైరా సంపాదిస్తారు తప్పెటలతో వెళ్లి. చందాలు ప్రోగుచేస్తారు. ఆ డబ్బుతో మూడోరోజు పెన్న ఇసుకలో పండిన తీయని దోసపళ్లు, వడపప్పు, పానకం పంచుతారు పిల్లలకి.

ఆరోజు ఇళ్లల్లో జరిగే వేడుకలు వర్ణనాతీతం. వరసైన బావమరదళ్లూ, ఒదిన మరదళ్లూ, కాబోయే పెళ్లికొడుకులు 'హోలి' వేడుకలో ఊపిరి త్రిప్పుకోలేకపోతారు.

కుర్రాళ్లు కిందులోని అంతరార్థం వివరంగా మాత్రం తెలియదు. వారికి తెలిసినదంతా తప్పెటల ధ్వనులు, రంగుల వానలు, గంతులు, అరుపులు.

ఆరోజు పూర్ణిమ.

కామదహన కార్యనిర్వాహక సభ్యులంతా వయోభేదం పాటించకుండా కలిసిపోతారు. అంతా ఆరోజు అయ్యవార్లంగారింటిదగ్గర ఆగారు. శబ్దాలపై శబ్దాలు. తప్పెటల ధణధణలు. అవి క్రమం తప్పడంలేదు. లయ తప్పని రుద్రపాదఘట్టన అవి.

ఈ గోలకి అయ్యవార్లంగారి కొడుకు ఆనందం నిద్ర లేచాడు. అతని కిదేదో వింతగా ఉంది; అతడావూరికే కొత్త.

ఇంతలోకే వెంకయ్య 'ఒరే! పదరా నారిగా. బాగా కొట్టూ వెళ్ళండి తప్పెట్లు." అన్నాడు, పసూలైన అర్ధ రూపాయి డబ్బు సంచిలో వేస్తూ.

అంతా కదిలారు ఉత్సాహంతో. తప్పెటల వెనుక బద్ధకంగా ఒళ్ళు విరుచుకుంటూ ఆనందం పెరటివైపు దారి తీశాడు. ఇంతలోకే అక్కడికి గంతులేస్తూ వాల్మీకి చేరాడు. అతనిచేతిలో పచ్చరంగు సీసా.

"ఒరేయ్. ఆనందీ! రారా! ఇంకా నిద్దరేనా. ఈరోజు కూడా పండగ చేసుకోకుండా."

"ఆ! పండుగ్గే లేనేం."

"చూడురా! అంతా ఏలాగా తయారైనారో. నీవు రారా! బాగా తిరుగుదాం! 'కామున్న మక్కాళు" అని అరుద్దాం!

"పోరా! నే రాను."

"ఎందుకు రావూ! నీకు రావాలని లేదు. నీవు కుర్ర వాడివి కాదూ."

"రాను. నా కిష్టంలేదు."

'అబ్బో! 'టెక్కు' జాస్తిగా ఉందే! లేదా లే! బల వంతం చేయాలా! కానీ త్వరగా! చద్దన్నం మింగి తయా రుగా మరి.'

"నేను రానన్నా నంటే రాను. నీవు వెళ్ళు."

"ఒరేయ్! నీవు మూతిముడుచ్చుకొని ముసంగిలాగా ఉండటాని కిది ఆ పల్లె కాదు. ఇక్కడ నీవు వచ్చితీరాలి. మాతో కలియాల్సిందే."

"నే రాను. ఈవేళ నేను బాగా చదువుకుంటాను నీవలాగంటే."

"ఒరేయి! నామాట విను. నీవు రాకుంటే తర్వాత చాల బాధపడ్తావు. రాకుంటే సరిపోతుం దనుకున్నావేమో! వచ్చేట్లు చేస్తాం! ఏ వూరిలో ఉంటే ఆ వూరి పద్ధతి పాటించాలి తెలుసా."

"పోరా నాగన్నా! నాల్గు మార్కులు తెచ్చుకోలేని నీవూ చేస్తావే నాకు .... చిరిగిన చొక్కా, రంగూ; అసహ్యంగా"

"అలాగా! ఇదంతా నీకు ఎగతాళా! నీపని చెబుతా నుండు."

"ఒరేయి! తన్నులు తింటావు. జాగ్రత్త. అత్తా...." అరిచాడు ఆనంద్. చల్లాలనుకొన్న రంగుసీసా మూత మూశాడు వాల్మీకి. కాని అటూ యిటూ ఆపదలో నుండేవానిలా దిక్కులుచూసి సీసాతో అక్కడినుండి మాయమయ్యాడు.

రంగు పులుముకోనివారంటే పిల్లలకి పట్టుదల; చినిగిన చొక్కా వేసుకొని రంగుమరకలు గల ఆకారంతో ఉంటే ఎవ్వరూ జోలికి రారు. ఆనందాని కేలాగయిన 'రంగు మజా' చూపించా లనుకున్నాడు వాల్మీకి.

ఏది ఏమయినా ఇల్లువిడిచి కదిలి పోకూడ దనుకున్నాడు ఆనందం. ఆవిధంగా తనను తాను రక్షించుకొంటే అదే గొప్పతనంగా భావించాడు ఆనందం. తోడి పిల్లలు పొందే ఆనందంలో భాగం అక్కరలేదనిపించింది. అంతే.

అవును. చిన్నప్పటినుండి అంతే ఆనందు. తల్లి పోయినప్పటినుండి మమత అతనిలో నూరిపోశారు పెద్దవాళ్ళు. ఎలిమెంటరీ స్కూలు చదువు కాగానే హైస్కూలు చదువు కోసం అమ్మమ్మ దగ్గరనుండి నాన్న దగ్గరికి వచ్చినందున ఆవూరి పద్ధతు లింకా వంటబట్టలేదు. స్కూలేమో, తన యిల్లేమో. అంతే తెలుసు అతనికి. అందుకే అన్ని విషయా లల్లో అతనికే ఫస్టు మార్కులు వస్తూంటాయి. వీధిలో తల్లిదండ్రు లంతా తమ పిల్లలకు 'ఆనందులా తెలివిగా చదువుకోరాదూ' అని అనిపింపజేయటానికి తగినట్లుగా ఉంది ఆనందు పరిస్థితి.

తోడిపిల్లల కిది యిష్టంలేదు. ఆటపాటల్లో తమలో కలిస్తే ఆనందు కూడా "ఎందు కల్లరి చేయలేడో!" పది మందికి చూపాలని అనుకుంటారు వారు. శేషాద్రి, వెంకట రెడ్డి, నరసింహులు, వరప్రసాదు, 'గౌసుభాషా' వీళ్లంతా ఆనందు స్నేహం కోసం పోటీ పడుతూంటారు. కాని ఎవ్వరి తోను ఎక్కువగా కలవడు ఆనందం.

ఎవ్వరితోనూ కలవకపోవడమే మంచిదనుకున్నాడు ఆనందం. అలావుంటే ఈరోజు తను గెలిచినట్లే అను కున్నాడు. పుస్తకాల అల్మరా దగ్గరికి చేరాడు. కాని మనసు మాత్రం ఆలోచనల పురులలోనుండి విడిచి రాలేదు. చెవులు చిల్లులుపడే శబ్దాలు. తప్పెటల ధణధణలు.

ఢం! ఢం! ఢం! ఢం! ఢం! ఢం!

రంగు చల్లకుండా దౌడుతీసిన వాల్మీకిని మిత్రులంతా 'చవటా', 'పిరికీ', 'దద్దమ్మా' వగైరా పదాలతో నిరసిం చారు. వాల్మీకి ఉగ్రుడైనాడు. 'వానిమీద ఈరోజు రంగుల వాన కురిపించి తీర్తాను. లేకపోతే నా పేరే వాల్మీకి కాదు. తెలుసా. సై! నాతో ఎవరైనా రండి మరి.'

అంతా వాల్మీకి నిర్ణయానికి హర్షించారు. వీధిలోని 'పాత ఎనిమీ' లంతా 'ఫ్రెండ్సు' కావాలన్నాడు నరసింహులు. పాపం నరసింహులతో చాలమంది మాటాడరు కాబట్టి. సరే అన్నాడు వెంకటరెడ్డి. శేషయ్య ఆమోదంతో అంతా కలిసి పోయారు.

నాగమ్మ అవ్వగా రింటి కొళాయి తిన్నెమీద అంతా సమావేశ మయ్యారు.

"ఆనందిగాడు బయటికి రాడురా!" అన్నాడు శేషయ్య విచారంగా.

"ఆ! వాడి మొహం. రాకుండా ఎలా ఉంటాడ లేరా!" సమాధానపర్చాడు వెంకటరెడ్డి.

"వాడు రాకుంటే ఏమిరా ! అంతా వెళ్ళి రంగు కుమ్మరిద్దాం నెత్తిన" ధీరుడులా సెలవిచ్చాడు కిట్టన్న.

"వాళ్ల నాన్న ఇంట్లోనే ఉన్నాడురా" నరసింహులు అందులో ప్రమాదాన్ని హెచ్చరించాడు.

"అవునురా బాబు. ఆయనకు కోపం వస్తే పెద్ద పులిలా తయారవుతాడు. మన మూతి పళ్లు రాలడం ఖాయం" శేషయ్య తెలివిగా సర్దాడు.

"అయితే ఎట్లాగు మరి !" వాల్మీకి పిడికిలి బిగించి పెదవులు చప్పరించసాగాడు.

క్షణాలు కొన్ని మౌనంగా గడిచిపోయాయి. కుర్రాళ్ల ముఖాలల్లో వివిధ భావాలు, భావప్రకటనాయత్నాలు, వ్యక్తావ్యక్తంగా నివురుగప్పిననిప్పులు కాసాగాయి.

'ఆ !' ఎగిరాడు. చేతులు పైకెత్తి నరసింహులు.

"ఏరా ! ఏం తోచింది" అంతా ఏకమైనారు ప్రశ్నలో.

"ఏంలేదురా ! మనమంతా కలిసి వెళ్ళి అయ్యవారు పిల్చాడని పిలుద్దాం" తన ఉపాయంలోని ప్రతిభకు పొంగి పోతూ అన్నాడు నరసింహులు.

"ఒరె ! నరసింహులూ. నీ ఉపాయం ఏడిచినట్లుంది. అందుకేరా నిన్ను 'డబ్బా' అని మేం పిలిచేది. వట్టి మట్టి బుర్రకాని అందులో..." వెంకటరెడ్డి ఈసడించాడు.

"చాల్లేవోయి. నీవూ నీ బుర్రమీద పైక్రాఫ్" వెంకట రెడ్డి పాపిటలేకుండా దువ్వినందున అది చూపాడు నర సింహులు.

"ఏమన్నావ్ ! ముక్కు దూలం విరగ్గొడతా" చొక్కా చేతులు మడిచాడు రెడ్డి.

"ఉండర్రా ! మీ రిద్దరూ పోట్లాడితే ఏలా. మన 'ప్లాను' నెరవేరిందాకా మనం జట్టుగా ఉండకపోతే ఎట్లా" వాల్మీకి మనస్సంతా ఆనందు మీదే ఉంది.

'అవునురా ! కాస్త తగ్గండి' శేషయ్య తీర్మానించాడు.

'ఆ ! లేవండిరా. నాకో ఉపాయం తోచింది.' కిట్టిప్ లేచాడు.

'ఏ ఉపాయమో చెప్పు' వాల్మీకి గద్దించాడు.

'అది అందరికి చెప్పేదికాదులే. వాణ్ణి బయటికి వచ్చేట్టు చేస్తా నంతే.'

'ఏవిధంగానో' చెప్పితే కదా ! శేషయ్య పట్టుబట్టాడు.

'ఒరేయి. ఆ సంగతి నా కొదిలేయండి. ముందు కమల ఎక్కడుందో వెదకాలి." కిట్టన్న అందరిలో విశ్వాసం సంపాదించాలనే చూపులు ప్రసారం చేశాడు.

'అసలు మన ప్లానుకీ, కమలకీ సంబంధ మేమిటో చెప్పరా.' వెంకటరెడ్డి అనుమానించాడు.

"నేనేది చెప్పను—అంతా నాతో వస్తారా. రారా. కావాలంటే వెళ్తూ నా ఎత్తు వివరంగా చెప్తా' కిట్టన్న అందరికి నాయకుడైనాడు.

అంతా కదిలారు. నెపోలియను మీదికి దాడి చేయ డానికి యూరప్ రాజ్యాలన్నీ ఏకమై వెళ్లిన తీరున గుట్టుగా నడక సాగించారు.

"నేరుగా మేదరవాని కొట్టు దగ్గరికి. అంతా పిచికార్లు కొనాలి." 'సిగ్నలు' ఇచ్చాడు కిట్టన్న.

## 2

పాఠాల్లో మనస్సు నెంత లయం చేద్దామన్నా చేత నైంది కాదు ఆనందుకి. సైన్సు విసుగు, ఇంగ్లీషుకు మనస్సు ప్రశాంతిగా లేదు. తెలుగు తీశాడు. కొన్నైనా పద్యాలైనా చదువుకోవచ్చునని.

"వనగజ మంబుజాకర మహారణి జొచ్చి కలంచి యాడగా
మనమునఁ గొంకు లేక కృపమాలిన బోయలు ముట్టిచంపు చా
డ్పున భవదీయసేనఁ బొరివుచ్చగ జుట్టును ముట్టి పార్థనం
దను నలయించి నిర్దయవిధంబున జంపి రనేక సైనికుల్'

అభిమన్యుని కథలో మనసు కాస్త పూరట చెంద సాగింది. కాని వీధిలో ఒకే హోరుమని తప్పెట ధ్వనులు. నాలుగు పద్యాలు చదివాడో లేదో విసుగెత్తి గిరాటేశాడు.

వీథంతా కలకలం. తన యింట్లో నిశ్శబ్దం. కాని మనస్సులో శాంతి మాత్రం శూన్యం. ఈలా ఉండకపోతే తానూ, వాలీ, శేషయ్య వాళ్లతో కలిసిపోతే బాగుండేది' అని తోచింది. కాని అలా వెళ్లటాని కేదో చిన్నతనం.

పాపం ! గంటలు గడిచేకొద్దీ ఒంటరితనం ఆనందు మనస్సరసిలో రాళ్ళు రువ్వసాగింది. చిన్నప్పటినుండి అతనికి నలుగురితో కలిసి మెలిసి తిరిగే అలవాటు కాలేదు. తల్లిలేని పిల్లవాడు కావడంతో పుడమికి భారంకాని విధంగా, భయ భక్తుల సరిహద్దులలోపలే చరించేవాడు. అందుకై ముందుకు వెళ్లాలనే ఉత్సాహ మతనిలో ఉరకలువేసేదేకాదు.

ఈలాగ కాదని డ్రాయింగ్ బుక్ తీశాడు. అలా గయినా భోజనంవేళవఱకు గడిపితే ఆతర్వాత నిద్రపోవ చ్చునుకున్నాడు. ఇంతలోకే వాళ్ల ఒదిన అక్కడికి వచ్చింది.

'ఆనంద్ ! చొక్కా వేసుకో. బజారుకెళ్లివద్దువుగాని.'

'దేనికీ?.'

'మా నాన్నగారికి కడుపునెప్పి ఎక్కువైందట. నేను వెళ్లాలి. అందుకని గుర్రబ్బండి తీసుకువస్తావని చెబుతున్నా."

"అన్నయ్య పొమ్మన్నాడా నన్ను" వినయంగా ప్రశ్నిం చాడు ఆనంద్.

"అన్నయ్య ఇంకా పోస్టాఫీసునుండి రాలేదు. అందు కోసం."

"........."

"వెళ్ళు బాబు."

"ఇంకెవరినన్నా పంపాదినా."

"నీవు వెళ్లి తెచ్చే వాడుకేగా. ఈవేళ కొత్తేమిటో."

"అదికా దొదినా. ఈరోజు మాత్రం ఇంకెవరినన్నా పంపించు. నీకు పుణ్యముంటుంది."

"బలేవాడివే నాయినా! వీధిలో కుర్రాళ్లను చూచి నేర్చుకుంటున్నావా! బెట్టు చేయుడం. సరేలే! నీవు మంచి వాడి వన్నందుకు..." ఒదిన పాదం కదిపింది వెళ్లబోతూ.

"ఒదినా, ఒదినా, నా మాట విను. నాకేం అలాటి బెట్టు లేదు. బయట వీధిలోవాళ్ళు రంగు చల్లుతారని; అంతే."

"ఆ! నీభయం గాని, వాళ్లెందుకు చల్లుతారు, నే చెబుతాగా. చల్లొద్దని."

"వాళ్ల సమాచారం నీకు తెలీదు ఒదినా."

"అయితే మరి దొడ్డి వైపున వెళ్లి తీసుకురా."

ఇంతట్లోకే కమల ప్రవేశించింది చేతిలో గిన్నెతో.

'ఏమిటక్కా, దొడ్డివై పంటున్నావు. బర్రెను విప్పాలా'' అంది.

"ఉహూ! బర్రెను పసులవాడు తోలికెళ్లాడులే. బండి కావాలంటే ఆనందు వెళ్లనంటున్నాడు, వాళ్లెవరో రంగు చల్తారని. అందుకని దొడ్డివైపు వెళ్లమంటున్నా. అంతే!" ఒదిన కమలకు వివరించింది.

"అదా! ఏం బావా! దొడ్డివైపు వెళ్లే ధీరుడివా. వెళ్ళు వెళ్ళు" ఎకసెక్కంగా అంది కమల.

"నీతో మాట్లాడటంలేదు నేను" ఆనందు క్రూరంగా చూస్తూ అన్నాడు.

"దొడ్డితట్టు వెళ్లడానికి యింత సింగారమా అబ్బ! ఇదంతా చూస్తే రంగు పులుముదామని ఉంది తెలుసా."

"ఆ! ఆ! పులుముతావ్! పెళ్లిలో వసంతం పోస్తాడుగా, నీ భర్త నీమీద. అంతవరకు ఉండు ఓపిగ్గా."

"అబ్బో! నామాటంటేనే ఎక్కుతుంది రోషం అయ్యగారికి."

"ఇదిగో అతిగా వాగొద్దు వసపిట్టలాగా."

"సరే! సరే! వెళ్లండి. త్వరగా వస్తే రంగు తయారు చేసుకోనుంటాను."

"పళ్లు రాలగొడ్తా."

"కొట్టావు. కొట్టావు. నీ ఒళ్లంతా రంగుతో ఎరుపెక్కాక కొట్టువుగానిలే."

"నోరుమూయి—" ఆనందు వెళ్లిపోయాడు.

"రా కమలా! మజ్జిగ పోస్తా" నంది ఒదిన,

"కమల ఆమె ననుసరించింది మందహాసంతో. ఆమె కళ్లలో ఏదో సంతోషపు కాంతులు నాట్యం చేయసాగాయి.

ఆనందు బజారుకెళ్లి సాయిబు బండిని కట్టించాడు. కాని సాయిబు ఎంత చెప్పినా అతనిమాట వినిపించుకోకుండా వీధి గుమ్మంవైపే బండి తోలసాగాడు.

బండిలో కూచున్నాడు ఆనందు. సాయిబు హామీ యిచ్చాడు రంగు పోసేవాళ్లకు ఛురికతోబుద్ధిచెప్తా నన్నాడు. కాని ఆనందుకు మనసులో అనుమానం కల్గసాగింది. గుండెల్లో నుండి అది నర నరాల్లోకి వ్యాపించసాగింది.

ఇంటి దగ్గరికి బండి వచ్చేకొద్దీ గుండెలలో దడ హెచ్చసాగింది ఆనందుకు. సాయిబువెనుకగా నక్కి కూర్చుని వీధిలో కుర్రాళ్లెక్కడున్నారో కళ్లను పెద్దవిసేసి పరికించసాగాడు. దూరాన ప్రక్కవీధిలో మలుపులో తప్పెటలు వినిపించసాగాయి. ఊపిరి నెమ్మదిగా పీల్చుకోసాగాడు. వీధిలో కుర్రవాళ్లెవరూ కనపడలేదు. 'బహుశా భోజనాలకు వెళ్లుంటారు! లేదా తప్పెటలవాళ్లతో వెళ్ళుంటారు!' అని అనుకున్నాడు. కొంచెంధైర్యం కల్గింది. తల కొంచెం పైకెత్తాడు.

ఇంటి ఆవరణలోకి చేరుకుంటే ఇంక తన కింకెవ్వరూ రంగు కొట్టలేరు. అంతవరకు నెగ్గితే తను గెల్చినట్లే అనుకున్నాడు.

"ఒదినా వాళ్ల నాన్న కీరోజే కడుపునెప్పిరావాలా!" అని విసుక్కున్నాడు.

బండి ఇంటిముందు నిలిపాడు సాయిబు. ఆనంద్ ధీమాగా దిగాడు. వీధిలో ఒక్క పిట్టయినా లేకపోయేసరికి ముఖంలో విచిత్ర మందహాసం వికసించసాగింది. 'వీధివైపునే బండి తెచ్చానని కమలకు బుద్ధివచ్చేలా చేయాలి.' కాస్త ఆగాడు.వీధిలో రెండు క్షణాలు నిల్చి చూచాడు నిర్లక్ష్యంగా; స్వాతంత్ర్యప్రకటన చేసిన వాషింగ్టన్‌లా భావించాడు. ఎంతో పెద్దబాధ్యత తీరినట్లు చేతులు బాగా కదిలిస్తూ గర్వంతో అడుగులువేస్తూ 'గేటు' రెక్క తీశాడు. ముఖంలో విజయవిలాసం! భాస్కరుని కోటికిరణాల రోచిస్సులు కళ్లలోనుండి వెలువడి ముఖానికి నీరాజనా లెత్తసాగాయి.

నిదానంగా చూచాడు చుట్టూ. ప్రశాంతంగా 'సాయిబూ బండి తిప్పి పెట్టుకో' అని చెప్పి చిన్నగా తలుపుకు అభిముఖంగా సాగాడు.

వీధిలో ఏదో కూతలు విన్పించాయి. 'అదుగో ఆనంద్' అని. వెనుదిరిగిచూచాడు తాను, సింహానికి దొరికిన మృగంలా భీతితో. ఎవ్వరూ కన్పించలేదు. ఇంటి వైపు తిరిగాడో లేదో ఎదురుగా శేషయ్య, వాల్మీకీ, వెంకటరెడ్డి, ఇంకా ఎవరో! ఎవరో! ఎవరిమీదా అతని కళ్ళు నిలకడగా కేంద్రీకరించలేకపోయాయి. కళ్లకు బైర్లు కమ్మినట్లయింది. ఆకాశంలో అరుణకాంతులు మెరిశాయి. ఒక్క ప్రవాహంగా అతనిపై 'రంగుల వాన' కురిసింది. అందరి చేతుల పిచికార్లలో రంగులు అయిపోయాయి. చూస్తూ అలానే విల్చుండిపోయాడు రాయిలాగా. హృదయంలో చైతన్యం జాడ్యం పొందింది. ఇంతలో వాల్మీకి జేబులోంచి పచ్చరంగు సీసా తీసి చొక్కామీద చల్లాడు. చల్లి గంతులు వేయసాగాడు. అంతే

వాల్మీకి రంగు ఒంటిమీద పడిందో లేదో ఆనందు ముఖం రుద్ర ఫాలనేత్ర శిఖాజాలాలు నాలుకలు విప్పినట్లు ఎర్రబడింది రోషంతో. ఒళ్లంతా అనంతచైతన్యభావంలో వూగిసలాడసాగింది. గట్టిగా అరిచాడు. ''వెధవల్లారా! కుంకల్లారా ...''

ఇంట్లోనుండి ఆనందు ఒదినా, అత్తా వగైరా అంతా గందరగోళ మేమిటో నని వచ్చేశారు. ఆనందుకు కూడా అన్ని తిట్లు వస్తాయా అని ఆశ్చర్యపోయారు. పగలే చుక్కలు రాలినట్లు.

చూచేవా రందరికీ అదొక విచిత్ర దృశ్యమైంది. వేదికలేని, తెరలులేని, సంగీతంలేని నాట్యరంగమైం దది. ఆ రంగస్థలంలో ఆనందు ఒక్కడే విలయతాండవం చేశాడు. శత్రువులు శరీరమంతా గాయపరచినా క్రోధారుణనేత్రాలతో ప్రకాశించిన అభిమన్యునిలా తయారైనాడు. పేరు పేరునా కుర్రవాళ్లనుతిట్టాడు. ''పైక్రాఫ్. పప్పూ, డబ్బూ, కోతీ, మొద్దూ, తుంటబీడీ....'' ఆ తిట్లను వినీ మిత్రు లెవ్వరూ నోరు కదపలేదు. అమాయకు డనుకున్న ఆనందులోంచి ఇంత 'ఘాటు' పైకి వస్తుందని వాళ్లనుకోలేదు. భీకరదృశ్యాన్ని చూచే ప్రేక్షకులలాగా చూపూ,మనసూ ఒకటిగా చేశారు.

తిట్ల సాధనాలు పనిచేయలేదు. అవమానం నిలువెల్లా దహింపసాగింది ఆనందును. గొంతంతా ఏడుపును జీర్ణించుకోలేక ఆక్రోశించింది.

ఒక్క క్షణంలో ఇంట్లోకి వెళ్లి గదిలోకి దూరిపోయాడు. ఆ సమయంలో ఏడుపే ఆనందుకి ఆప్తమిత్రునిలా ఆదరణ చూపింది.

## 3

''ఒరేయి ! అన్నం పెట్టాను లేచిరా'' ఆనందత్త తలుపు తట్టి పిల్చింది. లోపల్నించి బదులేమీ రాలేదు.

''ఆ చొక్కా విప్పేస్తే పోతే ! లేచిరా ! పొద్దుపోయింది'' ఆమె అనునయిస్తూ అంది. నిశ్శబ్దం మాత్రం మిగిలింది.

ఎవరో తనను పిలుస్తున్న ట్లనిపించింది ఆనందుకు. అయినా అతడు వాటి నంత పట్టించుకోలేదు. బదులు చెప్పకుండా తనలో తానే కుమిలిపోసాగాడు.

నేలమీది బండలపై కన్నీటిచారలు ఏర్పడి ఎండిపోయినా, మౌనంగా, అలానే ఉండిపోయా డానంద్. ఏడుపువల్ల హృదయభారం కొంచెం తగ్గినట్లుంది. కాని మనస్సు మాత్రం అవమానానికి దహించుకుపోసాగింది. వాల్మీకి తనమాట నెగ్గించుకున్నాడు. 'ఎలాగైతే నేం' తా నోడిపోయాడు.

తలచుకొనేకొద్ది ''తన ఒక్కడికోసం అంతా స్నేహితులై వచ్చి దాచిపెట్టుకొని రంగుచల్లారే! తనయింట్లోనే దాక్కుంటారా వాళ్లు!'' అనే విషయం గుర్తుకు వచ్చేకొద్దీ ఏడుపు పునరావృత్తం కాసాగింది. ఎలాగో తమాయించుకున్నాడు. ''కానీ.... వాళ్లకు తాను బుద్ధిచెప్పాల్సిందే'' ప్రతీకారాన్నిగూర్చి వూహించేకొద్దీ ఒంట్లోకి శక్తివచ్చినట్లు అయ్యేది.

లేచి కూర్చున్నాడు. ఏవేవో పన్నాగాలు! మనసు ఉరకలు వేస్తూ ఉపాయాల నాహ్వానించసాగింది. మధ్య మధ్య కుర్రాళ్ల చిలిపితనం జ్ఞాపకాలు మనోవేగాన్ని అరికట్టసాగాయి.

ఆ వెధవలకు తాను బండి తీసుకురావటానికి వెళ్లినట్లు ఏవిధంగా తెల్సో ? కాకుంటే అంత తెలివిగా, చలాకీగా, గప్‌చిప్‌గా కథ నడపగలరా ! అంతా వాళ్లకి ముందే తెలుసు. కాబట్టే ఆవిధంగా చేసుంటారు. అంతే. అయినా ఎంతధైర్యం! ఎన్ని గుండెలు. తన ఇంటి ఆవరణలోనే దాక్కొని తనపై రంగు చల్లగలిగిన సాహసం. ఇంట్లోవాళ్లెవరూ వీళ్లని చూడకుండా ఉంటారా ! ఏమో ! అత్త వంటింట్లో ఉంటుంది. ఒదిన ఇంకెక్కడో పనిలో ఉంటుంది. ఎలా చూచుంటారు వాళ్లు. ఒకవేళ వాళ్లు చూస్తే మాత్రం వాళ్లకళ్లలో కారం కొట్టే ఉంటారు వీళ్లు. సామాన్యులా ! వెధవలు మరి. పాఠాల్లో లేదుగాని, శుంఠతనంతో బుద్ధికి పదునెక్కువ వాళ్లకు. అయినా వాళ్లతెలివి తెల్లారినట్లే ఉంది. పిరికి వెధవలు. ఒక్కడిమీద రంగులు పోయడానికి అంతమంది 'ఏక్ దమ్మున' రావాలా ! వెంకటరెడ్డీ, నరసింహులూ ఎన్నాళ్లనుండో 'ఎనిమీ'గా ఉంటున్నారే. వాళ్లుకూడా 'ఫ్రండ్స్' అయినట్లున్నారు. అంతా తనకోసమే కాబోలు ! నిజంగా తనమీద రంగు కొట్టడానికి ఇంతమంది వచ్చారంటే తాను వాళ్లకి అందని ఆకాశంలోని చందమామేమో! అయినా తనలో లోపమేముంది. తానేం వాళ్ల జోలి పోకున్నా వాళ్లకి తనమీదెందు కంత కచ్చ. పరీక్షల్లో యీసారి ఏదైనా అడిగినప్పుడుకదా వాళ్ల పని పట్టేది. అయినా తాను బండిలో వస్తున్నట్లు వాళ్లకెట్లా తెలుసో !

అతని భావప్రవాహానికి విరతి కల్గింది. మనసుకు మౌనంలో ఏదో స్ఫురించి మందహాసరూపంగా ప్రకాశితమైంది.

''అవును. ఇదంతా కమల కొంటెతనమే. తనకు రంగులు పోస్తానంది. తన ముస్తాబు చూచి ఒళ్లంతా ఎర్రబడేట్లు చేస్తానంది. అదే! ఏదోరకంగా ఎప్పుడూ తనను గేలిచేసే కమలే. దీనికి నాయకురా లదే !'' బావకు పుస్తకాల్లో పారినట్లు బుర్ర ఆటల్లో పారదు'' అని ఎగతాళిచేయటం దానికి జన్మహక్కయినట్లు వాగుతుంది. అవును. అదే కిట్టిగాడికి చెప్పి ఉంటుంది. ఆ సమయంలో ఎక్కడో దాగివుండి యిదంతా చేయించి ఉంటుంది. ఈసారి యింటికిరాదూ ! బాగా బుద్ధి చెప్తానో లేదో చూస్తా.''

గ్రహణానంతరం తేజస్సును వింగడించుకొన్న అమృతాంశుకళ లతని ముఖంలో వచ్చిచేరాయి.

తన ఒళ్లంతా ఒకసారి 'ఎగా దిగా' చూచుకున్నాడు. రంగుతో తడిసిన చొక్కా, లాగూ, ఎరుపూ, పచ్చ, నీలం,

నలుపూ....అందులో ఒక్కొక్క మిత్రుడే జాలిగా పిలిచినట్లు తోచింది.

నేలమీద పొర్లడంవల్ల ధూళితో చేరి చొక్కానుండి వ్యాపించే ఒకవిధమైన వాసన నాసాపుటాలు చేరసాగింది. ముఖం లో ఏదో తీవ్రనిర్ణయం చేయగలిగిన ప్రతిభ ఉదయించింది. లేచాడు. అవును తన గొప్పతనం చూపించాలి. బాగా బుద్ధి చెప్పాలి. తానూ ఈ రోజు రంగు చేలబట్టాల్సిందే. తనకు అవ మాన మేసుంది. తాను కుర్రాళ్లమాదిరే చేయాలి. అందరినీ మించిన అల్లరి తనలోనుంచే అవతరింపజేయాలి. ఒదిన పెళ్లి నాటి వసంతం మాదిరి తానూ రంగులు కురిపించాలి. ఆనందు తలుపు తీశాడు. అతని మనస్సాగరంలో కోపం బడబాగ్నిలా ముసుగు తెరలలోకి జారుకొని గంభీరతను ముద్రించింది ముఖంలో.

"అత్తా! నాకో డేడ యియ్యి" జులుంచేస్తూ అన్నాడు.

"బేడా ! దేనికీ ! అన్నంతిను ముందు."

"ముందియ్యి. నేను రంగులు కొనాలి."

"అన్నానికి రారా ! ఇస్తాగాని."

"నాకు ఆకలి చచ్చిపోయింది. డబ్బియ్యి. అన్నం తర్వాత తింటా. రాత్రికి."

"అంతవఱకు ఉండలేవురా."

"బాగానే ఉండగలను. త్వరగా యియ్యి."

"సరే ! ఆ డబ్బాలో పావలా తీసుకో. ఏమైనా కొను క్కొని తిను."

ఆనందు పరుగుతీశా డక్కణ్ణుంచి. సాలి మంగమ్మ యింట్లో రంగులు కొన్నాడు.

పిచికారి కొనడానికి మేదరవానిదగ్గరకు వెళ్లాడు.

సాయంకాలం కావస్తోంది. కామదహనాని కింకా ఆరేడు గంటల వ్యవధి ఉంది.

ఉదయంనుండి ఎగురుతూ, గంతులేస్తూ ఉన్న కుర్రా ళ్లల్లో చాలమందికి అలత వచ్చేసింది. కామదహనపువేళ ఎప్పు డొస్తుందా అని ఎదురు చూడసాగారు.

కాని ఆనంద్‌కు మాత్రం ఆ సమయంలో తరగని ఉత్సాహం పొంగసాగింది. ఎక్కడ చూచినా ఆనందే. ఎందరిమీదో రంగులు పోశాడు. గూటినుండి వెడలివచ్చిన సీతాకోకచిలుకలా స్వచ్ఛందవిహారం చేయసాగాడు.

పిల్లలంతా ఆనందు తమలో కలిసినందుకు చాలా సంతో షించారు. బడి లేనప్పుడు కలిగే ఆనందం; పంతులు హెూం వర్క్ అడగనప్పుడు కలిగే ఆనందం, దేవాలయంలో ఆచార్యుల చక్కెర పొంగలి తిన్నప్పుడు కలిగే ఆనందం, అన్నింటిని నించిపోయింది ఆనందు స్నేహంలోని ఆనందం.

ఆరోజు ఆనందు తమ నాయకుడైనట్లు—బాల సామ్రాజ్యానికే మకుటంలేని మహాచక్రవర్తి అయినట్లు భావిం చారు వాళ్లు. ఇదొక అపూర్వ సుదినం. వీధిచరిత్రలోనే విస్మ రింపరాని విశిష్టత నార్జించుకొన్న దినం. కామదహనం రోజున ఆనందులోని పిరికితనమూ, సిగ్గూ, అన్నీ హరించుకు పోయాయి. అతని నిజరూపమీనాడు వ్యక్తం కావడం పండుగను లోకానికే మరుపురానట్లుగా జరపా లనుకున్నారు వాళ్ళు. ఈ దెబ్బలో హనుమప్పవీధివాళ్ళు కాని, మోచంపేటవారు కానీ తయారుచేసే 'కాష్ఠం' కంటె పెద్దది తయారుచేసి తీరా లనుకున్నారు.

ఆనందు కూడ తప్పెటలవాళ్ల ననుసరించి వెళ్లాడు. వాద్యానికి తగినట్లు చెంగుచెంగున గంతులేశాడు.

ఆనందు ననుసరించారు మిత్రులు. అతని కెవరు మిక్కిలి ప్రియమైన స్నేహితులో నన్న పోటీతో సతమత మయ్యారు వాళ్లు. ఆనందుకు కుడిభుజమయ్యే యోగ్యత రెడ్డిదా, శేషయ్యదా? వాల్మీకిదా; కిట్టిదా, నరసింహులుదా, చలపతిదా!

తప్పెట్లతో ఇదివరకు వెళ్లివచ్చినా ఆనందుతోపాటు కలిసి వెళ్లడంలో కుర్రాళ్లకు ఇంకా సరదా హెచ్చింది. ఇష్టం వచ్చిన చోటికల్లా తిరిగారు; ఆనందును త్రిప్పారు. రంగులు పోశారు; పోయించుకున్నారు. కాష్ఠంకోసం చెక్కలకు తిరిగారు.

రంగయ్యగారి బడి తలుపు పీకారు దొంగతనంగా; మునిసి పాలిటీవారు కక్కసుకున్న బోర్డులు వూడబీకారు. సోడా సుబ్బయ్య పాతబండిచక్రం పట్టుకొచ్చారు. ఆనందే స్వయంగా తమ యింటి వామిలో కట్టె లూడదీశాడు. కళ్లాపి చల్లటానికి పనిమనుషులు దాచుకున్న చీపుర్లన్నీ మాయం చేశారు. ఇజ్జీల వెంకమ్మ పాత కుక్కిమంచం లాక్కొచ్చారు. మట్టి మిద్దెలమీది గవాక్షపు 'గూడ' (అల్లికబుట్ట) లాక్కొచ్చారు. వీధిలో అన్నీ ప్రోగుచేశారు.

దూరంనుండి తప్పెటల శబ్దాలు చేరసాగాయి. పిల్లలంతా పీర్ల పండగలో పెద్ద పులిలా ఎగరసాగారు. అందరికీ సంబరం గానే ఉంది. అంత సంబరమూ ఆనందుకు కల్గింది., కాని .... అతనికి ఏదో తీరని వెలితి తోచసాగింది.

ఉత్సాహం క్రమంగా ఇనికిపోతున్న ట్లనిపించింది. అది చూచాడు శేషయ్య.

"ఏం ఆనంద్ ! విచారిస్తున్నావా మాలో చేరినందుకు."

"అబ్బే ! అదేంకాదు."

శేషయ్య ఏం మాట్లాడుతున్నాడోనని అంతా చేరారు.

# రంగుల పండుగ

''ఒరేయ్. ఆనందుకు ఆకలివేస్తోన్నట్టుందిరా' అన్నాడు నరసింహులు.

'ఏం లేదురా! కమలను చూడనేలేదు ఈరోజు'' మెల్లగా ఆలోచిస్తూ అన్నాడు ఆనందు.

'ఇందాక వాళ్ల అమ్మమ్మగారింటికి వెళ్లుతోంటే చూశారా నేను.'' వేంకటరెడ్డి వార్తయిచ్చాడు.

'ఓహో' అన్నాడు ఆనంద్.

'దేనికి ఆనంద్ !' వాల్మీకి అన్నాడు.

''ఊరికే' బదులిచ్చాడు ఆనంద్.

'ఒరేయ్ ! రంగులు ఆడపిల్లలకు వీధిలో వెళ్లేటప్పుడు చల్లకూడదు. తెలుసా' కిట్టు నైతికవిలువలను గుర్తుచేశాడు.

'అబ్బే! రంగు కొట్టడానికా! కానేకాదు. అది సరేగానీ, మనం ఆ రాజగోపాలు మిద్దెపైకెక్కి అక్కడ నిలబడి రంగు కొడ్దామా.'' ఆనందు వారిని సలహా అడిగాడు.

'ఓ ! యస్ ! పదండిరా.'' కిట్టు సై పలికాడు.'

'ఒరేయ్ డబ్బా! స్ట్రైక్రాఫ్, పప్పు, గోరీ''కేకేశా డానంద్.

తప్పెటలు దగ్గరి కొచ్చాయి. అంజనేయస్వామి గుడి వీధివాళ్లు వచ్చారు. పైవీధి కుర్రాళ్లంతా తమ శత్రువులు. తమ వీధిలో ఎక్కువ అల్లరి చేయకూడ దన్నారు. అలాచేస్తే రంగులుపోస్తా మన్నారు.

మిద్దెపై తొట్టె పెట్టారు. అందులో ఎర్రని రంగు నీళ్లు కలిపారు.

''పదరా పద!'', ''కామన్న పండగా'', ''కామన్న మక్కళు'' అరుపులు చెవుల్లో రింగు మంటున్నాయి.

లయ తప్పకుండా తప్పెటలు 'కంగ్' మంటున్నాయి. పై వీధి కుర్రాళ్లమీద పిచికార్లతో రంగులు కొట్టారు ఆనందు జట్టువాళ్లు. వీధిలో కుర్రాళ్లు 'క్రిందికి దిగిరాండ్రా' అని సవాలు చేశారు.

ఆ తప్పెటలు పూజారి యిల్లు దాటిపోయాయి. ఇంకో చివరి నుండి తమవీధి తప్పెటలవాళ్లంతా తయారవుతున్నారు. రెండు వైపులనుండి శబ్దాలు. ఒకదాని కొకదానికి శ్రుతి కలవడం లేదు. అంతా గగ్గోలుగా వినబడుతున్నాయి.

బాలబృందానికి ఉత్సాహం మిన్నేటిశృంగాల నందుకుంది. తమను తాము మరచిపోసాగారు. 'జల్సా' అంతా తమదే నన్నట్టు గజిబిజిగా 'గిన్నెరగోలు' తిరిగారు. ఆనందూ, నరసింహులు, రెడ్డి, శేషయ్య అంతా చుట్టు తిరుగుతూ కేక లేస్తున్నారు.

''కామన్న మక్కళు'', ''కామన్న పండగ'', పదరా పద 'రంగు బంగార్' తిరుగుతూన్న నరసింహులు కేదో కన్పించినట్లు యింది. పరిశీలనగా చూచాడు. తక్కిన కుర్రాళ్లంతా గంతు లేస్తోన్నారు. ఆనందుకు తానీ విషయం చెప్పిలిరా అనుకున్నాడు. చేయిబట్టి ఆపి చూపాడు.

'అదిగో ఆనంద్. అక్కడ వస్తోంది, చూడూ .... '

'దొరికింది పిట్ట. కానీ. త్వరగా .... దాటిపోతుంది.'

నరసింహులు జేబులో సీసా తీశాడు.. కాని అందులో రంగు కొంచెం మాత్రమే ఉంది. సీసా వాడి జేబులో తురి మాడు. వీధిలో తప్పెట్లు చాలాదగ్గరికి వచ్చాయి. అప్పుడే తప్పెటలకు మంట వేశారు కాబోలు. 'వరుస' కట్టి వేస్తున్నారు దెబ్బలు.

ఆనందు త్వరగా పిచికారి నిండా రంగు నింపాడు. తడ బడుతూ, వీధివైపే కళ్లప్పజెప్పి చూస్తూ కదిలాడు. పారిపోయే దొంగకోసం వెన్నంటి పరుగిడే పోలీసులా పరుగు తీశాడు. నరసింహులు వెనుకగా సాగాడు.

ఆ ఆనందంలో తప్పెటల శబ్దాలింకా హుషా రెక్కించ సాగాయి. మేడమెట్లు రెండేసి ప్రకారం లంఘించాడు. పిట్ట గోడకు పిచికారి తగిలింది తూలిపోయాడు. మెట్లమీద పడి దొర్లాడు. 'కమలా' అన్న పలుకులు వెలువడ్డాయి నోటినుండి.

కాస్సేపటిలో అంతా గుమిగూడారు..

తప్పెట్లవాళ్లు ఆపారు. ఆనందు వాళ్ల యింటికి కబురు వెళ్లింది. వెళ్తున్న కమలను కేకేశారు.

ఆనందు తలకు బలమైన గాయం తగిలింది. ధారగా స్రవించిన రక్తం అతని ఒంటినంతా ఎర్రగా మార్చింది.

'బా వా !' చేతో తట్టి పిలిచింది ఏడుస్తూ కమల. ఆనంద్ కన్నులు తెరవలేదు. బదులాడలేదు. అతని ఒళ్లంతా ఎరుపెక్కి కమల కడుపులో మంటలు రేపసాగింది.

''తరంగాని పనులకు వెళ్లితే'' ఎవరో పెద్దల మాట వినవచ్చింది. కమల కన్నులలో నిండి ప్రవహించిన కన్నీరు ఆ రోజు కాముని, అగ్నిశిఖల కాహుతి కాకుండా ఆపలేకపోయింది.

వీధిలో కామదహనం జరుగుతూంటే కుర్రా డొక్కడు లేడు. వాళ్లంతా ఆస్పత్రి ఆవరణలో దేవుని ప్రార్థిస్తూ ఉండి పోయారు. పండుగరోజున ఆనందును దేవుడు బ్రతికించాలని ప్రార్థించారు. కమల దేవుని కడప స్వామికి మొక్కింది శోక భారంలోనే. ఆ రోజు రాత్రి అయ్యవార్లంగా రింటిలో దీప మారిపోలేదు.

# ఉదయనోదయ ప్రబంధము

శ్రీ నిడుదవోలు వేంకటరావు

ఆంధ్రవాఙ్మయమున నతిప్రాచీనమగు బృహత్కథనుండి యితివృత్తము గ్రహించిన ప్రబంధములలో "ఉదయనోదయము" మొదటిది కడపటిది యని చెప్పవచ్చును. దీనికి తాళపత్ర ప్రతి[1] యొక్కటి మాత్రమే తంజావూరి పుస్తకశాలలో గలదు.[2] ఈఉదయనోదయమును గూర్చి తొలుత నాంధ్ర విద్వల్లోకమున కెరిగించినవారు కీర్తిశేషులు శ్రీ మానవల్లి రామకృష్ణకవి మహోదయులు. నేటివరకు నముద్రితమై నిలిచియున్న యీ గ్రంథమునుగూర్చి తెలుపుటయే యీ వ్యాసోద్దేశము.

ఉదయనోదయము అయిదాశ్వాసముల ప్రబంధము. దీనిని రచించిన కవి నారన సూరన—సూరన కథా ప్రారంభము నుండి యైదాశ్వాసముల గ్రంథము రచించి, యవతారిక వ్రాయకుండగనే—అనగా నెవ్వరికి కృతి యీయకుండగనే మరణించెను. సూరన పుత్రుడగు నారన, ముడియము భాస్కర మంత్రియను సచివుని ప్రేరణమున, నవతారికాభాగము, ఆశ్వాసాద్యంత పద్యములు రచించి గ్రంథము నాతని కంకిత మిచ్చెను. కృతిపతియగు భాస్కరమంత్రి "స్వరమేళ కళానిధి" అను సంగీతశాస్త్రగ్రంథమును రచించిన ప్రసిద్ధ విద్వాంసుడును, అళియరామరాయల దండనాథుడును, కొండవీటి పరిపాలకుడును నగు తోడరమల్ల, బయకార రామయామాత్యుని క్రింద యుద్యోగి. రామయామాత్యుని శాసనములు క్రీ. శ 1530 ప్రాంతమున లభించుటచేతను, అప్పటికీ గ్రంథము రచించిన సూరన—దివంగతుడగుటచేతను క్రీ. శ. 1500 ప్రాంతమునకుముందుగనే నీ యుదయనోదయము రచితమై యుండును.

ఈ ప్రబంధ రచన శ్రీ కృష్ణదేవరాయలవారి రాజ్యారోహణమునకు ముందుగానే సాగినది. ఇందలి కవితా రచనయు బహు ప్రశస్తమైనది. శ్రీనాథ మహాకవి రచనమును పుణికి పుచ్చుకొన్నట్లుండును. ఇట్లయ్యును నింత దనుక నిది వెలుగులోనికి రాకపోవుట సాహిత్యోపాసకుల దురదృష్టము.

## కథాసంగ్రహము

కౌశాంబియను పట్టణమును సహస్రానీకుడను రాజు పరిపాలించుచుండెను. ఆతని మంత్రి యుగంధరుడు—సేనానాయకుడు సుప్రతీకుడు—ఒకనాడు సహస్రానీకుడు నిండు కొలువుండగా, ఇంద్రుని యాదేశమున మాతలి రథముతో గూడ నచటి కరుదెంచెను. సహస్రానీకుడు మాతలిని సాదరముగ సంభావించి ఆతడు వచ్చిన కార్యముగూర్చి యడిగెను. మాతలియు, దేవేంద్రుడు సహస్రానీకుని తన లోకమున కాహ్వానించెననియు, నందుచే నాతని దోడ్కొనిపోవుటకు వచ్చితిననియు విన్నవించెను. వెంటనే సహస్రానీకుడు మాతలితో బయలుదేరి స్వర్గలోకముజేరి—యింద్రుని సందర్శించెను.

ఒకనాడు నందనోద్యానమున నింద్రుడును సహస్రానీకుడును విహరించుచుండగా నింద్రు డిట్లనెను. "నృపోత్తమా! నీకొక శుభవార్త దెలిపెదను వినుము. సాకేతరాజధానిని కృతవర్ముడనురాజు పాలించుచున్నాడు. ఆతనికి మహా సౌందర్యవతియగు మృగావతి యను కన్యక గలదు. ఆమె కిప్పుడేయౌవనోదయమైనది—ఆమె మానవకన్య గాదు. అలంబుస యను నప్సరసయే శాపవశమున భూలోకమున జన్మించినది. ఆమె నీకు భార్య కాగలదుసుమా! ఆమె శాపవృత్తాంతమును వినుము: "ఒకనాడు పరమేష్ఠి కొలువునకు అలంబుస యను నప్సరస వచ్చెను. ఆమె వలువ తొలగి యూరుమూలము కానవయ్యెను. తక్కినవారు ప్రత్యవాయభీతిచే కన్నులు మూసికొన్నను విధూము డను వసువు సాభిలాషుడై చూచెను. బ్రహ్మయది యెరింగి వారిరువురను మానవులై జన్మింప శాప మొసగెను. అలంబులయే మృగావతి—విధూముడవే నీవు. కావున నీకిక శుభము గలుగును. ఇట్లు చెప్పి మాతలితో గూడ సహస్రానీకుని నింద్రుడు వీడ్కొలిచ్చి పంపెను. ఇంద్రుని మాటలు వినినప్పటినుండి సహస్రానీకునకు మృగావతిపై మోహము రేకెత్త సాగెను. అంతకంతకు నది యగ్గలమై భూలోకమునకువచ్చునపుడాత డేమియు గమనింపకుండెను. ఆ సమయమున మధ్యేమార్గమున తిలోత్తమ లోచనోత్సవముగా విహరించుచుండెను. కాని సహస్రానీకుని దృష్టి మృగావతియందే లగ్నమై యుండుటచే తిలోత్తమను చూచియు చూడనట్లు మాటాడి మన్నింపకుండ యలక్ష్యముగ వెడలిపోయెను. తన్నవమానపరచెనని తిలోత్తమ భావించి కోపముతో నిట్లు శాపమొసగినది: "నీ హృదయములోనున్న మదిరాక్షిని పదునాల్గేండ్లు నీవు బాయుదువుగాత." కాని సహస్రానీకు డిది వినిపించుకొనలేదు. కౌశాంబి చేరి మాతలిని వీడ్కొలిపి, మృగావతి ధ్యానపరాయణుడై అత్యంత విరహబాధ ననుభవించుచుండెను. రాజకార్యములన్ని యున్నట్లే యుండెను. పరివారజనమున కేమి చేయుటకు దోచకుండ కళవళపడుచుండిరి. అట్టి సమయములో గగనమునుండి నారదు డరుదెంచెను. ఇది ప్రథమాశ్వాస కథ.

---

1. తంజావూరి పుస్తకశాల సంఖ్య 137.

1 2 భారతి—సం 5. సం 1. (1928) పుష్పాంజలి ఉదయనోదయము.

# ఉదయనోదయ ప్రబంధము

నారదుడు విచ్చేసినతోడనే సహస్రానీకుడు ప్రబుద్ధుడై యాతనికి నమస్కరించి విశేషము లడిగెను. నారదుడిట్లు చెప్పెను: సాకేతపురమును పాలించు కృతవర్మయను రాజునకు మృగావతియను కూతురు గలదు. యౌవన ప్రాదుర్భావమైన యామె యొకనాడు తన సౌధమున శయనించియుండగా కలలో నొక దివ్యపురుషు డొక చిత్ర పటమున, నొక మనోహర రాజకుమారరూపము లిఖించి యామెకు జూపి "యీ పటమును జూడుము. ఇతడే నీకు భర్తయగును" అని చెప్పి యంతర్ధానమయ్యెను.

అంత మృగావతియు మేల్కాంచి, తన హృదయము చూరగొన్న పురుషునిపై మోహమున విరహబాధ ననుభవింపుచుండ నెచ్చెలులు శైత్యోపచారములు చేసియు, వెరవుగానక యామెను కారణమడిగిరి. మృగావతి తన యనుభవమును దెలుపగా నామె చెలికత్తె, త్రిభువనములయందుగల రాజకుమారులను చిత్రించి, యీమెకు జూపినది. అందు కౌశాంబి రాజగు సహస్రానీకుని చిత్రమును చూచి యీతడే తనకు కలలో గాన్పించిన పురుషుడని తెలిపెను. ఆ వార్త సఖీజనము మూలమున కృతవర్మ డెరింగి, మృగావతిని నీకిచ్చి వివాహము చేయుటకు సంసిద్ధుడై యున్నాడు.

ప్రథమమున నీవు మృగావతియందు బద్ధానురాగుడవైయున్నమాట యింద్రుడెరింగి ఆమెకు నీయందు ననురాగము గలుగుటకు తన దూతమూలమున నీ చిత్ర పటమును చూపెను. ఇది యంతయు నాతని పన్నాగమే. యిక నీకు శుభము గలుగును అని నారదుడు వెడలిపోయెను.

అంత సహస్రానీకుడు తన మంత్రి యుగంధరుడు రాగా, నాతనికి నారదుడు చెప్పిన వృత్తాంతమంతయు తెలియ జేసెను. యుగంధరుడు తక్షణమే యయోధ్యకు ప్రయాణ సన్నాహముచేసి, ఆ పురముచేరి కృతవర్మకు తమ రాక దెలిపెను. కృతకర్మయు నానందభరితుడై మృగావతిని సహస్రానీకున కిచ్చి పెండ్లి కావించెను. మృగావతీ సహస్రానీకులు కొంత కాలము భోగమనుభవించిన పిమ్మట మృగావతి గర్భవతియయ్యెను. ఆమె గర్భగోళమున తేజోవంతుడగు కుమారుడు పెరుగుచున్నాడని జ్యోతిష్కులు చెప్పగా రాజానందభరితుడయ్యెను. ఆ సమయముననే మంత్రియగు యుగంధరునకు యౌగంధరాయణుడను కుమారుడును, సుప్రతీకునకు రుమణ్వంతుడను కుమారుడను, శాస్త్రార్థకర కుమారునకు వసంతకుడనియు, ముప్వురు కలిగి వర్ధమాను లగు చుండిరి.

మృగావతి ఒకనాడు కుసుంభరాగముతో కూడుకొనిన సరోవరమున నోలాడుటకు తనకు కోర్కె కలదని భర్తతో చెప్పెను. అంత సమస్త పరివారముతో రాజు సరోవరము చెంతకు నామెను తీసికొనివచ్చెను. ఆమెయు సంతోష చిత్తయై చెలికత్తెలతో నందు జలకేళి సలుపుచుండెను. కొంతవడికి మృగావతి యలసటచెంది చెంతనున్న వేదికపైని సేద తీర్చుకొనుచు జుట్టు ముడివైచుకొనుచుండగా నిండారు నెత్తరని దేహకాంతితోనున్న ఒక మాంసఖండముగా భావించి, యొక విహగరాజామె నమాంతముగా నెత్తుకొని, యాకాశవీథికి నతివేగమున వెడలిపోయెను.

రాజును, చెలికత్తెలును హాహాకారములతో చేయునది లేక పురమున కరిగిరి. విహగరాజును నామెను ఉదయాచల శిఖరమున నొక శిలాతలమున భద్రముగానుంచి తన దారిని వెడలిపోయెను. మూర్ఛాగతయైన మృగావతికి తెలివివచ్చినతోడనే నలుప్రక్కలనుచూచి, భయభ్రాంతయై దుఃఖించుచుండెను. ఆ సమయమున జమదగ్ని మహర్షి యచ్చటికివచ్చి అమె యుదంతము నెరింగి తన పర్ణశాలయందు నిలిపి, సంరక్షించెను. నవమాసములు నిండిన వెనుక నామెకు నొక తేజస్వి యగు కుమారు డుదయించెను. ఉదయాచలమున నుదయించినవాడు గావున నీతనికి "ఉదయనుడు" అని పేరని ఆకాశవాణి పలికెను.

జమదగ్ని మహర్షి పెంపువలన నుదయనుడు దినదిన ప్రవర్ధమానుడై సకల శస్త్ర శాస్త్ర విద్యలనేర్చి, యౌవనవంతుడయ్యెను. ఉదయను డొకనాడు తన యాశ్రమోపాంతమున విహరించుచుండగా నొక ముసలి యాటవికుడు, తన భుజదండముచే నొక పామును చంపుటకు ప్రయత్నించుట చూచెను. పాముపై దయగలిగి యా యెరుకును చూచి సొమ్మేమైన నిచ్చెదను, పామును విడుమనెను. వాడును నుదయ మునివద్ద యాతని తల్లి తొడిగిన విలువగల కేయూరమునుచూచి, దానిని కోరెను. ఉదయనుడు దానినిచ్చి పామును రక్షించెను. అంత నా భుజగము తక్షణమే పురుషరూపము దాల్చి యిట్లనద యనుని ప్రస్తుతించెను!

"అన్నా మున్ను ఖేచరు డురగమును రక్షించెను. నేడు నీవు నన్ను రక్షించితివి. నేను ధృతరాష్ట్రుడనెడి పన్నగరాజు కుమారుడను. కిన్నరుడను పేరివా డను. ఆటకొరకీ రూపము దాల్చి విహరించుచుండ నీ కిరాతుబారి బడితిని. నీకును నాకును సఖ్యమైనది రమ్ము" అని నాగలోకమునకు గొనిపోయి యచ్చట లలిత యను తన సహోదరి నాతని కర్పించెను. ఉదయను డామెతో కొన్నాళ్లు సుఖింప, నామె గర్భవతి యయ్యెను. అమెయు విద్యాధరయై మింటికరిగెను. ఉదయనుడును, భూలోకమునకు వెడలెదననెను. కిన్నరుడు తన స్నేహచిహ్నముగా వాడిపోవని పుష్పహారమును, ఘోషవతి యను వీణను నుదయనున కొసగెను.—తన కొరకై వేచియున్న తల్లివద్దకు వచ్చి యుదయనుడు సుఖముగా నుండెను.

ఆటవికుడా బంగారు కేయూరమును కౌశాంబియం దమ్మబోగా, ధనగుప్తుడు దానిపై మృగావతి పేరుండుటగాంచి రాజుగారివద్దకు నీతని తీసుకొనిపోయెను. సహస్రానీకుడు నాబోయ మూలమున నుదయనుడు, మృగావతియున్న చోటెరింగి, తన సమస్త పరివారముతో నచ్చటికి వెళ్ళుటకు సంసిద్ధుడయ్యెను. ఇది ద్వితీయాఖ్యాన కథ.

సహస్రానీకుడు, జమదగ్ని యాశ్రమమునకు నేగి అచ్చటనున్న మృగావతిని, ఉదయనుని చూచి యత్యంతానంద భరితుడై రాజధానికి తోడ్కొనివచ్చి ఉదయనునికి యౌవరాజ్య

పట్టాభిషేకము చేసెను. ఉదయనుడు కొంతకాలమునకు రాజ్యభార నిర్వహణ సమర్థుడుకాగా, సహస్రానీకు డాతనికి పట్టాభిషేకము చేసి తాను వానప్రస్థాశ్రమము స్వీకరించెను. ఉదయనునికి యౌగంధరాయణుడు, రుమణ్వంతుడు అను నిరువురు మంత్రులు గలరు. వారిరువురును ఉదయనునకు రెండు కన్నులవంటివారు. ఉదయనుడు, రాజ్యపరిపాలనయందు సమర్థుడయ్యు వీణావాదన వ్యసనపరాయణుడగుటచేత ఘోషవతి యను తన వీణను గొని వీథుల సంచరించుచు, నేనుగుల ముఖ్యముగా నాకర్షించుచు కాలక్షేపము చేయుచుండువాడు. ఇది మూడవ యశ్వాస కథ.

చండసేన మహారాజునకు వాసవదత్తయను చక్కని కూతురు కలదు. ఆమె యౌవనవతియైన వెనుక యుదయనుని యుదంతమును విని, ఆతనియందు బద్ధానురాగయై యుండెను. ఉదయనునికి యీ సంగతి తెలిసి వాసవదత్తయం దనురాగమున్నను, చండసేనునికిని తనకు వైరముండుటచేత యీ విషయమై యాతడు విశేషప్రసక్తి కలిగించుకొనలేదు. ఇంతలో చండసేనుడు స్వయంవరము చాటించి యనేక రాజుల నాహ్వానించెను. కాని వాసవదత్త యెవ్వరిని వరింపలేదు. ఉదయనునందలి మోహముచే నామె వాడియున్నదని గ్రహించి, చండసేను డెట్లయినను వాసవదత్తను ఉదయనునకు సమకూర్ప దలచి ఏనుగుల నాకర్షించుటయం దాతనికి మక్కువ కావున ఒక కర్ర యేనుగు నిర్మించి, అందు వాసవదత్త నుంచెను. ఉదయనుడును ఆ యేనుగు మనోహర రూపముచూచి, వీణ వాయించగా, యంత్ర మహిమచే నాతడు లోపలికి నాకర్షింపబడెను. అచ్చట వాసవదత్తకు వీణ నేర్పుచు కాలము గడుపుచుండెను. ఇది నాల్గవ యాశ్వాస కథ.

ఉదయనుని మంత్రియగు యౌగంధరాయణునకీ వృత్తాంతమంతయు దెలిసెను. రుమణ్వంతుని మూలమున నాతడు వారిరువురును, ఏనుగు గర్భమునుండి వెల్వడునట్లు చేసెను. కాని చండసేనుని సైనికులు వారిని బయలువెడలనీయలేదు. ఉదయను డొక్కడేయైనను నాతడు పరాక్రమవంతుడగుటచేత నెంత సైన్యసమేతులైనను వారి నొక్కుమ్మడి చెల్లాచెదరు గావించి తాను తప్పించుకొని నిజ రాజధానిని చేరెను. వాసవదత్తయు తండ్రివద్దకు జేరెను. కొంతకాలమునకు వాసవదత్తకు ఉదయనకును వివాహము జరిగెను. ఇది యైదవ యాశ్వాసమందలి కథ.

## మూ ల ము

నారన సూరన తానీ కథ నెచ్చటనుండి గ్రహించెనో తెలుపలేదు. కాని యిది కథాసరిత్సాగరమున రెండవ లంబకమున నున్న ఉదయనుని కథావృత్తాంతమే యని, యీ రెండును చదివిన వారికి తెలియగలదు. ఉదయనుని కథ కాళిదాసు కాలమునకు ముందే బహు ప్రఖ్యాతమైనదని యాతని మేఘసందేశము మూలమున నెరుకపడుచున్నది. అట్టి యీ కథకు మూలమేది యని విచారింపగా నది బృహత్కథ యని తేలినది. కథాసరిత్సాగరము సంస్కృత భాషలో రచితమైనది. కాని బృహత్కథ గుణాఢ్య పండితునిచే వైకృతభాషాభేదమగు పైశాచీ భాషలో రచితమైనది.

పైశాచీభాషలో తెలుగువారు పరిశ్రమ చేసిరనుటకు నన్నయ, నారాయణభట్టును గూర్చి చెప్పునప్పుడు "యస్సంస్కృత, కర్ణాట ప్రాకృతపైశాచికాంధ్ర భాషాసు కవిశేఖర ఇతి ప్రథితః" అని చెప్పుటయే చాలును. ఇక బృహత్కథయు, ఘోషవతి యను వీణెయు నన్నెచోడుని కుమారసంభవమున పేర్కొనబడినవి. (12—215, 6—25) నన్నెచోడునికేగాక తిక్కనకు గూడ బృహత్కథనుగూర్చి గుణాఢ్య పండితునిగూర్చి తెలియును. గుణాఢ్య పండితుడు శాతవాహన మహారాజుకాలమువాడుగదా. ఆతడు గాథాసప్తశతిని సంకలనము చేయుట వారి చారిత్రక ప్రసిద్ధ విషయము. నిర్వచనోత్తర రామాయణములో తిక్కన, శాతవాహనుని, గుణాఢ్య పండితుని గాథాసప్తశతి నిట్లు పేర్కొన్నాడు. దశమాశ్వాసము—ఆశ్వాసాంతపద్యము.

మాలిని. ధరణి భరణ దృష్యత్పార్థివార్థప్రకాండా
హరణ పండితుం డుద్య<u>ద్గుణాఢ్యక్షితీంద్రా</u>
భరణ కరణ <u>గాథా పండితోద్యత్పదా</u> వి
స్ఫురణ చరణ నిత్యస్ఫుత్య లక్ష్మీశు డుర్విన్
(10—162)

పై పద్యమున 'గుణాఢ్యక్షితీంద్రాభరణ' అనుచో గుణాఢ్యుడైన రాజుయొక్క—అనగా శాతవాహన మహారాజుయొక్క యనియు, గుణాఢ్య పండితునియొక్క' అనియు నర్థద్వయము స్ఫురింపుచున్నది. గాథా పండిత అనుచోట గాథా సప్తశతి అను నర్థము సుగమమగుచున్నది.[1] ఇంతేకాక తిక్కన మనుమసిద్ధిని వర్ణించుచు

"కవిహృదయ శుక ప్రతతి
సమాస్వాదనీయ రసికత" (1—36)

వెలసెనని వ్రాసియున్నాడు. గాథాసప్తశతి—పెక్కు కవుల కృతులనుండి సంకలనమేగదా, దీనినిబట్టి తిక్కనయు బృహత్కథను, గాథాసప్తశతిని, శాతవాహన మహారాజు కవితను చక్కగా నెరిగినవాడని చెప్పనగును.

---

1. ఉత్తర రామాయణమున తిక్కన వ్రాసిన పై విషయ మింతవరకు విమర్శకుల దృష్టికి తాకలేదు. ఇంకను మన ప్రాచీన కావ్యములను బహు సూక్ష్మముగా పరిశీలించిన నిట్టి విషయము లెన్నేని బయలుపడగలవు. ఈ నడుమనే తిక్కన కృతిని, నేనును, నా పెద్ద కుమారుడు శివసుందరేశ్వరరావును చదువుచుండగా నాతని కిది స్ఫురించినది. సాధారణముగా నాశ్వాసాంతపద్యము గొడవయే మన కవసరములేదు. గ్రంథాంతమున నున్నవి యంతకంటె నెరుగవలసినది లేదు. అందెన్నియో విషయములు దాగియున్నవి. ఇట్లే జిక్కన విక్రమార్కచరిత్రమునను నాశ్వాసాంతముల నెన్నో నూతన విషయములను మేము కనుగొన్నాము.

# ఉదయనోదయ ప్రబంధము

తెలుగు కావ్యములలోని కవి స్తుతులను మనము పరిశీలించిన తెలుగు కవులు సంస్కృతాంధ్ర కవులనేకాక, ప్రాకృత పైశాచీ భాషా కవులను స్తుతించినట్లు తెలిసికొనవచ్చును.

ప్రాచీనుడును ప్రశస్తకవియు నగు చిమ్మపూడి అమరేశ్వరుడు (క్రీ. శ. 1350) విక్రమసేనము అన తన కావ్యమున, సంస్కృతకవిస్తుతిలో 'గుణాఢ్య' పండితుని స్తుతించియున్నాడు.

సీ. భట్టనారాయణ భాషా మహాదేవి
లబ్ధవర్ణుల కర్థలబ్ధిజేయు
బాణవాగ్స్వామినీ ప్రసవమంజరి విశా
రదుల కలంకార రమను జేయు
రాజశేఖరు భారతీ జహ్నుకన్యక
సుకవీంద్రులకు భావశుద్ధి జేయు
మాఘవాణీ శీతమారుతగతి సార
మతులకు రోమోద్గమంబు సేయు
ఆ. వె. అని యెరింగి వారి యడుగులు దలచి న
మస్కరించి దండి మరి మురారి
వామనుని గుణాఢ్యు క్షేమేంద్రు నిల నలం
కారవిదుల దలచి గౌరవమున (52)
ప్రబంధ రత్నావళి (పుట 80)

పై పద్యమున 'గుణాఢ్యుడు' అలంకారికులలో జేర్పబడినవాడు కాని సంస్కృతమున గుణాఢ్యుడు' అను అలంకారికుడుగాని, కవిగాని లేడు. మరియు 'గుణాఢ్య—క్షేమేంద్రు' అని గుణాఢ్యక్షేమేంద్రుల నిరువురిని నొక్కచోట పేర్కొనుటలో కూడ విశేషమున్నది. ఏలయనగా, గుణాఢ్య పండితుడు పైశాచీ భాషలో రచించిన బృహత్కథను క్షేమేంద్రుడు, సంస్కృత భాషలో 'బృహత్కథామంజరి' అను పేర రచించినాడు.

క్షేమేంద్రుడు సుప్రసిద్ధాలంకారికుడు, మహాకవి, కాశ్మీర దేశమును క్రీ. శ. 1050—80 ప్రాంతముల బరిపాలించిన అనంతవర్మ ఆస్థానమున నున్నవాడు—కాబట్టి యీతడు నన్నయ భట్టు సమకాలికుడు—ఈతడు భారతమంజరి వ్రాయుట విశేషమే!

'క్షేమేంద్రుడు[1] సంస్కృత బృహత్కథామంజరిని రచించిన సంఘటన యెట్టిదో తెలియుటకు తెలుగునందే యొక యాధారమున్నది. అది "పతివ్రతా చరిత్రము."[2] ఇది యొక ద్విపద కృతి—రచించిన కవి పేరు లేదు. ఇందు డెబ్బదిరెండు పతివ్రతల కథలుండవలెను. కాని 31 మాత్రమే లభించినవి. అందు మొదటిది పుష్పదంతుని కథ.

ఒకనాడు పార్వతీదేవి పరమేశ్వరునిచూచి, తానెన్నడు విని యుండని, ఇదివరకెవ్వ రెరుంగని విచిత్రములైన కథలను తెలుపుమని వేడుకొనెను. పరమేశ్వరు డా మాటకు నంగీకరించెను; గాని "నేను కథలను చెప్పునప్పు డెవ్వరును మన చుట్టుప్రక్కల నుండకూడదు. అతి రహస్యములగు నీ కథలను ముందెవ్వరికి నేను వినిపించలేదు. కాబట్టి జాగరూకతతో ప్రవర్తింపవలయును" అని యొక షరతు పెట్టెను. పార్వతియు సరియే యని నందిని కాపుపెట్టెను. అంత శివుడు పార్వతి కా కథలను చెప్పనారంభించెను.

ఆ సమయమున పుష్పదంతుడను గంధర్వుడు—ప్రమథగణ నాయకుడు—వచ్చి, శివుని దర్శనముకొరకు లోనికివెళ్ళెదనని నంది కెరిగించెను. నంది యాతనిని లోపలకు పోనీయలేదు. అప్పుడాతడు వాయురూపమున లోనికేగి, పార్వతీ పరమేశ్వరులాశీనులైయున్న తల్పముపైని వ్రేలాడుచున్న పూల మాలికలో నొక తుమ్మెదగా నిలచి, ఆ కథలను వినెను. తాను వినుటయే గాక కథ పూర్తి కాగానే వాయురూపమున బయటకు వచ్చి యింటివద్ద పార్వతి చెలికత్తెయు, తన భార్యయు నగు 'జయ'కు వినిపించుచుండెను. ఇంతలో కొంతకాలమునకు కథలు ముగిసినవి. పార్వతియు మహోత్సాహముతో, తన చెలికత్తెల నందరను పిలిచి, వారిదివర కెన్నడు వినని యద్భుతమైన కథలను చెప్పెదనని, తాను విన్న కథలను చెప్ప నారంభించెను.

కాని జయమాత్రము మొదట విన్నతోడనే తనా కథ లివరకే తన భర్తచేత వింటిననియు, తనకు క్రొత్త వెంత మాత్రము కావనియు జెప్పెను. దానితో పార్వతికి చాల కోపము వచ్చి పరమేశ్వరునివద్దకు వెళ్ళి "ఓ దేవా! నాకు మీరు చెప్పిన కథలిదివర కెవ్వరెరుగరని చెప్పిరి. కాని నా చెలికత్తె జయకే యీ కథలన్నియును తెలియును. తు. చ. తప్పక చెప్పినది. నన్నీ విధముగా కన్నడసేయుట న్యాయమా?" అని ఉపాలంభించినది. శివుడు జయను పిలిపించి యడుగ తన భర్త పుష్పదంతుడు చెప్పెనని తెలిపెను. పుష్పదంతుని బిలిచి యడుగ నాతడు చేసిన మాయ చెప్పివేసెను. శివుడు కోపముతో శివద్రోహివి గాన

"నీవు రాక్షసుడవై నిర్జరారణ్య
మావాసముగ నిల్చి యాకట నొగిలి
పెద్దకాలంబు తపింతువుగాక"

అని శాపమిచ్చెను. అంత మహానందుడను పుష్పదంతుని సఖుడు సేవకుల నిట్లు బాధించుట న్యాయమా అని పుష్పదంతుని

---

1. క్షేమేంద్రుడను తెలుగుకవి గలడు. చూడుడు, తెలుగు కవుల చరిత్ర మదరాసు విశ్వవిద్యాలయప్రకటితము.

2. పతివ్రతా చరిత్రము రెండేండ్ల క్రిందట మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమువారు ప్రకటించిరి. ఇట్టి కృతులు ప్రకటితములగుచున్నవని కూడ మన సాహిత్య పరిశోధకులకు తెలియకపోవుట మిక్కిలి విచారకరము.

వెనుక వేసికొని మాట్లాడెను. గౌరికి అంత కోపమువచ్చి మహా నందుని మనుష్యుడవై చరింపుమని శాపమిచ్చెను. ఇరువురును శివ పార్వతుల కాళ్ళపై బడగా వారు శాపమోక్ష మిట్లు తెలిపిరి.

"మహానందుడు రత్నావతీపురమున రత్నగుప్తుడను వైశ్యకుమారుడై జన్మించి, రాక్షసుడైన పుష్పదంతునితో సమాగమును కలిగి, అతడు చెప్పిన కథలను వినును. అప్పుడు పుష్పదంతుని రాక్షసత్వము పోవును. ఆ కథలు ఏడు లక్షలు. వానిని లిఖింపజేసి లోకములో ప్రచారము గావించిన మహానందుడు మానవత్వము వీడును."

ఇరువురు భూలోకమున జన్మించిరి.

ఒకనాడు పుష్పదంతుడు రాక్షసుడై, లజ్వల్ల వృక్ష శాఖల వ్రేలాడుచు, ఆకలిచే తపించుచుండగా వర్తకము నిమిత్తము పరదేశమేగుచున్న రత్నగుప్తుడు, దారి తప్పి యచ్చటికి వచ్చుట తటస్థించెను. రాక్షసు డాతని మ్రింగుటకు సిద్ధపడగా రత్నగుప్తుడు శివ స్మరణము చేసెను. పుష్పదంతునికి పూర్వస్మృతి కలిగెను. అతడు రత్నగుప్తునితో "నేను చెప్పు నేడు లక్షల కథలు విన్న నాకును నీకును శాపవిముక్తి కలుగును అనెను. ఏడు లక్షలు కథలు వినుట కేడాదిపట్టును. అంతవరకు నాకలి దప్పుల కెట్లోర్తునని యాతడు బదులు చెప్పెను. "పార్వతీ దేవి కృపవలన మన కట్టి యడ్డంకులు గలుగవు. నీవు భూర్జ పత్రములపై పచ్చి కస్తూరితో నేను చెప్పు కథలు లిఖింపుము. అని రాక్షసుడు కథలు చెప్ప ప్రారంభించి యారు నెలలలో పూర్తి చేసెను. రత్నగుప్తుడు ఆరు నెలలు నిద్రాహారములుమాని వానిని లిఖించెను. పుష్పదంతుడు శాపమోక్షితుడై స్వర్గమున కేగెను.

రత్నగుప్తుడు వానిని జాగరూకతతో కాపాడుచుండెను. ఒకనాడా కథల పొత్తరంపన్నింటిని తన తలక్రింద పెట్టుకొని నిద్రించుచుండెను. ఆరు నెలలు నిద్రలేకపోవుటచే నతడు గాఢ నిద్రలో నుండెను. అట్లు కొన్ని నెలలుండెను. అంత తలక్రింద నున్న కథల పొత్తరలు వాయువశముచేత చెల్లాచెదరు కాజొచ్చెను. ఆ సమయమున

"చెదరిన వేట వచ్చిన శకాధిపుడు
నయ్యాకులొక కొన్ని యనుచర సమితి
నయ్యన దెచ్చిన చదివి యా కథల
సారస్యమున కాత్మ సంతోషమంది
చేరువ దవ్వున చెదరిన పత్ర
చయములు గూర్చి లక్ష కథల్ సమగ్ర
మయిన వల్లకిమీద యక్కట్ట నునిచి
తనపురంబున కేగి తత్కథలెల్ల
ననఘు డాక్షేమేంద్రు డను మునిచెంత
నిలిపిన నాత డన్నియు జదువుకొని
భళి! మంచి కథలని పరితోషమంది
యారాజు ప్రార్థింప నాలక్ష కథలు
ధార తప్పక సంస్కృతంబు గావింప
నప్పురాణము భూమినందందు వెలసె
అంత నిద్దురవీడి యవ్వైశ్యసుతుడు
చింతించి తలక్రింద జేర్చిన కథలు
పొత్తరగానక పొగులుచునున్న
నత్తరంగెరింగించె నాకాశవాణి."

పై పతివ్రతా చరిత్ర గ్రంథ భాగమునుబట్టి బృహత్కథ యేడు లక్షల గ్రంథమనియు నందు లక్ష గ్రంథము మాత్రమే లభ్యమైనదని యెరుగనగుచున్నది. ఈ గ్రంథములో 'క్షేమేంద్రుడనుమౌని' యని యుండుటచేతను, సంస్కృతమున నీ గ్రంథము వ్రాసినట్లుండుటచేతను, నేడు కాశ్మీర క్షేమేంద్ర మహాకవికృతముగా నెలయుచున్న సంస్కృత బృహత్కథామంజరి—రచనయొక్క పూర్వ వృత్తాంత మిందువలన మనము గ్రహింపవచ్చును. గ్రంథమున చెప్పబడిన క్షేమేంద్రుడు, కాశ్మీర క్షేమేంద్రుడనుట నిర్వివాదము. కాని యిందు 'శకాధిపతి' అని కలదు. కాశ్మీర దేశము నేలిన వారిలో క్షేమేంద్రుని కాలములో శకాధిపు డెవ్వడైన నున్నాడేమో. అది పరిశీలన చేయదగిన విషయము. కాని యింకొక చారిత్రక విపర్యాసము కన్పట్టుచున్నది.

శకాధిపుడనగా శాతవాహన మహారాజుగదా! ఆతడు క్రీ. శ. 78 నాటివాడు. పై కథలో ప్రసక్తుడైన క్షేమేందుడు క్రీ. శ. 1060 ప్రాంతము వాడని ముందు తెలిపితిని. అప్పుడు వీరిరువురికి సమకాలికత్వ మెట్లు? గ్రంథస్థ విషయమునుబట్టి, క్షేమేంద్రుడు గుణాఢ్యుని పైశాచీ భాషాప్రతిని యే రాజుల మూలముగానో సంపాదించియుండవచ్చును. ఆ రాజులకు వంశ పారంపర్యముగా మొదటి శాత వాహన రాజు కాలమునుండియు నది సంక్రమించియుండవచ్చును. తెలుగుకవి యీ విషయమునే తెలిపియుండవచ్చును. కాని యింతవరకు నీ కథ నెవ్వరెరింగింపలేదు. తెలుగుననే మొట్టమొదట యిది తెలిపిన కవి యజ్ఞాతుడైనను, మనకు సర్వదా యభినందనీయుడు. [1]సంస్కృత వాఙ్మయ చరిత్రకారులకు నిది క్రొత్తదియే.

వేరొక వ్యాసమున అ ముద్రిత ఉదయనోదయము నందలి సాహిత్య విశేషములను దెల్పెదను.

---

1. సుప్రసిద్ధాంధ్ర దేశీయేకైక సంస్కృత వాఙ్మయ పరిశోధకాచార్యులు, నాకు చిరకాలమిత్రులును నగు శ్రీమాన్ ఈయుణ్ణి వేంకట వీరరాఘవాచార్యులవారీ విషయమై సమన్వయము చేయుచు, దమ యమూల్యాభిప్రాయమును బ్రకటింతురుగాక.

# సౌభ్రాత్రము

## శ్రీ శ్రీపాద లక్ష్మీనారాయణ మూర్తి

[అవి బందిపోటు దొంగల ముఠాలు చైనాలో ప్రబలియున్న రోజులు. దొంగల అత్యాచారాలకు బలికాని వారు అరుదు. ఒకనాడు పాహియాను తోడి సన్యాసులతో వరిపొలమును కోయుచుండగా దొంగల గుంపు ఆ పొలముపై పడెను. అప్పుడు పాహియాను వారిని సన్మార్గమునకు తెచ్చిన సందర్భము.]

సోదరులార! సస్యములు చూఱగొనంగ శ్రమింపనేల? మ
ర్యాదగ నేనె మీకిడుదు నాకలి దీరగ; ఏల దీనికై
యీదశ మారణాయుధము లిట్టి యమానుషపుం బ్రవర్తనల్?
కాదన కెంత గావలయు గైకొను డంతయు చిత్తతృప్తిగా.

మిమ్ము కనుంగొనంగ మదిమిక్కిలి జాలి జనించుచుండె, పూ
ర్వమ్మున జన్మమందిటులు పాపములెన్ని యొనర్చినారో ఘో
రమ్మగు లేమి మీకిపుడు ప్రాప్తిలె; నిప్పుడు గూడ నిట్టి పా
పమ్ముల వీడకున్న నెటువచ్చును మీకిక మంచిపుట్టువుల్!

మనకడు పింత నింపుకొను మార్గము లిన్నని దింత లేదె? నె
మ్మనమున జాలిలేకిటులు మానవులం దెగటార్చి వారి వే
ధనములు మూటకట్టుకొని దారసుతోదర పోషణంబు జే
సిన నరకంబు నంబడుట సిద్ధముకాదె గ్రహింపబూనుడీ!

మీ దౌర్జన్యపిశాచి నోటబడి స్తంభీభూత చైతన్యులై
ఏదిక్కుంగనలేక ఎందఱు జనుల్ హీనస్థితిం జెందిరో
ఆ దౌర్భాగ్యుల యార్తనాదముల దైన్యంబించుకంతేని యున్
మీ దృష్టింబడలేదె? మీ యెడద స్పందింపంగలేదా దయన్.

బలవంతముగ చెవుల్ పట్టి రక్తముగార్చి గ్రహియించినట్టి జూకాల జోడు
ఏపాప మెఱుగని యెలనాగ మెడనుండి పుటుకున త్రెంచిన పుస్తెబిళ్ల
మురిసి మైమఱచిన ముద్దియ జడనుండి కోసిన బంగారుగుచ్చుగంట
తీయనికలలలో తేలిపోయిన కాంతముక్కున త్రెంచిన ముత్తియమ్ము
ఒక్కటొక్కటి విస్పష్ట వాక్కుతోడ చెప్ప కన్నీటిగాథ మీ చెవుల బడదొ!
అనదలై యేడ్చు వారి దీనారవములు శిలలనైన ద్రవింపగా జేయుచుండ!

అని సౌభ్రాత్రము రూపముం గొనిన పాహ్యాన్ దివ్య వాచామృత
మ్మును వర్షింపగ క్షాళితాత్ములయి నెమ్మోముల్ నవజ్ఞాన దీ
ప్తిని వెల్గొందగ చోరులెల్లరును భక్తిన్ మ్రొక్కి సస్యమ్ములన్
గొనకే మళ్లిరి క్రొత్త జీవితపు నిగ్గుల్ దారి చూపింపగా!

# విశ్వనాథ - వైలక్షణ్యము

శ్రీ కొత్త సత్యనారాయణచౌదరి

'రామకథ అందఱికీ తెలుసు. ఎవరూ వ్రాయనక్కఱలేదు. ఒకవేళ వ్రాస్తే ఏదో ఒక వైలక్షణ్యాన్ని చూపగలిగితేనే వ్రాయాలి. అందుకే నేను వ్రాశాను'—ఇది విశ్వనాథ కవిసమ్రాట్టు చేసినశపథము (2—11—60 ఆంధ్ర పత్రిక)

ఈ ధోరణితో ఉన్నదనుకొన్న వీరి 'రామాయణ కల్పవృక్షమును' పరిశీలింపఁగా ముప్పాతిక మువ్వీసము ఈ శపథము నెఱవేరినట్లే నాకు తోఁచినది. విలక్షణమనఁగా వేఱైనది—అన్న అర్థమేగాదు; విశేషమైన లక్షణము గలది—అన్న యర్థము కూడ ఉన్నది. కావున ఆ యర్థములోనే వైలక్షణ్యమన్నమాట ఆయననోట వచ్చియుండును.

ఇది రామాయణమున కనువాదముకాదు; వాల్మీకమునకు భాష్యమన్న ధోరణిలో కల్పవృక్షకర్త పలుకవచ్చును. మనకున్న ప్రాచీనాంధ్రవాఙ్మయమంతయు అనువాదరూపమే అయ్యు—అందలి ఒకానొక వైశిష్ట్యముచే కేవలానువాదముగా అనిపించుకొనలేదు. కవిత్రయమువారు కావించినదిగాని, శ్రీనాథాదులు చేసినదిగాని ఒక యపూర్వ సృష్టి. అనువాదముగా ఆ యితివృత్తమును దీసికొనుటలో దానిని తెలుఁగులో చిత్రించుటలో వారికున్న ప్రతిభ అసామాన్యము. అందువలననే వారి కావ్యములు స్వతంత్రకావ్యములకన్న మిన్నగా ఇన్ని వందల యేండ్లనుండి 'పరపతి' కెక్కియున్నవి. నిన్న చదివిన తెలుఁగు భారతమును నేడు మఱల చదువను బుద్ధిపుట్టుచున్నదనఁగా ఆ కవిత్రయమువారి హస్తకౌశల మట్టిదని యర్థము. రవ్వంత ఇతివృత్తమునే ఆధారముగాఁ గైకొని సర్వతో ముఖమైన కావ్యసౌందర్యమును దెచ్చియిచ్చి తెలుఁగులో తిక్కన్న వన్నెచిన్నెలు కూర్చుటఁ జేసియే తెలుఁగుభారతము కొన్ని ఘట్టములలో మూలమునే మించిపోయినదని అభిజ్ఞు లభివర్ణించిరి.

కల్పవృక్షములోని గాథ రామాయణమే కావచ్చును. నిజముగా కథకోసమని ఈ 'కల్పము'ను జదువవలసిన యక్కఱలేదు. చదివిన లాభమును లేదు. ఆ దృష్టిలో ఇంతకన్న వేయి విధాల మెఱుగైయున్న 'మొల్లరామాయణము' తెలుఁగువారికి ఉండనే యున్నది. కాఁగా, ఆ వైలక్షణ్యము గుర్తించుటకే ఈ కల్పవృక్షము మనకుఁ గావలసియున్నది. త్రేతా యుగములోని ఈ కథకు ఇరువదవ శతాబ్దిలోని వింతలు విశేషములు కొన్ని సంతనచేసి ఆధ్యాత్మికభావము లేవో ఉన్నయట్లు చూపిన ఘట్టములు ఇందుఁ గొన్ని కానవచ్చును. ఆ మాత్రము స్వాతంత్ర్యము ఏ కవికైన ఉండకతప్పదుగాని, ఆ వైలక్షణ్యములో ముఖ్యమైన ఔచిత్యము—మర్యాద మన్నవలు ఏవేవో కొన్ని పాటించి తీరవలెను. అప్పుడే ఆ కావ్యము నాలుగు కాలాలు నిలిచియుండును.

'కల్పము'లో—ఆ వైలక్షణ్యము ఎన్ని ముఖాల నడచెనో నాకుఁ దోఁచినది విన్నవింతును.

క

కైకేయి కోరిన వరములు ఇచ్చితీరవలెనని నిశ్చయమైన పిదప సుమంత్రుఁడు జోక్యము తీసికొని అందఱి ముందు కైక నిట్లని మందలించును :—

శ్లో. 'ఆశ్చర్య మివ పశ్యామి యస్యాస్తే వృత్త మీదృశం,
ఆచరంత్యా న వివృతా సద్యో భవతి మేదినీ

శ్లో. మహో బ్రహ్మర్షి జుష్టా వా జ్వలంతో భీమ దర్శనాః
ధి గ్వాగ్దండా నహింసంతి రామప్రవ్రాజనే స్థితామ్.

శ్లో. ఆమ్రం ఛిత్వా కుఠారేణ నింబం పరిచరేత్తు యః
యశ్చైనం పయసా సించే న్నైవాస్య మధురో
భవేత్' ఇత్యాది. అయోధ్య 625.

ఈ ఘట్టములో 'కల్పము' చిత్రించిన వైఖరి చూతము :

ఆ. రాజు మూర్ఛపొందె రాణులు మూర్ఛిల్లి
రంత మూర్ఛపొందె నా సుమంత్రుఁడు.....'

చం. కడకును నందఱుం దెలివిగాంచి
సుమంత్రుఁడు పెద్దయూరుపుల్
నిడివిగఁ బుచ్చి దంతములు
నెట్టన పీడనచేసి కోపపుం
బడలున.....కైకయింగని...ఇట్లనెన్.

గీ. నీవు రాజునుగాని వనీనితాంత
వీథులకుఁ బంప నిన్ను శపింపమింత
లజ్జను బతిఘ్నివగుదు కులఘ్ని
వగుదు వంతె యిది యేమి చేసితి వబ్బురముగ.

గీ. ఆవుర! సుకుమార శిల్పినీ! యంబునిధిగ
భీరు నక్షోభ్యుఁబతి నెంత వెట్టినావు?

కం. ధరణి నిను మ్రింగనోరుం
దెఱువదు బ్రహ్మర్షి వాక్యదీపిత శిక్షా
సరణియు నిన్నంటదు నీ
పరమాఘంబెంత గట్టిపడినదొ కైకా!

ఉ. తెచ్చినవేపమొక్కకును దేనియ
పోయుము చేదు మానునా!
యెచ్చటఁ బుట్టె నా గుణమె?
యెవ్వఁడెఱుంగఁడు నీదు తల్లి నా
మచ్చరి మూఁడు మూర్తులను మాకయి పుట్టితి....

# విశ్వనాథ - వైలక్షణ్యము

కం. ఆతల్లిబిడ్డ వంగన! మాతం బడి
పుట్టునంౘడు మహి, భూపతియే
రీతిఁ దలంచునొ చేయుము
భూతల మిది నీదుఁగరుణపొం కేఁ జరించున్.

ఉ. ఎయ్యదియైన మానవుల
కెంతయు నోర్చుట తేలికౌఁజుమీ
ౘపయ్యెడునట్టి మానవుల
పజ్జఁ జరించుటకంటెఁ బంపకే
యయ్యెడవుల్ రఘూత్తముని,
నాతని మాఱుగ రాజు పోవు నా
దయ్యములున్ నినుంగని కృతజ్ఞులుగా
మనుచుందు రెంతయున్

గీ. అని సుమంౘతుఁడు సాక్షేపసానుకంప
ముగను బతిమాల (అయోధ్య 99.100 పేజి)

ఇట్టి నీ వృత్తమును జూచి యీనేల ౘవయ్యలు కాలేదే అన్నదే నా కాశ్చర్యముగా ఉన్నది. వసిష్ఠాదులు చీచీ యని తిట్టి పోసిన తీౘవమైన మాట లేవియు నిన్ను బాధింపలేదే! అని వాల్మీకము చెప్పఁగా, 'ధరణి నిను ౘమింగ నోరుందెఱవదు' అని కల్పము ౘకొత్త భాష్యము వినిపించినది. మూలము చూడని వారికి 'ౘబహ్మర్షి వాక్యదీపిత శిక్షానరణియు నిన్నంటదు' అన్న వాక్య మర్థమేగాదు. 'ధిగ్వాగ్దండా :—అన్న భావము కల్పములో లేదు. ముక్కకు ముక్కగా అనువాదము కాకపోయినను మొత్తముమీఁద భావము స్ఫురింపవలయునుగదా! ఆవల—కైకేయీ దశ రథుల నిర్వరను గూర్చి అన్యాపదేశముగా మందలించినట్లున్న 'ఆౘమం ఛిత్వా'—ఇత్యాది శ్లోకమునకు ఒక విలక్షణమైన పద్యమునే కల్పము మన కిచ్చినది. వాల్మీకములో మనకుఁ జూపి నవి రెండు చెట్లు. ఒకటి మామిడి, రెండు వేప. మామిడిని గొడ్డలితో నఱికి వేపను పాలుపోసి పెంచినట్లు సుగుణాభిరాముఁడైన ౘశీరాముని వరముల వంకతో అడవులకుఁబంపి భరతుని రాజుగాఁ జేసెదరా? మధురఫలముల నిచ్చు ౘశీరాముని విడనాడి కైకేయి మాట వినుట నీకు న్యాయముగాదయ్యా అని వృద్ధరాజును మంద లించినట్లు అర్థము రావలెను. 'తెచ్చిన వేప మొక్కకును, దేనియపోయుము చేదుమానునా?' అన్నది కల్పములోని కవనము. ఈ వేప మొక్క ఎవరు? తల్లి కైకేయికి అన్వయించునా! బిడ్డయైన భరతునకే చెందునా? నీ తల్లి కథ ఎవ్వఁడెఱుఁగడని పూర్వ వృత్తాంతము జ్ఞప్తికిఁ దెచ్చుచున్నారుగాన కైకమ్మయే కల్ప మునుబట్టి వేపమొక్క కావచ్చు. మొక్క గావున భరతునకే అన్వ యించుట మంచిది. మూలమందలి సారస్యమును ౘదుంచివైచి ఈ వైలక్షణ్యము చూపుటకా ఈ కల్పవృక్షము మనకు దక్కినది?

'ఉ. ఎయ్యదియైన....' ఈ పద్యములో అంతరార్థ మేమున్నదోగాని అసలు కావలసిన అర్థము సులువుగా స్ఫురించుట లేదు. ఒకటి రెండు పాదములను గలిపి చూచినను రావలసిన అర్థమురాదు. 'పంపకేయయ్యెడవుల్ రఘూత్తముని'—రఘు రాముని అడవులకుఁ బంపకుమా అని అర్థమ కాఁబోలు! అడవులు పంపుట—ఒక వింత కారకము. ఆ వెంటనే 'ఆతని మాఱుగ రాజు పోవు' అన్నమాటకు మూలము చూచినప్పుడే నాకర్థమైనది.

శ్లో. రామే హి యౌవరాజ్యస్థే రాజా దశరథో వనం
ౘపవేక్ష్యతి మహేష్వాసః పూర్వవృత్త మనుస్మరన్.

(అయోధ్య 628) పూర్వవృత్తమనఁగా ఇక్ష్వాకు కుల ౘకమాగతవృత్తమనియర్థము. రాముఁడు యువరాజయినప్పుడు ఆచార మునుబట్టి దశరథుఁడు వనములకుఁ బోవునన్న భావమును ఒక్క చిన్న మాటలో కల్పము సూచించినది. ఇది యనువాదమును గాదు. భాష్యమునుగాదు. ఇది విలక్షణమో అవలక్షణమో చెప్ప లేము.

'ఆదయ్యములున్ నినుంగని ఎంతయున్ కృతజ్ఞులుగా మనుచుందు'రఁట! ఏ దయ్యములవి? 'ఆ' యనఁగా ౘపసిద్ధమైనవని యర్థమా!ఇంతకుఁ బూర్వ మీ దయ్యములు ఈ ఘట్టములో వచ్చినవా! లేదే. అవి కృతజ్ఞులుగా ౘబదుకుట యెందులకో! దీని కొక భాష్యము కావలెను.

'కడకును నందఱుం దెలివిగాంచి సుమంౘతుఁడు.....నిడివిగ బుచ్చి.....పీడనచేసి......కైకయింగని.....ఇట్లనియె' తెలివి గాంచినవారు రాజు—రాణులు అంతిపురిలోనివారు 'పుచ్చి—చేసి—కని' ఈ యసమాపకములకు కర్త సుమంౘతుఁడు. ఇరువురు కర్తలతో ఈ తీరుగ అసమాపకములను నడిపించుట ఈ కల్పవృక్షములోని ఇంకొక వైలక్షణ్యము. 'కడకును నందఱు' లోని సముచ్చయము ఈ కవనములోని వెలితిని చెప్పకయే చెప్పును. ఊరుపులు నిడివిగఁ ననుటలో దంతములు పీడన చేసియనుటలో అందమేలేదు. పండ్లు పటపటకొఱికి అనవలసినఈ యర్థములో దంతపీడన మనగా దంతక్షతము స్ఫురింపవచ్చును. కైకను 'సుకుమార శిల్పినీ' లని బోధించుటలో సారస్యమేమున్నదో!

"ఆ తల్లి బిడ్డ వంగన...." ఈ పద్యములోని పదములు చిన్నవే కావచ్చు. అన్వయసౌరభము చూతము. అంగన=ఓ కైకేయి, ఆ తల్లి బిడ్డవు—అంతటి నీచురాలైన తల్లియొక్క బిడ్డవు నీవు. మహిన్—మాతన్ + బడి—పుట్టునంౘడు—దీని కన్వయము కుదురదు; అర్థమురాదు. అచ్చులో అంగన! అని సంబుద్ధిగా కన్పించును. ఆ గుర్తు లాగివైచి, అంగన—ఆడుది మాతం + బడి—పుట్టునంౘడు అనవచ్చునుగాని 'బడి' యనఁగా నేమో! అసలు, బడికి, చదువుల బడియనియు, దిట్టమనియు, ౘకమమనియు వెంబడియనియు నర్థము లున్నవి. ఇందలి యర్థమేదియు 'మాతంబడికి' కుదురదాయె. మూలములోనున్న మాట ఇది : శ్లో. అభిజాతం హి తే మన్యే యథామాతుస్తథైవచ' అయోధ్య 625. నీతల్లిస్వభావమెట్టిదో నీ స్వభావము నైతము అట్టిదేయని దీనిభావము' కార్యము కారణానుసారి యనుటలౌకికవాక్యము. ఈ ఘట్టములో జనమంచివారు 'నిజజననీస్వభావ మెట్లలఘుజన ౘపదూష్యమగు నట్లుగ నొప్పెనొ నీ స్వభావ మట్లలవడెనం చెఱిఁగితి'నని తెలుఁగ

చేసిరి. నాది, యనువాదము కాదన్న మాత్రాన ఈదోషము దోషము కాకపోదు. ఒకానొక చిన్న భావమే మంచి పదములలో పొదిని పాఠకులకు వెంటనే స్ఫురించునట్లు వ్రాయలేని కవనము ఒక కవనమా! పైగా మధురాతిమధురమైన వాల్మీకి కవితను హాయిగా తెలుఁగులోఁ దెచ్చుటకు వీలులేకపోలెదు. ఇట్టి అనువాదకులనుజూచి యే కాఁబోలు అనువాదకర్తలు ద్రోహు'లని ఇటలీ దేశస్థులలో సామెత పుట్టినదఁట.

'నీయఁ 'గరుణపొంపెఁ జరించున్' ఇది యేమి స్వామీ! దుగాగమము పిదప నుగా గమము! ఒకవేళ 'అటినున్న' అచ్చువారి దోసమన్నచో 'గ' కారమెందుంకు వచ్చినట్లు? సరే! ఈ వ్యాకరణపు ఘోకులు తరువాత మరొకసారి చూతము.

చ

వనవాసము నిశ్చయము చేసికొని శ్రీరాముఁడా వార్త నుజెప్పుటకయి సీతా నివాసమునకు వచ్చును. పట్టాభిషేక మహోత్సవమున కెదురుచూచుచున్న వైదేహి, రాముని వదనారవింద వైఖరి గుర్తించి ఏవేవో అడుగఁగా, కైకేయి వరముల మాట ఆతఁడు వినిపించి, అయోధ్యలో నీవు నివసించి పెద్దలను సేవింపుమని బోధించును. అన్నియు విన్న వైదేహి కోపించి శ్రీరాముని సుకుమారముగ మందలించును. "ప్రణయాదేవ సంక్రుద్ధా భర్తారమిద మబ్రవీత్' ప్రేమ చేతనే కోపించినదిగాని వైరముచేత—కాదఁట. రామా! నీవు పలికినది సారములేని వట్టి తుచ్ఛమైన మాట. అమాట నాకు నవ్వులాటగాఁ దోచుచున్నది. లోకములో స్త్రీలకు తల్లి దండ్రులు—ఆవల భర్తయే గతి. ఆ ధర్మమే నాకును ధర్మమైయుండఁగా నీతోపాటు నేనును అడవులకు ఉత్సాహముగా పోవలసియున్నది. నీతోపాటు కందమూలాదులు తినుచు నిన్నే సేవింపవలసిన విధి నాకున్నది. కావున నేను గూడ వత్తు నన్న సీతకు రాముఁడు మఱికొన్ని కారణములు చెప్పి ఆమె ప్రయాణ మాపఁదలఁచును. వాని కన్నిటికిని సీతచక్కని సమాధానమిచ్చి

శ్లో॥ ద్యుమత్సేనసుతం వీర సత్యవంత మనువ్రతాం
సావిత్రీమివ మాం విద్ధి త్వ మాత్మ వశవర్తినీమ్'అని యొక యుదాహరణము చూపినట్లు వాల్మీకములో నున్నది.

ద్యుమత్సేనుని బిడ్డ సత్యవంతుని సావిత్రి ఎట్లు అనుసరించెనో అట్లే నన్నుఁగూడ భావింపుమని శ్రీరాముని హెచ్చరించెను. ఈ సూచనలోని ఉదాత్తతకు కల్పవృక్షము చెప్పిన భాష్యమిదిగో వినుఁడు :—

మ॥ తన వేదంబులు పండియున్న మతి
చేతన్ దొల్లి సావిత్రి భ
ర్తను వెన్నాడి పరేతరాజును
బుగర్థ స్తోమసంప్రీతుఁజే
సిన యా పాతివ భర్తృ సంవ్రతము
నా చిత్తంబునన్ హత్తియుం
డెను శ్రీ రాఘవ! నే వనంబులకునేన్
నీవెంటనే వచ్చెదన్॥ (అయోధ్య 74 పేజి)

చం. అనినను నవ్విరాముఁడు మహావనవీథిఁ
బరేతరాజు న
న్నునుఁ గొనిపోవరావలయునున్
జనకాత్మజ కూడ నన్నుఁ బ్రో
వను వలెనన్న, సీత రఘుబంధునిఁ
జూచిన చూపు వాఁడిమిన్
జనకతనూజఁ గొఁగిలికిఁ జాచి
రఘూద్వహుఁడోర్చు పుచ్చుచున్ (74)

శా॥ ఈ మాత్రంబున కింతకోపపడనీ
వేలాగు కాంతారవీ
థీమార్గంబుల నాదు మాటలకు
నాధింబొందెదో యన్ననో
స్వామీ! దండధరుండు నిన్నుఁ
గొనిపోవన్ రానె రావద్దు సా
మీ! మాయామతి యేఁడొ నన్నె
కొని పోనీ వాఁడొ! యుంకెవ్వఁడో (74)

ముచ్చటగానున్న ఈ పద్యముల నడకను జూచి మున్మెచ్చఁట మెచ్చుకోవలెను. అవధానములో నిషిద్ధాక్షరిలో ప్రాశ్నికుఁడు పెట్టు బాధను అపనయించు కొనుచు, అర్థమున్నను లేకపోయినను ఏవేవో పదములు అవధాని ఆ వృత్తములో దూర్చినట్టులు ఈ కల్పములో సైతము ముప్పాతిక మువ్వీసము 'స్వామీ! స్వామీ! నన్నును గొనిపోవ—రావలయునున్—భర్తృసంవ్రతము' వంటి పడికట్టుపదములు పడక తప్పదాయె. ప్రకృతమనుసరామః:

'సావిత్రీ మివ మాంవిద్ధి'అన్న మాటకు ఇన్ని పద్యము లీతీరు నడకలో చెప్పినను ఆ సొగసు రానేలేదు. రాముఁడు నవ్వి 'పరేతరాజు నన్నును గొనిపోవ రావలయునుఁ' ఇది మాత్రము నిజముగా కల్పము చూపిన ఉపజ్ఞయే. ఇచ్చట దండధర ప్రశంస—ఒక వైలక్షణ్యము కావచ్చును. 'మాయామతి యేఁడొ నన్నె కొని పోనీ'—ఇది కావ్యార్థ సూచన కాబోలు! వాఁడొ! యుంకెవ్వఁడో దీనితో రావణుఁడున్నాఁడు.

పతివ్రతయైన సీతా మహాదేవి సావిత్రీ సతిని సంస్మరించి నీతోడిదే నా బ్రదుకని నిశ్చయము చేసికొని సవినయముగ శ్రీరామునకు విన్నవించుకొని ఆతని యంగీకారము పొంది యున్నట్లు వాల్మీకి చెప్పిన దానికి ఈ ఘట్టము ఈ దండధర ప్రస్తావము భాష్యము కాఁబోలు! ఒకానొక పెంకెపిల్ల పెనిమిటిని ఎదిరించినట్లే ఈ కల్పవృక్షములోని సీత, రామునితో గడుసుగ మాటలాడుట మనము గుర్తింపవలెను. పరబ్రహ్మస్వరూపులుగ భావించుకొని ఆరాధింపవలసిన సీతా రాముల సంభాషణము కల్పములో ఉన్నట్లే అప్పుడు జరిగి యుండునా? క్లిష్ట దశలోనే మానవుని గుణశీలములు పదిమంది కర్థమగును. ఏ కష్టములు లేనినాఁడు కావలసినన్ని 'ధర్మపన్నములు' ఏకరువు పెట్టెడివారు లోకములో ఎందఱో యుందురు. కైకేయి కోరిన వరముల వార్త విన్నవెంటనే శ్రీరాముని మనస్సు వికారము చెందలేదు. అట్లేయని దాని కంగీకరించి దానిని సమర్థించి అది గాదన్న వారిని సుకుమారముగా మందలించి బోధించి అతఁడు

మహాపురుషుఁడాయెను. అట్టి మహాసత్త్వనకు గంభీరచిత్తునకు రవ్వంతైన లోపము రానీయక అత్త మామల సేమాత్రము ఆడిపోసికొనక పతి మార్గమే తన మార్గమని నిశ్చయము చేసి కొన్న పురాణ పతివ్రత ఈ వైదేహి. ఈ కథ ఇట్టిదై యుండఁగా విశ్వనాథవైదేహి, శ్రీరామునితో ఏమన్నదో చిత్తగింతురా!

గీ. 'ఆడు బిడ్డల మఱదులయత్తలందు
రాము! ప్రోషితపతికి గౌరవములేదు

శా. ఈ పుల్లాంతపువెన్నుఁడో తెలిసి తానే మానా మాతండ్రి, నే
నే వారింటికిఁ బోయి నా ముఖముగానే యెల్లవ్రాకుత్తునా?

(అయోధ్య 74 పేజి)

భర్త దేశాంతరగతుఁడైనప్పుడు తన్ను ఆడుబిడ్డలు మఱదులు—అత్తలు—గౌరముగా జూడరు గావున అయోధ్యలోనే నుండను. మా పుట్టింటికేపోయి మా తండ్రితో ఈ కథయంతయుఁ జెప్పి వైచెదనని ఇరువదవశతాబ్దిలోని నూటు ఆమె చెప్పినట్లు 'కల్పము' మనకుఁ జెప్పినది. అత్త మామల సేవయే నీకు ధర్మమనియు, ఆపదలోనున్న మా తల్లి కౌసల్యను విశేషించి కనిపెట్టుకొని యుండవలెననియు, 'ఆ యిక్ష్వాకుల నాఁటి లక్ష్మియ్య' రామయ్య బోధించుచుండఁగా, వారి యేలుబడిలో నేనుండలేనని ఈమె యనుటలో కల్పవృక్షములోని వైలక్షణ్యముకాక మఱేమగును? ఇట్టివి ఈ కావ్యమునుగూర్చి కొంగ్రొత్తగా మనము గుర్తింపఁదగిన విశేషములు. గౌరవభావమే లేక గడుసుఁదనపుఁ బోకడలో సరసముగాని సంభాషణ ఈ సీతాదేవి జరుపుచున్నదనఁగా అంతరార్థము కనిపెట్టవలెనా!

పద్యములోని 'ఆడుబిడ్డలన్'—అనఁగా ఆడుబిడ్డలలో అని షష్ఠ్యర్థము కాఁబోలు! లేదాసప్తమ్యర్థమో! కానిఁ మఱఁదుల యత్తలందు ఈ ప్రయోగమేమి? మఱఁదులన్—అందునా 'నత్తలందు, కావలెను. అచ్చులో అదిలేదు. మఱదుల యత్తలందు అంటుమా! మఱఁదులయొక్క అత్తలు వత్తురు. ఆడు బిడ్డలలో మఱఁదులలో అత్తలలో గౌరవము లేదన్న ఒక్క చిన్న మాటకు ఈ గీతములో ఈ డొంక తిరుగుడు ప్రయోగముల కక్కుర్తి కావలసివచ్చెనా!

''నేనే వారింటికిఁబోయి' ఇక్కడ వారు ఇంటికి, అనెడిఅపార్థము రాకుండుటకై సంధి చేయకుండుట విద్వత్కవుల వైఖరి 'నేను వారింటికి పోవుచున్నా'నని లోకములో వాడుక ఉన్నంత మాత్రాన కొన్ని ప్రయోగము లున్నంత మాత్రాన శబ్దశుద్ధి పాటించు కవీశ్వరుఁడట్లు వ్రాయఁడు. నా యంతట నేనే వ్రాకుత్తుననుటకు నా'ముఖముగా'నే అనుటలో సొగసులేదు.

### ౬

సీతా రామ లక్ష్మణులు అడవికి ప్రయాణమగుచుండఁగా వారికి నారబట్టలు తెచ్చి యిచ్చిరి. సీతకు శ్రీరాముఁడే నార చీర కట్ట బెట్టుచుండఁగా వశిష్ఠులవారు రాముని చేతిలోని చీరను లాగివైచి ఇట్లన్నాఁడట :—

కం. ధరియించు నారచీరల
నరుంధతి, ధరాత్మజాత కవి కట్టఁగరా
దరయఁ జెఱి సగముగా నీ
దరిద్రతాస్థితి పతివ్రతాలోకములన్' అని.

వ. అప్పు డరుంధతి యిట్లనియె.

ఆ. తూకమయిదు మళ్ళు తొమ్మిది మూరల
నారచీరఁగట్టినావె సీత
కాను మోయలేద యందు మున్గియపోవుఁ
గాళ్ళ కడ్డముపడి కదలలేదు.

ఆ. అనుచుఁ బొంగివచ్చు నట్టి దుఃఖము మ్రింగి
కోపమడరఁ బుడమి కూఁతునడవి
కంపువారలను శపింపఁగా దొరకొని
మఱల మనసునెల్ల మార్చికొంచు.

గీ. తిరిగి రాముఁడు వచ్చెడు వఱకునేను
మీ గడపఁ ద్రొక్కననిచెప్పిఁయేగెనంత(అయోధ్య 105)

ఈ ఘట్టములోని అరుంధతీ ప్రస్తావము వాల్మీకములోలేదు. అందఱిలో వశిష్ఠుఁడే ముందునకువచ్చి, ఆ నార చీర కట్టుకోవలదని సీతను హెచ్చరించి కైకను దిట్టిపోసి 'అనుష్ఠాస్యతి రామస్య సీతా ప్రకృత మాసనమ్'అని తీర్పు చెప్పను. స్త్రీ రాజ్యపాలనము మంచిది కాదని ఎవ్వరేని అందురేమో యని సంశయించి 'ఆత్మాహి దారా స్సర్వేషాం దార సంగ్రహ వర్తినాం అత్మేయ మితి రామస్య పాలయిష్యతి మేదినీమ్' అని పలుకును. 'అర్ధోనా ఏష ఆత్మనో పత్నీ' అన్న శ్రుతిని ప్రమాణముగా సూచించి సీతనే సింహాసనముం దెక్కింపవలెనన్నంత తీవ్రత చూపును. ఈ మాటలేనియు వైశ్వనాథ విశిష్ట మహోదయులు పలుకలేదు. వారికి బదులుగాఁ గాబోలు వారి ధర్మపత్ని అరంజోతి 'అయిదు మళ్ళ తూకము తొమ్మిది మూరల పొడవు గలిగిన నార బట్టల కథ తెచ్చి పెట్టినది. అంతటితో ఆమె ఆగక 'పుడమికూఁతు నడవి కంపువారలను' శపింపదొరకొన్నదఁట. ఎందఱినో తన బిడ్డలను విశ్వామిత్రుఁడు శపించి చంపినను శాంతము వీడని మహర్షి యని వశిష్ఠునకు పురాణకథలలో పెద్ద పేరున్నది. శాంతిలో దాంతిలో ఆయనను మించినది ఆయన యిల్లాలని అందఱనుకొందురు. అట్టి పరమ సాత్త్వికమూర్తు లయిన ఆయాలు మగలు కల్పవృక్షములో విలక్షణ వ్యక్తులుగా మాఱిపోయిరి. తిరిగి రాముఁడు వచ్చువఱకు మీగడప ద్రొక్కనన్నంత క్రోధము అరుంధతికి వచ్చెనఁట. అడవికి సీతను బొమ్మన్న దెవరు? అరుంధతి ఎవరిని శపింపదొరకొన్నది? రాముని ప్రయాణ వార్తవిని తాను గూడ వత్తునని వైదేహి పట్టుపట్టెనేగాని కైకేయిగాని దశరథుఁడుగాని ఆమెను అడవికిఁ బొమ్మని చెప్పలేదే.

అరుంధతి, ఇఁక నెవరిని శపింపవలెను?

'ధరియించు నార చీరల' పద్యములో ఉత్తరార్థమున కర్థమేమని చెప్పవలెనో? అరయన్—పతివ్రతాలోకములన్—ఈ దరిద్రతాస్థితి—చెఱిసగము—కాన్—అనగా పతివ్రతా లోకములలో ఈ దారిద్ర్యము చెఱిసగముగా ఉండునని అధ్యాహార్యము. పిండితార్థమేమో తెలియదాయె. అంతరార్థమున్నదేమో! ఇట్టి యన్వయములను ఇట్టి గూఢార్థములను కావ్య దోషములలో పూర్వులు జమకట్టిరి.

సీతకు నారచీర గట్టినది శ్రీరాముడైనప్పుడు—అరుంధతి ఆతనితో 'నారచీర కట్టినావె సీతకు' అనుట గ్రాంధిక భాష కాదు కట్టినాఁడవనియే యుండవలెను.

'మీ గడప' యేమి స్వామీ! 'కడప' శబ్దము కల్పవృక్ష మహాకావ్య కరుణా కటాక్షమునఁ జేసి 'గడప' అయ్యెనా? ఇటు నటు కడచుటకు సాధనముగాన కడప— కడప యయ్యెనని పూర్వ కాలపు పండితుల ధోరణి 'కల్పము'న కెక్కదు కాఁబోలు! నిచ్చలు లోకమునుచున్నదని గ్రాంధికమని పేరు పెట్టుకొన్న కావ్యములలో గొబ్బరికాయలు—దోవలు—బునాదులు—గాక తేలిన బోకెలు—గడపలు —గడచిన సంవత్సరములు— గానుగు పుల్లలు' పెట్టుకొనవచ్చునా? ఆ పదము పరుషాదియో సరళాదియో గుర్తింపక ప్రయోగ శరణాః వైయాకరణాః అన్న కారికను హవ్యమునకు కవ్యమునకు చూపుట భావ్యముగాదు. సకృత్తును శకృత్తుగా పలికినను శ్మశానమును స్మశానముగా వ్రాసినను శిష్టు లంగీకరింతురా! లేక—ఇదియు కల్పవృక్ష వైలక్షణ్యమా?

తే

'అనిన సుమంత్రుఁ డన్నియుఁ దనంతన
తెచ్చి వినీతుఁడై చు రా
జునకును దెల్పె రాముఁడవనిఁ జొచ్చెడు
వేళకు నెల్ల రేడ్వఁగాన్ (108 వ పేజి)

శా. కౌసల్యాసతి ముద్దుకోడలి నెసన్
గౌగింటకింబట్టి బా
హా సమా మ్మర్జన మాచరించి మృదు
మూర్ధాఘ్రాణముం జేసి త
ల్లీ! సీతా! నను నీవునున్ వదలి
పోవే నేను నే కాకినై నా సీతా!
మఱి మీరు వచ్చువఱకైనన్ ప్రాణముల్ నిల్తునే?
(108 వ పేజీ)

సీతారాములు అయోధ్యలో నున్న ఘట్టమిది. వనిఁజొచ్చెడు వేళయనగా అడవిలో ప్రవేశించు సమయమని అర్థము వచ్చును గాని, లక్షణయా అడవికి బయలుదేరు సమయమని అనుకొనవలెనేమో! అప్పుడు అంద ఱేడ్వఁగా, కౌసల్య కోడలిని కౌఁగిటఁబట్టి 'బాహాసమ్మార్జన' మాచరించి నీతులే వేవో బోధించును. సమ్మార్జనమనఁగా శోధనమని యర్థము. చీపురుకట్టను 'సమ్మార్జని' యందురు. గృహ సమ్మార్జన మనఁగా ఇల్లు ఊడ్చుట. బాహాసమ్మార్జనమనఁగా భుజములను సవరించి యేదేదో చేసెనని అర్థములాగవలెను. రెండుచరణములలో పునశ్చరణముగాఁ బలికిన 'తల్లీ సీతా! నా సీతా!' అన్న సంబోధనలు రెండును ఉత్కటమైన ప్రేమకు చిహ్నములు కాఁబోలు! 'ప్రాణముల్ నిల్తునే' నిల్తునకు నిల్పుదునా! అన్నఅర్థములేదే. అది అంతర్భావిత ప్రేరణ క్రియయుఁగాదే. నిల్చునే అన్నదానికిది అచ్చుదోసమా!

ఉ. లోకమునందుఁ గామినులు లోలుప
బుద్ధులు పెన్మిటిన్ వృథా
వ్యాకుల పెట్టుచుందురును
నవ్వియుఁగావలె నివ్వి కావలెన్
నాకనుచున్ సగౌరవ మనంబున
భర్తను గాంచలేరు! యా
పోకిళులందుఁ బోకువె యభూపతియో
పతియం దశీలవై (108 పేజీ)
''ధూర్తవు కాకు రాఘవుని తోడిది
ఛాయగ సంచరింపవే''

సీ. వనిలోన నేరి తెచ్చిన కందమూలముల్
చిదుకు మంటలపైనఁ జిముడనీక
ఏదో కావలెనని యొడదను నెఱపి
యెప్పుడునవీదూరముల్ పోవనీక
తరుణివనికాక యాతని తల్లివంచు
నూహ పెంచితివేని నాయుక్తులెల్ల
నాచరించుటకెల్ల సమర్థవగుదు (109 పేజి)

ఆ. తల్లి కడుపుచూచుఁ దరుణి వీఁపునుజూచు
పురుషుఁడైన నింటికరుగుదేరఁ
దరుణివోలెఁగాక తల్లి పోలిక నీవు
చాన! యెల్లవేళ సాఁకుకొనుము (109)

ఇవి కౌసల్య కోడలికిఁ జెప్పిన బుద్ధులు' లోకములో కామినులు పెన్మిటిని వ్యాకుల పెట్టుచుందురన్న మాట, సపత్నియగు కైకేయికి చెంపపెట్టు కాఁబోలు! ఏదో కావలెనని వనీదూరముల్ పోవనీక— అన్న నీతిలో 'బంగారు లేడి' కథ భావి కథగా జరుగవలెఁ గాఁబోలు! కందమూలములు—చిదుకు మంటలు—చిముడుటలు—ఇత్యాదులను గూర్చి ఇప్పుడు నేర్చుకోవలసిన యువతికాదు—ఈసీత. ఈ దశలో అత్తగారు కోడలికి ఈ రీతి నీతులు బోధించెనని కల్పము బోధించుటలో సారస్య మంతగా లేదు. తరుణి, వీపును జూచుట పూర్వకాలము. నేడు జేబు చూడవలెను. మూట కట్టుకొని వీపునఁ బెట్టుకొను ధోరణికన్న జేబులో ఉంచిన దానికోసమే తరుణి చూచుటలో అందమున్నది. ఈ సామెత ఈ ధోరణిలో నడచియున్నచో ఇది మఱియొక వైలక్షణ్యమని సంబరపడవచ్చును. అత్తగారు బోధించిన నీతులకు మించి రెండాకులు హెచ్చుగఁ జదివినట్లు సీతయు 'భావ కవి తలో' దిగి' నీ కొడుకు సాలభూజంబు నేను లతను—నీ కొడుకు హొన్ను వీణియ నేను తీఁగ—నీ కొడుకు వార్షికాభ్రంబు నేను మెఱుపు—నీ కొడుకు సూర్యదేవుండు నేను వెలుగు. (109 పేజి)
'అతఁడు కులాలుఁడు—మెత్తని క్షితిమృత్తును నే నతండు చివురాకు సమీహిత నైగనిగ్యమును నే నతండు దైవంబు భక్తురాలను నేనున్' (109)

ఇత్యాదిగ ఒక వేదాంతము అప్పగించును. ఇది బహుశః ఈ రామాయణ కర్త అన్నట్లు, అందఱివోలె కేవలము రామాయణకథను మాత్రము వ్రాయక దీక్షగా వ్రాసి లోకమునకు జూపఁ దలఁచిన ఒకానొక వైలక్షణ్యమని యెంచవలెనేమో! కామినులు నా కనుచు గాంచలేరు. ఇట్టి 'వచన' వ్యత్యయములు కల్పవృక్షము పాటింపదు. అభూపతి'—'అశీల' విలక్షణమైన శబ్దములు. మంటలపైనన్ గ్రాంథికముగా తప్పు. 'పైనిన్' అనవలెను. పెట్టుచుందురును నవ్వియు పురాణజ్వరమువలె జీర్ణించి పోయిన సముచ్చయ సౌరభము. 'పురుషుఁడైన నింటికరుగుదేర'లో—'ఐన'కు అర్థమేలేదు.

# పెల్లుబికిన పేరాశ

శ్రీ మండపాక రాజేశ్వరశాస్త్రి

చినుకు చిన్నదేకాని, ఎడతెగకపడి 'అంతా వర్షమయం ఈజగము' అన్న భ్రమకలిగిస్తున్నది. గాఢాంధకారంలో, ఉరుములలో, చీకటిని చీల్చే మెరుపులలో ఎంతవేళైఉండవచ్చునో ఊహకే అందలేదు. పదిగంటలకి రావలసిన ఒక్క రైలుబండీ వచ్చిందో—వచ్చి వెళ్ళిపోయిందో! రహదారీ అంచుల పొడుగునా ముసుగురాక్షసులలాగున చీకటిలో కనబడే చెట్టుకొమ్మలనుండి నీటిబిందువులు ఉత్ప్రేక్షించిన శబ్దంతో కిందికి రాలుతున్నాయి. దూరంలో నక్కలు కూస్తూ, ఒకటి నొకటి తరుముతూ తిరుగుతున్న శబ్దం. నక్క కూతలకు జవాబుగా కుక్కల మొరుగులు. ఆ చిమ్మచీకటిలో ఏదీ వినపడడమేగాని కనపడడమంటూ లేదు.

గజరథంవలె నిదానంగా దొర్లుకుంటూ పోతున్నది పోతుల బండి. ఫర్లాంగుదూరంనుండి ప్రయత్నిస్తూ, ఎట్టకేలకు బండి ఆపి, ఆరిపోయిన చుట్ట నోటినుండి తీసి కన్నయ్య బండిలోకి కేకవేశాడు.

"బాబూ.......రగురామయ్యబాబూ! నిన్నే—లెగు లెగు ఐరోడు పెదకానాకాడి కొచ్చేసినాం. ఇక్కడే దిగాల మరి."

రఘురామయ్య త్రుళ్ళిపడి వొత్తిగిల్లి—మళ్ళీ కళ్ళు మూసుకొని గుర్రుపెట్టాడు. 'బండి కుదుపు, పారాకాపు నిద్రకు బింకమైన పట్లు' అని పానుగంటివారు చెప్పినట్లు, లోపల వొత్తు వరిగడ్డిలో వెచ్చగా పరుండి స్వప్న లోకాల్లో విహరిస్తున్నాడతడు. కాని కన్నయ్య అదే పనిగా కేకలువేసేసరికి విధిలేక లేచి కూర్చుని, కళ్ళు నులుముకుంటూ "ఏమన్నావ్ కన్నయ్యా?" అన్నాడు.

"ఇక్కడే దిగాల నువ్వు. ఈ కానాకిందినించే రెయ్యిలు కమ్ములు—కమ్ముల పక్కలే రోడు—రోడెంబడే అరకోసుపైగా నడిస్తే—మరేముంది—రెయిలిస్టేసనే!"

రఘురామయ్య జల్దుకొనిలేచి, తలక్రింది గోనె మూట చంకలో ఇరికించి, పక్కనే ఉంచిన గొడుకు చేతబట్టి బండి దిగుతూ "బండికి అందుతానో లేదో!" అని అనుమానంగా అన్నాడు.

పల్లెటూరు వ్యక్తులు ధన్యవాదాలు చెప్పుకొనడంలో కొస్త ఉత్ప్రేక్షించిన పదాలు వాడుతారు. ఆ మామూలు ప్రకారమే, కన్నయ్య సమయానికి బండి కట్టినందుకు రఘురామయ్య అతడిని పొగిడి ఆకాశానికెత్తివేశాడు. కన్నయ్య తృప్తిగా నవ్వుకుంటూ బండితోలుకొని వెళ్ళిపోయాడు.

బట్టతడుపు చినుకులు పల్చగా పడుతూనే ఉన్నాయి. రఘురామయ్య గొడుగువిప్పి, కానా గోడకానుకొని నిలబడి, జేబులు తడిమి చుట్ట, అగ్గిపెట్టెతీసి చుట్ట ముట్టించాడు. ఈ చినుకుల చిత చిత వాతావరణంలో ఇంతరాత్రిపూట ఈ దిక్కుమాలిన ప్రయాణం చెయ్యవలసి వచ్చినందుకు తన్ను తనే తిట్టుకుంటూ, గోనె మూట మరో మారు పదిలంగా సర్దుకొని, గొడుగు తలకి తగిలినట్టు గట్టిగా పట్టుకొని, చీకటికి కాళ్ళతో నేల తడుముతూ స్టేషనువేపు నడక సాగించాడు రఘురామయ్య.

సకాలంలో డబ్బు చేతికందిఉంటే తను ప్రొద్దుటి బండిలోనే బయలుదేరి వేళ ఉండగానే బస్తీచేరి ఉండేవాడు. కాని.........ఏ ఒక్కరినీ నిందించి ఏమిలాభం? నగదుపంటలకి ప్రసిద్ధిచెంది వేలకువేలు డబ్బార్జించే తన గ్రామంలోనే—ఖర్మం, మూడువేలు జతపడడమే కష్టమైంది. అవేవో—ఏవో—దరిమిలా తలెత్తిన పంచాయితీ సమితులట—బ్లాకుడెవలప్‌మెంటు ఆఫీసు లట. జిల్లా పరిషత్తులట—ఇవట, ఇవట, ఇవన్నీ డబ్బున్న వాళ్ళకి ఊసుపోవడాని కేర్పడిన సంస్థలలాగు తయారైనట్టుంది గాని, తనవంటి సామాన్య రైతు పని ఎక్కడ వేసిన గొంగళీ అక్కడే ఉన్నట్టనిపిస్తున్నది. 'పల్లెసీమ! దాన ధర్మాలసీమ మా పల్లెసీమ!' ఓ! బస్తీల్లో ఎక్కడవిన్నా ఈ పాటే! నిజానికి పల్లెటూరులోపుట్టి పెరిగి పల్లెటూరులోనే జీవిస్తున్న తనకు పల్లెటూరు అసలు రంగు తెలుస్తుంది గాని బస్తీ బాబుల కేమి బోధపడుతుంది? పల్లెటూళ్ళలో మనిషికీ మనిషికీ కక్ష—వీధికీ వీధికీ కక్ష—కులాల మధ్యనే కక్షలు! ఊరిలో ఎటుచూసినా కక్షలే, తగువులే, పార్టీ ప్రచారాలే! అసలు పనిసున్న, కాని ఆర్భాటం హెచ్చు. రోజులేకాదు, వారాలూ, నెలలూ గలాటాలతోనే గడిచిపోతాయి.

ప్రతి పెద్దమనిషీ, రయితే, మడుపులు వేలమీద—పొలందున్నేది మాత్రం పాలికాపులు. ఒక్క రైతూ పంచ ఎగగట్టి ఏరుపట్టి మడిలో చొరపడడానికి మొగ్గడు. ఆర్జించేది వేలమీద—కాని ఏమి లాభం? ఆర్జించినదంతా అప్పులకింద సాహుకార్లకి జమ. మర్నాటినుండీ సాదరు ఖర్చులకీ అప్పే! ప్రతి రయితూ పొలం పని పాలికాపులకి వదిలి, ఎనిమిది మూళ్ళయెనభై నంబరు పంచ కట్టి, కళ్ళీ చొక్కా వేసుకొని, భుజంమీద సరిగంచు మడత ఓణీ వేలాడుతూఉండగా బస్తీలకివెళ్ళి, రాజకీయాలు చర్చించి, ఇంటికి వచ్చి భార్యతో ప్రగల్భాలు పలుకుతాడు. కాని ఒకడికీ తన భూమి తాలూకు ఈశాన్యపు సరిహద్దు పేచీ సంగతే తెలియదు.....

పదిరోజులు నానాయాతనా పడితేనేగాని రెండువేల రూపాయిలు జత పడలేదు. తక్కిన వెయ్యిపైచిలుకుకోసం పెళ్ళాం మెళ్ళోని పిసరూపిప్పీ అమ్మక తీలులేకపోయింది. అప్పటికే సాయంత్రమైపోయింది. ఈ మూడు వేల పైచిలుకూ దమ్మిడీలతో సహా రేపు రిజిష్టరాఫీసులో చెల్లిస్తేనేగాని భూమి తనదని అనిపించుకోదు.........

చేతితో స్లాస్కులైటేనా, ఆసీసం లాంతరైనా లేక పోయినా, కళ్ళతో నేల తడుముకుంటూనే చివరి కెలాగో స్టేషను చేరుకోగలిగాడు రఘురామయ్య. అదొక చిన్న రైలు స్టేషను. ఇట్టి స్టేషన్లలో బండివచ్చిపోయే కొద్ది క్షణాలలోనూ ఎంతో సందడిగా ఉంటుంది—తరవాత నిర్మానుష్యమై పోతుంది. ఆ రాత్రిపూట ముందు హాలులో నేలమీద పశువులు పడుకొని నిశ్చింతగా అర్ధనిమీలిత నేత్రాలతో, శూన్య దృక్కులతో నెమరు వేసుకుంటున్నాయి. హాలు పొడవునా ఉన్న చెక్క సిమెంటు బెంచీలపై కొన్ని కుక్కలు కాళ్ళు పారచాపి నిష్పూచీగా గుర్రు పెట్టి నిద్రపోతున్నాయి. అతడి రాకను అవి గమనించినట్టే లేదు. ఉబ్బరగా దొరికిన ఊరిముప్పల్లోని వేసుమేసి ఉదరం నింపు కొనే దొంగ గొడ్లకీ, చచ్చిన జంతువులను పీకుకుతినే స్వేచ్ఛా జీవులైన ఈ పెరయా కుక్కలకీ ఇటువంటి ఛోటా స్టేషన్లు రాయితే లయిన రాత్రి విశ్రాంతి మందిరాలు కాబోలు! బుకిం గాఫీసు కిటికీతలుపు వేసిఉంది. రఘురామయ్య ప్లాటుఫారంమీదికి నడిచాడు. ప్లాటుఫారం ఏ అలికిడీలేక చీకటిగా కనబడుతున్నది. దూరంలో—నెట్లలో కాబోలు—విచిత్రమైన ధ్వనులు—వెకిలి అరుపులు, విపరీతమైన చీకటి తెరలు! ప్లాటుఫారం అంచు వరకూ వెళ్ళి చూసినా కారుచీకటిలో కంటికేదీ పొలిలి తగల లేదు. వెనక తిరిగి వరండా మీదికి వచ్చిన అతడికి ఒక గదిలో కొద్దిగా వెల్తురున్నట్టు కనబడింది. లోపల ఒక మూల మేజామీద మసి బారిన చిమ్నీలో మిణుకు మిణుకుమంటూ ఒక లాంపు, ప్రక్కనే కుర్చీలోచేరగిలపడి కాళ్ళు మేజా మీదకి చాపి నిశ్చింతగా నిద్ర పోతున్న ఒక వ్యక్తి కనపడ్డారు. ఇంతవరకూ అధైర్యంతో సంగోరు ప్రాణాలు పోయినట్టైపోయిన రఘురామయ్యకి కొండంత ధైర్యం చేకూరింది.

"మేష్టేరుగారూ—అయ్యోయ్!" రఘురామయ్య—కాస్త అనుమానంగానే—పిలిచాడు.

నిశ్శబ్దం—చిన్న మాష్టరు గాఢసుషుప్తిలో ఉన్నాడు.

"మేష్టేరు బాబూ! తమరినే నండి పిలుస్తూంట !" ఈసారి రాఘవయ్య గట్టిగానే కేక వేశాడు.

చిన్న మాష్టరు కళ్ళువిప్పి చూశాడు. పాపం, సంతతం రాత్రిడ్యూటీ చేయవలసిన చిన్న మాష్టర్లకి ఒళ్ళు మరచిన నిద్ర ఉండటం అరుదే.

"ఏం—ఏంకావాలి ?"

అతని కంఠంలో విసుపు స్పష్టంగానే కనబడింది.

పల్లెటూరు రఘురామయ్య కంఠంలో ప్రపత్తి ఏమాత్రం తగ్గలేదు.

"బండి ఎంతసేపట్లో వస్తుంది బాబూ ?"

"ఏం—కనబడదూ ?" అన్నాడు చిన్న మాష్టరు.

"బండి ఇంకా రాలేదుగదా అండి ?"

"ఈ రాత్రి బండి రాదు."

చిన్న మాష్టరు తిరిగి యథాప్రకారంగా టేబిల్ పైకి కాళ్ళు చాపి నిద్ర కుపక్రమించాడు.

*　　*　　*

సుందరయ్య పొడుగుపాటి సీసాలోని పసుపుపచ్చని పానీయం గ్లాసులో కొద్దిగా పంపుకొని, కళ్ళు మిటకరిస్తూ మింగి ఒక కొత్త బీడీ ముట్టించాడు. ప్లాటుఫారం దాటి కమ్ముల కవరలివైపున కాస్త ఎత్తయిన ప్రదేశంలోని మామిడితోటలో ఉన్న బంగాళా వరండాలో ఈజీఛెయిరులో చేరగిలబడి, పరధ్యానంగా ఏదో ఆలోచిస్తున్నట్టు కనబడు తున్నా డతడు. మొదటి రోజుల్లో అధమం రెండు డ్రాముల ఆరక్కు కళ్ళు విదల్చకుండా మింగి, చుట్టమీద చుట్ట ముట్టిస్తూ గంటలతరబడి కదలకుండా కూర్చొనే సుంద రయ్య 'రక్తపుపోటు వచ్చింది, జాగ్రత్త !' అంటూ డాక్టరు వారించిన దగ్గరనుండీ అసలి మానివేసి, కాస్త ఖరీదు జాస్తి అయినా, అప్పుడే మార్కెట్టులోకి వచ్చిన ఈ పచ్చని ద్రావకం తెప్పించి (డాక్టరుకు తెలియకుండా) తాగడానికి అలవాటుపడుతున్నాడు. చుట్టలు కూడా డాక్టరు వల్లకాదంటే సిగరెట్లు మొదలుపెట్టాడు. ఇది తెలిసి డాక్టరు సిగ రెట్లూ వల్లకాదంటే, విధిలేక, ఏదో రూపంలో పొగంటూ ఒకటి ఉండాలి గనక, బీడీలు తెప్పించుకొని (అదీ రహస్యం గానే) రోజు కొక కట్ట చొప్పున మాత్రం కాల్చుతూ దినం తీర్చుకుంటున్నాడు. మాంసం, చేపలూ ఎంతమాత్రం వల్ల కాదని డాక్టరంటే కోడిగుడ్లతో సరిపెట్టుకుంటున్నాడు.

సుందరయ్యచేత సీసా మాన్పించడానికి చంద్రమ్మ శాయశక్తులా శ్రమ పడింది గాని, సీసామీది లేబిలు చూపిస్తూ సుందరయ్య చెప్పిన ఇంగ్లీషు మాటలు విని ఆమె తగ్గిపోక తప్పలేదు. మగడు మంకుపట్టు పట్టితే ఎంత జాణ భార్యేనా ఏమి చెయ్యగలదు ? పరిస్థితులు తెగేవరకూ పట్టే లాగడానికి స్త్రీ సహజంగా వెరుస్తుంది.

వారంరోజులైంది వెంకట్రమణ జాడ లేదు. ఎక్కడి కుడాయించాడో, ఎప్పుడు వస్తాడో ! పాతికేళ్ళొచ్చిన పోతుకోడె—వా డే వల్లకాట్లో తిరిగినా భయమేమి టంటాడు సుందరయ్య. కాని కన్నకడుపు—చంద్రమ్మ కీ శాంతం ఉంటుందా ? ముఖ్యంగా ఆమెను తృప్తిపరచడానికే సుంద రయ్య—పచ్చని ద్రావకం పుచ్చుకుంటూ, బీడీమీద బీడీ ముట్టిస్తూనే—రైలును వచ్చేవరకూ కనిపెట్టుకొని స్టేష నుకు వెళ్లడమూ, అబ్బాయి రాలేదని తిరిగి రావడమూ వారం రోజులనుండి విధిగా జరుగుతున్నది ......

తదేకధ్యానంగా బీడీ పీల్చుతున్న సుందరయ్య స్మృతి పథంలో పాతసంగతు లొకటి తరవాత ఒకటి జ్ఞాపకం రాసాగాయి. ఏబదియేళ్ల నడివయస్సుకే సంచులు తేరిపోయిన గుండ్రని ముఖం, అంట కత్తిరించిన తెల్లని జుట్టు, కత్తి రించిన మీసాలతో అతడి ధారాళమైన నవ్వు అందరికీ యెరికే. ఒకేరకం గీరల పై జామా మీద గోధుమరంగు బుష్కోటు వేసుకొని, నల్లని బాటాజోడుతో సహా రూపాయినోటు

లాగే ఎప్పుడూ ఒకే రూపంలో కనబడే సుందరయ్యను పోల్చి పలకరించనివా డెవడూ ఆ స్టేషను దరిదాపుల్లో లేడు. ఏదో తొందర పనిలో సతమత మవుతున్నట్టే అత డెప్పుడూ కనబడుతాడు—కాని, పరిచయస్థులు కనబడితే మాత్రం ఆప్యాయనంగా పలకరించి కుశలప్రశ్నలు వేస్తూ మాట్లాడ తాడు. స్టేషనుప్రాంతాలలోని చిన్నా పెద్దా కంట్రాక్టు పనులు చెయ్యడం అతని వృత్తి. స్టేషను స్టాఫుకీ, డ్రైవర్లకీ, గార్డులకీ అవసరమైన వస్తువులు—సాధ్యమైనంత వరకూ ముఫత్తుగానే—జతపెట్టి యిస్తూ, అందరితోనూ మంచిగా మెసులుతూ, అందరిచేతా మంచి అనిపించు కుంటున్నాడు కంట్రాక్టరు సుందరయ్య.

సుందరయ్యకున్నవి రెండే అనర్థాలు. వీధి బడిపంతులు యెదట విద్యార్థిలాగే అతడు పెళ్లాం దగ్గిర పిల్లి అయిపో తాడు. ఆమె ఏది చెయ్యమంటే అది చెయ్యాలి. వద్దన్నది మానాలి. డబ్బు ఆమెది. తన కంట్రాక్టు మదుపులకి కావల సిన డబ్బు ఆమె నడిగి తీసుకొని, వచ్చిన లాభంతో కలిపి తిరిగి ఆమెకు వప్పగించాలి. క్షవరానికి డబ్బులు కూడా ఆమె నడిగే తీసుకోవాలి! రెండవ అనర్థం వెంకట్రమణ. వెంక ట్రమణ చంద్రమ్మ ఆస్తికేకైక వారసుడు. పనీ, తీరుబడీ లేని వీడికి, ఇంట్లో తెగ తిని వూరిమీద గాలితిరుగులు తిరు గుతూ, అయినదానికీ, కాని దానికీ తల్లిని మారాం చెయ్యడం చిన్నప్పటినుండీ మామూ్మలే. నయగారం మాటలు చెప్పీ, నూతిలో పడి చస్తానంటూ భయపెట్టీ వీడు తల్లిదగ్గర వందా, యాభై గుంజి ఇష్టం వచ్చినట్టు దర్జాగా ఖర్చులు పెడ తాడు. తల్లిదగ్గర డబ్బేమీ పారకపోతే పెట్టె మెడ్డాయించి ఆమె తాలూకు బంగారం నగలు దొంగిలించి పబ్బం గడుపు కుందికి వెనుదియ్యడు. చుట్టుప్రక్కల వూళ్లలో వెంకట్రమణ నెరుగనివాళ్లు లేరు. వీడు తరుచు వెళ్లని తాగుడు, జూదపు అఖాడాలు లేవు. చేతిలో నగదు మెసిలినంతవరకూ నవాబు జల్సాలు చేసి, అది కాస్తా తిరుపతి క్షవరమైపోయిన ఉత్తర క్షణం దేబెముఖం పెట్టి దొడ్డితోవను ఇంటిలో దూర తాడు. వీడికి ఇరవయ్యో యేడు రాక పూర్వమే పెళ్లి కావడం, పెళ్లాం కాపరానికి రావడం, తరవాత ఒకనాటి అర్థ రాత్రి వీడు తెగతాగి ఇంటికి వచ్చి పెళ్లాన్ని చావ తన్నడం, ఆమె ఆవేశంతో నూతిలోకి గెంతి ఆత్మహత్య చేసుకొనడం— ఈ వ్యవహారం పీకలమీదికి రాకుండా తను రెండువేల వరకూ ఖర్చుపెట్టవలసి రావడం—ఇప్పటికీ తల్చుకొని సుందరయ్య ఎంతో యిదౌతూ ఉంటాడు. దురదృష్టవశాత్తో, అదృష్ట వశాత్తో—అతడూ, చంద్రమ్మా ఎంత ప్రయత్నించినా వాడి కింతవరకూ తిరిగి పెళ్లి కాలేదు.

ఇంతకంటే విచిత్రమైంది అతనికి కంట్రాక్టరుగిరీ సంఘటన. ఇరవైయేళ్లనాటి ముచ్చట—అక్కడికి పదిమైళ్ల దూరంలోని గ్రామంలో ఒక సాహుకారువద్ద గుమాస్తాగా ఉంటూ, అడపా తడపా గూడుబండిలో సామాను వేయించు కొని స్టేషనుకు వచ్చి, పని పూర్తికాగానే సావకాశంగా స్టేషను వెలుపల ఉన్న ఒకేఒక టీ దుఖాణంలో టీ పుచ్చుకొనడం అలవాటుండేది అతడికి. టీ దుఖాణంలో 'చంద్రమ్మ' అన్న చంద్రముఖి ఒకతె పెసరట్లు, వడ్రగారెలు, చిట్టి బూరెలు అందరికీ అందిస్తూ, అతి చలాకీగా అందరి దగ్గిరా మెసులుతూ ఉండేది. కొద్దికాలంలోనే అతడికి చంద్రమ్మ దగ్గిర చనువు జాస్తి అయిపోయింది. అయితే చంద్రమ్మనిగురించి చెప్పేడుమాటలు కొన్ని వినకపోలే దతడు. మగడు చచ్చి నిస్పృహలో ఆమె పసికుర్రవాడితో సహా రైల్లో ఎక్కడికో వెళ్లిపోతూఉంటే, టిక్కెటు కలక్టరు ఆ స్టేషనులోనే దింపి వేశాడట. ఆకలిబాధ భరించలేక ఆ స్టేషనులోనే ఆమె ముష్టెత్తుకుంటూ ఉండగా, ఈ దుఖాణం పెట్టిన ముస లమ్మ చూసి జాలిపడి ఆమెను చేరదీసి తనదగ్గరే ఉంచు కున్నదట. క్రమంగా చంద్రమ్మ పెసరట్లు వగైరాలు అమ్మడం నేర్చుకున్నదట. తరవాత ముసలిది పక్షవాతం వచ్చి చచ్చి పోయినప్పుడు తనే అంత్యక్రియలు చేసి దుఖాణం పనికి అదుకొని నేర్పుగా చేసుకువస్తున్నదట.

చంద్రమ్మ దుఖాణం మూడు పువ్వులు, ఆరు కాయ లుగా వెలగడం ప్రారంభించిన రోజుల్లో ఒకనాటి రాత్రి పెళ్లివారిజట్టొకటి రెండు నాటుబళ్లలో స్టేషనుకు వచ్చి రైలు తప్పిపోయి దుఃఖిస్తూ, విధిలేక చంద్రమ్మ దుఖాణంలో ఫలహారాలు చేసిన తరువాత ఆరాత్రి అక్కడే పరున్నదట. గ్రహచారవశాత్తూ ఆ రాత్రే దుఖాణంలో దొంగలు పడడం తటస్థించింది. పెళ్లివారి తాలూకు నగా నట్రా పూర్తిగా పోయింది. వాళ్లందరూ నెత్తీ, నోరూ కొట్టుకుంటూ విధిని తిట్టుకుంటూనే మర్నాటి ఉదయం రైల్లో వెళ్లి పోయారట. ఇందులో చంద్రమ్మ లాలోచీతనం లేకపోలేదని ఇరుగుపొరుగు దుఖాణదార్ల దృఢనిశ్చయం. అయితే పుష్టి అయిన ఆమె యౌవన శరీరం, వంపులుతిరిగిన అంగసౌష్ఠవం పసికట్టి ముగ్ధుడైపోయిన అతడి కీ సంఘటన నమ్మతగినదిగా తోచలేదు. అలవాటుప్రకారం అత డామె దుఖాణంలో కూర్చొని పిచ్చాపాటీ కబుర్లు చెప్తుతూ పెసరట్లూ, టీ పుచ్చుకుంటూనే ఉన్నాడు.

మాటల సందర్భంలో ఒకనాడు చంద్రమ్మ అంది : "దొడ్డమ్మ చచ్చిపోయింది. ఒంటరిదాన్నయిపోయాను. ఇక్కడి ఇరుగుపొరుగు దుఖాణాలవా ళ్లంచేతో నామీద కక్షగట్టారు. కొడుకు చూస్తే బొత్తిగా చిన్నవాడు. అంచేత .... మళ్లీ మా ప్రాంతాలకే వెళ్లిపోయి ......"

'అతడి భార్య సంవత్సరంపాటు క్షయవ్యాధితో తీసుకొని మూడేళ్ల క్రిందటే చచ్చిపోయింది. నిజానికి భార్య నించి సంసారసుఖం అతడు పొందనేలేదు. మళ్లీ పెళ్లి చేసుకొమ్మని తనవాళ్లందరూ ఒత్తిడి చేస్తూనే ఉన్నారు. ఇప్పుడు చంద్రమ్మ—! అమాంతంగా అతడి బుర్రలో ఒక దివ్యమైన ఆలోచన పుట్టింది. చంద్రమ్మని ఖుషామత్తు చెయ్యాలని అతడు నిశ్చయించాడు.

"ఎటో వెళ్లిపోవడ మెందుకు—మావూరే వచ్చెయ్య కూడదూ—చంద్రవదనా !" అన్నాడు సుందరయ్య, ఉద్రేకంతో కాక ఉత్సాహంతో... 

"అలా గెలా అవుతుంది—సుందర్రావుగారూ ? బాగా ఆలోచించుకొని మరీ బతుకుబాట వేసుకోవాలిగదా ?"

'చంద్రవదన' పెనంమీది పెసరట్టు చుట్టూ నూనె చిలకరిస్తూ, సుందరయ్య వైపు ఓరగా చూస్తూ నవ్వింది. సుందరయ్య వేగిన పెసరట్టు చిదిమి నోట్లో వేసుకొని నములుతూ "వా! ఎంత బాగా వేగింది!" అంటూ, "ఆలోచించడాని కేముంది ? ఏవిధంగా చూసినా నాకు నువ్వు, నీకు నేను అవసర మన్నది స్పష్టం. ఇంక—తబ్బిళ్ళ మాటకేం, అవి ఎలాగో సర్దుకుపోతాయి" అన్నాడు.

తరవాత చంద్రమ్మ డొంకతిరుగుడుగా ఏమేమో మాట్లాడింది—హిరణ్యాక్ష వరాల్లాంటివి కోరింది—షరతులు పెట్టింది—తన యిష్టానిష్టా లేవో నిష్కర్షగా చెప్పేసింది. ఆమె మోహంలో పడిన సుందరయ్య ఈ షరతు లన్నిటికీ ఊకొడుతూనే ఉన్నాడు. పర్యవసానం ? సుందరయ్య వెంటనే ఊరికి బయలుదేరడం—స్వంత సామాను యావత్తూ బండి కెక్కించి మూడవనాటికి తిరిగి వచ్చివేయడం—అంతా సునాయాసంగానే జరిగిపోయింది. ఆ మర్నాటినుండే స్టేషను వాళ్లతో మంతనాలు ప్రారంభమయ్యాయి. డబ్బు యథేచ్ఛగా ప్రవహించింది. తర్జనభర్జనలు జరిగాయి. అనతి కాలంలోనే సుందరయ్య ఒక మోస్తరు ఛోటాకంట్రాక్టరై పోయాడు. మరికొద్దికాలంలోనే పక్కా కంట్రాక్టరు గిరీ ప్రాప్తించిం దతడికి.

చంద్రమ్మదీ అదృష్ట జాతకమే. సుందరయ్య చేపట్టిన కంట్రాక్టుపనులు విజయవంతంగా పూర్తవుతున్నాయి. అతడు రెండుచేతులా లాభాలు గడిస్తూ చంద్రమ్మ చేతులో పోస్తున్నాడు. సంవత్సరం తిరగకుండానే స్టేషను కెదురుగా ఉన్న అంటుమామిడితోట కొని అందులో సుందరయ్య అందమైన ఆరు గదుల బంగాళా కట్టించి, చంద్రమ్మ, వెంకట్రమణలతో సహా ఒక శుభముహూర్తాన ఘనంగా గృహప్రవేశం చేశాడు.

ఇప్పుడు సుందరయ్య స్టేషనులో పాతపిల్లి, కంట్రాక్టరు సుందరయ్యగారు సకుటుంబంగా మామిడితోట బంగాళాలో దివ్యంగా కాలక్షేపం చేస్తున్నారని స్టేషనువాళ్లు చుట్టుపక్కల ఉన్న ప్రజానీకం అందరూ ఒకటే మాట.

* * *

సుందరయ్య సీసామూత వేశాడు. ఆఖరి బీడీ ముట్టించి ఆవులిస్తూ అయిష్టంగా లేచి నిలుచున్నాడు. ఇంకా బండి వచ్చిన జాడ లేనట్టుంది. బహుశా ఈపాటికి లైను క్లియరయిపోయి ఉండాలి. ఈలోగా తనకు కునుకు వచ్చేస్తే గట్టి చిక్కే. ఈ బండిలోనే వెంకట్రమణ వచ్చివెయ్యడానికి అవకాశముంది ..... సామాను జాగ్రత్త పెట్టమని ఇంట్లోకి కేక వేస్తూ సుందరయ్య బంగాళానుంచి బయలుదేరి కొద్ది క్షణాల్లో స్టేషను చేరుకున్నాడు. అప్పుడే బయటికివచ్చి అటూ యిటూ చూస్తూ నిలబడిన అసిస్టెంటు స్టేషను మాస్టరు కనపడ్డాడు.

"క్యా మాస్టర్‌సాబ్ ! క్యా ఖబర్‌హై ? ప్యాసింజరు పత్తా లేదు—ఎక్కడైనా ఏమ్యనైపోయిందేమిటి, కొంపదీసి ?" అన్నాడు సుందరయ్య, తన సహజ హాస్యధోరణిలో.

"అదే చూస్తున్నాను. బండి వచ్చే ధోరణి కనబడదు" అన్నాడు చిన్న మాస్టరు, ఆవులింత చేతితో అణుచుకుంటూ.

"కంట్రోలువాళ్లని కనుక్కోకూడదూ ? — ఈలోపుగా మీరు—ఇంటికెళ్లొస్తే మంచి దనుకుంటున్నారులా ఉంది—కొత్తగా పెళ్లయింది కూడాను !" సుందరయ్య పకపక నవ్వాడు.

ముఖమాటంగా నవ్వుతూనే చిన్నమాస్ట రన్నాడు : "అది కాదు సార్. ఇక్కడ స్టాండులోని మంచినీళ్లు కల్తీవి. ఇంటికెళ్లి కాస్త దాహంతాగి వత్తామనుకుంటున్నాను."

"అవునవును—మీ వయస్సువాళ్లకి ఇలాంటి అర్ధరాత్రి పూట దాహం వెయ్యడం సహజమే ..... అనునుగాని, బండి సంగతి చెప్పారుకారు."

"ఈ రాత్రి మరి బండి రానట్టే. నూరుమైళ్ల అవతల ఒక స్టేషనులో గుడ్సు డిరెయిలు అయిపోయింది. అది లేవనెత్తడం, లైను బాగుచెయ్యడం—ఈ తంతంతా జరిగితేనేగాని ప్యాసింజరు కదలడానికి వీలుపడదు."

"చంపేశారు. ప్యాసింజర్లో మా బోయ్ ఒస్తాడని ఎక్స్పెక్టు చేస్తున్నాను .... మరెందుకు, పోయి పరుంటాను." సుందరయ్య వెనుకకు తిరిగాడు.

అనతిదూరంలోనే నిలబడి వీరిమాటలు జాగ్రత్తగా వింటున్న రఘురామయ్య దగ్గరికి వచ్చాడు.

"బాబ్బాబూ !" ఆతృతగా కేక వేశాడు రఘురామయ్య.

అతడిని చూస్తూ సుందరయ్య "ఈ విలేజ్ జెంటిల్ మన్ ఎవరు మాస్టారూ ?" అని అడిగాడు. రఘురామయ్య తనే చొరవ తీసుకొని అన్నాడు : "నేనండి—నాపేరు రఘురామయ్య. ఈ బండిలో అర్జంటుగా వెళ్లితీరాలి. రేప్పొద్దున కోర్టులో డబ్బు చెల్లించకపోతే నాలు గెకరాల సుక్షేత్రమైన మాగాణి భూమి నాకు కాకుండా మునిగిపోతుందండి."

"బండి ఈ రాత్రి మరి రాదట. ఎవరేం చేస్తారు"

"అదే అన్నారండి చినమేస్టేరుగారు. నేను మనవిచేసేది బండి రాగానే ఎలాగో వెళ్లిపోతాననుకోండి. అందాకా మేస్టేరుగారి రూములో—ఎవరేనా కళాసీ సాయముంటే—ఈ రాత్రి పడుకొని, బండొచ్చిన ఉత్తరక్షణం వెళ్లిపోతాను. నిజం చెప్పాలంటే—నా దగ్గర మూడువేల వరకూ రొక్కముంది. కీడెంచి మేలెంచమన్నారు. ఈ డబ్బుతో ఒంటరిగా స్టేషనులో ఎక్కడో పరుండడమంటే భయం వేస్తూంది.

ఏ. ఎస్. యం. ససేమిరా వల్లకాదన్నాడు.

"మే మెవ్వళ్లం పూచీ పడలేమయ్యోయ్ ! అంత డబ్బుతో ఈ రాత్రి ఎందుకు రావాలి నువ్వు ? ఇష్టమైతే హాలులో పడుకో—నీ పూచీమీదే."

# పెల్లుబికిన పేరాస

"ఘట్టిచిక్కే వచ్చిందే !" అన్నాడు సుందరయ్య, సానుభూతిగా.

చిన్నమాస్టరు కో చక్కని ఆలోచన తట్టింది.

"నాకొకటి తోస్తూంది. కంట్రాక్టరుగారూ, ఏమంటారు ? మీ బంగళాలో బోలెడుజాగా ఉంది. ఇతగాడిక్కి ఓమూల చోటు చూపిస్తే—రాత్రి పడుకొని తెల్లారేసరిక్కి మళ్లీ బండికి వెళిపోరాడా ?"

సుందరయ్య మొదట తటపటాయించాడు. కాని రఘురామయ్య చిన్నమాస్టరు చెప్పిన సలహాకి వంతకలుస్తూ తన్ను పదేపదే బతిమాలుకొనేసరికి మెత్తబడి, "సరే దానికేం లెండి. ఎవరేం మోసుకుపోవాలి. మీ పేరేమిటో—నాతోరండి" అంటూ ముందుకి నడిచాడు.

సుందరయ్య వెనకనే, భుజంమీది గోనెమూట గట్టిగా పట్టుకొని రఘురామయ్య నడిచాడు. ఇద్దరూ చీకట్లో తడుముకుంటూనే రైలుకమ్ములు దాటి, అవతలి గట్టెక్కి కొద్దిదూరం నడిచి మామిడితోటలోని బంగాళా చేరుకున్నారు. రఘురామయ్యను వరాండాలో ఉండమంటూ సుందరయ్య తలుపుతట్టి లోపలికి నడిచాడు.

*　　　*　　　*

నిశిరాత్రి—కారుచీకటి ! మనుష్యసంచారంలేని మామిడితోటలో—ఒంటరిగా బంగాళాలో ! అపరిచిత వ్యక్తులు—ఎవరో, ఎందరో ! గ్రామంలో నిత్యం నలుగురి మధ్య తిరిగే రఘురామయ్య గుండెలు గతుకు గతుకు మంటూనే ఉన్నాయి. వర్షం దాదాపు ఆగిపోయినట్టే కనబడింది. కాని మేఘాడంబరంతోపాటు ఉండీ ఉణిగీ ఉరుములూ, మెరుపులూ—చిన్న సుడిగాలీ, ఇవన్నీ చూస్తే ...... ఏమో—తిరిగి వర్షం పిరాయిస్తే .... ? మేఘావృతమైన ఆకాశంలో చంద్రబింబ మెటువైపున ఉందో తెలియదు. కాని ఓవిధమైన గుడ్డి వెల్తురు మాత్రం వ్యాపించిఉంది. తోటలోని చెట్లు చిక్కని చీకటి ముద్దలవలె అవ్యక్తరూపాలతో కనబడుతూనే ఉన్నాయి. ...... ఆహాహా ! ఏమి సౌరభం ! బంగాళా పరిసరాలలో ఏయే పుష్పజాతు లున్నవో గాని అన్నీ ఒక్కేసారి పూచినట్టుంది. ఎక్కడో దగ్గిరలోనే రేరాణి, గుల్బాబుల పరిమళం గుబాళింపు ! ఎక్కడనించో మల్లి, విరజాజి, పారిజాతాల వాసనలు మత్తెక్కిస్తున్నాయి. ఇంక వాసనలేని మందార, కృష్ణతామరల వంటి పొదలా పరిసరాల్లో ఎన్ని ఉన్నాయో ! దూరంగా కోరడిలోనించి—ఏ అడవితీగలవో—పుష్పజాతుల గాఢ సువాసన లవశంగా నాసాపుటాలలో ప్రవేశించి చిత్రమైన మతిమరపు కలిగిస్తున్నవి ! .... సుదూరంలో కుక్కల బృందరోదనం—అక్కడ ఏదో గ్రామం ఉండి ఉంటుంది. గ్రామవీధుల్లోకి నక్కలో దుమ్మరగుళ్లో చొరబడి కుక్కపిల్లల నెత్తుకుపోవడానికి ప్రయత్నించి ఉండాలి. ఎటువైపు దృష్టి సారించినా ఏదో తెలియని భీతావహం ......

బంగాళా తలుపు తెరుచుకుంది. లాంతరు పట్టుకొని సుందరయ్య, అతడితో ఒక స్త్రీ వరాండాలోకి వచ్చారు. ఆమె కంట్రాక్టరుగారి భార్యే అయిఉండాలి. ఆమె కొస్త లావుగా, గుండ్రడంగా ఉన్నట్టు లాంతరు వెల్తురులో రఘురామయ్యకి అనిపించింది. చిత్రం ! ఆమె మెడనిండా, చెవులనిండా, చేతులనిండా బంగారునగలే ! చాలావాటి పేర్లే తెలియవు తేదతడికి. అన్నీ కలిపి తూచితే కొన్ని వీశల బంగారం తక్కువుండ దనిపిస్తుంది. ఉన్న నగలన్నీ ఒంటిమీద మోస్తూ ఇలాంటి అకేలా బంగాళాలో—ఈ రాత్రిపూట—తిరగడంలో ఏమి ఆనందముందో అతడి పల్లెటూరు బుద్ధికి పాలుపోలేదు.

"ఇతగాడే నే జెప్పిన ఆసామీ. దగ్గిర డబ్బుందట. పాపం, ఈ రాత్రిపూట ఇక్కడ పరుండనిమ్మని ప్రాధేయపడుతున్నాడు. నేను కాదనలేక కూడా తీసుకువచ్చాను" అన్నాడు సుందరయ్య.

చంద్రమ్మ రఘురామయ్య ముఖం పరిశీలనగా చూసింది. అతడి వడిలో ఉన్న గోనెమూట మరీ కుతూహలంగా చూసింది.

"సరే—దానికేం ? ఆ మూలగదిలో పడుకోమనండి. దీపం చూపించండి—గది చూసుకుంటాడు." ఆమె లోపలికి వెళ్లిపోయింది.

సుందరయ్య చేతిలోని లాంతరు వెల్తురులో రఘురామయ్య మూలగది లోపల చూసుకున్నాడు. గదిలో ఒకవైపు ఖాళీగా ఉన్నట్టు కనబడింది. తనకి సరిపోతుంది. ఒక మూల చెక్కసున్నం దంచే కర్ర రోకళ్లు, కొన్ని తట్టలూ అస్పష్టంగా కనబడుతున్నాయి. నేలమీద పాత తుంగచాప ఒకటి పరిచిఉంది—తనకోసమే అన్నట్టు. గదిలోంచి ఇంటిలోకి వెళ్లడాని కొక ద్వారముంది గాని, తలుపు మాత్రం ఇంటిలోంచి వేసిఉంది. తోటవైపుకి ఉన్న ఒకేఒక కిటికీ మూసిఉంది.

కొద్దిక్షణాల్లో సుందరయ్య లాంతరు తీసుకొని ఇంట్లోకి వెళ్లి తలుపు వేసుకున్నాడు.

*　　　*　　　*

అసలే పల్లెటూరి మనిషి కావడం, అందులో మూడు వేల పైచిలుకు నగదు దగ్గి రుంచుకొని ఈ మేఘాల రాత్రిపూట—ఈ నిర్మానుష్యపు బంగాళాలో—వరాండా చివరిని మూల గదిలో—దిక్కుమాలినట్టు ఒంటరిగా పడుకోవడమంటే రఘురామయ్యకి నిజంగానే భయం వేసింది. ఒకవేళ దొంగలే పడితే ! గుడ్డిలో మెల్ల అన్నట్టు ఆ దొంగలెవరో తన్ను చూసి తప్పుకుంటారు. గాని, తనదగ్గిర డబ్బుందని వాళ్లకేం తెలుస్తుంది ? రాత్రనక పగలనక సంతతం వీశలకొద్దీ బంగారం ఒంటిమీద మోసే ఆ మహా యిల్లాలు మీదే వాళ్ల దృష్టి సహజంగా పడుతుంది .... ఈ ఆలోచనతో అతడికి కొద్దిగా ధైర్యం కలిగింది. ఇంతకీ తనిక్కడ ఉండేది కొద్ది గంటలే అని మన స్సమాధానం చేసుకొంటూ అతడు జేబులో మిగిలిఉన్న ఒక్క చుట్టా వెలిగించి, గోనెమూట చాపమీద ఉంచి, వరండామీదికి వచ్చి మెట్లుదిగి అనుమానం తీర్చుకుందికి పదడుగులు నడిచి పచ్చికమీద కూర్చున్నాడు. దగ్గిరలో ఒక చెట్టుమీంచి గుడ్లగూబ అరుపు వినిపించింది. రఘురామయ్య ఉలిక్కిపడి, ఇదేదో అపశకునంలాగుం దనుకుంటూ భయంభయంగా ముందుకు చూశాడు. దూరంగా చెట్లలోంచి ఒక వెల్తురుచుక్క కనిపించింది. చెట్లలో అనేకంగా మెరుగుడు పురుగులు కనబడుతూనే ఉన్నాయి. వాటిలో

ఇదొకటి—కాదుకాదు—దీని తరహా వేరులాగుంది. ఇది అదే పనిగా వెలుగుతూంది. ఇది చుట్టో, సిగరెట్టో తాంబాకు నిప్పై వుండాలి. లేచి అనుమానంతో అవైపే తీక్షణంగా చూశాడతడు. అది చుట్టో—సిగరెట్టో—సందేహంలేదు .... తక్షణం చేతిలోని చుట్ట పారవేసి అతడలాగే చూస్తూ నిలబడ్డాడు....

ఎవడో వ్యక్తి తూగుతూ, అడుగులు తడబడవేస్తూ ఈవైపే వస్తున్నాడు ! రఘురామయ్య గుండెల్లో కంపం పుట్టింది. అవశంగా అడుగులు వెనకకి వేస్తూ అతడు వరండా మెట్లెక్కి గదిలో జొరపడి, గోనెమూట చంకలో ఇరికించుకొని బయటికి వచ్చి, వరండా అంచు చివరినుండి కిందికి గెంతి, గోడ చివరివరకూ నడిచి ఏమి జరిగేదీ కని పెడుతున్నాడు.....

ఇప్పుడు స్పష్టమైంది, ఆ వచ్చేది యెవడో గాని, బంగాళావైపే వస్తున్నాడు ! రఘురామయ్య బల్లిలాగు గోడ కంటుకుపోయి ఆ వ్యక్తి వాలకం గమనిస్తున్నాడు.

ఆ విచిత్ర వ్యక్తి బంగాళా దగ్గిరికి నడిచాడు...ఇప్పుడు మెట్లెక్కుతున్నాడు....వరండామీదికి వెళ్ళాడు....

రఘురామయ్య భయం నసాళానికి అంటుకుంది. వాడు దొంగే అయివుండాలి—సందేహంలేదు. అక్కడనించి ఉడాయించడమే అన్నివిధాలా శ్రేయస్కరం .... అతడు తడుముకుంటూ తోటలోనికి నడవడం ప్రారంభించాడు—కాని చీకట్లో ఏమీ కనబడక, ఒక చెట్టుతాలూకు కాండం తగులుకొని బోర్లా పడిపోయాడు. పాదం మణిగిపోయి బాధపెట్టసాగింది. అధమం అరగంటేనా సర్దుకుంటేనేగాని తను ముందుకి నడవడం కష్టం. విధిలేక అతడు చెట్టు మొదలు చేరి, అతి కష్టంమీద చెట్టెక్కి చిక్కగా ఆకులతో నిండివున్న చెట్టు కొమ్మల్లో సర్దుకొని కూర్చున్నాడు. కొద్ది క్షణాల్లోనే అతడికి మాగన్ను పట్టింది. దినమంతా ఆందోళనతో అలసిపోయివున్న లతడికి కునుకు పట్టడంలో ఆశ్చర్యంలేదు.

బంగాళా మెట్లెక్కుతున్న వ్యక్తి తప్ప తాగినట్టున్నాడు. మెట్టు మెట్టుకీ కాలు జారి పడుతూ లేస్తూ, మధ్య మధ్య వెకిలిగా నవ్వుతూ, ఎలాగో వరండామీదికి నడిచి తూగిపోతున్న శరీరం సమం చేసుకుంటూ, ఆ వ్యక్తి బంగాళా తలుపు దగ్గిరికి వెళ్ళి చేత్తో తోశాడు. తలుపు తెరిచిలేదు. నిజానికి లోపలి గడియ వేసిఉంది. రెండవ ద్వారమూ అదే విధంగా వేసిఉంది. ఒక క్షణం అనిశ్చితంగా అటూ యిటూ చూసి, ఏదో జ్ఞాపకం వచ్చినట్టయి, ఆ వ్యక్తి మూలగది వైపు నడిచాడు. గది తలుపు తెరిచేవుంది. లోపల నేలమీద చాప పరిచిఉన్నట్టు బూటుకాళ్ళకి తగిలి, మరేమీ ఆలోచించకుండా బూటుకాళ్ళతో ఆ వ్యక్తి అలాగే చాపమీద చాగోరాడు. కాని

మరుక్షణంలోనే లేచి, ఏమో అస్పష్టంగా గొణుక్కుంటూ కిటికీ తలుపు తెరిచి, వీధిద్వారం తలుపులు చేరవేసి, ఈ మూలా, ఆమూలా తడుముతూ, చేతికి దొరికిన కాళీ సిమెంటు సంచుల కట్ట లీసి తల క్రింద పెట్టుకొని, కాళ్ళుచాపి కొద్ది క్షణాల్లోనే గుర్రు పెట్టటం ప్రారంభించాడు.

గాఢ సుషుప్తిలో కలలు రావు నిజమే. కాని విధి బలీయం కావడంవల్ల చెట్టెక్కి కొమ్మల్లో తలదాచుకున్న రఘురామయ్య అలిసిపోయి నాగన్న నేసినా, కలలు మాత్రం కంటూనే ఉన్నాడు .... ఇంటి పైకప్పుపైనించి క్రిందికి దొర్లిపోయి ఎడమకాలు విరగగొట్టుకున్నాడు .... ఏమి చిత్రమైన కల ! .... ఏనుగెక్కి అమాంతంగా క్రిందికి జారిపోయాడు .... ఏట్లో ఈదుతూ మునిగిపోతే ఎవరో జుట్టు పట్టుకుని లాగి ఒడ్డుకు చేర్చారు .... ఒంటరిగా అడివిదారిని నడుస్తున్నాడు— దొంగలముఠా దూరంగా కనబడింది. భయవిహ్వలుడై తను పక్కకి పారిపోబోయాడు, కాని దొంగలు అడ్డు తగిలారు— వాళ్ల మొనగాడు లావుగా, గుండ్రంగా ఉన్నాడు. విత్రం ! వాడి ఒంటినిండా నగలే—అన్నీ బంగారంవే ! అవి మొయ్య లేక వాడు కాలుజారి పడ్డాడు—అక్కడే పొదలో పొంచున్న ఒకపాము వాడికాలుమీద కసుక్కున కాటునేసి పొదల్లోకి పారి పోయింది. వాడాశ్చర్యంగా అడగొంతుకతో 'అమ్మో నాయినో! సచ్చానర్రో !' అంటూ అదేపనిగా అరుస్తున్నాడు !

గబుక్కున తెలివివచ్చి రఘురామయ్య గాభరాగా అటూ యిటూ చూస్తూ, "ఇదంతా ఓట్టి కలేనా!" అనుకొని నవ్వు కున్నాడు. మరుక్షణంలోనే అతనిదృష్టి ముందుకుపడి, అత డిని ఆశ్చర్యంలో ముంచివేసింది. తను కూర్చున్న కొమ్మల లోంచి బంగాళా పక్కభాగపు గోడలో .... ఒక కిటికీ కన బడుతూంది .... కిటికీ తీసేవుంది .... ఆకాశం నిర్మలంగా ఉండి పశ్చిమంవైపున చంద్రబింబం స్పష్టంగా కనబడు తూంది. చంద్రకిరణాలు తిన్నగా కిటికీలోంచి గదిలో పడు తున్నాయి .... ఆ గది .... తను—ఇంతకుముందు చూసిందే— అక్కడినించే తను భయంతో పారిపోతూ ఈ చెట్టు కొమ్మల్లో తలదాచుకుంటున్నాడు ! గదిలో .... ఏదో ఘోరం .... ఏదో నాటకం జరుగుతున్నట్టుంది !

ఇద్దరు వ్యక్తులు .... సున్నపు రోకళ్లతో మోదు కొంటున్నారు. ! ఒక వ్యక్తి .... పురుషకంఠం .... 'అమ్మో' అన్నాడు. ఆ వ్యక్తికి మోపైన దెబ్బే తగిలిఉండాలి .... ఈసారి అరిచింది స్పష్టంగా స్త్రీ కంఠమే—ఆమె 'అమ్మో— సచ్చా నర్రో' అంటూ చేతులతో తల పట్టుకుంది .... ఆమె ముంజేతుల నిండా బంగారం నగలే ! .....

ఈమె ఎవరో రఘురామయ్యకి తెలిసిపోయింది. భయా శ్చర్యాధిక్యంచేత నోటిమాట పెగలక అత డలాగే గుడ్లు వప్ప గించి చూస్తూ ఉండిపోయాడు !

అకస్మాత్తుగా ఇంటిలోపలినుంచి చప్పుడైంది. చేత లాంతరుతో గది లోపలిద్వారంలో సుందరయ్య నిల బడ్డాడు. అదే క్షణంలో ఇంటి నౌఖరు వరాండా వేపు తలుపు తెరిచి లోపలికి చూశాడు. వాడి చేతిలోనూ లాంతరుంది. లాంతర్ల వెలుతురులో .... పోట్లాడుతున్న వ్యక్తులు ఒకరి నొకరు చూసుకోక తప్పలేదు .... ఇద్దరికీ దెబ్బలు తగిలి ఉన్నాయి—కారిన రక్తం చాపమీద పడిఉంది.

"అయ్యో దేముడా—నా చేతులు కాలిపోనూ ! నువ్వట్రా రమణా !" అంది స్త్రీకంఠం.

"అయ్యో గ్రాచారమా ! నువ్వటే ! నువ్వని తెలియు లేదే !" అంది పురుషకంఠం.

ఆ యిద్దరూ చంద్రమ్మా, వెంకట్రమణా !

కొద్ది క్షణాలవరకూ వాద ప్రతివాదాలూ, నిందలూ ప్రతినిందలూ, రణగుణధ్వనీ తప్ప ఎవరేమంటున్నదీ అగమ్య గోచరమైపోయింది. కొంతసేపటికి చంద్రమ్మ తెమలుకొని, కళ్ళు పెద్దవి చేస్తూ అంది :

"అయితే—నా డెవడో—స్టేషన్నించి వచ్చినఆసామీ ఏడీ?"

ఇంతసేపటికిగాని సుందరయ్య దిగ్భ్రమనుండి కోలుకో లేదు. నిజంగా ఏమి జరిగిపోయిందీ అతడికి క్రమక్రమంగా అవ గాహనైపోయింది. సందు చూచుకొని లోపలికి అడుగువేస్తూ అసహ్యపడుతూ అన్నా డతడు :

"ఏమిటిదంతా ? మీకేం సిగ్గుల్లేనూ ? చంద్రమ్మా ! నీకేం వినాశకాలం వచ్చిందే ? ఈ క్షణానికి నీ పెట్టెలో యాభై వేలకి తక్కువుండదు, నాకు తెలుసును. అయినా నీకు డబ్బు దాహం తగ్గలేదు ...."

చంద్రమ్మ విభ్రాంతితో పళ్లెత్తుమాట అనలేకపోయింది.

ఈ ప్రశస్తమైన అవకాశం సుందరయ్య జారవిడవ దల్చుకోలేదు. అతడు బిగ్గరగా చెప్పుకుపోతున్నాడు :

"స్టేషనునుండి వచ్చిన ఆసామీదగ్గిర మూడువేలు రొక్కం ముంటని నీతో నే ననడం నిజమే. అయితేమాత్రం ? నీకు డబ్బుమీద ఆశ పోలేదు. నీ ధనాశ అత్యాశ అయిపోయింది. పేరాస అయిపోయింది. ఆ మూడువేలూ నయానా, భయానా కాజెయ్యడానికి యెత్తు వేశావు. వా డెవడో పల్లెటూరు ఘట మైనా మన సంగతి ముందే పసిగట్టాడు గాబోలు. ఎప్పుడు పారిపోయాడో గాని, తెలివైనపనే చేశాడంటాను. ఈ వెంక ట్రమణగా డెప్పు డొచ్చాడో ! వీడికోసం వారం రోజులనుంచీ కాళ్లరిగి చచ్చాను. వీడే వాడనుకొని, మూడువేల డబ్బూ కాజె య్యాలని తడిమిడుంటావు. వీడు గాభరాగా లేచి భయపడి ఆత్మరక్షణకోసం నీతో కలబడి ఉంటాడు. నువ్వు కూడా—"

మంత్రముగ్ధుడిలాగు చెట్టుకొమ్మలలోనించి ఇదంతా వింటున్న రఘురామయ్య నిశ్చేష్టుడైపోయాడు. కొద్ది క్షణాల్లో తెలివి తెచ్చుకొని, అమాంతంగా చంకలోని గోనె మూట, పాత గొడుగుతో సహా క్రిందికి దుమికి కాలికొద్దీ పరుగు లంకించుకున్నాడు. ఆ తోటా, బంగాళా, మనుష్యులూ— అందరికీ మహామారి సోకినట్టు, అక్కడ పిశాచాలు తాండవం చేస్తున్నట్టూ అతడికి అనిపించింది! కాళ్లకి ముళ్లు గుచ్చు కున్నా, బట్టలు చిరిగినా లక్ష్యపెట్టక పరుగెత్తుతూ గేటు దాటి వెనకతిరిగి చూడకుండా రైలుకమ్మి పక్కనించి ముందు స్టేషనువేపు తొందరగా నడవడం ప్రారంభించాడు.

కొద్దిసేపట్లో తూర్పువైపు అరుణకాంతులు స్పష్టంగా కనిపించాయి. అవి చూడగానే రఘురామయ్యకి కొండంత ధైర్యం చేకూరినట్లయింది!

# పాఠగ్రంథి పర్యాలోచనము

శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రి

శ్రీ వి. రామకృష్ణరావుగారు, జూన్ 1961, 'భారతి' లో, "కతిపయ పాఠగ్రంథులు" అను శీర్షికతో, జైమినిభారతము, కాశీఖండము మొదలైన గ్రంథములలోని పాఠదోషములు కొన్ని చర్చించి, సవరణలు ప్రతిపాదించినారు. వాటిలో 'ఎడమ—తము' అను ప్రత్యయములను గూర్చిన చర్చ యొకటి యున్నది. అది, 1960—నవంబరు 'భారతి' లో నేను ప్రచురించిన "ఎడు—తల సంధి విచారణ" అను వ్యాసముమీది విమర్శలేశము. అందువలన దానిని గురించి నే నేదో కొంత యెట్లును చెప్పవలసియే యున్నది. గావున, దానితోపాటు శ్రీ రావుగారి 'పాఠగ్రంథు' లను గురించియు, నాకు తోచిన మాటలు చెప్పదలచుకొన్నాను. 'ఎడు త' ల సంగతి నాకు సంబంధించినది గావున, ముందు దానినే ప్రస్తావిస్తున్నాను.

## 'ఎ డ మ — త ము'

'ఎడమ—తము' అను పురస్కరించుకొని శ్రీ రావుగారీ వ్యాసములో తెలిపిన ఆక్షేపములను, "ఎడుతల సంధి విచారణ పరామర్శ" అంటూ, 1961 మార్చి 'భారతి' లో, ఇంతకుముం దొకసారి ప్రకటించియున్నారు. కాని నేను బదులు వ్రాయలేదు.. కారణ మేమనగా : అది తత్త్వాన్వేషణ తాత్పర్యముతో చేసిన భాషా పరామర్శ కాదు. నేను వజ్ఝలవారి సిద్ధాంతమును కాదన్నానన్న ఆగ్రహమున వాదుకు వ్రాసిన ఆక్షేపపు వ్రాత. ఈ విషయమును వారి వ్యాసప్రారంభవాక్యములే చెప్పుచున్నవి. చూడండి.

"శాస్త్రిగారు 'ఎడుము;—ఎడమ; తము—తమ' అనేవి ఆశీరర్థకములని నిర్ణయించడానికి ప్రయత్నించినారు. ఈ ప్రయత్నం కేవలం అనావశ్యకం, అసమర్థం. ఈ విషయం సహేతుకముగా మనవిచేస్తాను."—"శాస్త్రిగారు తమ వ్యాసంలో శ్రీ కోరాడ ప్రభృతుల వ్రాతలను విమర్శించినా అవి ప్రధాన విషయాలు గావు. ఎడు—తల సంధిని చర్చించి నూతన సిద్ధాంతమును ప్రతిపాదించినవారు శ్రీ వజ్ఝల చినసీతారామస్వామి శాస్త్రిగారు. దానిపై భిన్నాభిప్రాయం ప్రకటించడమే యీ వ్యాసంలో ప్రధాన విషయం."

ఇవీ వారి వాక్యములు. ఈ వాక్యములవలన, వారి పరామర్శకు మూలము, నేను వజ్ఝలవారి సిద్ధాంతమును కాదనడమే నని తేలిందిగదా ! ఇక వారి అధిక్షేపము లెట్లు సహేతుకములో విచారింతాము.

చిన్నయసూరి "ఎడుతలు ద్రుతాంతంబులగు" నన్నాడు. నేను ద్రుతాంతములే కాదు; 'ఎడుము; తము' అని మునర్థాంతములును అగునని నిర్ణయించడానికి ప్రయత్నించాను. "ఈ ప్రయత్నం కేవలం అనావశ్యకం" అన్నారే ! భాషా విమర్శకు లనదగిన మాటేనా ?

ఈ 'ఎడు—త'ల సంధి విషయము విశాల హృదయులైన భాషాతత్త్వవేత్తలు లోతుగా విచారించి నిర్ణయింపవలసినది గాని, బుడిబుడి పరామర్శలతో తేలునది కాదు. సంకుచిత దృష్టులకు అంతు పట్టునదీ కాదు.

ఇక్కడ ఒక్కమాట : వజ్ఝల పండితులును, 'ఎడు—త'ల విషయమున నూతన సిద్ధాంతమును జేయ ప్రయత్నించినవారే గదా ! మరి వారి ప్రయత్నమును కేవల మనావశ్యకమేనా ? "కాదు కాదు, వారి ప్రయత్నము అత్యావశ్యకము. నీది మాత్రము కేవలం అనావశ్యకం" అంటారా ? అంటే ప్రాజ్ఞు లంగీకరిస్తారా ! రావుగారి అధిక్షేపము సహేతుకమేనా ? అన్నది యిక్కడ ప్రకృతవిషయము.

వజ్ఝలవారి సిద్ధాంతానికి నా యభిప్రాయము భిన్నమైనప్పుడు ప్రకటించడం తప్పా ? నా యభిప్రాయము ఒక్క వజ్ఝలవారి సిద్ధాంతానికే కాదు; ఇంకను పలువురు పండితుల యభిప్రాయములకు, మా గురువులు శ్రీ తిరుపతి వేంకటకవుల యభిప్రాయమునకు గూడా భిన్నమే. అయినను, ప్రకటింపకుండుట విమర్శ పద్ధతి కాదు గావున ప్రకటించినాను. ఆ వరుసలోనే శ్రీ వజ్ఝలవారి సిద్ధాంతమును గూర్చిన చర్చయు జరిగినది. అంతేగాని, అందు ప్రత్యేకత యేమీ లేదు. వారి సిద్ధాంతముపై భిన్నాభిప్రాయం ప్రకటించడమే నా వ్యాసములో ప్రధాన విషయమైనట్లు శ్రీ రావుగారు వ్యాఖ్యానించడం అక్రమము.

నా సిద్ధాంతము సరియైనది కాదని తమకు నిర్ధారణగా తోచినప్పుడు వెల్లడించవలసినదే. కాని, ఊరసమున, సమంజసములు కాని శంకలను వెల్లడించగూడదు. శ్రీ రావుగారు, "నేను కూడా సత్య నిర్ధారణ దృష్టి తోనే నాకు పరమ పూజ్యులైన శ్రీ శాస్త్రిగారి వ్యాసముపై భిన్నాభిప్రాయం వెల్లడించవలసి వచ్చింది." అన్నారు. ఇది వారు హృదయపూర్వకముగా అన్న మాట కాదు. నేను, నా విమర్శలో, మా గురువుల విషయమున్ను ఉన్నందున, "సత్య నిర్ధారణార్థము, నాకు పరమ పూజ్యులైనవారి అభిప్రాయములకు భిన్నముగా కొన్ని సంగతులు చెప్పక తప్పినది కాదు" అని వ్రాసియున్నాను. అందుకు బదులుగా, రావుగారు— "నేను కూడా సత్య నిర్ధారణ దృష్టితోనే ...." అని వ్రాసినారు.

ఇది యెత్తిపొడుపుమాట గాని నిజమైన వినయోక్తి కాదు. వారి పరామర్శ ఈర్ష్యాప్రేరితముగాని, బుజ్జాఖావో

దితము కాదని యింత స్పష్టముగా తెలియుచుండగా, దాని కొక విలువ యిచ్చి ప్రత్యుత్తరము చెప్పు ప్రయాసమేల ? వారి శంకలైనను విచారపూర్వకములు కావు. వివరింప బూను కొంటే చాలా వ్రాయవలసి వస్తుంది. గ్రంథము పెరుగుటే గాని ప్రయోజనము శూన్యము. అదియునుగాక, వారి శంకలలో పెక్కింటికి సమాధానములు నా వ్యాసములోనే ఉన్నవి. మరల చెప్పుట చర్వితచర్వణ మగును. ఈ కారణ ములచేతనే, నేను వారి పరామర్శకు బదులు వ్రాయక ఉపే క్షించి ఊరకొన్నాను.

వారు, ఆ పరామర్శలోని ఆక్షేపములనే సంగ్రహించి, మరల ఈ 'పాఠగ్రంధి' వ్యాసములో ఉట్టంకించినారు. కాని, నే నిపుడును వారికి బదులు వ్రాయుటలేదు. మా ఉభయుల వ్రాతలను పరిశీలించి సత్యము నిర్ణయింప వలసినదిగా పండి తులను కోరుచున్నాను.

ఇక ఇతర పాఠగ్రంథులమాట.

## 'తే నె త ల'

శ్రీ రావుగారి విమర్శ:—

"జైమిని భారతములో, సీసపద్యపు ఎత్తుగీతి యిలా ముద్రితమై యున్నది.

"తేనె తలవడఁ బండె ధాత్రీతలంబు, ......
ప్రస్తుతింపఁగఁ దగు రామరాజ్యమునను" (6.9)

"ఈ పద్యములోని 'తెనెతలవడఁ బండె' అన్నది వ్యాస ఘట్టము వలె దుర్భేద్యముగా ఉన్నది. దీనికి పాఠాంతర మేదీ చూపబడలేదు. 'తేనెతల—సస్య విశేషము' అని సూర్యరాయ నిఘంటువు వ్రాసి యీ పద్యమునే ప్రమాణముగా చూపింది. "తేమ తలపడ బండె ధాత్రీతలంబు" కవి పాఠం కావచ్చునని తోచుచున్నది. తేమ తలపడితే చాలు పంటలు పండుతున్నా యన్నమాట."

రావుగారికి తోచిన 'తేమ' పాఠము ప్రకరణోచిత ముగా నాకు తోచలేదు. ఎందువల్ల ననగా : ఆ ఎత్తు గీతి నెత్తిమీదనే,—"నెల మూఁడువానలు నిలిచి కురిసె" అను వాక్య మున్నది. వానలు సమృద్ధిగా కురిసిన వనియు, అందువల్ల పంటలు చక్కగా పండినవనియు దాని భావము. 'తేమ ఆర కుండా నెలకు మూడు వానలు నిలిచి కురిసిన' వని చెప్పిన వాడు, వెంటనే 'భూమి తేమకే పండిన' దనడం ఉండునా ? అట్టి పూర్వోత్తర విరుద్ధరచన వీరభద్రకవి చేయునా ? కవియైనవా డెవ్వడును చేయడు.

కాబట్టి సవరణ సందర్భోచితముగా లేదు.

'తేనెతల' అను పాఠపు ముడిని విప్పబోయి, రావు గారు 'తేమతల' అను పీటముడి వేసినారు. అసలు ఈ రకపు సంస్కరణమే అనుచితము. సరియైన పాఠమును వ్రాత ప్రతులు వెదకి సంపాదింపవలెగాని, ఎవరి యిష్టమువచ్చి నట్లు వారు కల్పింపగూడదు. పద్యార్థమును పరికింపక అతికించు పాఠములు గ్రంథకర్తకు—భాషకు—అపకారకములు.

## 'అ లఁ చి వ వు ర'

శ్రీ రావుగారి విమర్శ.—

"కాశీఖండములో ధ్రువవర్ణన సందర్భంలో క్రింది ఎత్తుగీతి రచింపబడింది.

గీ. తారకాశింశుమారకా కారుడైన
యాది నారాయణుని తోఁక యలఁచి (వ) వుర
తప్ప కీక్షింపు ధరణి బృందారకేంద్ర !
వివిధకల్ప పరంపరాధ్రువుని ధ్రువుని.

ఇందులో 'అలఁచి వ(వు)ర' అంటే యేమో తెలియ లేదు. "తారకా .... యణుడు" అంటే ఖగోళ విషయం తెలిస్తే గాని బోధపడదు. ఆ శింశుమారపు తోకకు ఏ భాగంలో ధ్రువు డున్నాడో తేలితేగాని పాఠనిర్ణయం సాధ్యపడదు. జ్యోతిర్వేదం అనే గ్రంథంలో, .... "తారకామయస్య శింశుమా రస్య పుచ్ఛదేశే వ్యవస్థితో ధ్రువ" అని యున్నది. అందువల్ల 'అలఁచివవుర' అన్న చోట 'అలఁతి చివర' కవి ప్రయుక్త పాఠం అయివుంటుంది—అని ఊహించవచ్చును."

జ్యోతిర్వేదం చదివి, ఖగోళవిషయం తెలుసుకొని గూడా,—"ఇదిగో ఇదీ కవిపాఠం" అని చెప్పక, "అలఁతి చివర అయివుంటుందని వూహింపవచ్చును" అని నీళ్లునమలడ మెందుకు ? ధ్రువుడు శింశుమారపుతోకలో ఏ భాగములో ఉన్నాడో జ్యోతిర్వేదంలో తేలిందా ? ఏమి తేలింది ? "పుచ్ఛ దేశే వ్యవస్థితః తోకయందున్నాడు" అని మాత్రమే అం దున్నది. ఆ భాగ్యానికి అదియొక గొప్పగా ఆ వేదవాక్యము నెత్తి చూపుట యెందుకు ? ధ్రువుడున్నచోటు తేలితేనేగదా పాఠ నిర్ణయం సాధ్యపడడం ? అది తేలనప్పుడు పాఠచర్చ కొక నమస్కారంచేసి ఊరకుండవలె గాని, సొంత ఊహలకు దిగ వచ్చునా ?

"పుచ్ఛదేశే వ్యవస్థితః—అని ఉండడంవల్ల 'అలఁతి చివర' అయిఉంటుందని ఊహించవచ్చు"నన్నారే ! అది ఎలాగండీ ! 'పుచ్ఛదేశే' అనుటలో 'అలఁతి' లేదు, 'చివర' లేదు. మరి వారి ఊహ కాధారమేమి ? నిరాధారపుటూహకు నిలకడ యేమి ?

అసలు 'అలఁతి చివర' ఏమిటి ? 'చిన్నచివర' అని గదా అమాట కర్థము ! 'చివర' లో చిన్న—పెద్ద ఉండునా ? ఆ మొసలి తోకకు చిన్న చివర యొకటి, పెద్ద చివర యొకటి— రెండు చివరలు ఉన్నవా ? ఉన్నవని జ్యోతిర్వేదం చెప్పినదా !

ఎందు కింకను చర్చ ! 'చిన్నచివర' అనడం లోక వ్యవహారంలో లేదు. మొసలితోకకు రెండు చివర లుండడం సృష్టిలో లేదు. కనుక అది శ్రీనాథుని పాఠమై యుండు నన్న ఊహ తప్పు. 'అలఁచివవుర' వలెనే 'అలఁతి చివర' యు పాఠగ్రంధియేగాని, పాఠముగాదు.

'అలఁతిచిప్ప' అని కవిపాఠము. 1933. వావిళ్ల ప్రతి లోను, 1888 లో కందాడ రంగాచార్యుల వారిచే పరిష్కరింప బడి, ముద్రితమైన ప్రతిలోను ఉన్నది. 'చిప్ప' అనగా, చేప— మొసలి మొదలైన జలచరముల ఒంటిమీది పొలుసు. ధ్రువుడు తారకామయమైన శింశుమారముతోకమీది అలతిచిప్ప (—చిన్న

పొలుసు) గా చెప్పబడినాడు. సీస చరణములు నాల్గింటిలోని అర్థములతో ఈ యర్థమే సమన్వయించునది. 'తోక యంతిచివర' నున్నా'' డను అర్థము సరిపడదు.

## 'వా ణి య త్త ను'

శ్రీ రావుగారి విమర్శ.—

''ఎఱ్ఱన హరివంశములో,—''రనకావించిన సృష్టి తక్కొరులచేతం గాదు నా .... వాణి యు, త్తను నీటం డొకరుండు నాఁజను మహత్వాప్తిన్ గవిబ్రహ్మనా'' లని యున్నది. 'వాణి యత్తను' అంటే అర్థం ఏమీ లేదు. 'వాణి భర్తను' అయి ఉంటుంది. ''భర్తయును—భర్తను'' కావడం, అనగా 'యు' వర్ణం లోపింపజేయడం ఎఱ్ఱనకు సమ్మతమే.,''నీ వేమిని వేగిర పడక'' (హరి. పూ. 8.110. ప్రౌఢ. వ్యా. 116 సూ) కాన 'వాణి భర్తను' కవిప్రయుక్తం కానోపును.—ఈ పద్యములో ''మహత్వాప్తిన్'' అనేచోట 'మహత్వ+ఆప్తిన్' అని పదచ్ఛేదం చేస్తే అఖండయతి అవుతుంది. మహత్ + వాప్తిన్, కవ్యభిమతమేమో !

'అవ+ఆప్తి=అవాప్తి' అనేచోట 'అవ' అనే ఉపసర్గంలోని 'అ' లోపించి 'వాప్తి' కావచ్చును''—ఇవి రావుగారి వాక్యములు.

'వాణి యత్తను' అను పాఠ మున్నదేమో గాని నేను చూడలేదు. 'వాణిభర్తను' అను పాఠ మింతకుముం దున్నదే. వావిళ్ళ ప్రతిలో 1926 లో ముద్రితమై యున్నది. శ్రీ రావు గారికిని అట్టి పాఠమే స్ఫురించినది గాబోలు!

''వాణి భర్తను=వాణియొక్క భర్తయును, ఈతండున్ = తిక్కనయును, ఒకరుండునా=ఒకడు అనగా'' అని శ్రీవారు భావించిన అర్థము. ఈ యర్థ మెంతవరకు సరిపడునో గాని 'భర్తయును' అను అర్థమున 'భర్తను' అనుట మాత్రము పొసగదు.

సముచ్చయార్థమున అనుదంతములమీద 'యును' గాని, 'ను' లోపించి 'యు' గాని చేరుట కలదుగాని, 'యు' లోపించి 'ను' చేరుట లేదు.

వన్నెయును—చిన్నెయును వన్నెయు—చిన్నెయు

తిక్కనయును—ఎఱ్ఱనయును తిక్కనయు ఎఱ్ఱనయు అనుట వ్యాకరణ సమ్మతము. 'వన్నెను—చిన్నెను'; తిక్కనను—ఎఱ్ఱనను' అనుట (సముచ్చయార్థమున) వ్యాకరణ సమ్మతము కాదు. కాబట్టి 'భర్తను' అను పాఠముగాని, సవరణగాని సాధువులుకావు.

కొ. అనంతాచార్యులవారిచే పరిష్కరింపబడి, యద్దనపూడి సంజీవయ్యగారిచే (1901 లో) ముద్రింపబడిన ప్రతిలో ''వాణినత్తను'' అను పాఠమున్నది. అత్తు=కూడు, పొందు. ''మిత్తి మొత్తి సత్తి నత్తి'' (నీలా 1 118 వ)

'వాణినత్తన్—సరస్వతిని కూడుటకు' అని బ్రహ్మపరమునను, 'భాషను పొందుటకు (=వశము చేసికొనుటకు) అని తిక్కన పరమునను అర్థము కావచ్చును. ఈ పాఠమే కొంతకు కొంత మేలని నా యభిప్రాయము.

కాని ఈ 'అత్తు' ఒకటే కాదు. మొత్తముమీద ఆ పద్యమే సరిగా అర్థమగుటలేదు. ''కవిబ్రహ్మనా వినుతింతున్'' అంటే సమన్వయ మెట్లో నాకు బోధపడలేదు. పెద్దలవలన తెలియగోరుచున్నాను.

ఇక 'మహత్వాప్తి' విషయము.—

పద్యములో నున్నది. 'మహత్త్వాప్తి'గాని, 'మహత్వాప్తి'కాదు. రావుగారు 'మహత్వాప్తి' అని ఉదాహరించినారు. ''మహత్వ+ఆప్తిన్అని పదచ్ఛేదంచేస్తే అఖండయతి అవుతుంది; అది దోషము'' అని వారి ఆక్షేపము ''మహత్ + వాప్తిన్ మహద్వాప్తిన్ అంటే ఆ దోషము తొలగుతుంది' అని వారి సవరణ.

ఈ సవరణవల్ల యతిదోషము తొలగకపోగా, మరి రెండు అనర్థములు వస్తున్నవి.

1. తిక్కనకు ఎఱ్ఱన సమకూర్చిన మహత్త్వము పోవుట. మహత్త్వముయొక్క ఆప్తిచేతనే తిక్కన కవిబ్రహ్మ యగుట. 'మహద్వాప్తిన్' అను సవరణతో, మహత్త్వమున్ను, దానితోనే బ్రహ్మత్వమున్ను పోయి అతడు వట్టి కవియే అగుచున్నాడు.

2. 'మహత్—గొప్పవానియొక్క, వాప్తిన్=పొందుటచేత' అను అసంగతార్థ మేర్పడుట.

ఈ యర్థము, ''ఈతం డొకరుండ నాఁజను'' అన పూర్వవాక్యముతో సమన్వయించదు. 'ఇతడొక్కడే యనగా—ఒప్పునట్టి-గొప్పవానియొక్క—పొందుటచేత-కవిబ్రహ్మ యనగా, అనిగదా ఏర్పడే వాక్యము! అర్థమేమి? ఎఱ్ఱన, అర్థము పొందు పడని ఇట్టి అవక తవక వాక్య రచన చేయునా? 'మహత్త్వము'ను తొలగించి 'మహత్' శబ్దమును చేర్చి,ఆ మహాకవి రచనను దోష భాజనము చేయుట సంస్కరణ మనిపించుకొనదు.

3. 'అవాప్తి'ని 'వాప్తి'ని చేసినారు. సరే: 'వాప్తి' లోను అకార మున్నదిగదా! మరి అది అఖండయతి కాదా?

''వాప్తిలో అకారమున్నను, 'అవ' ప్రాదులలో చేరినది గావున 'ఉభయవళి'గాని అఖండయతి కాదంటారేమో! 'ఉభయవళి' అన్నా, 'అఖండయతి, అన్నా రెండూఒకటే. పేరులో భేదమే గాని ప్రయోజనములో భేదము లేదు. రెండును, అటు స్వరమునకూ, ఇటు వ్యంజనమునకూ రెంటికిని చెల్లునవే. కాబట్టి 'మహద్వాప్తిన్' అను సవరణలోను, అఖండయతి తప్పదు. అసంగతార్థ మొకటి—''అయం విశేషః''—అందువలన''మహత్త్వాప్తిన్'' అను అచ్చు ప్రతి పాఠమే, పద్యార్థమునుబట్టి ఉండదగినది.

ఆ ప్రయోగమునుబట్టి అఖండయతి భారత కవులును సమ్మతించినదే నని మనము గ్రహింపవలె. అంతేగాని మన మతము ప్రకారము ఆ పాఠమును మార్చగూడదు. కవ్యుద్దిష్టార్థమును గమనింపక చేయు మార్పులు, పద్యార్థమును పాడు చేయు యతి మతము భాషావిత్సమ్మతములు కావు.

భారత కవులు ముగ్గురును అఖండయతిని వాడినారు. అట్టి పాఠములు వ్రాతప్రతులలో ఉన్నవి. అవి అచ్చు ప్రతులలో మారిపోయినవి. అట్లు మార్చినవారు అఖండయతి ప్రతి

పక్షులైన పరిష్కర్తలు. వారికి అర్థ దృష్టి హ్రస్వము. ఇందు కొక్క తార్కాణము.

సీ. "నీల జీమూతంబు లీల నాక్షేపించి
నల్లనై తోఁతెంచు నట్టి తనువు
గల హిడింబుండు" (ఆది 6. 214)

అని వ్రాతప్రతుల పాఠము "నల్లనై తోఁతెంచు నల్ల గృహము" అని అచ్చు ప్రతుల పాఠము. (ఈ పాఠమే సూర్యరాయ నిఘంటువున కెక్కినది. చూ 'తోఁతెంచు')—. "నట్టి తనువు" అనుటలోగల అఖండయతినితప్పించుటకై పరిష్కర్తలు "నల్లగృహము" అని మార్చినారు. మార్పులో 'న' కు 'న' యతి కుదిరినదిగాని, అర్థ మధ్వాన్నమైనది.

అది హిడింబుని ఆకార వర్ణనము "మేఘ సంఘాత వర్ష్మకచ" అన్న మూలము ననుసరించి నన్నయభట్టు—"కారు మబ్బుకంటెను నల్లగా కనుపించు తనువుగల హిడింబుడు" అన్నాడు. ఆ హిడింబుడు, పరిష్కరణములో "నల్లగా కనుపించు నల్లని గృహముగల హిడింబుడు"గా మారిపోయినాడు. ఒళ్ళు ఇల్లుగా మారినదన్నమాట!

అది యట్లుండనిండు. నన్నయభట్టు ఆకారమును వర్ణించుచోట గృహమును చెప్పునా? "నల్లగాఁ గనుపించు నల్ల గృహము" అని 'నల్ల' విశేషణమును అనుచితముగా—పునరుక్తము చేయునా? ఇట్టి విచారణతో పరిష్కర్తల కేమి పని? అఖండయతి తొలగిపోవడ మొకటే వారికి కావలసినది.

ఈ విధముగా భారతములోని అఖండయతులు మాయమైపోయినవి. ఈ విషయమును 'గిడుగు' పండితులు (1924) అప్పకవీయము పీఠికలో విపులముగా వివరించియున్నారు.

అంతేకాదు. అక్కడనే, "భారతములో అఖండ యతులు లే" వనే వారిని ఈ క్రింది విధముగా—సూటిగా—ప్రశ్నించియున్నారు. "పీరలుద్దైవశక్తిఁ బ్రభవించిన వారను టేమి సందియం బీరమణీయకాంతి నుపమింపఁగ" (ఆది 5. 151) ఇది అచ్చుప్రతి పాఠము. ఇందులో ఇంచుగాగమ సంబంధియైన ఇకారము విరగదంటే రెండవ చరణములో అఖండవడి సిద్ధము; విరుగునంటే మొదటి చరణములో అఖండవడి సిద్ధము. ఏమంటారు?" అని వారి ప్రశ్న.

ఇంక అనే దేమున్నది? అఖండయతి అంగీకరింపవలసినదే. కాబట్టి 'మహత్వ్యాప్తిన్' అను పాఠమును మార్చ నవసరములేదు. 'మహద్వ్యాప్తిన్' అను సవరణ అర్థభంజకము గావున పనికిరాదు.

ఇదీ శ్రీ రావుగారు 'పాఠగ్రంథు'లను విప్పిన విధము. ఇది యిట్లుండగా వారి వ్యాసములో మరి రెండు వింత విషయము లున్నవి.

1. అపపాఠములను 'పాఠ గ్రంథు'లనుట.

2. ఉపక్రమమున ఒక విషయము సూచించి, వ్యాసమున ఇంకొక విషయము చెప్పుట.

వారి ఉపక్రమ వాక్య మిది.

"వ్యాసమహర్షి భారతమును ఎనిమిదివేల యెనిమిది వందల గ్రంథ గ్రంథులతో రచించినాడు. కాని లేఖకుడైన విఘ్నేశ్వరుడు తాను ఎలాంటి గ్రంథులను తయారు చేయలేదు. ఆ లోటును తీర్చడానికో అన్నట్లు తాళపత్ర మాతృకా లేఖకులు బయల్దేరి ఎన్నో పాఠ గ్రంథులు తయారు చేసినారు. కొన్ని పాఠ గ్రంథులను ఈ వ్యాసంలో విప్పడానికి ప్రయత్నిస్తాను."

ఈ యుపక్రమమునుబట్టి వ్యాసమున వారు చూపించవలసినది, సంస్కృతభారతమునకు ప్రతులు వ్రాయడములో లేఖకులు తయారు చేసిన పాఠగ్రంథులను. వారు చూపించినది? తెనుగు గ్రంథములలోని పాఠ దోషములను! వింతగా లేదా?

పాఠ గ్రంథులు—'గ్రంథి' యనగా ముడి. కీలక మెరిగినవారు విప్పి చెప్పిననేగాని అర్థముకాని గూఢరచనలను 'గ్రంథ గ్రంథు'లంటారు. వ్యాసుని గ్రంథములోని గ్రంథు లిట్టివే. అవి తప్పులుకావు. గ్రంథిశబ్దముకు 'తప్పు' అను అర్థమున్ను లేదు. మరి తప్పు పాఠములు 'పాఠగ్రంథు' లెట్లగును. గ్రంథులు కానివాటిని విప్పడ మెలాగు? తప్పులుగానున్న పాఠములను ఒప్పులుగా సంస్కరింపవచ్చునేగాని విప్పడం పొసగదు. కాబట్టి "పాఠ గ్రంథులను విప్పడానికి ప్రయత్నిస్తాను" అనడంలో అర్థంలేదు.

పాఠగ్రంథులు తయారు చేయుట.—ఇది మరీ వింత సంగతి. లేఖకుడు విఘ్నేశ్వరుడైనను, వీరభద్రుడైనను ప్రమాద వశమున—ఎక్కడైనను—ఒక యక్షరమునకు మరియొక యక్షరమో, ఒక పదమునకు మరియొక పదమో లిఖించుట యుండునుకాని, కావలెనని—అదియొకపనిగా తప్పులను ('గ్రంథులను') తయారుచేయుట యుండదు. ఇది లేఖనానుభవముగలవా రెల్లరును ఎరిగిన విషయము. "లేఖకులు బయల్దేరి పాఠగ్రంథులను తయారు చేసినా" రనుట మాత్రము అనుభవ విరుద్ధమైన వింతవిషయము.

నిజానికి 'పాఠ గ్రంథులను' తయారు చేయువారు లేఖకులు కారు. అపరిశీలకులైన పరిష్కర్తలు. ఆ గ్రంథులను లేఖకుల కంటగట్టజూచుట ప్రాజ్ఞోచితముగానివని.

శ్రీ రామకృష్ణరావుగారు ప్రాచీనగ్రంథములు పరిశోధించి, అపపాఠములను గుర్తించి సంస్కరింప ప్రయత్నించడం ప్రశంసించదగిన కృత్యం. "ఆప్రయత్నం కేవలం అనావశ్యకం" అని గాని, "అసమర్థం" అనిగాని నే నన్ను. కాని, భాషాలక్షణమును, కవిహృదయమును, సంస్కరణ . సంప్రదాయమును తెలుసుకొని సంస్కరించుట మంచిదంటాను. మన సొంత ఊహలతోనే సంస్కరించుట వలన, ఒప్పు తప్పగుటయు, ఒక తప్పుపోయి మరియొక తప్పేర్పడుటయు తటస్థించునుగావున ఆ పద్ధతి మంచిది కాదంటాను. నాకు తోచిన మాటలు మనవి చేసినాను. పొరపాటులున్న మన్నింతురు గాక.

# ఆత్మహత్య

శ్రీ వి. నాగరాజు

[తెరలేచేసరికి అది ఒక ప్రైవేటు డాక్టరు గది. డాక్టరు వ్రాసికొంటూంటాడు]

నేపథ్యం :

జీవితమ్మొక వింత
జీవన మ్మొక వింత
జీవించుటే వింతరా
భువిలోన జీవించుటే వింతరా!
అల్లంతదూరాన అట్టడుగుసంద్రాన
అంతమేలేని యీ అవనీతలమ్ముపై
ఆనందమంటాడు అనుభవిస్తానంటు
ఉరకలేసినగాని అందదదిఎందుకో !
స్వారాజ్య మంటాడు స్వాతంత్ర్య మంటాడు
ఆశయాలంటాడు అనుసరిస్తానంటు
మానవుడు తన కన్ని అవధులే కట్టుకుని
సంఘమంటే బెదిరి పరువెత్తుచున్నాడు!
దోపిళ్ళు హత్య లత్యాచారములు బలిసి
దొమ్మిగా జరిగేటి రోజులయిపోయాయి!
తన బాధ తనకింక భరియింపరానిదై
'ఆత్మహత్య'కు నాందివేశాడు మానవుడు!

[హఠాత్తుగా ఒక యువకుడు ప్రవేశిస్తూ]

యువకుడు :—డాక్టర్......డాక్టర్......

డాక్టరు :—............

యువకుడు :—డాక్టర్ మీ మేలు మర్చిపోలేను డాక్టర్. నాకో చిన్న సహాయం చేసిపెట్టండి డాక్టర్.

డాక్టరు :—ఓ......ఎవరు నువ్వు ?

యువకుడు :—అదంతా ఎందుకు. నాకో చిన్న సహాయం చేసి పెట్టే చాలు డాక్టర్.

డాక్టరు :—(వ్రాసే పెన్ను ముడిచి) ఏమిటయ్యా అది ? చెప్ప కుండా సహాయమంటే నేనేం చేసేది ? కాస్త కూర్చుని మాట్లాడు.

యువకుడు :—ఇప్పుడు నేను కూర్చోలేను డాక్టర్. నాతల తిరిగిపోతోంది. ఇక ఈ భూమిమీద నే నొక్కక్షణం ఉండలేను డాక్టర్. దానికోసమే మీ సహాయం కావాలి.

డాక్టరు :—అబ్బాయీ! నీకేమీ పిచ్చిపట్టలేదుగదా ? అసలు మీదే వూరు ? ఏమిటీ విషయమంతా....

యువకుడు :—చెపుతాను; వినండి. కాని మీరు నాకు సహాయం చేస్తానని మాటివ్వండి. అలాచేస్తే మీకేది కావ లిస్తే అది ఇస్తా. నా దగ్గర మీరుకోరే వస్తువు ఏదైనా ఇచ్చేస్తా. మీరు నాకో చిన్న సహాయం చేయాలి డాక్టర్.

డాక్టరు :—చెప్పవయ్యా. నాకు సాధ్యపడిందైతే తప్పకుండా చేస్తాను. విషయమేమిటో చెప్పకుండా......

యువకుడు :—అబ్బబ్బ. నా శరీరం తూలుతోంది. మెదడు బరువెక్కిపోయింది. డాక్టర్ చెపుతాను వినండి. నా కీ ప్రపంచమంటే అసహ్యమేస్తోంది. నా ముఖం ఈ తుచ్ఛ మానవ లోకానికి చూపలేను. ఈ విశ్వాస రహిత ప్రపంచంలో బ్రతకలేక, కుడితిలోపడిన ఎలుకలా కొట్టుకుంటున్నాను డాక్టర్—కొట్టుకొం టున్నాను. అందుకే మీ సహాయం కావాలి డాక్టర్.

డాక్టరు :—ఆవేశపడకు. నేను నీ ధోరణి నర్థం చేసుకోలేక పోతు న్నాను. అయితే నీ పేరేమిటన్నావు ?

యువకుడు :—....సతీష్.

డాక్టరు :—నువ్వు చేసేపని ?

సతీష్ :—డాక్టర్! చచ్చిపోయేవాడు కూడా వృత్తి పనీ చెప్పుకు చావాలా ? —కడుపుకక్కుర్తికోసం, గానుగ ఎద్దు గుమాస్తానని చెప్పుకోనా—లేక చాలీచాలని జీతాల్ని తీసికొంటూ నా సంసారాన్ని నేను నెట్టుకు రావ డానికి నానుండి అవసరాన్ని ఆశించే కష్టజీవుల దగ్గర లంచాలు గుంజుకునే నిర్భాగ్యుణ్ణని చెప్పుకోనా ? నాకు పనీ పాటా లేదు. తిని ఆనందించడానికి కావలసి నంత ఆస్తి ఉంది. కాని డాక్టర్ నే నాస్తిని అనుభ వించి ఆనందించలేను. నా గుండెమండి, మనస్సు కుళ్ళి, నేను 'ఆత్మహత్య' చేసికొంటున్నాను డాక్టర్.

డాక్టరు :—"ఆత్మహత్య !"

సతీష్ :—అవును. ఆత్మహత్య. దాని కోసమే మీ సహాయం కావాలి. అందుకే నేను మిమ్మల్ని ఇంతగా ప్రార్థిం చేది. మీ సహాయ మర్థించేది.

డాక్టరు :—ఇందులో నా సహాయమా ! నువ్వు ఆత్మహత్య చేసి కొంటావ్. నేను సహాయం చేయాలి !

సతీష్ :—(వికటంగా నవ్వి) డాక్టర్ మీ సహాయం తప్పకుండా కావాలి. నేను నీళ్ళలో పడి చద్దామంటే నాకు ఈతవచ్చు. తలబద్దలు గొట్టుకుందామంటే బాధ భరించలేను. రైలుకింద తలపెడితే విలవిలలాడే నా తెగిపడిన శరీరావయవాల్ని చూస్తూ ఆ రక్తంలో కళ్ళు మూయలేను. నేను హాయిగా, శాశ్వతంగా, ఈ మురికి కూపంలోంచి బయటపడే మందు కావాలి.

డాక్టరు :—ఏమిటి సతీశ్ నువ్వనేది ? 'ఆత్మహత్య మహాపాపం' అసలీ విషయం ప్రభుత్వానికి తెలిస్తే, నిన్ను

నాలుగు గోడల మధ్య బంధించి, చావకుండా, బ్రతుకకుండా హింసిస్తుంది.

సతీష్ :—అదేమిటి డాక్టర్ ! నా శరీరంమీద నా కధికారం లేదా ? నే నెవ్వరి శరీరాలమీదా అధికారం చెలాయించటంలేదే. నా శరీరాన్ని నేను బాధించుకుంటే తప్పా ? అది ప్రభుత్వ దృష్టిలో నేరమా ? చస్తే ప్రభుత్వానిదేంపోయింది ? మరి తిండి లేక అల్లాడి క్షోభించే గతిమాలిన భికారి ప్రజానీకాన్ని రక్షించ లేని ప్రభుత్వం 'అమ్మా' 'బాబూ' అంటూ వీధుల వెంట తిరుగుతూ, తోటి ప్రజానీకంతో సమాన హక్కులు కలిగినా, పస్తులకువాడి, కుటుంబాలు కుటుంబాలు పక్షుల్లా గిలగిలలాడి చస్తోంటే రక్షించలేని ప్రభుత్వం—వాళ్ళ శరీరాలమీది కెలా చెలాయిస్తుందీ అధికారం ? నన్నలా దండించ దానికి దానికే మధికారం ?

డాక్టరు :—ఇదిగో సతీష్. నీ హృదయం చాల చికాకుగా ఉం దిప్పుడు. జీవితమంటే కాస్త ఆలోచించు. ఆత్మ హత్య చేసికొని ఎవర్ని సాధిస్తానంటావ్ ?

సతీష్ :—ఇదే నా నిశ్చయం. మిమ్మల్ని సలహా యిమ్మని, నా జీవితాన్ని పునరుద్ధరించమని రాలేదు. కాని నన్ను నేను ఎలా సూక్ష్మంగా, బాధ లేకుండా చంపు కోవాలో అర్థం గాకుంది. కాస్త ఆ మందిచ్చి నన్ను శాశ్వతంగా నిద్రపోనీయండి డాక్టర్.

డాక్టరు :—ఒక డాక్టరుగా ఒక జీవిని రక్షించడంపోయి, ఒక జీవిని చంపడమా ! ఇటువంటి దేశద్రోహకర మైన సంఘనాశక విషయాలకు నే నిక్కడ డాక్టరు నవలేదు సతీష్. అటువంటి పని నేను చేయ లేను. ఆ విషయం.....

సతీష్ :—ఇంతేనా డాక్టర్. నేను బ్రతికి ఉండిమాత్రం సుఖించే దేముంది ? నా శరీరం నా అధీనం తప్పింది. నే నిక బ్రతుకకూడదనుకున్న నా మొండి నిశ్చయానికి తిరుగులేదు. డాక్టర్ నువ్వు చంపకపోతే నేనే చస్తాను. కనపడిన మందల్లా తాగుతా.

(బల్లమీద సీసా తీయబోతాడు. డాక్టరు వారిస్తాడు)

డాక్టరు :—సతీష్ నీది భరించరాని బాధే కావచ్చు. అయినా ఒక నిండు ప్రాణాన్ని అమాంతంగా తీసేసుకోవడం మన ధర్మం హర్షించదు.

సతీష్ :—ఛీ. బోడి ధర్మం. ధర్మం, న్యాయం, నీతి, నిజాయితీ, మంచీ, చెడూ అనేవి బ్రతుకదల్చుకున్నవాడికి. కాని నేను చచ్చిపోతాను. నాకు చావు కావాలి. కౌగి లించుకుందామన్నా నన్ను చూసి వెనక్కి పారిపోయే మృత్యువును పట్టి, బంధించి, నామీదికి విసరాలి. అలా చేయగల సమర్థులు మీ రొక్కరే.

బయటచద్దామంటే తండోపతండాలుగా ప్రజలు నన్ను వింతగా చూడ్డానికి గుమిగూడుతారు. నా జీవితంమీద, నా ప్రాణంమీద నాకే స్వతంత్రంలేదు. శాసనాలు చట్టాలు నేను చస్తే ఏం పోగొట్టుకొంటు న్నాయి ? ప్రణాళికల్లో నా వంతు ఖర్చు ప్రభుత్వా నికి లాభిస్తుందిగదా, మరి నన్ను నేను చంపుకొంటే ఏమిటా క్రౌర్యం ?

డాక్టరు :—నీ ఇల్లు నువ్వు తగలబెట్టుకుంటానంటే సంఘం ఒప్పవద్దా ?

సతీష్ :—ఛీ. పాడుసంఘం ! కుత్సితం, కుళ్ళు, అసూయ, అశాంతి ఆవరించుకుపోయి, ఆలోచనా శూన్య మైన ఈ నికృష్ట సంఘంలో నేనూ ఒక వ్యక్తినని చెప్పుకోలేను. బలిసిన అడవిదున్నల్లా కలియబడే రాజకీయ పార్టీలతో, జీవితాల్ని జీవితాలుగా దోచు కొనే దురాశాపరుల గూడుపుఠానీ వేషాలతో నిండి పోయి, అమాయకులను, అండలేనివాళ్ళను రూపు మాపి, అంతస్థుల తేడాలు కల్పించి, మానవకోటి—మానవజాతినే సోపానాలుగా నిర్మించి, ఏహో వింత భవనాల్లో సంచరిద్దామని వూహించుకొనే కర్కశ ప్రపంచంలో నిలబడలేను.

రెండు ప్రపంచయుద్ధాలుచేసి కోట్లమంది ప్రజల్ని చంపానని ఈ సంఘం ప్రగల్భాలు పలుకుతుందా ? లేక నాగరికత అనుకుంటూ, కట్టుబాట్లులేక సంచరిస్తూ......అబ్బబ్బ భరించలేని నా బాధ ప్రజ్వలిస్తోంది. డాక్టర్ మీతో వాదించడానికి నేను రాలేదు. నాకు ఆత్మహత్య కావాలి.

(ఫోను మ్రోగుతుంది. డాక్టరు ఫోను తీసికొని మాట్లాడుతుంటాడు)

ఓరి సర్వజ్ఞాని ననుకొనే ఆత్మవంచకా ! నీ కనూ హ్యమైన రెండు ఊహల్ని, సందర్భాలు కల్పించి భాషతో మేళవించి, చమత్కరించి విర్రవీగే ఆగర్భ దరిద్రుడా ! నే నిప్పుడు చస్తున్నాను. చావు తర్వాత నువ్వనే పుణ్యలోకాలన్నీ, పాతలోకాలన్నీ, అన్నీ తిరు గుతాను. అహ్హహ్హా పిచ్చి కల్పనలు.వెర్రి వేదాంతాలు.

(అలసిపోతాడు. డాక్టరువచ్చి కుర్చీలో కూర్చోబెడతాడు)

డాక్టరు :—సతీష్ ! !

సతీష్ :—డాక్టర్ మందు. నేను చచ్చిపోతాను డాక్టర్—

డాక్టరు :—కళా—

సతీష్ :—నన్ను చంపెయ్యండి డాక్టర్.

డాక్టరు :—చూడు సతీష్. అర్జంటుగా సూపర్నెంటు దగ్గ ర్నుండి ఫోను వచ్చింది. నువ్వేమీ అనుకోకు. ఇప్పుడే వస్తా. (స్నేహసౌకృతో ముందు కడుగు వేయబోతాడు)

సతీష్ :—(డాక్టరు కాళ్ళను వాటేసుకుంటూ) డాక్టర్. నాకు విముక్తి లేదా ?

(కళ వస్తుంది నర్సు డ్రస్సులో)

డాక్టరు :—సతీష్. నన్ను వదులు.

సతీష్ :—డాక్టర్ ! పోనీ మీకారు పెట్రోలును నా శరీరంమీద గుమ్మరించి నిప్పు ముట్టిస్తే ఓర్చుకుంటాను. భరించలేని జీవిత శేషం డాక్టర్! నన్నేవో పిశాచాలు తరుముకొస్తూ నాశేషజీవితానికి ప్రళయాగ్ని కొండాల్తో వాతలుబెట్టచూస్తున్నాయి డాక్టర్.

డాక్టరు :—సతీష్ ! నువ్వు సంస్కారంగల యువకుడివి. ముందు జీవితాన్ని ఆలోచించలేని నీ ప్రవర్తన నా అనుభవంలో నేను చూడలేదు. కళా! నే నిప్పుడే వస్తాను. సతీష్ ! నువ్వు కాస్త విశ్రాంతి తీసుకో.

(డాక్టరు వదిలించుకుని వెళ్ళిపోతాడు. కాగితాలు జేబులో పెట్టుకుంటూ)

సతీష్ :—విశ్రాంతి !—? నాకు నోటంట మాట రావడం లేదు. గతులు తప్పుతున్న శరీరం ఎలా నే నదుపులోకి తెచ్చుకోగలను? పాత కొత్తలు లేని విసుగు పుట్టే ఈ జీవిత నాటక రంగంలో ఉన్నవాటిని లేనట్లూ, లేనివి ఉన్నట్లూ చేసే భ్రాంతిలో నేనిక నా పాత్ర నిర్వహించలేను. నా పాత్ర నిక్కడితో అంతం చెయ్యి డాక్టర్.

చస్తానో అంటే చావనీయని ఈ లోకం, అభివృద్ధికి ఆటంకాలు కల్పించే ఈ లోకం, మండే దావాగ్నికి ఇంధనాలు సమకూర్చి ప్రజ్వలింపజేసే ఈ లోకం—ఉన్నఫళంగా ఎందుకు నాశనమైపోదు ?

కళ :—నాశనమైపోతూనే ఉంది.

సతీష్ :—లేదు. నాశనమవడంలేదు. ఎలా నాశనమవుతుంది? ప్రపంచ యుద్ధాలు రెండు— కాట్లకుక్కల్లా కలబడి అంతమయిన తర్వాత, బుద్ధిలేని ప్రపంచం మూడో యుద్ధానికి తలపడితే, ఓర్పులేని ఒక జాతి ఈ పశువుల్ని మరో ప్రపంచం సాధిద్దాం అని మభ్యపెడుతూ, ప్రపంచముఖాన్ని ఒక్క తన్ను తన్ని చంద్రగోళానికి తిప్పితే మరింకెప్పుడు ఈ వినాశం రావాలి ?

కళ :—కాదు. సహజంగా కోమలమనస్కులైన స్త్రీ జాతి ముందు కడుగువేసి, ప్రపంచాన్ని మరో మార్గంలో నడిపిస్తున్నారు.

సతీష్ :—స్త్రీ జాతి! ఛీ ఛీ. ఆడజాతి ! చంచలా! ఆడది సర్వకాల సర్వావస్థల్లో మగాణ్ణి అనుసరించి, కర్మకూ విధికీ లంకెపెట్టి, జాతిని నాశంచేసే ముసలకం. హృదయంలేని కఠిన పాషాణం. కల్పవృక్షాన్ని అలుముకొన్న విషపు తీగె. మగ నాటకానికి నాందీ భరత వాక్యాలు పలికే సూత్రధారిణి ఆడది.

నా పరుషోక్తులు నీ హృదయాన్ని గుచ్చి నీ మనస్సును నొప్పించి, బాధ కలిగిస్తున్నాయా? నీకు బాధ కూడానా స్త్రీలోకమా ! సిగ్గు, లజ్జ, అవమానం, ద్వేషాన్ని భరించగలిగిన ఈ శరీరం, ఈమాత్రం బాధ కోర్చుకోలేదా? లసహ్యాన్నంతా అమృతప్రాయంగా దిగమింగే హీనజాతికి నువ్వే రూపంలో ప్రాతినిధ్యం వహిస్తున్నావ్ ? అబ్బ. నా ప్రవర్తనలో లేని ద్వేషభావం నాకెలా అబ్బుతోంది ? డాక్టర్ నాకు ఆత్మహత్య కావాలి. చంచలా! నువ్వైనా నా జీవితాన్ని కడదేర్చవూ?

కళ :—కడదేరుస్తాను.

సతీష్ :—కడదేరుస్తావా చంచలా ! నా బాధను అర్థం చేసుకొన్నావన్నమాట. ఆడదానివైన నీకు కూడా ఒక మనస్సుందా చంచలా ? నన్ను క్షమించు చంచలా. చంచలా! నన్నీవాతావరణంనుంచి త్రోసివేయవూ ?

కళ :—త్రోసివేస్తాను. కాని మీకు, మీ జీవితంమీద కలిగిన ఏహ్యత పరిణమించి, ప్రపంచాన్నే చూపి, ఇదంతా పెంటకుప్ప అంటోంటే, మీబలహీనతను చూసి నా మనస్సు ఒక ఆడదవుతోంది.

సతీష్ :—చంచలా 'ఆడ' పదానికి అర్థంలేదు. అది సర్వ విపత్తులకు మూలం. ఈ ఆడ శబ్దం సాగి ప్రపంచాన్నంతా తనలో ఇముడ్చుకోగల ఒక ప్రత్యేక అర్థ రహిత పదం. నీ విషయంలో నువ్వు ఆడదానివికావు చంచలా. నువ్వు వేరే చంచలవు. నీలో ఏదో వినూత్నమైనశక్తి ఉంది. కాని అది ఈ స్వార్థకలుషిత ప్రపంచంలో మునకలు వేస్తున్న జీలుగుబెండుముక్క. నీలో ఆత్మ చచ్చిపోయింది. కాని నీకు మనస్సు ఉంది. నీ మనస్సు నామీద జాలిపడుతోంది.

కళ :—నేను ఆడదానినే. సృష్టిని సాకుతూ, సృష్టి రూపకమైన స్త్రీత్వం నాకుంది. అనురాగానికీ, ఆప్యాయతకూ ఆటపట్టై శాంతిస్వరూపకమైన తేజోరూపం నాలో ఉంది. ఎనభైనాల్గు లక్షల జీవరాసుల్లోనూ అత్యుత్తమ స్థానాని కర్హురాలైన, ఆనందానికి మూలకారకమైన క్రియారూపాలను జీర్ణించుకొన్న మూర్తిని నేనే.

సతీష్ :—అవమానానికి, అనుమానాలకు, అనర్థాలకు స్థానాన్ని కల్పించుకున్న ఆడదాన్ని అమరత్వం చేసిన కవులు బుద్ధితక్కువవాళ్ళు. కోమలీ, మయూరీ, లతా, కళామూర్తీ అని పూజించే గుడ్డి లోకానికి అవగాహన శక్తి తక్కువ. పురుషుని దౌర్బల్యానికి మూల హేతువు స్త్రీ. పురుషుణ్ణి కపటానందాల్లో తేల్చి, బలహీనుణ్ణిచేసి, కాళ్ళు కట్టి, కదలకుండాచేసి, భయంకరమైన రొంపిలోకి నెట్టేది ఈ ఆడదే. ఆడది క్షమించరాని ఏహ్యజంతువు.

కళ :—ఆడది లేకపోతే సృష్టేలేదు.

సతీష్ :—సృష్టికంతం కావాలి. ఆడది రూపుమాసిపోవాలి.

కళ :—సృష్టి అంతమవాలన్నా ఆడదే కావాలి.

సతీష్ :—అనవసరం. ప్రపంచమంతా ఒక్కసారిగా ఆడది లేకుండా అణుశక్తి నుపయోగించి చచ్చిపోతుంది.

కళ :—కాని దాన్ని పురికొల్పాలంటే ఆడది కావాలి.

సతీష్ :—అనవసరం. స్వార్థపరత్వం, లోభం, ఆశ, పెచ్చు పెరిగితే పురుషుడినే అనహనం పులుముకుపోయి, లోకాన్ని మట్టుపెడుతుంది.

కళ :—కాని పురుషుడి స్వార్థపరత్వానికి, లోభానికి, ఆశకు, పురికొల్పేది కూడా ఆడదే.

సతీష్ :—కాదు.

కళ :—అవును. భీభత్సానికి ఆదిశక్తి ఆడదని తెలిసికోలేని మూర్ఖుడవు.

సతీష్ :—నాకు మూర్ఖత్వం వద్దు. చంచలా, నాకు ఆత్మహత్య కావాలి. దయ, సానుభూతి, లేని డంబాచారసంఘ వృక్షంమీదినుండి నన్ను స్థానభ్రష్టుణ్ణి చేయాలి. అడుగడుగుకూ అనేక అత్యద్భుత కల్పనలు చేసి జీవితాన్ని భయంకరరూపంగా చేసిన ఈ గతిమాలిన గుంపులోనుండి బహిష్కృతుడనై పోవాలి.

కళ :—ఈ సంకల్పం దైవం సహించదు.

సతీష్ :—దైవం.......భగవంతుడు !.....ఆ యా కాలాల ఇంద్ర జాలికుల తెరచాటు గగుర్పాటు. నా సంకల్పాన్ని దైవం సహించేదేమిటి? అసలు దైవమనే పదా నికి నిర్వచనం చెప్పు చూద్దాం.

చంచలా, గారడీవాణ్ణో భగవత్సంభూతుడని నమ్మిన రోజులులేవా? పరిపాలించేనాయకుడిణ్ణిదైవప్రతినిధిగా భావించి పూజించిన రోజులులేవా? కాకపోతే వాళ్ళ జీవిత మొక వృత్తి అవడంవల్ల, మానవజాతి వాళ్ళ చర్యలను పరిశీలించింది. కాని, మేము భగవంతుడి స్వరూపమనేవ్యక్తులకు విగ్రహారాధనచేసే నీ తెలివి తక్కువను నేనేమని పరిహసించను ?

ఒకానొకప్పుడు పూజాపునస్కారాలు కల్గిన బలవత్తరమైన రోమను సామ్రాజ్యపు రక రకాల దేవుళ్ళు, గౌరీ శంకర శిఖరంమీద ఆయా పర్వతాల మీద ఆసీనులైన దేవదేవుళ్ళు ఇప్పు డెక్కడికి పారి పోయారు ? నేను చెప్పేది నా పిచ్చి కదూ ! అవును. కోపర్నికస్ భూపరిభ్రమణాన్ని కనిపెట్టేవ రకూ, సూర్యభ్రమణాన్ని నమ్మిన ప్రపంచం కోపర్నికస్‌ను మొదట్లో నమ్మిందా ? అంతే చంచలా, మళ్ళీ ఈ భ్రమణాన్ని మరో ప్రామాణిక నిదర్శ నంతో మరొకడు చూపేవరకు నమ్మడం ఈ దౌర్భాగ్య మానవ సంఘంలో లేదు. నువ్వు పిచ్చి దానివి చంచలా.

కళ :—మతమంటే దేవుడంటే నమ్మిక లేనివాడికి ప్రపంచ మంతా అలానే కన్పిస్తుంది.

సతీష్ :—ఓసి కామ క్రోధ, లోభ, మోహ మద, మాత్సర్యాల సంపూర్ణ రూపమా! లోకాన్ని నీ తెరలతో మూసి గాఢాంధకారాన్ని కల్పించి మానవుణ్ణి దాసాను దాసుణ్ణి చేసికొంటున్న పాపాలపుట్టా! మతమంటే ఏమిటి ? ఆ మతం వచ్చి ఒరగబెట్టిందేమిటి ? అహింస అన్న మతాన్ని అనుసరించే జాతి, కారణం లేకుండా సాటి జీవాత్మాన్ని తుద ముట్టించ డాని కానన్నమవటంలేదా ? 'పొరుగువాడిని ప్రేమించు'— అనే మతాన్ని అనుసరించే జాతి, తోటిజీవుల్ని బానిసలుచేసి యుద్ధం యుద్ధం అంటూ కలవరించడంలేదా? మరీ మతం ఎందుకు? అవసరమైనప్పుడు యుద్ధాలంటూ కొట్టుకు చావడానికా!

జీవితాన్ని జీవనాన్ని బానిసచేసి, ఆ వృధా జీవితాన్ని జీవి ఎలా అనుభవించగలడు ? లెక్క లేనన్ని కట్టుబాట్లకు లొంగి నా వ్యక్తిత్వాన్ని చంపుకోలేను. ప్రపంచంమీద నాకు అసహ్యం పుట్టింది. ప్రపంచం నామీద విరుచుకుపడుతుంది. ఈ విజ్ఞానయుగంలో ప్రపంచంతో అయిష్ట పడినవాడికి సాధించగలిగింది ఒక్కటే — అది ఆత్మహత్య. కాని ఈ ప్రపంచ సముద్రం హోరున ఘోష లెత్తి ఒక్కసారిగా నిశ్చలమయే నిశిరాత్రి నైనా సంఘంకళ్ళనుండి తప్పుకొని ఆత్మహత్యకు పూనుకోలేకపోతున్నానే.

అందమనబడే హాలాహాలంతో పూత పూయ బడి, పురుషజాతిని అజ్ఞానులనుచేసి భూపరివర్త నాన్ని తగ్గిస్తున్న ఆడజీవమా, నీ భయంకర నేత్రా లకు మానవుల్లో స్పర్థలు కన్పించడంలేదా? కాల ప్రవాహంలో పడి, జీవితపు విలువలు మరిచిపోయి, ముందు వెనుకలు గుర్తించలేక, జీవితాన్నొక నియ మిత చర్య చేసికొని అయోమయజీవితాన్ని గడిపే, ఈ ప్రాణమున్న కొయ్య బొమ్మలమధ్య నేనెలా ఉండ గలను ? చదివిన సాహిత్యమే చదివి, బ్రతికిన బ్రతుకే బ్రతికి, గతాన్నే పొకడం—భవిష్యత్తుకు తపించడం, ఎక్కడో ఏదో ఉందని కలలుగనడం—చివరకు నిరా శను కోరి తెచ్చుకొని కుమిలిపోవడం—నాకు సరి పడదు. మనిషిని మనిషే అర్థం చేసికోలేని ఈ మనుష్య లోకంలో నేను చరించలేను.

కళ :—జీవితపు అంచులవరకూ పరిగెత్తి చూస్తే కన్పించేది వేదాంతం. జీవితం మధ్య నిలబడి పరిశీలిస్తే అగు పడేది సరసత్వం. జీవితంలో ప్రవేశిస్తేంటే అభి ముఖమై ఆహ్వానించేది—తీయదనం.

సతీష్ :—ఆహాహా ! జీవితాన్ని ఎంత చక్కగా నిర్వచించావు. కృత్రిమానికి నగిషీ చెక్కబడిన స్ఫటిక శిలా రూపమా! చంచలా! బాధ అనే కోరాన్ని తెచ్చి నా హృదయాన్ని మధిస్తే వచ్చే ఈ నా బరువైన

ఉచ్ఛ్వాస నిశ్వాసాలకు అర్థం తెలుసికోలేని ఈపాడు సమ్మర్దంలో, ఎవడో పెద్దవాడనబడే దౌర్భాగ్యుడిచేత సూచించబడిన అర్థంలేని మార్పులకు లొంగి, అభిమానాన్ని చంపుకుని సాటివాళ్ళతో నడుంకట్టాల్సిన ఈ జనావళిలోనే నేను బ్రతకలేను.

నా గుండె పగులుతోంది. మనస్సు విచ్ఛిన్నమవుతోంది. తల పూడిపడుతోంది. నాకు రక్షణవద్దు. నన్ను చంపమన్నా ఎందుకు చంపరీ వ్యక్తులంతా. స్థిరత్వంలేని విభిన్న వ్యక్తిత్వాల సందడితో తోసుకుపోతున్న మనుష్యవాహిని నన్నీ ప్రవాహంలోముంచి, అట్టడుగు బురద కెందుకు నెట్టివేయదు?

కళ :—మానవుడు కొన్ని పరిమితులు దాటితే......

సతీష్ :—భగవంతుడవుతాడా ? పిశాచమవుతాడా ? జంతువవుతాడా ? లేక పిచ్చివెర్రి మేళవించిన కొత్త మృగమవుతాడా ? చంచలా నేను, ఆత్మహత్య చేసుకుంటాను. నువ్వు వెళ్ళిపోతున్నావు. (కళ వెళ్ళిపోతుంది) నాకు ఆత్మహత్య కావాలి. నేను ఆత్మహత్య చేసుకొంటాను (గట్టిగా అరుస్తాడు)

ప్రభుత్వాన్ని నిర్మించి, రాజకీయాల్ని నెలకొల్పి, రాజ్యాంగాల్ని సరిదిద్ది, ఆశయాల్ని చట్టాలుగా మార్చి, ఏకత్వం, సహోదరత్వం, సమానత్వం, అంటూ ప్రపంచాన్నంతా రైలుబద్దెలమీద నడిపిద్దామనుకొన్న ఆలోచనలకు ప్రతి రూపమేనా ఈనాడు నడుస్తున్న ఈ మానవ జాతి ? మనుష్యుడు కళకోసం పుట్టాడట. ఏదీ ఆ కళ ? భీభత్సంచేసి ఆ వచ్చే ఫలితాన్ని చూసి ఆనందించడమా ? సోమరితనాన్ని పారాయణచేస్తూ, 'ప్రకృతి ప్రకృతి'—అంటూ కలవరించడమా ? కృత్రిమాన్ని కృత్రిమమని తెలిసినా, వాటిని తోటివాళ్ళకు అతిశయంచేసి చూపడమా ?

ప్రపంచముఖం మారిపోయింది. తల్లి ముఖంలో మాతృత్వం మాసిపోయింది. ప్రేయసి ముఖంలో చిరునవ్వు నశించిపోయింది. యువకుడి ముఖంలో ధైర్యం చచ్చింది. పిన్నల ముఖాల్లో దైన్యం పొడచూపుతోంది. భార్యలు భర్తలను మోసం చేస్తున్నారు. (గట్టిగా) వంచిస్తున్నారు. ద్రోహం చేస్తున్నారు. ఎక్కడ చూసినా దౌర్జన్యం. స్వార్థం మూలుగు. (లోపలనుండి బాధపడుతూ గుక్క తిప్పుకోలేని దగ్గు. తర్వాత మూలుగు విన్పిస్తుంది) నే నిప్పుడే చస్తాను. మాడిపోయిన ముఖం పాలిపోయిన కళ్ళు, వాడిపోయిన శరీరం, విరిగిపోయిన హృదయం, అరిగిపోయిన నడకతో నేను నా జీవితానికి శ్రద్ధాంజలి సర్పించను. కుష్ఠు, క్షయ, ఉబ్బసం—ఛీ ఛీ ఛీ ఏమిటీ బ్రతుకు? ఒక పక్క వాంతి చేసుకుని మూతి ముడుచుకుని పంచదారతింటే ఏమిటా సంతోషం!

ఆలోచిస్తుంటే నాకు పిచ్చెక్కిపోతోంది. నాకీ లోకంలో ఎవ్వరూలేరు. నే నొక్కణ్ణే నేను. ఆ నేను కూడా ఈనాటితో ముగింపు.

(టేబిలుమీద సీసా తీయబోతాడు. ఆత్మ ప్రత్యక్షమయినట్లు ప్రవేశం)

ఆత్మ :—ఆగు !

సతీష్ :—నన్నడ్డుపెట్టేదెవరు ?

ఆత్మ :—నేను.

సతీష్ :—నువ్వెవరు ? ఏమిటావేషం ? నువ్వు కోరితెచ్చుకున్న భార్య అనబడే ఆట వస్తువు సంతోషంతో నిన్నొదిలి, హాయిగా చచ్చిపోయిందా ? లేక నువ్వు చేయిపట్టుకుని నడిపించే ఈ సూదుల బాటమీద, ఏడుపు నవ్వులతో నీవెంటబడి, అమాయకత్వాన్ని మేస్తూ వస్తున్న ఒక చిన్న ప్రాణి మరణించిందా? నీ విచారాన్ని తెలుపడంకోసం మృత్యువుకు మరో రూపాన్ని కట్టుకువచ్చిన ఏ పదార్థానివి నువ్వు ? నీ పేరు ?

ఆత్మ :—''నేను''

సతీష్ :—ఓ ''నేనా'' నా జీవితరేణువును మృత్యు సముద్రంలో కలుపగల శక్తి ఉందా నీలో? అసలు నీ నిజరూప మేమిటి ?

ఆత్మ :—''నేను''. నిన్ను ''నన్ను హత్య'' నుండి మరల్చడానికి వచ్చిన ఆత్మను.

సతీష్ :—అహ్హాహ్హా. ఆత్మ!.........ఆత్మకు రూపంలేదు.

ఆత్మ :—నువ్వు కల్పించుకొన్న రూపాన్ని.

సతీష్ :—నాకు ఆత్మంటే నమ్మకంలేదు.

ఆత్మ :—బుద్ధి, మనస్సు, ఆత్మ అని వాపోయిన ఈ మూడింటిలో అదృశ్యరూపం గలిగిన ఆత్మను నేను.

సతీష్ :—అయితే నువ్వు అరిస్టాటల్ ఆత్మవా ? ప్లాటో ఆత్మవా ?

ఆత్మ :—నీ ఆత్మనే పిచ్చివాడా.

సతీష్ :—మరయితే నన్ను చంపు. లేకపోతే నా ఆత్మహత్యకు సహాయం చెయ్యి.

ఆత్మ :—నువ్వు చావలేవు.

సతీష్ :—నేను చస్తాను.

ఆత్మ :—బలవంతమైన చావు చస్తే నీ ఆత్మ ఘోషిస్తుంది.

సతీష్ :—యుద్ధాల్లో చచ్చిన మానవులు కూడా ఆత్మహత్య చేసికొన్నట్టుకాదా ? వాళ్ళ ఆత్మలు భూగోళం చుట్టూ ఘోషించటంలేదే ?

# ఆ త్మ హ త్య

ఆత్మ :—యుద్ధాల్లో చచ్చింది—మనస్సు సంకల్పించి, బుద్ధి దారి చూపిన చావుకాదు.

సతీష్ :—నువ్వు చెప్పే ఏ విషయం నా కర్థం కావటంలే దిప్పుడు.

ఆత్మ :—నువ్విప్పుడు అర్థం చేసుకోలేవ్. విపరీతాలోచనలతో మనస్సును వికావికలం చేశావ్. అర్థంకాని సమస్యలతో బుద్ధి ఎటుపోవాలో తోచక, కళ్ళాన్ని విడిచావ్. నిన్ను నీవే నాశనం చేసుకొంటున్నావ్. ఒక చిన్న సంఘటనను ఆవేశంతో జీవితానికి ముడి పెట్టుకోవడం అల్పజ్ఞాని లక్షణం. నీ చావు నీకే అరిష్టం. అసలు నువ్వీ ప్రపంచాన్నుండి బయట పడలేవు.

సతీష్ :—బయటపడగలను. ఏమిటిది ? నా ప్రాణం నేను భరించలేక తీసికొంటూంటే మధ్య వాళ్ళందరికీ ఏమిటీ బాధ !

ఆత్మ :—భగవంతుడికైనా వెరచి ఆత్మహత్య మాను.

సతీష్ :—భగవంతుడు లేడో అంటోంటే భగవంతుడో లంటూ మీరంతా నాతో వాదించి, నన్ను విసుగెత్తించి భయంకరమయిన చావుకు నన్నుత్తేజ పరచాలనా మీ సంకల్పం.

ఆత్మ :—నీ ప్రతి మాటలోనూ భగవంతుడున్నాడని ప్రతి ధ్వనిస్తోంది. సృష్టి కంతకూ ఒక సార్వభౌము డెవరో ఉన్నాడని నీ ఆత్మను నాకు తెలుసు. అయినా నువు మూర్ఖతతో వృథాగా కత్తి కట్టావు. పిరికిపందవై నిన్ను నువ్వు చంపుకోవడానికి ప్రయత్నిస్తున్నావు. అయినా నీ ఆత్మను నేను ఎక్కడా ఆశ్రయంలేక, పడరానిపాట్లకు లోనవుతాను.

సతీష్ :—అయితే నే నెవరిని ?

ఆత్మ :—నువ్వే నేను, నేనే నువ్వు.

సతీష్ :—నేను నాతో ఎలా మాట్లాడుతున్నాను ?

ఆత్మ :—బుద్ధి మనస్సు బాహ్యావాతావరణాని కనుకూలాలు. ఆత్మ నిరాకారమైన పరలోకసంబంధమైనది.

సతీష్ :—నువ్వు చెప్పేవన్నీ బూటకాలు. నాకు పిచ్చెక్కిపోతోంది. నిన్ను నేను నమ్మను. పో వెళ్ళిపో.

(టేబిలుకేసి కొట్టుకుంటాడు తల. ఆత్మ అదృశ్యమవుతుంది)

సతీష్ :—(లేచి తల పట్టుకొంటూ) :—బుద్ధి: మనస్సు—ఆత్మ: మానవుడి బాహ్యావాతావరణం: ఆంతర వాతావరణం. సృష్టి కంతకూ సార్వభౌముడనే వాడొకడున్నాడు. ఆత్మ ఆశ్రయంలేక పడరానిపాట్లకు లోనవుతుంది. (గట్టిగా) నా ఆత్మ ఏమైనాసరే నే నీ బరువు బ్రతుకు నీడ్వలేను. నేను ఆత్మహత్య చేసుకుంటూ.....ఆత్మహత్య చేసుకుంటూ.

(రమేష్ తాగుబోతుగా ప్రవేశిస్తాడు.)

రమేష్ : ఆత్మహత్య చేసికొంటా నన్నవాడు చేసికోవాల్సిందే—

సతీష్ : తాగుబోతుగా ఆనందిస్తున్న ఓరి దౌర్భాగ్యుడా ! వ్యథి చారానికి మూలవిరాట్టువై జీవితాలకు విలువలుకట్టే నిర్భాగ్యుడా! నాకు ఆత్మహత్య కావాలి !

రమేష్ : చూడు. జీవితాన్ని అనుభవించింది ఉమర్ ఖయ్యాం. విఫలు డయ్యింది అలెగ్జాండరు. ఉమర్ ఖయ్యాంకు ఆనందించటం తెలుసు. అలెగ్జాండరుకు ప్రపంచ మంటే తెలియదు—నీకూ్కడా తెలియదు.

సతీష్ : తెలుసు.

రమేష్ : ఎలా తెలుసు ? కొంపతీసి ప్రపంచగతికి ఏమైనా సూత్రాల్ని వ్రాసుకొచ్చావా ? లేకపోతే ఆ మూరు మూల ఎత్తయిన కొండయెక్కి ఈ పట్టణం మీద దృష్టి సారించావా ? లేకపోతే ఇసుక యెడారుల్లోనూ, పర్వతాల మధ్య తిరిగావా ? ఏదీ కాక పోతే బుతువుల్ని లెక్కచేయకుండా కఠోర తపస్సు చేశావా ? ఏదైనా చెట్టు ఆశ్రయమిచ్చిందా ? లేకపోతే నువ్వు "మహది" వా ?

(కళ వస్తుంది).

సతీష్ : నేనేమీ చెయ్యలేదు. నే నెవ్వరినీ కాదు. కాని నాకు ప్రపంచమంటే ఒక "కుళ్ళుగొయ్యి" అని తెలుసు.

రమేష్ : అక్కడే పొరపాటుపడ్డావ్. మర్చిపోయాను—నా కతిథి సత్కారం అంటే బహు శ్రద్ధ. నీ కీ పానీయంలో సగం మాత్రం ఇవ్వగలను తాగుతానంటే.

సతీష్ : నామీద అభిమానం చూపి, నన్నాదరిస్తున్న ఓ సాటి జీవితమా ! నాకు కావల్సింది విషంగాని, పానీయం కాదు. నా కా విషాన్నిచ్చి నా జీవితానికి భరతవాక్యం చెప్పు.

రమేష్ : శశీ, ఇత ననేది ఏమిటి ?

కళ : ఆత్మహత్య చేసుకొంటా నంటాడు.

రమేష్ : దాని కిక్కడిదాకా ఎందుకు ? వెళ్ళి ఎలక్ట్రిక్ తీగెలమీద కూర్చో.

సతీష్ : నే నా చావు చావలేను.

రమేష్ : వాడి అయిన బాకు తీసుకొని పొడుచుకో.

సతీష్ : నాకు భయం.

రమేష్ : ఓరి పిరికిపందా! చచ్చేవాడికి బాకు భయం ఏమిటి? ప్రపంచంలో భయం అనేది పెద్దవాళ్లనుండి పిల్లలకుసంక్రమించే మానసికమయిన ఆస్తి. దీన్ని మన కివ్వకుండా మన పెద్దవాళ్లుండలేరు—దాన్ని తీసుకోకుండా మనం ఉండలేము. ఇదే మా డాక్టరు నాన్న అంటూంటారు.

సతీష్ : నువ్వు డాక్టరు కొడుకువా?

రమేష్ : అవును డాక్టరు కొడుకునే. నావంక నువ్విలా వింతగా చూడ్డంలో గల అంతరార్థం నాకు బోధపడటం లేదుగాని, నీకు నా చరిత్రను చెబుతాను విను—ఈ డాక్టరు ఏకైక కుమారుడు రమేష్, ఆరేళ్ల చిన్నతనంలో ఎక్కడో మారిపోయి, ఇరవై సంవత్సరాలు ఈ వినోద ప్రపంచంలో విహరించి, మళ్లీ ఇలా—రెండు సంవత్సరాల క్రితం డాక్టర్ని చేరుకున్నాడు—సంక్షిప్తంగా, బాగా చెప్పాననుకుంటా నా చరిత్ర.

సతీష్ : అయితే నా మృత్యుద్వారప్రవేశానికి అనుమతినిచ్చే ముందు ద్వారపాలకులు మీ యిద్దరూ, నన్ను విముక్తుణ్ని చేసే అధినాధుడు డాక్టరూ నన్నమాట.

రమేష్ : ఇప్పుడు నీ ఆత్మహత్య విషయ మంటావ్. 'ఆత్మహత్య' అంటే కాస్త ఆలోచించాల్సిన విషయమే. ఎందుకు చేసుకొంటున్నాడు? ఎలా చేసుకోగలడు? అన్నవి ప్రధానాంశాలు. నువ్వు నా పరిమితిని మించి ఏవో ఏవో మాట్లాడేస్తున్నావు. అయినా అలో చిస్తాను నీ విషయాన్నిగురించి. ఇప్పుడే వస్తా ... రా శశీ.

(రమేష్, కళ వెళ్లిపోతారు లోపలికి.)

సతీష్ : ఉరికంబాన్నుంచి తప్పుకోవాలంటే బ్రహ్మప్రళయం ఆత్మహత్య చేసుకోవాలంటే మహాప్రళయం.

ఇహపరాలకు భేదాలు చెప్పి 'నేను' పదాన్ని పూర్తిగా పరిపాలిస్తున్న ఆత్మా! నేను నిన్ను ఎదిరిస్తున్నానని పొగలు కక్కుతున్నావా? అయినా నేను లెక్కచేయను. చచ్చేవాడు ఈ ప్రపంచంలో ఎవడిని లెక్కచేయాలని ఉంది.

(డాక్టరు ప్రవేశం.)

సతీష్ : డాక్టర్.

డాక్టరు : సతీష్ నిన్ను నేను పిచ్చివాడవనుకోవాలో, మంచివాడిగా అర్థం చేసుకోవాలో అర్థంకాకుంది. ఈరోజు పొద్దుట ఒకచోట ముగ్గురు ఆత్మహత్య చేసు కొన్నారట, కారణంలేకుండా.

సతీష్ : (ప్రాధేయపూర్వకంగా) డాక్టర్ నన్ను కూడా అంతం చెయ్యండి.

డాక్టరు : (సతీష్ ముఖంలోకి పరిశీలనగా చూస్తాడు.)

సతీష్ : డాక్టర్.

డాక్టరు : ఆత్మహత్మ చేసుకొంటావా?

సతీష్ : డాక్టర్. దారంతెగిన గాలిపటం అల్లల్లాడి సముద్రపు అట్టడుగుకు ప్రశాంతంగా చేరుకుంటుంది. సతీష్ కూడా మరో రెండు క్షణాల్లో సంఘపు భూత కాలంలోకి హాయిగా నడిచిపోతాడు.

డాక్టరు : సతీష్?

సతీష్ : నిజంగానా డాక్టర్. ఇప్పుడే చంపేస్తారా! అయితే ఇదుగో సిద్ధంగా ఉన్నాను.

డాక్టరు : ఆత్మహత్య చేసుకొంటున్నట్టు, నీ అంతట నువ్వీ కాగితంమీద వ్రాసియివ్వు.

సతీష్ : అవును. అదీ నిజమే. నేను చచ్చిపోయేముందు మరో అమాయక జీవికి కష్టం కలిగించలేను డాక్టర్ ... వ్రాస్తాను.

డాక్టరు : ఇదుగో కలం .... కాగితం (తలుపులు మూసి వస్తాడు) వ్రాయి— శ్రీ శ్రీ ప్రభుత్వ పోలీసు శాఖాధికారు లకు—నీ పేరు వ్రాయి—వ్రాయునది.

సతీష్ : నాకు జీవితంమీద విరక్తిపుట్టి ఆత్మహత్య చేసు కొంటున్నాను.

డాక్టరు : దీని కెవరూ బాధ్యులు కారనిన్నీ, నన్ను నేనే విషం తీసుకొని చనిపోతున్నాననీ తెలియజేయుచున్నాను.

సతీష్ : ఇంతేనా డాక్టర్.

డాక్టరు : చూడు సతీష్. నీ కింత ఆస్తి ఉందన్నావు, అనుభ వించేవాళ్లెవరైనా ఉన్నారా?

సతీష్ : ఎందు కుండరు డాక్టర్. ఎవడో, చచ్చిన సతీష్ బాబాయి అన్నకొడుకుననో, వాళ్ల ముత్తాత, మా తాత అన్న దమ్ములనో రాకుండా ఉంటాడా? ఎవడో ఒకడు అనుభవిస్తాడు.

డాక్టరు : చూడు సతీష్, నువ్వెంత ఉదాత్తుడివి—నీవంటివాడు చావడం దేశాని కరిష మంటాను.

సతీష్ : నాకు వచ్చే రక్తాశ్రువులు కూడా రాకుండా పోతున్నాయి డాక్టర్. నా జీవితా న్నొకదరి జేరుస్తున్నారు. మీకు నా కృతజ్ఞతలు.

# ఆ త్మ హ త్య

డాక్టరు : కాని చనిపోతున్న నీ పేరు, నీ ఉదాత్తత లోకంలో చిర స్థాయి కావాలని నా కోరిక.

సతీష్ : పోనీయండి డాక్టర్. ఈ వెధవపేరు ప్రతిష్ఠలమీద నాకు ఆసక్తి లేదు. ఎన్ని దుర్మార్గాలో చేసి గడించిన సొమ్ములో, పది పదిహేనువేలు ఉదాత్తంగా యిచ్చా ననిపించుకొంటే వచ్చే ప్రతిష్ఠలో కలిగే సుఖంలో నాకు సంతృప్తి లేదు.

డాక్టరు : అయితే సతీష్, నీ ఆస్తి అన్యాయ్యమైందా ?

సతీష్ : అన్యాయం కాకపోయినా ఆకస్మికంగా వచ్చింది. నా కీ దుర్మార్గ ప్రపంచంలో జీవితాన్నిచ్చిన నా తండ్రి ఒక వ్యాపారస్థుడి దత్తపుత్రుడు.

డాక్టరు : అయితే నువ్వెలాగూ చనిపోతున్నావు. లోకంమీద నీకు అసహ్యత పుట్టింది. కాని నీకోసం, నీ ఆదర్శ ....

సతీష్ : ఆదర్శం ! .... చచ్చేవాడికి నాకు ఆదర్శం యేమిటి? నన్ను గురించి మాత్రం ఎవళ్లో ఏమో చెప్పుకోవాలని ఏముంది ? బ్రతికిఉన్నప్పుడు తెలుపని సానుభూతి —చచ్చింతర్వాత ఈ లోకం ఎంత సంతాపాన్ని చూపిస్తుంది డాక్టర్ !

డాక్టరు : సతీష్, నీ తర్వాత, నీ ఆస్తిని ఎవరో ఒక చీడపురుగు అనుభవించడం నేను ఒప్పలేను. జీవితమంటే కావా లని ప్రాకులాడే కొంతమందికి, నీ పేరు చెప్పుకొనే స్థాయి కల్పించు. నీ జీవిత స్మారకచిహ్నంగా ఒక అనాథ శరణాలయాన్నో—

సతీష్ : డాక్టర్ మీరు నాకు సహాయం చేస్తున్నారు. మీకు కూడా నేను ప్రత్యుపకారం చెయ్యాలి. మీకు నా ఆస్తంతా వ్రాసేస్తాను డాక్టర్.

డాక్టరు : నేనేం చేసుకుంటాను సతీశ్. నా తల మునిగే డబ్బుతో నేనూ కొట్టుకులాడుతున్నాను.

సతీష్ : డాక్టర్ నా ఆస్తిని మీకు వ్రాసేస్తా. (కాగితంమీద వ్రాసి సంతకం పెడతాడు.)

డాక్టరు : ఆకాశాన్నుండి ఒక తోకచుక్క రాలిపోయే ఈరోజు, మానవజాతికే ఒక కళంకం. నీకు ఉపకారం చేస్తున్నా నంటూ నీకు ద్రోహం చేస్తున్నానేమో సతీష్!

సతీష్ : లేదు డాక్టర్. నా బరువును మీ రెత్తుకుని, నాకు స్వేచ్ఛ నిస్తున్నారు.

(డాక్టరు కాగితాన్ని మరో ప్రక్కకు జరిపి లోపలి తలుపు తెరిచి).

డాక్టరు : కళా—వాటర్.

(కళ వస్తుంది ఒక గ్లాసెడు నీళ్లతో)

సతీష్ : డాక్టర్, నా హృదయం సంతోషావధులు దాటిపోతోంది. ఇంక నాకే కోరికలు లేవు. నన్ను మృత్యువు జయించ లేదు. నేనే మృత్యువును జయించాను. అసంతృప్తితో చావడంలేదు. సంతృప్తితో చస్తున్నాను.

పాషాలు, పాదుషాలు, మహారాజులు, ఫేరోలు, చక్రవర్తులు, దైవదత్తులు నడిచిపోయిన ప్రతిభా వంతపు మృదుల శయ్యలమీదుగా పోతానో, కష్ట జీవులు, దరిద్రజనులు, అభాగ్యులు, నిర్భాగ్యులు నడిచిపోయిన భయంకర నరకద్వారాల మీదుగా పోతానో—నా కక్కర్లేదు. వాళ్లంతా ముం దేముందోనన్న అనుమానాల్తో చచ్చారు. నా కదేం లేదు. ఇప్పుడు నేను చేసేది ఒక గొప్ప సాహస చర్య.

కళ : ఏమిటిది డాక్టర్ ?

డాక్టరు : సతీష్ నీ ఇష్టదైవాన్ని ప్రార్థించుకో.

సతీష్ : ప్రార్థించాను .... మీకు నా కృతజ్ఞతలు డాక్టర్.

కళ : డాక్టర్, ఒక జీవితాన్ని భగ్నం చేయగలరు గాని, ఒక జీవి తాన్ని రక్షించడం మీ చేతులలో లేదు.

డాక్టరు : నువ్వు నా బానిసవి.

కళ : అవును నేను బానిసనే. అయినా నేనీ అన్యాయాన్ని సహించను.

సతీష్ : ఆడదానికి సహనం ముఖ్యం. (గభాల్న తీసికొని త్రాగే స్తాడు.)

కళ : సతీష్ !

సతీష్ : భూగోళం ఉరవడి కందని వేగంతో భయంకరశబ్దం చేస్తూ తిరుగుతోంది. మానవులంతా ఆవేగాన్ని అందుకోలేక ఒకళ్లొకళ్లే సముద్రంలోకి దూకి చస్తున్నారు. ఆ మహావేగంలో గడ్డాలూ, మీసాలూ ఒకప్రక్క, రంగు రంగుల పేలికలు మరోప్రక్క. దరిద్రు లొకప్రక్క, శ్రీమంతు లొకప్రక్క, రంగుల రాట్నంలా తిరుగుతూ స్థితిని కోల్పోయి, హాహా కారాలు చేస్తున్నారు—నేను నేనుగా చచ్చిపోతు న్నాను (పడిపోతాడు).

కళ : డాక్టర్ .... డాక్టర్ !

డాక్టరు : కళా 'ఆశ' అనేది జీవికి మానసికాహారం. ఇతన్ని గురించి కొద్దిగా నాకు ముందే తెలుసు—ఆస్తివంతుడు, బుద్ధిమంతుడు, అవివాహితుడు. కాని ఈ ప్రపంచ వాతావరణాని కితడు సరిపోడు. ఆనాటి కాలానికి మహావేదాంతి సోక్రటీసు సరిపడక, విషం తాగి మరణించాడు. సతీష్‌తో కూడా అంతే. అతను

పడే బాధకంటే ఆత్మహత్య ఏమంత ఘోరమైంది కాదు.

కళ : డాక్టర్ మీరు ఎంత మృదువుగా మాటలు దొర్లించగలరు ! మీలో రాక్షసత్వం ప్రబలిపోతోంది. సంఘంలో గౌరవనీయుడైన డాక్టరు ననిపించుకొంటూ ఎన్ని పాపకార్యాలు చేస్తున్నావు డాక్టర్.

డాక్టరు : కళా, మానవుడి శక్తి మానవుడిని చంపగలగడంవరకే. నువ్వు నాకు పోటీపడుతున్నావు. నీకు సంభవించేది ఏమిటో నీకు తెలుసు, నాకు తెలుసు.

కళ : ఆడదానికి చావు కూడా ఒక ఆభరణమే. కానియ్యండి డాక్టర్.

డాక్టరు : నీ చావుతో నా కింకా అవసరం రాలేదు.

కళ : కాని డాక్టర్, ఈ పాపా లన్నింటికీ అనుభవించాల్సిన రోజు ఈ లోకంలోనే ఉంటుంది.

డాక్టరు : జ్యోతిష్యం చెబుతున్నావా కళా ?

కళ : కాదు. జరుగవలసింది చెపుతున్నా. పిల్లి కళ్ళు మూసుకుని పాలు త్రాగుతోంటే లోకం కూడా కళ్ళు మూసుకో లేదు డాక్టర్. మీ పాతచరిత్ర పూర్తిగా తెలియక పోయినా కొంచెంగా నాకు తెలియకపోలేదు. మీకు భార్యను కాకపోయినా, మీ కానందాన్నిస్తూ, మీ అభి వృద్ధిని కోరిన బానిసను.

డాక్టరు : బానిసలకు సలహా చెప్పగలిగినంత హోదా లేదు.

కళ : అయినా స్త్రీహృదయం ఇటువంటి పాపకార్యాలను సహించదు.

డాక్టరు : కళా.

కళ : డాక్టర్.

డాక్టరు : కళా ........

(కళ భయపడి రెండు చేతుల్తో ముఖం కప్పుకొని వెళ్ళిపోతుంది. డాక్టరు ఆవేశంతో అటూ ఇటూ తిరుగుతాడు.)

డాక్టరు : అతను చచ్చిపోవా లనుకుంటున్నాడు. నేను బ్రతకా లనుకుంటున్నాను. అతనికీ లోకంతో పనిలేదు. కాని అతనితో నాకు పని ఉంది. డబ్బుకోసం ఎన్ని ఘోరాలు జరగడంలేదు ? దేశాలు కోసం దేశాలు పోరాడి మనుష్యుల్ని చంపుతోంటే, చావుకు తెగించి, చస్తానన్న ఒక ప్రాణిని చంప డంలో దోష మేముంది ?

నాలో ఉన్న రహస్యాన్నంతా కళ మెదిపెట్టే సింది. ఆఁ, (బాధపడుతూ) మనస్సు ఒప్పని విషయాన్ని బుద్ధి మాట్లాడేస్తూంటుంది. అసలు మానవుడికి మాట అనేది ఎందుకుంది ? తనలో ఉన్న బాధను బయటకు చెప్పకపోతే ఉపశమించదు. నాబాధను, నామోయలేని రహస్యాన్ని ఎవరికి చెప్పను? కళ నాకు ద్రోహం తలపెడుతోంది. కళా— నేను చంపకపోయినా మరోచోటికి పోయైనా చస్తాడు. కళా, అసలు నేను సతీష్‌కు విషన్నీయలేదు. ఆ యిచ్చింది మత్తుమందు—సతీష్‌ను మరికొంత కాలం బ్రతికించాలి. సతీష్ జీవితాన్ని ఇన్సూర్ చేయాలి. అప్పుడు సతీశ్‌ను చంపాలి.

ఎప్పుడో చేసిన అద్భుత చర్యలు ఇప్పుడు చేయలేకపోతున్నాను. నన్నేదో పిరికితనం ఆవ రించుకొంటోంది (కుర్చీలో కూర్చుంటూ) అయినా నే నిప్పుడు చేసేపని మానవ చరిత్రలో ఏమంత క్రూరమైంది ? బయటిప్రపంచాని కీ విష యంతో పనేముంది ?

(రమేష్ పోలీసు డ్రస్సులో వస్తాడు).

రమేష్ : డాక్టర్ పనే ఉంది.

డాక్టరు : ఏమిటది రమేష్.

రమేష్ : నా ఉద్యోగం డాక్టర్.

డాక్టరు : నువ్వు ఉద్యోగం చేస్తున్నావా ?

రమేష్ : రెండు సంవత్సరాల నుండి మీ యింట్లో ఉద్యోగం చేస్తున్నాను.

డాక్టరు : నువ్వెవరవు ?

రమేష్ : సి. ఐ. డి. ఇనస్పెక్టరు—బలరాం. ఇదిగో విజిటింగ్ కార్డు.

డాక్టరు : మీరెందుకొచ్చా రిప్పుడు ?

బలరాం : మిమ్మల్ని ఆహ్వానించడానికి డాక్టర్.

డాక్టరు : ఎక్కడికి ?

బలరాం : నేరస్థులు పోయే ........

డాక్టరు : బలరాం, మీరు నాతో సరసమాడుతున్నారా ?

బలరాం : లేదు డాక్టర్. ఇది సరసం కాదు. విరసం.

(డాక్టరు గభాల్న పిస్టలు సొరగులోంచి తీసి గురిపెడతాడు.)

డాక్టరు : ఇప్పుడేమంటావు బలరాం ?

బలరాం : డాక్టర్ ఒక్క విషయం చెబుతాను వింటారా ?

డాక్టరు : నీ ఇష్టదైవాన్ని ప్రార్థించుకుంటావా ?

బలరాం : మరో ఇరవైనాలుగు గంటల్లో మీకు ప్రాప్తించే కర్మకాండ అదే.

# ఆ త్మ హ త్య

డాక్టరు : బాగా చెప్పావు బలరాం. పోలీసు ఆఫీసరుగా బాగా సరి పోయావు. బలరాం. నేను చేసిన హత్యలు నీతో కలిపి పన్నెండు. మరి రెండు హత్యల్ని కూడా చేస్తా ఇరవై నాలుగు గంటల్లో. ఈ అపరాధ పరిశోధ కులు, ఈ ఇనస్పెక్టర్లు—ఎవడు పట్టుకోగలడో చూస్తా.

బలరాం : నేనే మిమ్మల్ని పట్టుకున్నది డాక్టర్‌జీ. మేము అనుమానిస్తున్న ఎనిమిది హత్యలు కంటే మరో మూడు ఎక్కువ చెప్పావు డాక్టర్, కాని ......

డాక్టరు : మరో రెండు కూడా చేస్తాను బలరాం. కన్న కొడుకునని నమ్మించావ్. గుర్తులు చూపించావ్. నా కళ్లల్లో కారం కొట్టావ్. నా యింట్లోనే తిని తిరుగుతున్నావ్. నా డబ్బును విచ్చలవిడిగా ఖర్చుచేస్తున్నావ్. చివరకు నువ్వా హించిన ద్రోహమిదా బలరాంజీ ?

బలరాం : ద్రోహంకాదు డాక్టర్, న్యాయం. మీరు పొరపాటు పడుతున్నారు.

డాక్టరు : సంవత్సరాల తరబడి దిక్కుమాలిన నా కన్నకొడుకు రమేష్‌ని లక్షాధికారిని చేద్దామని ఎంతో ప్రయ త్నించాను. ఎప్పటికైనా దొరక్కపోతాడా అని డబ్బు కూడబెట్టాను. హత్యలు చేశాను.

బలరాం: డాక్టర్! మీ ఈ నాటకానికి రెండు సంవత్సరాలుగా కృషి చేయాల్సి వచ్చింది. మీకు నా ధన్యవాదాలు. డాక్టర్ మీ పిస్టలులో గుండ్లు లేవు.

డాక్టరు : ఆఁ (పిస్టలిప్పిచూసి) ఆ ....

బలరాం : డాక్టర్, మీరు మాట్లాడిన మాటలన్నీ మరోసారి వినాలని ఉందా ? మీ గదిలోనే మీకు తెలియ కుండా 'టేపురికార్డరు' సెట్ చేసినందుకు క్షమించండి.పాపం మరో రెండుక్షణాలు పోతే కళకు మీ చేతుల్తో మందు తాగించేవారు. డాక్టర్ అలా కంపించిపోతా రెందుకు ? ఎనిమిది నిండు ప్రాణాల్ని సునాయాసంగా తీయగలిగిన మీకు చావంటే భయం పుడుతోందా ?

డాక్టరు : నన్ను నేను సమర్థించుకోలే నిప్పుడు.

బలరాం : తడిగుడ్డల్తో గొంతుకలు కోయగలరా ? ముఖం లోనూ, మాటలోనూ సౌమ్యాన్ని ప్రదర్శించగలరా ? ఎదుటివాడి శరీరాన్ని చీల్చే చూపుల్ని చూడగలరా? భయంకర వ్యూహాల్ని పన్నగలరా ? అర్భకుల్ని ఆజన్మాంతం బంధించగలరా ? నిన్ను నువ్విప్పుడు ఎలా సమర్థించుకొంటావు డాక్టర్.

(డాక్టరు దిక్కులు చూస్తూంటాడు.)

డాక్టర్! మీరు పరుగెత్తి కూడా ఎక్కడికీ పోలేరు. మీ బంగళా చుట్టూ పోలీసు కావలా ఉంది. డాక్టర్, ఇంకా ప్రయత్నా లేమైనా ఉంటే చెయ్యండి. మత్తుమందు కూడా తాగలేదేమో ఈ సతీష్. కాని మీ రిచ్చిన పొట్లం విషమనుకొని ఘోరంగా చచ్చిపోయాడేమో ! ఎంత విచిత్రం డాక్టర్ ఈ ప్రపంచమంతా.

డాక్టరు : కాదు బలరాం. పొరబడ్డావు. ఓడిపోతే సైనికుల తప్పు. గెలిస్తే జనరల్ గొప్పతనం. నా అజ్ఞానం నన్ను ఓడించింది. నా తెలివితేటలు నన్ను రక్షించ లేకపోయాయి. ప్రాణంలేని టేపు రికార్డరు మాట్లాడుతుంది. కళ్ళులేని ప్రభుత్వం కళ్ళు తెరిచింది. నా ఆత్మాభిమానాన్ని చంపుకుని నేను నీకు లొంగిపోలేను బలరాం. (కోటుజేబులో సీసా తీసి) ఆత్మహత్య చేసుకొంటానన్న సతీష్‌కు ఉపయోగిద్దా మనుకున్న, రంగు, రుచి, వాసనలేని ఈ మందే నాకు గెలుపు తెస్తుంది.

(డాక్టరు తాగేసి క్రింద పడిపోతాడు వెంటనే కళ లోపలనించి పరుగెత్తి వస్తుంది).

కళ : డాక్టర్ !

(సతీష్ లేస్తాడు కంగారుపడుతూ).

సతీష్ : నే నెక్కడ ఉన్నాను ? నాకంతా అయోమయంగా ఉంది. నాకు 'ఆత్మహత్య' కావాలి.

['జీవితమ్మొక వింత—జీవనమ్మొక వింత' పాటతో తెర జారుతుంది].

# నిశాంతమూర్తి

శ్రీ ఆర్. ఎస్ సుదర్శనం

ఆర్ద్రగళమొందు విరహవ్యథాంకితముగ
స్మృతులు మెలమెల్ల మీటివి శీర్ణమౌను,
మృదుమృణాలబంధ మొకండు యెదనుగదిసి
గాఢముగ కౌగలించి నిగూఢమౌను,
సురభిళ పవనోర్మి మెలసి సుఖముగూర్చి
ప్రియసఖీ సన్నిధానమై రిత్తయౌను—
ఒకటి శ్రుతి, రెండు స్పర్శ, యింకొకటి శ్వాస
మిట్లు భిన్నమై అనుభూతి యింతదాక
జీవన నిశా ప్రవాహ సుషిరములందు
మూడుపాయలై జాఱె, సంపూర్ణ సత్య
శాంతి సరసి నాంకాంక్షింతు కనులతోడ.

రాత్రి అవతలిగట్టుపై ప్రసవమొందు
ఆకృతీ, ఓ యదృశ్య నిశాంతమూర్తి
ఈ వలిదరిఁ నిలిచి బాహ్యదృష్టిలేక
ఈ ప్రశాంత రోదసీ నిరీక్షాప్రవృత్తి
నూహసేయుదు నిన్ను సమ్మోహనముగ;
భావనావీధి క్రమముగా బ్రస్ఫుటించి
నవ్వినది తార—ఆ నవ్వు సవ్వడులను
వంశి నూదినయట్లు విపంచి మీటి
కంఠమెత్తి పాడిన యట్లు కదలెజగతి,
కంఠసీమ ముక్తావళి కాంతియట్లు,
ధవళధర్మము వచ్చె నంధత్వమునకు!

నవ్వినది తార ఎదవిచ్చి—నవమృణాల
బంధమొందు సాగుచువచ్చి ప్రణయకిరణ
మై జగతినిండి, మధురోర్మియై విషాద
మొక్క-తాకున విదళించి, ఊరుపై వి
శృంఖలత గూర్చి కన్నుల శిశిరమౌను,
అంధకారమ్ము ద్రెచ్చు నవాంశువగుచు
ప్రేమదృష్టి ప్రసాదించు వేళ దెలియ
వచ్చె బాహ్యప్రకృతి సుప్రభాతమూర్తి!

నవ్వినది తార ఎదవిచ్చి పువ్వువోలె—
జగతి ప్రసవమై, రేకులు సాచి ఊర్పు
పరిమళమ్మెగబోయు ప్రభాతమూర్తి
ధవళమాధురి శివమెత్తి తాండవింప
నీ వసంతముహూర్త సమీక్షణమ్ము
దగ్ధకామ మనంగతా దర్శనమ్ము
సత్యసుందరమ్మద్వైత శాంతి కాంతి,
యమ్యో బహిరంతరముల నిశాంతమూర్తి!

# ఇజ్రాయేలు ఇండియాల పోలికలు

## శ్రీ జి. ఆర్. వర్మ

సహస్రాబ్దాల చరిత్ర తరిస్తే యూదులనుగూర్చి ఎవ్వరు ఈజిప్టు రాజులనుండి హిట్లర్ కాలంవరకు సదభిప్రాయం ప్రకటించిన ట్లగుపడదు. సుమారు రెండు సహస్రాబ్దాలనాటికే మన దేశానికి పరిచయమైన యూదులను ఒక జాతిగా నిర్ణయించే ఆధారాలూలేవు. పోతే యూదుల్లో 'ఎసెనీ'లనబడిన వారు మన బౌద్ధులవంటివారనీ, బౌద్ధమత ప్రాబల్యం క్రైస్తవంలో కనిపిస్తుందనే పరిశోధనా వుంది. అలానే క్రైస్తవంలో పారశీక మిత్రదేవుని పూజలు ఇతరుల ఛాయలు వున్నాయి.

బైబిల్ పూర్వభాగం (పాత నిబంధన) యూదుల సహస్రాబ్దాల ఆర్థిక మత సామాజిక రాజకీయ చరిత్రయేగాని మరొకటిగాదు. తర తరాలుగా వారు పడిన బాధల గాథల్లో వారి సంకుచితత్వం, క్రౌర్యం, తిరుగుబాట్లు, మూఢ విశ్వాసాలు, దుర్వృత్తులు, మొదలైనవే అయితే అలాంటి వనేకం ఇతర జనాంగాల్లో లేకపోలేదు.

యూదులు మాత్రం ఎప్పుడూ—చారిత్రకంగా తెలివి తక్కువవా ళ్ళనిపించుకోలేదు. పైగా తర తరాల్నాటి బాధలు ఓపిక, సహనశక్తి పెంచడంలో—మొరటుదేలినట్లుంది. పోతే అప్పుడూ—ఇప్పుడూ—ఎప్పుడూ అవకాశవాదుల్లో అగ్రగాములు యూదులే అనిపిస్తుంది.

పదమూడు సంవత్సరాల క్రితంవరకూ ఖచ్చితంగా చెప్పుకోడానికి నాది అనే దేశంలేదు. అనేక ఇతర జాతి దేశాల్లో ప్రజల వలె వీరూ వలసపోయిన వాళ్ళే.

యూదుల జాతి ఇదమిత్థం అనేందుకవకాశంలేదంటే—అనేక ఇతర జనాంగాల్లోవలె—అంతకుమించిన సంకరముండ వచ్చును.—అందుకే ఆకారాల్లో—వర్చస్సులో, వర్ణాలలో యూదులు రక రకాలుగా అనేక దేశాల్లో వ్యాపించిఉన్నా వారిలో మతం బట్టి అందరం ఒకటే అనుకునే సంకల్పం ఉన్నది. కాని ఆ మతమైనా సాంఘిక నైతిక విషయాలే అనాలి.

యూదు వంశ పురుషుడు అబ్రహాం అని బైబిల్ వివరణ. ఆపేరు మొదటి రెండక్షరాల్లో తండ్రి అనే అర్థం వుంది. అలాగే మతి చెడిన దేశద్రిమ్మరికి పర్యాయపదం అయింది. బైబిల్లో అమోరీయు లనబడిన అనురుల్లో అబ్రహాము సాధారణ నామం. సుమేరియనుల్లో 'అబ్రాం', బాబిలోనియాలో 'అబంరాం' సాధారణ నామం. బైబిల్లో అబ్రహాం అమ్రఫీల్ సమకాలీనుడని వుంది. అమ్రఫీలు హమ్మురబి (క్షమూరని—సూర్యారాధకుల వంశీయులందాం) అయ్యుంటే క్రీ. పూ. 2038 నాటి విషయం.

చిన్న చిన్న రాళ్ళు—స్తంభాలు—విగ్రహాలు పూజించే ప్రజల్లో—ప్రప్రథమంగా ఏకేశ్వరోపాసనకు దారితీసినదీ అబ్రహామే అనుకోవాలి. ఆ సంకల్పంలోనే అబ్రహాం మెసొపొటేమియా అనబడిన ఈరాక్ ప్రాంతాన్నుండి వెళ్ళినవాడో, బహిష్కరింపబడినవాడో ఉర్ (పూరు) పట్టణంనుండి వెళ్ళాడట.



రెక్కలసింహం : ఇజ్రాయల్

అబ్రహాం సేము (Semite) వంశీయుడు. సేము 'మోతి' కొడుకు—భాషా సంబంధంగా సెమిటిక్ ప్రాంతాలు ప్రజలు బాబిలోనియా, అస్సీరియా, అరామియా, కనాను, హిబ్రూ మోయబు, ఫినీషియనులు.

అస్సీరియా (అసురదేశం)తో కాల్డియు అనబడిన వీర్ప జ్యోతిర్వేదులు—బ్రాహ్మణులవంటివారు. క్రీ. పూ. 3000 ప్రాంతాన వీరితో నొక వర్గం కనాన్‌చేరి బెని—ఇజ్రాయెలీ (Beni-Israel) లైనారు. 'బెని' అంటే కొడుకు అనే అర్థం వుంది. కాబట్టి ఇజ్రాయేలు దేశీయులైనారనాలి.

అబ్రహాం నాయకత్వాన కనాన్ చేరిన వారినే పరదేశి లనే అర్థంలో 'ఇబ్రి' అన్నారు. అదే 'హిబ్రూ'గా మారిందని



శిలాయుగం నాటి ఇజ్రాయల్ శిల్పం

కొందరి నమ్మకం. నాటి వలస నేటి ఇజ్రాయేలు—జోర్డాన్ ప్రాంతం. అక్కడే నాడాక్రమించుకున్న చోటనే 13 ఏళ్ళ క్రితం స్వరాజ్యం సంపాదించుకున్నారు హిబ్రూలు. క్రీ. పూ. 15 వ శతాబ్దంలో యూదులు కనానీయుల (కాణ్వుల) వేటాడించారట.

క్రీ. పూ. 1600 ప్రాంతాల్లో హిబ్రూ(Habiru) అనబడిన మందల కాపరి—దేశద్రిమ్మరి—పోడు వ్యవసాయకులకు చిన్న చిన్న రాజ్యాలున్నట్లుంది. క్రీ. పూ. 1000 ప్రాంతాల్లో ఇజ్రాయేలీలైన యూదుల రాజు డేవిడ్, తర్వాత సోలమన్ (యూదురాజు) రాజ్యాలేలినా "బైబిల్"లో చెప్పుకున్నంత గొప్పని కావు అంటారు కొందరు. అలాంటి పోలికలు అనేక రాజ్యాల్లో వున్నాయి.

కనాన్ ప్రాంతాన్నే ఒకటి ఇజ్రాయేలు—మరో రాజ్యం యూదా(Judeh). రెండవ దాని ప్రాంతీయ నామమే యూద్ర (Jeu) అని కొందరి పరిశోధన. ఇజ్రాయేలులనే సమరియా అనీ అన్నారు.

హిబ్రూలనే ఖబిరులన్నారు కూడా. ఈజిప్టు 18 వ రాజ వంశం అంతరించాక హిబ్రూలనే దేశద్రిమ్మర్లు పాల స్తీనా (ఇజ్రాయేలు ప్రాంతం) గెల్చుకున్నట్లుందని పరి శోధకాభిప్రాయం.

వారి రాజ్యం (Judah) యూదా, మతధర్మం యూదా, (Judaism) పారశీకులు (ఈరాన్) యహూదీ లన్నారు—అదే జ్యూ (Jew)గా మారిందని కొందరి నమ్మకం.

ఈ పరిశోధనల్లో—ఆ ప్రాంతంలో కబిరు (Cabiris) అనే ఎనిమిది ఆరాధ్య మూర్తులుండేవంటారు (అష్టశక్తులు) కొందరు.

కనాన్‌నుండియే యూదులు ఈజిప్టు చేరారు. ఈజి ప్టులో యూదుల కుటుంబ నియంత్రణ క్కారణం రాజభయం కావచ్చు—శిశువుల్ని నైలునదిలో (గంగ అష్ట వసువుల్లో కొందర్ని నదిలో పారవేసినట్లు—) పారవేసేవారు.

కర్ణుని జనన చరిత్రలో నదిలో వదలడం—సారగన్ చక్రవర్తి కలాంటి కథేఉంది. ఈజిప్టులో యూదుల్లో నాటికి తెలివైనవాడు సంస్కర్త—జ్ఞాని మోషే (Moses) బాల్యం గూర్చి అలాంటి కథే వుంది.

"బైబిల్" పాత నిబంధనబట్టి యూదుల్లో నాడు సాంఘికంగా కూడా బహు దురాచారాలు ప్రబలిఉన్నట్లుంది.

మోషే ఏకేశ్వరోపాసకుడు—యూదుల ఐక్యతకు పడిన పాట్లు ఎన్నోఉన్నాయి. తాను ఈజిప్టులో గ్రహించిన విజ్ఞానాన్ని మార్చుకుంటూ—సదుద్దేశ్యంతోనే కొన్ని కల్పనలు చేయక తప్పిందికాదు—అవివేకులైపోతూన్న యూదుల నుద్ధరించిన వారిలో చారిత్రికంగా ప్రథముడు మోషే.

కేవలం దేవుడే తనకు చెప్పాడు, అనకుంటే మోషే మాట వినేదెవరు? అలాంటి పోలికలు మన మనుస్మృతికే

కాదు—హమ్మురబి (క్షమారవి)కి సూర్యుడే ఉపదేశించినట్లు పోలిక లున్నాయి. ఇదే కథ దేవుడి పేరిట బ్రదక నేర్చిన ప్రజలు, రాజకీయవాదులు, మరోరూపంలో వాడడం నేడు చూస్తూనే వున్నాం.

తన వారిని నమ్మించడానికి—మోషే పేటిక చేయించా డట—అది తుమ్మకర్రలతో చేసిందంటారు. దీన్నే 'తెబా' అనీ, అర్కా, అర్క్ (Arc)అన్నారు. అప్పటికి అక్కడ నంది నాగపూజలు ప్రబలం. ఈజిప్టులోనూ అంతే—భాగ్యచిహ్నంగా సిరియా(సురలు), ఆచారంగా యూదులు బంగారు దూడ పోతపోసి పూజిస్తే విగ్ర హారాధన (దేవునికి రూపంలేదు) కూడదనే మోషే సాగించిన హింసాకాండ కూడా బైబిల్‌లో వుంది. అయితే మోషే పూజల్లో పాము Brazen Serpent వుందనే వాదం వుంది. ఆ 'తెబా'లో సజీవ సర్పమే వుందనే పరిశోధక సందేహం వుంది.

అనేక దేశాల్లో—మన పురాణేతిహాసాలవలె, బైబిల్ కూడా అనేకులు, అనేక కాలాల్లో వ్రాసి—సేకరించిన గ్రంథం—నేటి ఇజ్రాయేలు కానుకొనియున్న లెబనాన్ నాటి అమర క్షత్రియులదేశం. అక్కడ 'బైబ్లస్' పట్టణ శిథిలాలిటీవల పురావస్తు పరిశోధకుల గ్రంథాల్లో వివరింపబడ్డాయి.

యూదుల్లో డేవిడ్‌వీరుడు తర్వాత ప్రఖ్యాతుడు సోల్మన్ రాజు. ఈయన చాలా తెలివైనవాడట. పూర్వకాలపు వారీ యన పేరిట పెండ్లి పాటల అసభ్య సాహిత్యం వదిలారు.

సోల్మన్ కనేక భార్యలుండేవారట. వారంతా యూదులు కారు. మత పరంగా వివిధ మతాల వారైనట్లే జాతి ప్రాంతీ యతల్లో అంతే నంటే—అవన్నీ రాజకీయ వివాహా లన్నమాట. అస్టార్టీదేవి ఆలయ నిర్మాణం ప్రసిద్ధ విషయం. ఈమె మన లక్ష్మీ, విజయలక్ష్మి, జగదంబ మొదలగు దేవతల వంటిదే.

ఈ సోల్మన్ నాటినుండే ఇండియాకు ఇజ్రాయేలుకు సంబంధా లుండేవి. ఈయన ముఖ్యపట్నం జెరూసలేము (Jerusalem). అదే యెరూషలేము.

కోతి, నెమలి—హిబ్రూ భాషలో కూడా ద్రావిడ భాష పోలిఉండుట—ఇండియా ఇజ్రాయేలు వాణిజ్యసంబంధం—అలానే బాబిలోనియాలో భారతీయులపేట వుండేదనీ—బైబిల్‌లో పేర్కొన్న బట్ట—సిందం—సదినే నూలుబట్ట లాయా దేశాల కెగు మతి ఇండియానుండే అని తెలుస్తుంది—ఇండియా కప్పటి పేరు సింధు. (హిందూగా మారింది)

బాబిలన్‌తో మాత్రం క్రీ. పూ. 4000 నాటికే ఇండి యాకు గాజా ప్రాంతపు సినాయి పర్వతం ఈజిప్టుల మీదుగా వర్తక రహదారి సంబంధం వుండేది.

నీతి కథల్లో తుంగ వంటిది యూదు జాతి — సహ స్రాబ్దాలు దాస్యంలో—నిర్బ్రంగా జీవించినా మొండిగా బ్రదుక గలిగింది.

క్రీ. పూ. 2290—785 వరకూ యూదులను అస్సీరియులు (అసుర) ముప్పు తిప్పల బెట్టడమేకాదు. ఫినీ షియాకు వలసపంపినదీ వారేనట. యూదులు కూడా అనేక కాలాల్లో తిరుగుబాట్లు కుట్రలు జరిపి నట్లుంది.



నశించిన ఇజ్రాయల్ దేవాలయద్వార చిత్రం

క్రీ.పూ. 536 లో సైరస్ (Cyrus) పారశీక విజేత పుణ్యమా అని బాబిలన్‌లో బానిసత్వం వదలి ఎజ్రా నాయకత్వాన మరో వలస ఏర్పడింది.

క్రీ. పూ. 1700 ప్రాంతాన అస్సీరియన్‌ల క్రౌర్యం యూదుల నీజిప్టుకు తరిమింది. యూదుల పవిత్ర పట్టణం అనేకులు అనేకసార్లు—అసురులూను—ధ్వంసం చేశారు.

క్రీ. పూ. 940లో ఈజిప్టు నుండి శశాంకు(Shesonc) ని దండయాత్ర—తర్వాత ఇటు ఇరాక్ అనబడుతున్న ప్రాంతా న్నుండి 'నెబుకోడో నొసరు' దండయాత్ర సాగింది.

మోషే ధర్మసూత్రాలు ఈజిప్టు, అమొరైటు (అసుర) హిత్తి(కాత్య—క్షత్రియు) ల ననుకరణగా నున్నట్లే—ఆచార వ్యవహారాల్లో కూడా ఈజిప్టు, బాబిలన్, అస్సీరియా, గ్రీసు, రోము మొదలగు రాజ్యాల్లో సమకాలికమైన పోలిక లున్నాయి.

క్రైస్తవంలో బౌద్ధ పారలౌకిక మిశ్రమాలున్నవి. రోమక నిరంకుశత్వంపై సామాన్యుల తిరుగుబాటు వంటిదే, యూదుల రాజకీయాలు—క్రైస్తవ మత వ్యాప్తి.

అలానే యూదా మతంలో ఈజిప్టు, సిరియా, లెబనాన్, జోర్డాన్, ఇశ్రాయేలు అనబడుతున్న నేటి రాజ్యాల్లో సహస్రాబ్దాల పూర్వపు తాలిక సంస్కృతి వుంది.



క్రీ. శ. 6-వ శతాబ్దం గోముఖదీపిక

యూదుల్లో నోవానావ, నారంరోజుల్లో సృష్టిప్రళయం, ఆది దంపతులు, స్వర్గం ఉన్నాయి. ఇవన్నీ టైగ్రిస్—యూఫ్రటీస్ నదుల మధ్య దేశాలవే—ఆ పోలికలే మన ఇతిహాస పురాణాల్లోనూ కనిపిస్తాయి.

క్రీ. పూ. 3000 పూర్వపు సేము వంశీయులకు సుమెరియన్‌లకు,—అస్సీరియన్‌లతో (అసురుల) పోరాటాలే పురాణేతిహాసాల్లో దేవాసుర యుద్ధాలుగా వర్ణితమయ్యాయి. ముఖ్యంగా వృత్ర వధ దీనికొక తార్కాణ.

సేము వంశీయులు (Amorite) అమరులు, సిరియా దేశీయులు (సురి—సుర) సుమేరియన్‌ల నోడించి వారిని అసురులుగా వర్ణించారు.

హిబ్రూ, ఫీనిష్, అక్కాదీ, అబిసీని, కాల్డి, అస్సిరీ, బాబిలనీలు సేము వంశీయులేనట.

కనాన్‌నే ఐగుప్తీయులు 'కినశికు' అన్నారు. క్రీ. పూ. 1800 నాటి కది మాగాణి. సాగరతీరభూమి. కనానీయులు ఆదిలో ఆర్యులు—తర్వాత వారిని సేము వంశీయులాక్రమించుకున్నారట.

బైబిలులో కనానీయులు హిత్తీలు అమరులు (Amorites) కలిపి పేర్కొనబడ్డారు.

మన సురలు, క్షత్రియులు, కాత్యులు, పురువంశీయులు మొదలగు వారి రక్తం యూదుల్లోనూ వుందన్నట్లే—యూదీయులకూ ఫినీషీయులకూ రక్త సంబంధం వుందట.

క్రీ. పూ. 1200 ప్రాంతాల్లో కనానీయుల దైవం యహోనా పోలిక సిరియాలో వున్నట్లు పరిశోధకాభిప్రాయం. ఈ 'యహ్వే'యే ఇశ్రాయెలీల మహాదేవుడు.

కనానీయు (కాణ్వ)ల్లో 'ఇయాహ్వే' అంటే దేవుడు. (Lord) Yaven—ఆయనే Baal బల (మన మహాబలేశ్వర) దేవుడు. క్షేత్రపతి—ఉర్వరపతి సృష్టిదైవం. యూదుల్లో లింగధారణవంటి పోలికలుండే వనదమేగాక నిలువురాళ్ళు (స్థాణానాంపతి) పూజలు—రక్త—తైలాభిషేకాలు ఉన్నాయి' యోని లింగారాధనలు ఇండియాకు తెచ్చిన దీ ఫీనిషన్‌లనే పరిశోధకాభిప్రాయం.

అమొరైట్సు ఫిలిస్టీన్‌లు ఒకటేననే సూచనలు బైబిల్‌లో కలవు—ఫిలిస్తీయుల నోడించి ఆక్రమించుకొన్నది ఇశ్రాయలీలే. ఇద్దరి మధ్య పచ్చగడ్డికూడా మండి పోయేదనే కథలున్నాయి.

బహుశా విరోధభావంలో కావచ్చు—యూదులు తమ కాపట్యానికీ—మోసానికీ అమొరుల సంబంధం అనీ, ఆ జిత్తుల మారి ప్రజల్ని ఓడించి వారి గ్రంథాన్ని పర్వతంక్రింద పాతి పెట్టామనీ అంటారు. అమర హిబ్రూలమధ్య దేవాసుర యుద్ధం పోలిక ఉన్నది. మన దేవతలు మోసం—మాయచేసి రాక్షసుల నోడించిన కథలు చూడండి.

ఫిలిస్తీల దేశంకాబట్టే పాలస్తీనా—పాలస్తీనా అంతర్భాగమే ఇశ్రాయేలు—ఒకప్పుడు పాలస్తీనాయే సిరియా అంతర్భాగం. క్రీ. పూ. 1100 ప్రాంతాల్లో ఫిలిస్తీలనే (Philistines) ఐగుప్తీయులు పురసతి, పులిస్తే (Purasati, palesti) లన్నారు. అస్సీరియనులు పలాస్తు, పిలస్తు అంటే గ్రీకులు పలాశు లన్నారు. కాస్పియన్ లనబడిన జాతులకు చేరువ అయిన వీరు మన భార్గవుల దగ్గరి బంధువులే.

ఐగుప్తీయ రాజులు ఒకప్పు డీ పులస్త్యులకు భయపడేవారు. మూడవ రామశేష, రమేశ (Rameses) దండయాత్ర దీనికి తార్కాణ.

# ఇశ్రాయేలు ఇండియాలు పోలికలు

ఫినిషీయుల్లో లిచియ (Lycian) ఋచిక, మ్లెక్షీనియాల పోలిక కలదు. ఈ రెండు పేర్ల వారికీ సంబంధ బాంధవ్యాలుండు టేగాదు—వారు మాతృప్రాధాన్య కుటుంబాల వారై యుండుటేగాదు. ఋచిక భార్గవులనిపించేట్లుంది వీరి సాదృశ్యం. ఫిలిస్తీయుల 5 రాజ్యాలుయూదుల కడేయమ్లెసవి.

మన ఋగ్వైదిక పలాస్తులు పులస్తులే—'బైబిల్'లో 'ఫిలిస్తీం' 'కస్లుహిం' వంశీయులు. 'కఫోత్తోరియం' సోదరుడు, మిస్రజయం పుత్రుడు అంటే తూర్పు దేశస్థుడు.

మన (దీర్ఘతమ—స్) అంగవంగాదుల జననం కథ—వ్యక్తి జనాంగ ప్రాంతీయతలు సూచించే జన్మల గాథ.

'ఫిలిస్తీం' పై వివరణబట్టి క్రీటు (క్రతు), ఈజిప్టు (మిస్రజయం, మిసర్, కామత్) దేశ సంబంధం విస్పష్టం—

మన పలాస్తులు కూడా 'పాంచజన్యాః' 5 గోత్రాలున్నాయి. ఇవి వర్గాలు—శాఖలు.

మన పురాణేతిహాసాలు యదుతుర్వసులు వ్యాప్తిని గూర్చి చెప్పినట్లే బైబిల్ కనానీయులు (యూదులొక్కరేగాదు) పలు ప్రాంతాలకు వ్యాపించారట. కనానీయుల్నే కాణ్వులతో పోల్చిన పరిశోధన కలదు.

ఫీనిషీలకూ, సేమువంశీయులు, హిబ్రూలకూ సంబంధం ఉంది. ఫీనిషీలు వర్తకులు, నావికులు, మన పురాణేతిహాసాల్లో పణులు. వీరే—నాటి వైశ్యులు. వీరే—ఫూనిక్స్, కార్తేజియను లనబడినారు.

"బైబిల్"లో సహస్రాబ్దాల పూర్వం ఆ ప్రాంతాల్లో బాలు పూజలున్నాయి. యూదుల్లో కూడా నర బలి వుండే దని తెలుస్తోంది.

మహ్మదీయుల్లోవలెనే యూదుల్లో పురుషాంగాగ్రచర్మ చ్ఛేదనాకాండవుంది. నరబలికి ప్రత్యామ్నాయం ఈ ఆచారం అని కొందరి భావం. మరికొందరు లైంగికారోగ్య సూత్రాలు చూచారు. మనలో ఉపనయనం వంటి దీ కర్మకాండ. ఆచర్మచ్ఛేదనానంతరం బాలునికి సమాజ కార్యాల్లో పాల్గొనే సభ్యత్వం కల్గే దని వుంది. అయితే ఈ ఆచారం యూదులకుమున్నే ఈజిప్టులో వుందట.

బాబిలోనియన్ ఇస్టారు, ఈజిప్టు ఈశిస్ పోలిన అమ్మవారు ప్రాంతాల్లో జగదంబ, లక్ష్మివంటిది, దుర్గవంటిది, రతివంటి దుండేది. ఆమెనే అస్టొరెత్ అస్టార్టి (Astoreth, Astarte) అన్నారు. యూదులీ పూజల్ని అసహ్యించుకున్నట్లున్నా చాలామంది యూదులు పూజించినట్లుంది. హీబ్రూలు ఈమెను బాషెత్ (Bosheth) అన్నారు. అంటే సిగ్గు—బహుశా ఈవిడ రూపాలు వ్రీడాకటి శూన్యాలై ఉండాలి. అమ్మవారికీ మార్పులు వచ్చి ఉండాలి. ఆ స్టార్టి బాల్ (Baal) (మహాబల లింగమూర్తి పోలిక) భార్య. యూదులు ఇస్టర్‌నే ఎస్తర్ (Esther)అన్నారు. యూదు రాజు సోలమన్ అష్టోరెత్‌కు ఆలయం నిర్మించాడు. యూదుల అల్లుడు ఫీనిషరాజు ఏతుబాలు ఆమె భక్తుల్లో ప్రముఖుడు.

బాల్ దేవుని మరోరూపం మాలెక్(Moloch) వృషభ శీర్షుడు. యూదులీ దేవునికి కూతుర్లనూ, కొడుకులనూ బలి యిచ్చేవారు—దేవుని చేతుల్లో వదిలితే, చేతులు ముడుచుకోగా ఆ వ్యక్తికి ఉదరప్రవేశం. ఈ దేవుని పొట్టలో (విగ్రహం లోహ నిర్మితం,) రవరవలాడే నిప్పు—అంటే యూదుల్లో మనుషుల్ని దేవునికై సజీవ దహనం చేసే దురాచారం వుండేదన్నమాట.

ఈ దేవుడి భార్య అస్టార్టి (Astarti) ఫ్రిజీ (Phrygian=భార్గవ)ల జగదంబ కెబిలీ వంటిదే. ఈమెలో సింహవాహిని మోహిని పోలికలు కనిపిస్తాయి.

# మహానగర శిథిల దేవాలయము

శ్రీ పి. గణపతి శాస్త్రి

ఘన నీరాజనశోభితాననములన్
 గండస్థలీ లోల కాం
చనభూషాప్రతిబింబముల్ మెరయ,
 చంచ న్నూపురాహ్వాన ని
ధ్వనముల్ గర్భగృహాంతరాళమున
 దీపజ్యోతి మేల్కొల్ప, భా
మిను లెవ్వా రెద భక్తి నించి
 తమ సామిం గొల్వరా రక్కటా!

సరసీజాకృతులై దివిం దటతట
 స్వానమ్ము లేపార, గో
పురపారావతముల్ గళార్ద్రగతి
 మార్మ్రోగన్ విరాజిల్ల; వం
బర చుంబి ధ్వజ కింకిణీ
 శ్రుతియుత ప్రాచీన ఋఙ్మంత్ర ఘో
ష రవంబైన చెలంగ దీ శిథిల
 పూజాశూన్య దివ్యస్థలిన్.

ధరణీదేవ సమూహ వాగ్వినుత
 సంధ్యాపాద లాక్షాక్త పు
ష్కరిణీ చంచల రత్నడోలికల
 నంచల్ జంటలై తేల; వ
చ్చర లల్లల్లన వచ్చి మున్గినటులై,
 సందీప్త కర్పూర భా
స్వర కాంతుల్ చెలరేగ ఘూర్ణల
 నుదంచ న్నావిహారమ్ములన్

# మహా నగర శిథిల దేవాలయము

వినుడీమాట! వరాల మూట! ఒకటే,
వేయేల, ఓహో! మహా
జనులారా! కరణీయ మీశ్వర సదా
సంసేవయే! రండు! రం
డని గొంతెత్తి యొకప్డు డధ్వగుల
నాహ్వానించె జేగంట! ఆ
ధ్వని హీన మ్మది మౌనమూర్తి మసృణ
ధ్వాంతమ్మునన్ మున్గెడిన్.

భయ సంక్షోభితులై విశాల నగరీ
పౌరుల్ మృషాదర్శ మృ
ణ్మయ మూర్తుల్ హృదయమ్ములన్
నిలిపి, నానా యాతనా దుర్గమ
మ్మయినన్ మృత్యుపథాన జీర్ణ తరు
పర్ణాకారులై పోదు; రం
తియ కాని, తలపోయ రొక్క
రయినం దేవాలయాస్తిత్వమే!

నీరవమై సమస్తపురి నిద్రిత
మైన నిశీథవేళ, తా
రా రజతాల్ప మీన నికర మ్మలలం
దరళింప, దేవతా
గార మనోహర స్మృతిసుఖమ్మున
నిశ్చలమై, వినీల గం
భీర సరోవ రాబ్జ దళపీఠిక
నిల్చె బలాక ఒక్కటే!

# విఖ్యాత రచయిత ఎర్నెస్ట్ హెమింగ్వే

శ్రీ ఆకుండి గోపాలకృష్ణ

అమెరికన్ రచయితలలో అగ్రశ్రేణికి చెందిన ఎర్నెస్ట్ హెమింగ్‌వే జూలై 2 వ తేదీని తుపాకిని తుడిచి బాగు చేస్తూ ప్రమాదవశాత్తు మరణించాడు. అప్పుడతని వయస్సు 62 ఏండ్లు. నవలారచయితగా హెమింగ్‌వే అఖండమైన ఖ్యాతి సంపాదించాడు. అతని మరణం అమెరికా సాహిత్యానికి, నవలా శాఖకు, చాలా నష్టం కలిగించినది.

హెమింగ్‌వే ఆకస్మికమరణం ప్రపంచంలోని వాఙ్మయ ప్రియుల నందరిని విచారగ్రస్తులను చేసినది. కాని హెమింగ్‌వే జీవితాన్ని యెరుగున్నవారు అతని మరణ రీతిని గురించి అంతగా ఆశ్చర్యపడవలసినదిలేదు. అతడు మరణపుటంచుల దగ్గరకు చాలసార్లు వెళ్ళి వచ్చినవాడే. మొదటి ప్రపంచ యుద్ధంలో అతడు తీవ్రంగా గాయపడ్డాడు. మరొకసారి స్పెయిన్‌లో వృషభయుద్ధంలో ఒక యెద్దు అతన్ని చీల్చివేసినది. ఇంకొకప్పుడు మోటారుకారు ప్రమాదంలో పెద్ద దెబ్బ తిన్నాడు. ఇటీవలనే ఆఫ్రికాలో పర్యటిస్తూ, రెండుసార్లు విమానం పడి పోవడంవలన గాయపడ్డాడు. వీటికన్నిటికీ తట్టుకొంటూ వచ్చిన ధీరమూర్తి హెమింగ్‌వే. మరణానికి భయపడకుండగా నిర్లక్ష్యంగా బ్రతికిన జీవితం హెమింగ్‌వేది.

ఎల్లప్పుడూ ఆపదల మధ్య మెలగుతూ, తీరికైనప్పుడు కథలు, నవలలు వ్రాసి పేరు గడించాడు హెమింగ్‌వే. నవలా రచనలో అతని తీరు అమోఘమైనదని ప్రపంచ విఖ్యాతమైన నోబెల్ బహుమానం కూడా ఇచ్చారు హెమింగ్‌వేకు.

"మానవుని నిర్మూలం చెయ్యవచ్చునుగాని ఓడించడం శక్యంకాదు" అన్నాడు హెమింగ్‌వే ఈ నోబెల్ బహుమానం పొందిన "ది ఓల్డ్‌మాన్ అండ్ ది సీ" అనే నవలలో. జీవితాన్నిగురించి ఈ మహా రచయిత ముఖ్యోద్దేశం ఇదే.

ఎర్నెస్ట్ హెమింగ్‌వే 1899 జూలై 21 వ తేదీని జన్మించాడు. అతని జన్మస్థానం చికాగో పట్టణ పరిసరాలలోఉన్న ఓక్‌పార్క్ అను ఇల్లినాయ్ రాష్ట్ర ప్రదేశం. తండ్రి వైద్యుడు, కాని వేటాడ్డం చేపలు పట్టడం అంటే అతనికి ప్రియంగా వుండేది. తల్లి సంగీత ధోరణిగలమనిషి, దైవభక్తి గలదీను.

చిన్నతనంలో హెమింగ్‌వే అక్కడికి దగ్గరవున్న స్కూళ్ళలో విద్యాభ్యాసం చేశాడు. విద్యార్థి దశలో అతడు చాల తెలివి గలవాడని పేరు పొందాడు. చిన్నతనంలోనే వేట, చేపలు పట్టడం నేర్చుకొన్నాడు. పదహారేళ్ళ వయస్సు లోనే కథలు వ్రాయడం కూడా ప్రారంభించాడు.

పాఠశాలలో వుండగానే ఫుట్‌బాల్ ఆటలో ప్రావీణ్యం, ఈతలో ప్రావీణ్యం సంపాదించాడు. పైగా ముష్టియుద్ధం నేర్చుకున్నాడు. ఈ సందర్భంలో కంటిమీద దెబ్బ తిన్నాడు కూడా. ఆ కారణంగా కొంత దృష్టి లోపం కలిగింది.



ఎర్నెస్ట్ హెమింగ్వే

ఇంట్లో తల్లి దండ్రులు ప్రేమతో పెంచుతున్నప్పటికి, హెమింగ్‌వే హైస్కూలు చదువులో వున్నప్పుడు రెండుసార్లు ఇల్లు విడిచి పారిపోయాడు. దీనినిబట్టి అతనికి చిన్నతనంలో ఇంట్లో జీవనం అంతగా తృప్తిగా లేనిదై వుండిందని అనుకోవలసి వస్తున్నది. 1917 లో స్కూలు చదువు పూర్తికాగానే కాన్‌సాస్ పట్టణానికి వెళ్ళిపోయి ఎప్పటికోగాని తిరిగి యింటికి వెళ్ళలేదు. అక్కడ ఒక వార్తా పత్రికలో విలేకరిగాచేరి జీవనోపాధి కల్పించుకొన్నాడు.

మొదటి ప్రపంచ యుద్ధం జరుగుతున్న రోజులవి. చిన్నప్పటినుంచీ హెమింగ్వేకు ఆటలంటేను వీరోచితములైన పనులంటేను ప్రీతి : కాబట్టి యుద్ధంలో తాను కూడా పాల్గొనవలెనన్న ఉత్సాహంతో రెడ్‌క్రాస్ సంస్థలో గౌరవోద్యోగిగా చేరాడు. ఈ సందర్భంలో అతడు 1918 లో ఇటలీలో ఉండగా మోకాలికి గుండు దెబ్బ తగిలినది. దెబ్బ తగిలిన కాలికి పన్నెండు

# విఖ్యాత రచయిత ఎర్నెస్ట్ హెమింగ్వే

సార్లు శస్త్ర చికిత్స చెయ్యవలసి వచ్చినది. దెబ్బ నయం కాగానే ఇటలీ దేశపు సైన్యంలో పదసైనికుడుగా చేరాడు హెమింగ్‌వే. యుద్ధ విరమణంవరకు ఈ సైన్యంలోనే పని చేశాడు.

యుద్ధానంతరం హెమింగ్‌వే అమెరికాకు మరలివచ్చి కెనడాలో 'టొరొంటొస్టార్' అను పత్రికలో పని చేశాడు. కొన్నాళ్ళతర్వాత ఈ పత్రిక విదేశ విలేఖరిగా పారిస్ పట్టణానికి వెళ్ళాడు.

హెమింగ్వే పారిస్ నగరవాసిగా వున్నప్పుడు అతనికి వాఙ్మయాభిరుచి కలిగినది. ఆరోజులలోనే అతనికి నేర్పుగల వ్రాతకాడని పేరు వచ్చినది. పారిస్‌లో వుండగా హెమింగ్వేకు జెర్ట్రూడ్ స్టీన్ అనే అమెరికన్ రచయిత్రితో పరిచయం కలిగినది. హెమింగ్‌వేయొక్క వచనశైలి ఆమె ప్రాబల్యం వలననే యేర్పడినదని చెప్పవచ్చును. హెమింగ్వే సులభశైలి ఆమె సలహాల ఫలితమే.

మొట్టమొదట్లో హెమింగ్‌వే శైలికాని పుస్తకాలుకాని ఎవ్వరినీ ఆకర్షించలేదు. 1923 లో 'మూడు కథలూ, పది పద్యాలు' అను పేరుతో ఒక గ్రంథం వ్రాశాడు. 1924 లో 'మన కాలంలో' అను ఒక కథల సంపుటి ప్రచురించాడు. 1925 లో 'వసంత కాలపు ప్రవాహాలు' అను నవల వ్రాశాడు. వీటన్నిటిలోను హెమింగ్వే తనయొక్క దృక్పథాన్ని తన యొక్క విపరీత శైలిలో వెలిబుచ్చాడు. అయితే ప్రపంచం అప్పట్లో అతని విశిష్టత గ్రహించలేదు.

సూర్యుడుకూడా ఉదయిస్తాడు'(The sun also rises) అను నవలను హెమింగ్‌వే 1926 లో వ్రాశాడు. అప్పటికి హెమింగ్‌వే ప్రతిభ గుర్తించబడినది. అతని నిశితమైన వ్యావహారిక భాషాశైలిని విమర్శకులు మెచ్చుకొన్నారు. కొందరు రచయితలు అతన్ని అనుకరించకుండా మొదలు పెట్టారు.

1929 లో 'ఆయుధాలకు వీడ్కోలు' (A farewell to Arms) అను నవల వ్రాశాడు హెమింగ్‌వే. ఈ నవలవలన అతని ఖ్యాతి ఇంకా పెరిగినది. కొందరు విమర్శకుల దృష్టిలో ఈ నవల యుద్ధానుభవాలను చిత్రించిన నవలలలో ఉత్కృష్టమైనది.

తర్వాత పదేండ్లపాటు హెమింగ్‌వే యెన్నో చిన్న కథలు వ్రాశాడు. ఆ కాలపు వాఙ్మయంమీద అతని ప్రాబల్యం యెక్కువగా వుండేది. వీటి మధ్యన 'మధ్యాహ్న మరణం' (Death in the Afternoon) 'ఆఫ్రికా పచ్చని పర్వతాలు' (Green Hills of Africa) అను రెండు పుస్తకాలు కూడా వ్రాశాడు. మొదటిది స్పెయిన్ దేశంలో యెద్దులతో పోరాటం విషయంలో హెమింగ్‌వే అనుభవాలమీద ఆధారపడినది. రెండవది హెమింగ్‌వే ఆఫ్రికా అడవులలో క్రూర జంతువులను వేటాడిన అనుభవాలమీద ఆధారపడినది. రెండింటిలోను యూరపులోని నాగరికతాప్రపంచంకన్న మృగప్రాయమైన అనాగరికపురీతులే మేలన్న హెమింగ్వే ఉద్దేశం నిరూపించబడుతుంది.

1940 లో హెమింగ్వే 'గంటలు మ్రోగుతున్నవి' (For whom the bell tolls) అను పేరుతో ఒక నవలారత్నాన్ని ప్రచురించగలిగినాడు. ఈ నవలయొక్క ఇతివృత్తం స్పెయిన్ దేశంలోని అంతర్యుద్ధంలో రచయితయొక్క అనుభవాలమీద ఆధారపడినది. ప్రపంచంలో ఒక చోటి కింకొక చోటు సంబంధ బంధురమైనదనీ, ఒకచోట స్వాతంత్ర్య నాశనం అయితే అన్ని చోట్లా స్వతంత్రం నశించినట్లే అనీ, ఈ నవలలోని ప్రధానాంశం.

రెండవ ప్రపంచ సంగ్రామంలో హెమింగ్‌వే పత్రికా విలేకరిగా పని చేశాడు. అయితే పత్రికా విలేకరిగా పని చేశాడనడంకంటె యుద్ధసైనికుడుగా పని చేశాడనడమే నిజానికి దగ్గర. పారిస్‌లో తాను వున్న హోటలు ప్రాంతానికి శత్రువర్గ సైన్యాలు రాగానే వారితో పోరాడి హోటలు శత్రువుల వశం కానివ్వలేదు. అతని ధైర్యశౌర్యాలను సైనిక వృత్తిలో వున్నవాళ్ళు కూడా మెచ్చుకొన్నారు.

1952 లో తిరిగి హెమింగ్‌వే నవలా రచనకు పూనుకొని 'ముదుసలి, సముద్రము' (The oldman and the sea) అను నవల ప్రపంచార్పణ చేశాడు. ఒక ముదుసలి బెస్తవాడు కనబరచే అసాధారణమైన ధైర్య సాహసాలను ఈ నవల చిత్రిస్తుంది. ముదుసలి బెస్త తాను పట్టిన మహామీనాన్ని కోలుపోవడం దీని ఇతివృత్తం. కోలుపోవడం సహజమే. కాని కోలుపోతున్నప్పుడు ఎలాగు ప్రవర్తించామన్నది ప్రధానాంశం, అంటాడు హెమింగ్‌వే.

ఈ పుస్తకానికి 1953 లో పులిట్జర్ బహుమానం వచ్చినది. 1954 లో ఈ పుస్తకం వలననే హెమింగ్‌వేకు నోబెల్ బహుమానం కూడ వచ్చినది. బహూకరణకర్తలు ఈ నవలలో హెమింగ్వే శైలినే ఎక్కువగా మెచ్చుకొన్నారు.

హెమింగ్‌వే జీవితంలోని ఆఖరు ఎనిమిది సంవత్సరాలలో ఎన్నో కథలు, వ్యాసాలు వ్రాశాడు. 1959 లో స్పెయిన్ దేశం చూచి, అక్కడ జరుగుతున్న యెద్దుల యుద్ధంలో పాల్గొంటున్న యోధులను గురించి వ్రాయడానికై ఆదేశం వెళ్ళాడు. ఆ విషయమై 'వేసవి ప్రమాదం' (The danger of summer) అను పుస్తకం ఇటీవలే పూర్తి చేశాడు. ఆ పుస్తకం ఈ సంవత్సరం ప్రచురణ కాబోతున్నది. ఇందులోని కథా నాయకుడు కూడా ధైర్యంగా పోరాడుతూ సృష్టిలోని మహా శక్తులకు లొంగిపోతాడు.

హెమింగ్‌వే రచనలను చదివిన మీదట అతని సొంత చరిత్రకూ, అతని పుస్తకాలలోని నాయకుల జీవితానికి చాలా సామరస్యం వున్నట్లు స్పష్టపడుతుంది. హెమింగ్‌వే కథలలోని నాయకులు వేర్వేరు పేర్లు కలిగి వున్నారు. కాని నిజానికి అందరు హెమింగ్‌వేకి ప్రతిబింబాలే. హెమింగ్‌వే తన వుద్దేశాలను తన ఆశయాలను తన నైరాశ్యాన్ని తన ఆవేశాన్ని తన కథలలోని నాయకులలో చిత్రించాడు.

అయితే హెమింగ్‌వే రచనలను ప్రపంచం ఇంకా పూర్తిగా అర్థం చేసుకోలేదనే చెప్పాలి. హెమింగ్‌వే రచనలన్నీ స్థూల దృష్టికి వేర్వేరుగాను, ఇతివృత్తాలు తేడాగాను కనిపిస్తున్నవే గాని, సూక్ష్మంగా ఆలోచిస్తే వాటన్నిటిలోనూ ఒకటే ఆశ

యం వ్యక్తం అవుతుంది. ఈ విషయాన్ని కొంచెం పరిశీలిద్దాం.

అసలు హెమింగ్‌వే వ్రాసిన కథలు, నవలలు అన్నీ కూడా ఒక దానివెంబడి ఒకటి చదువవలసినవి. ముందర కథ అవగాహన చేసుకొనడానికి వెనుకటి కథ చాలవరకు సహాయ పడుతుంది. అందుచేత హెమింగ్‌వే నవలలను సరిగా అర్థం చేసుకోవాలంటే అతని మొదటి కథ మొదట చదవాలి.

టూకీగా చెప్పాలంటే అతడు వ్రాసిన మొదటి కథ. ఇది : నిక్ అనే పిల్లవాని తండ్రి వైద్యవృత్తిలో వుంటాడు. ఒక రోజున ఒక అమెరికన్ నల్లజాతి స్త్రీ ప్రసవవేదన తాళ లేకుంటే డాక్టరుదగ్గరవున్న కూరలు తరిగే కత్తితో మత్తుమందు ఇవ్వకుండగానే శస్త్ర చికిత్సచేసి శిశువును బయటకు తీస్తాడు. ఆ స్త్రీయొక్క భర్త జబ్బుతోవుండి భార్య వేసిన అరుపులు విని బెదిరిపోతాడు. వైద్యునికి సహాయంగా అతని పిల్లవాడు నిక్ నీళ్ళ పళ్లెం పట్టుకుని నించునివుంటాడు అతను ఆపరేషన్ చేస్తున్నప్పుడు. శిశువును బయటకు తీసేవరకు ముగ్గురు ఆడవాళ్ళు ఒక మగవాడు ఆ స్త్రీని అదిమి పట్టుకొని వుంటారు. ఆపరేషన్ పూర్తి అయి, శిశువును బయటకు తీసిన తర్వాత వైద్యుడు భర్త వున్న గదిలోనికివెళ్ళిచూస్తాడు. ఘోరం! ఆ భర్త క్షవరపు కత్తితో గొంతు చాలమటుకు కోసివేసికొని వున్న దృశ్యం కనిపిస్తుంది!

ఇది హెమింగ్‌వే వ్రాసిన మొట్ట మొదటి కథ. స్థూలంగా చూస్తే కథ చాలా ఘోరంగా కనిపిస్తుంది. కాని హెమింగ్‌వే చెప్పదలచుకొన్న విషయంవేరు. ఘోరమైన పరిస్థితులను పరికించిన ఆ పిల్లవాని మనస్సు ఎలాగు పరిణతి చెందినదో చిత్రించడం అతను తలచుకొన్నది. ఆ క్షణంలో ఆ పిల్లవాడు ఏమీ మార్పు చెందనప్పటికీ, తర్వాత వాడు భయస్థుడుగాను, మానసిక క్షోభను అనుభవించినవాడుగాను తయారవుతాడు. అలాగు ఎందుకైనాడో చెప్పడమే హెమింగ్‌వే ఉద్దేశం.

తర్వాతి కథలలో కూడ నిక్ చరిత్ర వున్నది. ఆ సంపుటిలోని ఆఖరు కథలో నిక్ మొదటి ప్రపంచ యుద్ధంలో చేరినట్లు, అందులో గాయపడ్డట్లు, శత్రువులతో రాజీ పడ్డట్టు వ్రాశాడు. ఇది అంతా హెమింగ్‌వే స్వీయానుభవం మీద ఆధారపడినదనే చెప్పవచ్చును.

హెమింగ్‌వే తర్వాత వ్రాసిన కథలన్నిటిలోను, నవలలలోను కూడ ప్రధాన పురుషుడు నిక్‌లాగు శారీరకంగాను మానసికంగాను గాయపడినవాడుగా వుంటాడు. రెండవ విషయం, హెమింగ్‌వే కథానాయకులందరూ నిక్‌లాగు తమ తమ శత్రువులతో రాజీ చేసికొని దేశభక్తిలేని వాళ్ళుగానే తయారవుతారు. సాధారణప్రపంచంలో మానవుని ఉదాత్త ఉద్దేశాలకు కలిగే ఆశాభంగం, తత్కారణంగా అతనికి కలిగే నైరాశ్యం ఈ నవలలలో హెమింగ్‌వే చిత్రించాడు.

ఈ పుస్తకాలలో అన్నిటిలోను కథా నాయకుల పేర్లు వేర్వేరుగా వున్నప్పటికీ, వాళ్ళ పరిస్థితులు వాళ్ళ శీలం అంతా నిక్‌యొక్క చరిత్రకు ప్రతిబింబాలే. అంతేకాదు. ఈ కథలలో నిక్ అరోజు కారోజు పెద్దవాడవుతూ వుంటాడు. అంటే నిక్‌యొక్క జీవితంలో వేర్వేరు ఘట్టాలను వేర్వేరు పేర్లతో హెమింగ్‌వే ప్రదర్శించాడన్నమాట. ఈ విషయం తెలిసికొనక పోవడంచేత హెమింగ్‌వే నవలలు కొన్ని అవగాహన చేసికొనడం కష్టమనిపిస్తుంది. కాని యీ విషయం మనసులో వుంచుకొంటే అతని నవలలూ, కథలూ అన్నీ సుస్పష్టం అవుతవి.

ఇటువంటి గాయపడిన కథానాయకుడు చేయవలసిన పని యేమిటి? క్రౌర్యము, అనౌచిత్యము, బాధ మొదలగు వానితో నిండియున్న ప్రస్తుత ప్రపంచంలో హెమింగ్‌వే కథానాయకునివంటివాళ్ళు తట్టుకొనడం ఎలాగు? ఈ ప్రశ్నకు కొంతవరకు ప్రతి కథలోను కూడ హెమింగ్‌వే సమాధానం ఇచ్చే ఉన్నాడు. కాని అతను వ్రాసిన ఆఖరు నవల 'ముదుసలి, సముద్రము' The old man and the sea లో ముదుసలి ద్వారా ఈ సమస్యకు పరిష్కారం చూపించాడు. ఈ నవలలోని ముదుసలి తానుపట్టిన మహామీనాన్ని గ్రహిస్తుంటే అవరోధం కలిగి దాన్నినష్టపోతాడు. కాని చాల శౌర్య సాహసాలు గౌరవప్రతిపత్తిచూపి మరీ వోటమి పొందుతాడు. ప్రపంచంలో ఓటమి పొందవలసిన పరిస్థితులలో మానవుని కర్తవ్యం కూడా అంతేనని ద్యోతన. ఈ పరిస్థితులతో అతని వోటమి విజయంతో సమానం.

హెమింగ్‌వే వ్రాసిన కథలు, నవలలు అన్నీ ప్రచురణ కాలేదని ప్రతీతి. ప్రస్తుతం అచ్చుకు సిద్ధంగావున్న 'వేసవి ప్రమాదం' The Danger of summer అనే పుస్తకం మాత్రమేకాక, ఇంకా యెన్నో కథలు ప్రచురణ కాలేదు. కారణం : హెమింగ్‌వే వ్రాసిన కథలకుగల ప్రజాదరణవలన వేలకొలది ప్రతులు అమ్ముడుపోతే ప్రభుత్వానికి పన్నుగా చాల డబ్బు కట్టవలసివస్తుంది. అవి హెమింగ్‌వే జీవితానంతరం ప్రచురిస్తే అతని భార్యకు, ముగ్గురు కొడుకులకు, మనుమలకూ కూడ లాభసాటిగా వుంటుందను వుద్దేశంతో కొన్నింటిని ప్రచురించలేదు.

హెమింగ్‌వే తన జీవితంలోని విషయాలనే తన కథలలో చిత్రించి తన పుస్తకాలకి జీవం కల్పించాడు. జీవితంలో తాను అనుభవించిన కష్టనిష్ఠురాలను తన కథా నాయకులకు అంటగట్టి చూపించాడు.

హెమింగ్‌వే చిత్రించిన ప్రపంచం కష్టబంధురమైనది. అందులో సహజంగా పెరిగి పెద్దవడంలేదు. హటాత్సంభవాలు, దుర్భర కష్టాలు, జీర్ణమై కృశించిపోవడం, చివరకు సంపూర్ణంగా ఆహుతి అయిపోవడం—ఇవి అతని ప్రపంచంలో జరిగేవి. అటువంటి ప్రపంచం సహించదగినది కాదు. అది మన మామూలు ప్రపంచం కానట్టు తోస్తుంది మొట్ట మొదట. కాని జీవితాన్ని తిరుగ విమర్శించి చూచుకొంటే మన ప్రపంచంలోనే యీ కష్టనిష్ఠురాలన్నీ వున్నట్లు గ్రహించగల్గుతాం. గడచిన రెండు ప్రపంచ సంగ్రామాలు, ఇప్పుడు నడుస్తున్న వేర్వేరు చిన్న చిన్న యుద్ధాలు దేనికి దారి తీస్తున్నవో అవగాహన అవుతుంది. ముందు రావలయునది వెనుక వెళ్ళినవాటి నన్నిటిని మించగలదని స్పష్టపడుతుంది. హెమింగ్‌వే రచనలలోని విశిష్టత ఇదే.

# మరో సూర్యుడు

శ్రీ దాశరథి

తూర్పు కొండ శిఖరం పై కెక్కి
నేర్పుతో భూలోకంలోని చీకట్లను
తుడిచేసే సూర్యుడవు కావు నీవు—
మానవ మనస్సులలోని తమస్సులను
మటుమాయంచేసే మరోసూర్యుడవు.
కోట్లకోట్ల మానవ పద్మాలు
ఆనంద సద్మాలు
నీ ఉదయంకోసం అలనాడు ఎదురు చూచాయి
రవికవీ!
కవితా సురగవీ!
తూర్పున నీవుదయించిన అలనాడు
ఊర్పులతో ఉక్కిరిబిక్కిరి అవుతున్న ధరిత్రి
నా సవిత్రి
ఆనంద పండింది
ఆవేదన విడింది క్రమంగా.

భూమి బొంగరం గాలి ఉంగరం ధరించి
గిరగిరా తిరిగి తిరిగి
చీకటి కూకటిలోకి ప్రవేశించి
వెలుతురు వాకిటిలోకి ప్రవేశించి
తనచుట్టూ తాను తిరిగి
సూరీని చుట్టూ మళ్లీ మళ్లీ తిరిగి
అలసి సొలసి వున్నప్పుడు
అలసట బాపే సూరీడా!
అమరాలయానికీ అవనికీ
అచంచల నిశ్రేణిక నిర్మించిన రేడా!
నేస్తకాడా!
బానిసదేశంలో పుట్టిన మానిసీ!
కుహనా స్వతంత్ర దేశాల దుస్తంత్రాలకు
నొచ్చుకున్న మనీషీ!
తమ మట్టుకు తామే స్వతంత్రులు
పరులుమాత్రం పరతంత్రులు
తమకే కావాలి అన్ని హక్కులు
పాలిత దేశాల కన్నీ చిక్కులు.
ఇదేనా స్వాతంత్ర్య మంత్ర రహస్యం?
నిజాల బుజాలు పట్టుకుని గజం గజం
అసత్యాల ఝంఝూ వాత్యాహతపథంలో
నడచిన ఋజువర్తీ!
కవిలోక చక్రవర్తీ!
ప్రతిగుడిలో దయ్యాన్ని ప్రతిష్ఠించిన
ఈలోకంలో
ప్రతి మనిషిలో దైవాన్ని దర్శించిన
పవిత్రుడవు.
గుడిసీడలో పాపాల బడి నడిపించి
ముడికట్టుకున్న జడమతులకు
భగవంతుని అనంతానంత విశ్వరూపం
సాక్షాత్కరిస్తుందా?
గుడిగోపురాలకు దూరంగా ఎక్కడో
పొలంలో హలంపట్టి నడిచే
నిరుపేదవాని బరువైన గుండెప్రక్కగా
పరాత్పరుని సందర్శించిన
పరమోదార వేదాంతీ!
నీవుకోరిందే శాంతి.
శాంతి జండా క్రింద
అశాంతి అగ్నికుండాలను దాచి
అబద్ధాలాడే యుద్ధోన్మాదుల
దొంగవాదాలే వేదా లనుకునే
అమాయిక జనగణానికి
నిజంబోధించిన మేధావీ!
నీవే ప్రపంచానికి భావి!

భాషాద్వేషా పరిష్వంగానికి అతీతంగా
కవితా నవతా ప్రదీప్తిని వ్యాపింపజేసిన
అనశ్వర విశ్వకవీ!
నవ్యరవీ!
దేశానికి దేశానికి మధ్యగా
సరిహద్దుల దొంగగీట్లు దేశపటాల్లో గీసుకుని
ఒకరి నొకరు కొల్లగొట్టకోవాలని
ఒకేరీతిని కుట్రలు పన్నే తృష్ణాళువుల
నరనరాల్లోని ద్వేషాగ్నిని రోషాగ్నిని
మ్రింగివేయగల దయా పయోధర
కల్పనా రవీ!
నవచ్ఛవీ!
అఖండ మహీమండలం అంతా ఒక్కటనీ,
ఆ మండలంలో ఉండే నిండు మానిసి ఒక్కడనీ,
అతని కరచరణాలను నరికేసే యుద్ధం
ఆత్మహత్యాసదృశమనీ బోధించిన సత్యవాదీ!
త్రికాలవేదీ!
నీ నయనాల లోతులలోని శీతలచ్ఛవులు
మారణహోమాగ్ని దగ్ధలోకానికి
వెన్నెల స్నానాలను చేయిస్తాయి.
నీ ఫాలఫలక సంప్రసక్త శాంతి మరీచికలు
అశాంతి తమోభూతాల ఘాతాలకు
భీతువడినలోకానికి దారి చూపిస్తాయి.
చావు బ్రతుకుల చదరంగపు ఆటలో
ఓటమి నెరుగని విజయీ!
చావుబ్రతుకుల చాకిరేవులనంటని
చైతన్య మహాధునివి నీవు!
మహాశివునివలె ఆకాశకేశుడవై
శీతల సుధాద్రవసంపూరిత
బాలచంద్రరేఖా శిఖనుండి
కావ్య గంగా తరంగిణిని
నింగినుండి నేలకు దింపిన,
భూదివాలను ఒక్కటిగా కలిపిన,
చీకటి కాగడాలను మలిపిన,
వెలుతురు విద్యుద్దీపాలను నిలిపిన,
పరాత్పరా!
నీకు లేదురా జర.
మనిషిని మషి చేసే రణ విషాన్ని దిగమ్రింగి
మనిషిని మనీషినిచేసే మధురామృతం నీకవిత.
కుల మతాల, వర్గాల, దేశాల, భాషల,
వేషాల, భేషజాల, రోషాల, మోసాల
దోసాలను తుడిచేసి
వసుధైకత్వ మంత్రరహస్యం
బోధించగలది నీకవిత.

వసంతర్తు కవోష్ణరసాల కుట్మలాలలో
వసురాజు సువర్ణమకుటాలలో లేని ఘనతను
దర్శించడం నేర్పుతుంది నీ కవిత.
నీలాకాశ నివేశనంలో అందాలరాశిగా
కూర్చున్న శశిబాలికలో—
కోట్లకోట్ల ధనరాసుల్లో లేని విలువను
కనిపెట్టగల స్ఫూర్తి నిస్తుంది నీ కవిత.
నీ చుట్టూ ప్రాణికోటి సర్వదా
ప్రదక్షిణం చేస్తుంది శాంతి కోరి,
సూరీని చుట్టు గ్రహతారాగోళాలవలె.
నీవు కేంద్రానివి సర్వసాధుశక్తులకు,
మానవతా భక్తులకు,
శాంతి కళా రక్తులకు.

నీ అంజలిలో దేవునితోపాటు
ప్రతిజీవుడూ చోటుచేసుకొన్నాడు.
అఖిల ప్రాణికోటికి అంజలిలో ఆశ్రయమిచ్చిన
అమృత కవీ!
నూతన రవీ!
శాంతి చ్ఛవీ!
జోహార్, జోహార్, జోహార్!

# కాళిదాస రవీంద్రులు

## శ్రీ బొడ్డుపల్లి పురుషోత్తం

ఉత్తమశ్రేణికి చెందిన కవిత్వంలో ఉత్తమ విమర్శనం కూడా ఉంటుంది. ఉత్తమ విమర్శనంలో ఉత్తమ కవిత కూడా గోచరిస్తుంది. అంటే కవి కూడా ఒక విధమైన విమర్శకుడే! విమర్శకుడు కూడా ఒక విధమైన కవియే.

కావ్య విమర్శనం ఒక కళగా నేడు గౌరవం పొందుతున్నది. కవుల కులగోత్రాదులు వివరించడం, కథా వస్తువు నుద్ఘాటించడం, కవిత్వంలోని సొగసులు కొన్ని చూపడం, జాతీయాలు క్రోడీకరించడం, నుడికారాలు పొందుపఱచడం, కవిజీవితానికి, కావ్య రచనకు సంబంధాలేమైనా ఉంటే కూర్చడం సామాన్యంగా కావ్య విమర్శనంగా చెలామణి అవుతున్నది. సామాన్య విమర్శకుల కిదే పరమావధి! సామాన్య కవులను గూర్చి కూడా ఇంతకన్న చెప్పేదేమీ ఉండదు. ఇలా బండ్లకెత్తబడిన విమర్శలే వాఙ్మయ చరిత్ర నేర్పఱుస్తున్నాయి. వీని ప్రయోజనం పరిమితం. కాని వ్యాస వాల్మీకుల మహేతిహాసాల్ని, కవికుల గురువైన కాళిదాసుని కావ్య సప్తకాన్ని విమర్శించాలన్నా, అందలి భావ నిక్షేపాలను వెలికి తీయాలన్నా, అందులోని క్లిష్ట గ్రంథుల్ని విప్పాలన్నా భావోన్మీలనం జేయాలన్నా పై విమర్శకుల కందఱికి సాధ్యం కాదు. అందుకెన్నో అర్హతలు కావాలి. అందుకు కేవలం డిగ్రీలు చాలవు. దాని కొకవిధమైన తపస్సు కావాలి. ఎంతో సంస్కారబలం ఉండాలి. జాతీయ సంస్కృతి వికాసభరితమైన హృదయం కావాలి. ఋషులు, ఋషితుల్యులైన ఆ మహాకవుల అగాధమైన ఆత్మీయతా ముద్ర వీరి మనఃఫలకాలమీద హత్తుకోవాలి. ఇట్టి మహాకవుల్ని, వీరి కావ్య సృష్టిని అన్య దేశ మహాకవులతోను, వారి కావ్యాలతోను తులనాత్మకంగా పరామర్శించాలంటే ఆ యా దేశ వాఙ్మయాల్ని కూలంకషంగా పరిశీలించి ఉండాలి. ఆ యా జాతుల చరిత్ర సంస్కృతి పూర్తిగా అవగాహనం కావాలి. దురభిమానాలు దురావేశాలు దూరం చేసుకోవాలి. విద్వేషం పొడగట్టకూడదు. ఆ శ్రేణికి జెందిన కవి కూడా అయితే మరీ మంచిది. ఇట్టి ఋషితుల్యులైన విమర్శకులు ఎందరుంటారు ప్రపంచమంతా గాలించినా? ఆధునిక కాలంలో పై యోగ్యతలన్నీ మూర్తీభవించిన మహనీయుడు శ్రీ గురుదేవుడు రవీంద్రులు కావటం మన అదృష్టం.

కవికుల గురువైన కాళిదాసునిగూర్చి రవీంద్రుడికి తొలి సారిగా పరిచయం హిమాలయ పర్వతోన్నత సానువుల్లో జరిగింది. సర్వ విజ్ఞాన ఖనియైన మహర్షి దేవేంద్రనాథుడే రవికి గురుత్వం వహించి మేఘ సందేశాన్ని అధ్యయనం చేయించాడు. ఆ కవి సార్వభౌముని మంజుల మందాక్రాంతవృత్తమీ బాల కవి శేఖరుని హృదయాబ్ధి నానందతరంగితం కావించింది. ఆ లఘు కావ్యంలో కాళిదాసుని దివ్యలేఖిని తీర్చిదిద్దిన భారతీయ గ్రామ జీవిత దృశ్యాలు, రవీంద్రుని శుభ్ర హృదయఫలకంమీద హత్తుకొని, ఆతని మహత్తర భావనా శక్తిని ప్రోది చేశాయి. బాల్యంలో కాళిదాసుని కమనీయ కవితపై ఏర్పడ్డ ఆ అభిమానం రవీంద్రునిలో కాలక్రమాన అతిశయించి, పరాకాష్ఠనంది, మహోన్నత విశ్వకవి స్థానం అధిష్ఠించిన ఆతని హృదయాన్ని సైతం అధిష్ఠించి, పునఃపఠనానికి ప్రేరేచింది. ఆయన సారస్వత తపస్సులో అధికభాగం ఈ కవీశ్వరుని కావ్య సప్తకంమీదికే ప్రసరించింది. అతనిపై భక్తి, ప్రపత్తులు క్రమంగా ప్రఫుల్లమైనాయి. ప్రాజ్యకవితా మహా సామ్రాజ్య సింహాసనంమీద ఆ కవి సార్వభౌముణ్ణి ప్రతిష్ఠించి తానో వందిమాగధుడుగా వినయంతో కైవారం కావించాడు. ఆ కైవారం కృతకమైంది కాదు. ఆతని పరిపూర్ణహృదయంనుండి వెల్లుబికిన సజీవ కవితా స్రవంతి. కాళిదాసుని ఆత్మీయతను చిత్రించే స్వతంత్ర కావ్యం!

వాల్మీకివ్యాసులపై అధికమైన భక్తి ప్రపత్తులుండవచ్చుగానీ, కాళిదాసునిమీద కూడా ఇంత గౌరవం ఎందు కుండాలనే సందేహం కల్గవచ్చు. వాల్మీకి వ్యాసులు వ్యక్తి ప్రధానులు కారు. "రామాయణ మహాభారతాలు జాహ్నవీ హిమాచలాలవలె భారతజాతికి చెందినవి. వాల్మీకి వ్యాసులు ఉపలక్షక మాత్రులనిపిస్తారు." రచయితల నామాలతో సంబంధం లేకుండానే ఈ మహేతిహాసాలు ఆసేతు హిమాచలంగా భారతీయుల రక్తనాళాల్లో లీనమైనాయి. కాని కాళిదా సిట్టివాడుకాడు. ఈతని కావ్య సృష్టిలో ఈతని మధుర హస్త స్పర్శ మనల్ని పులకింపజేస్తుంది. మానవుని కల్పనా సామర్థ్యోన్నీతడు గౌరీ శిఖరం ఎక్కించాడు. అతని హస్తతలిమందే సాహిత్యం ఒక కళగా శక్తిసంపుల్లమై రక్తిగాంచింది. ఆతని కళా గోపనంలోనుండి ఆతని ఆత్మీయత తొంగి చూస్తూ ఉంటుంది. అందుకే ఈ వీరా రాధనం! అందఱు మహా కవులకు, కాళిదాసుకుగల ఒక గొప్ప

తారతమ్యాన్ని విశ్వకవి ఒకటి రెండు పంక్తుల్లో ఇలా నిరూపించారు.—"భీకర గంభీరమైన లోకాంబునిధిని త్రచ్చి, అందువలన ఏది పుట్టినా ప్రపంచానికి నీవు పంచిపెట్టలేదు. హాలాహలాన్ని నీవే మ్రింగి అమృతాన్ని మాత్రమే మాకు పంచిపెట్టావు. అందుచేతనే నీ కవిత మాకు నిత్యం ఉపాదేయమవుతున్నది."

విశ్వకవి నెక్కువగా ఆకర్షించిన కాళిదాసుని ఘనత ఇంకొకటి— కాళిదా సెప్పుడు తన కాల పరిస్థితులకు ప్రభావానికి లొంగక పోవటం! ఆశ్రమ ప్రభావ యుగం నిష్క్రమించింది. నాగరక యుగం తలయెత్తింది. పౌర మహా సభామధ్యంలో భారతీయుడు తన స్థానాన్ని ఏర్పాటు చేసుకొన్నాడు. చైనీయులు, హూణులు, సిథియన్లు, పర్షియన్లు, గ్రీకులు, రోమన్లు భారతీయులతో చెలిమిచేయ నారంభించారు. భారతదేశం అష్టైశ్వర్యసమృద్ధితో తులతూగుతుంది. దేశాభిమానోద్రిక్తహృదయుడైన కాళిదాస కవి సార్వభౌముడు, ఉజ్జ్వలమైన ఉజ్జయినీ నగరంలో విక్రమాదిత్య సార్వభౌముని సింహాసనం ప్రక్కనే ఉన్నతాసన మధిష్ఠించినా, అతడు కావించిన కావ్యగానం ఆశ్రమ జీవితాశయ మహిమను గూర్చియే. ఇది సంప్రదాయానికి దాసోహ మనటం కాదు. భారతజాతీయజీవనంలోని స్వాభావిక ధర్మాన్ని పరిపోషించటం. జాతీయతను సంరక్షించటం. సంప్రదాయాన్ని నశింపనీయకుండ పునరుజ్జీవింపచేయడం ! ఆనాడు కాళిదాసు, ఈనాడు విశ్వకవి భారత జాతీయతలోని ఈ పరమార్థాన్ని గుర్తించి కళాసృష్టి కావించారు కాబట్టే భారతీయ సంస్కృతి అవిచ్ఛిన్నంగా నిలిచి ఉంది.

* * *

విశ్వకవి కాళిదాసుని శాకున్తలాన్ని గూర్చి ఒక ప్రత్యేక విమర్శ వ్యాసాన్ని వ్రాశాడు. ఈ వ్యాసాన్ని ఉపక్రమించేటప్పుడు జర్మన్ కవీశ్వరుడైన గెథే శాకున్తలాన్ని పఠించి ఆనందోన్మత్తుడై కావించిన ప్రశంసా పద్యాన్ని ఉద్ధరిస్తాడు. గెథే కావించింది కేవలం కవితా ప్రశంస కాదనీ, అందులో ఎంతో విమర్శ సూక్ష్మ రూపంలో ఉందని మొత్తం రూపక సారాన్నంతటినీ ఈ పద్యంలో అతడు పొందుపరచాడని ఊతగా ప్రారంభిస్తూనే అట్లా అట్లా ఎన్నో కాళిదాసుని కళా రహస్యాలు చెప్పినట్లే చెప్తాడు. ప్రథమాంకంలోని భౌతిక సౌందర్యం, అంతిమాంకంలోని దివ్యాశ్రమ నైష్ఠిక సౌందర్యం! మొదట కామోద్రిక్తత, యౌవనమత్తత, తత్ఫలానుభవం, తరువాత సత్య ప్రేమానుభూతి ఈ రూపకంలో ఎలా అనుసంధానితమైనాయో వివరిస్తాడు విశ్వకవి. ఇట్టి విమర్శలు చదివినపుడు సహృదయులలో ఒక నూత్న వికాసం కల్గుతుంది. ఆ వికాసానుభవంతో మరల ఆ రూపకాన్ని పఠిస్తూంటే ఎన్నో గమనించని రహస్యాలు, పరిశీలించలేని పరమ సత్యాలు ప్రస్ఫుటమై కాళిదాసుని మనకు మరింత సన్నిహితుణ్ణి చేస్తాయి. "ఒక ప్రత్యేక భావోద్రేకాన్ని ప్రేరేచి పరిపోషించటానికై ఈ రూపకం ఉద్దేశింపబడలేదు. ఒక ప్రత్యేక పాత్ర క్రమోన్మీలనాన్ని ప్రదర్శించటానికి మాత్రమే యిది రచింపబడలేదు. మొత్తం కథా విషయాన్నే ఒక లోకంనుండి మరో లోకానికి తరలించటమే యిందులోని ఉద్దిష్ట నిర్దుష్ట లక్ష్యం! భౌతిక సౌందర్య పరిమితమైన ప్రేమను, నైష్ఠిక దివ్య ప్రణయాపథుల కుద్గమింపచేయటమే యీ కవీశ్వరుని పవిత్ర ప్రయత్నం" అని రవీంద్రుడు చెప్తుంటే, అనేక ఇతర రూపకాలకన్న యీ రూపకానికి గల పార్థక్యం మనకు వివరించినట్లైంది. "ఆ యౌవన మత్తత అట్టిది ! అది సిగ్గు దొంతరల మధ్య తొణికిసలాడుతూ ఉద్వేగోత్సాహాలుగా పొంగి పొరలింది! శకున్తల అమాయకత్వాని కిది ఒక నిదర్శనం! ఇతఃపూర్వం ఆమెకు భావోద్రిక్తత అంటే ఏమిటో తెలియదు! దుష్యంతుని ఆగమనంచేత ఆమెకీ ఉద్రిక్తత కల్గింది. ఇపుడు పొంగిపొరలే ఉద్రిక్తత నెట్లా సంయమించుకోవాలో, తన మనోభావాల్ని ఎలా ప్రకటించాలో శకున్తలకు బోధపడలేదు. తనలోని ప్రేమభావంపట్లగాని, తన్ను ప్రేమించిన ప్రియుని ప్రవర్తనపట్లగాని ఆమె కెట్టి అప్రత్యయంలేదు. ఆశ్రమ శాటక మెట్లా నిర్భీకమో! ఆశ్రమ కన్యయైన శకున్తల కూడా అట్లాగే నిర్భీక! ఆశ్రమపరిపోషిత యౌవనోద్భాసితయగు కాళిదాస రూపక నాయిక శంకారహిత స్వభావ! ఆమె నెప్పుడు కవి అదుపులో పెట్టటానికి ప్రయత్నించలేదు. అయినా కాళిదాసీమెను భక్తి సంభరితమైన ఆదర్శ ధర్మపత్నిగాను, సంయత శీలగాను కష్ట సహిష్ణుస్వభావగాను, నిష్ఠురాధ్యాత్మిక క్రమ శిక్షణాన్విత జీవితగాను తీర్చిదిద్దాడు. ఆరంభంలో తన్నుదా మఱచి స్వభావోద్రేకాలకు గురి అయింది. కణ్వాశ్రమలతల్లో ఆమె జంగమ లత; కుసుమాలలో వాడని కుసుమం!" అని వివరించుకుపోతూంటే కాళిదాసే విశ్వకవి ముఖతః తన నాయికను మనకు పరిచయం చేస్తున్నట్లు ఆనందభరితుల మౌతాం. విశ్వకవి ఈ రూపకంలో చతుర్థాంకసృష్టికన్న పంచమాంకసృష్టికే విశేషప్రాధాన్యమిచ్చిన ట్లీ వ్యాసంవల్ల ద్యోతమానమవుతుంది. "వాస్తవిక జీవితంలో బహు భార్యా సక్తుడైన దుష్యంతుడు, తన నవనవాభిరుచుల్నిబట్టి శకుంతలను విస్మరించటంలో ఎబ్బెట్టేకంలేదు. దుర్వాసుని శాపం ఇందుకు నిమిత్తంగా కవి నిరూపించాడు. లేకపోతే శకున్తలా నిష్కాసనం మిక్కిలి క్రూరం, హృదయ విదారకం అయ్యేది. అంతేకాదు. రూపక సమైక్యస్థాయి కూడా నశించిపోయేది. కవి పంచ

మాంకారంభంలో తెరచాటునుండి పల్కించిన కొన్ని పల్కులు రాజకృత్యాల్లోని పాపాలను మనకు స్ఫురింపచేస్తాయి! శకున్తలా దుష్యంతుల మధుర ప్రేమచే సుస్నిగ్ధమైన ప్రేక్షక హృదయాలకు హంసపదిక శిథిల హృదయ విషాద సంజనిత గాద్గదిక గీతాలాపం వ్యాకులతను గల్గిస్తుంది. హంసపదికగీతంవలన రాజు ప్రేమ క్షణికమని స్పష్టమవుతుంది. ఇట్లు కవి పంచమాంకారంభంలో సూచించటంలో ఎంతో ప్రయోజనముంది. దుర్వాసుని శాపం కృతకం కాదని, మానవ స్వభావనిహితమైన విషబీజాన్ని అది ఖండించటాని కేర్పడ్డదని, ఇట్లా స్వభావ విరుద్ధంకాని కల్పన కావించటంలోనే కాళిదాసుని పరిణత కళా పటిమ ద్యోతమానమవుతుందని విశ్వకవి వివృతం కావించారు. భారత దేశంలోని శాపాలన్నీ యీ దృష్టితో పరిశీలిస్తే అవి భారతీయ స్వభావాన్ని పుటంపెట్టి వన్నెతేల్చటానికే ఉపయోగించాయన్న విషయం భారతీయేతరులకు సులభంగా అర్థంకాదు. అందు చేతనే విమర్శకునకు జాతీయ సంపదంతా హృద్గతం కావాలని మనవి చేశాను.

చతుర్థాంక వాతావరణానికి, పంచమాంక వాతావరణానికి గల వ్యత్యాసాన్ని రవీంద్రుడు స్పష్టపరుస్తాడు. ఇట్టి సందర్భాల్లోనే విమర్శలోని కళాధర్మంఅంటే ఏమిటో గ్రహించకల్గుతాం! కాళిదాసు ఈ వ్యత్యాసాన్ని నేటి నాటక కర్తలవలె హఠాత్తుగా కల్గించి ప్రేక్షకులను దురవగాహంను గావించకుండ క్రమక్రమంగా వ్యంగ్యంగా పరిచయం చేస్తూ, నాటకీయ తీవ్రతను సన్నద్ధం చేస్తాడని రవీంద్రు డీ గీతిగా తన కవితా శక్తితో విషయాన్ని ఉద్దీపితం చేస్తాడు. "చతుర్థాంకంలో శకున్తల పూజనీయుడు, పలితకేశుడునైన కణ్వమహర్షి మహితాశీర్వచనాలను స్వీకరించి సమస్త వనవాటీ భవ్య సముపలాలితయై, ఎట్టి పవిత్ర ప్రశాంత మధుర వాతావరణాన్ని హృదయభారంతో వీడ్కొన్నది దర్శించిన ప్రేక్షకలోకం కరుణరసపరిప్లావితమై శకున్తలా దాంపత్య ప్రేమసౌధానికి సోపానమార్గాలు అన్వేషిస్తూంటుంది. కాని పంచమాంకంలో దర్శించే రాజసభా ప్రాంగణం కపటప్రేమావృతమైందని శకున్తలవెంట వచ్చిన ముని కుమారుల ప్రసంగ వాక్యాలవలన గోచరిస్తుంది. శార్ఙ్గరవుడు 'అగ్నివేష్టిత గృహమునందు వచ్చి పడినట్లున్నా మ'ని చెప్పగా 'నూనెపూసి కొనిన వానిని చూచిన సుస్నాతునకు, అశుచిని చూచిన శుచికి, నిద్రితుణ్ణి చూచిన జాగృతునకు, బద్ధుని చూచిన స్వాధీన పురుషునకు ఎట్టి భావం మనస్సులో పుడుతుందో నాకు అట్టి భావమే కల్గుతుందంటాడు. శకున్తలా బహిష్కారం రానేవచ్చింది. శకున్తలకు తలపై పిడుగు పడ్డట్లైంది. చేరదీసి, ప్రేమించి లాలించిన మృదుల హస్తంతోనే కఠినంగా దెబ్బతిన్న లేడిపిల్లవలె ఈ వనకుమారి భయవిషాద విహ్వలాకుల చిత్తయై రిత్తచూపులు చూస్తుంది. తనకు చిరకాలం ఆవాసమైన పవిత్రాశ్రమంనుండి తాను విసరి వేయబడ్డదన్నమాట వాస్తవమైంది. తన సఖుల్ని, మృగ శాబకాలను, తరులతావిహంగాల్ని విసర్జించింది. కాని రాజభవనంలో తనక్కు నిలువ నీడలేక పోయింది. ఒంటరిగా నిలువలేక కూలిపోయింది. ఒక్క క్షణంలో నాల్గో అంకంలోని అసాధారణ సంగీత మాధుర్యం మటుమాయమైంది. రూపకం విషాదచ్ఛాయాశబలితమైంది. పాపమా శకున్తల గంభీరమౌన ముద్రాంకిత అసహాయ, అనద అయింది. ఆమె దుర్భర దురంత విషాదం భూమ్యాకాశాలు అలముకొన్నాయి! ఇట్టి స్థితిలో కాళిదాసు తన అనన్య సామాన్య ప్రకాంత దార్శనికతతో, శకున్తలను తిరిగి కణ్వాశ్రమానికి చేర్చలేదు. దుష్యంత పరిత్యక్త అయిన శకున్తల కచ్చట ఇక స్థానంలేదు. ఆమె పూర్వపు వ్యక్తికాదు. నిసర్గామల కన్యాభావ సౌందర్యంతో పూర్వం ఆమె ఆశ్రమ తరులతా విహంగాదులతో సౌమనస్యం కుదుర్చుకొన్నది. ఇప్పుడట్లా కుదుర్చుకోలేదు. ఆమె జీవితం ఒక సమస్య అయింది. ఈ సమస్య నామే పరిష్కరించుకోవాలి. కణ్వాశ్రమంలో దీన్ని గూర్చి ఆలోచించే వాళ్ళు లేరు. ఇప్పుడు మొత్తం రూపకం మౌనముద్రాంకితమైంది. శకున్తలలో మౌనం, కవిలో మౌనం, ప్రేక్షకునిలో మౌనం. ఈ మౌన విరామంలోనుండే అపూర్వ నూతనశక్తి ఉద్బుద్ధం కావాలి. అపరిచితమైన మారీచాశ్రమంలో శకున్తలమనకు ప్రత్యక్షమౌతుంది. ఆ ఆశ్రమం అనంత ప్రశాంత దివ్యధామం! అందు శకున్తల దురంత విషాద పరితప్త! నిరంతర తపశ్చరణ పరాయణ! సంతతైకాంత సంసిక్త మానస! శకున్తల ఆగమం వలన ఈ ఆశ్రమానికి కూడా చక్కలిగింత కలిగింది! అబలయగు శకున్తల సబల కావటంతో ఈ మార్పు వచ్చింది. శకున్తల భరతుణ్ణి కన్న వీరమాత! పుష్ప తరులతాగుల్మ సౌందర్యాన్ని అతకరించే కుమారు డీతడు! తాపసస్త్రీ లితన్ని పట్టలేరు. ఈ రీతిగా రూపక సమీక్ష చేసుకుంటూ విశ్వకవి తిరిగి శకున్తల రూపకాన్నే భంగ్యంతరంగాసృష్టించి మన మనోనేత్రాలకుప్రత్యక్షం చేస్తారు. ఇట్టి విమర్శ, ఈ విచక్షణ, ఈ సమీక్ష విశ్వకవివంటి ప్రజ్ఞాశాలికి మాత్రమే పట్టుపడుతుంది. ఇంతకు కాళిదాసీ రూపకం మూలంగా భారత జాతికిచ్చే కాంతాసమ్మితమైన ఉపదేశం అనండి, సందేశం అనండి దాన్ని గురుదేవు లీ రీతిగా పేర్కొంటారు—"ఒకా నొక యౌవనోద్రిక్త భావావేశంలో శకున్తల దుష్యంతునికి ప్రాప్తించింది. ఆ ప్రాప్తి సత్య ప్రాప్తికాదు. ఏకాగ్ర నిశ్చల వినిర్మలభావనచే ఆమెను సంపాదించటమే ఉత్తమ మార్గం! అందరు కన్యల లాంటిది కాదు శకున్తల! శకున్తలా దుష్యంతుల గాథ భారతేతిహాసంలో ప్రధా

సంగా ఉండాలి. తక్కిన వారితో ఇట్టి గాఢ గార్హస్థ్యబంధం దుష్యంతుడికి లేదు! సులభ సంప్రాప్తమైంది సులభంగానే సురిగి పోతుంది. అందుచే ఈ యిరువురిని నిష్కరటపశ్చరణ విధానంచేత, శాశ్వత పవిత్ర స్థాన సమధిగతుల్ని కావించాడీ కవి. కఠిన కర్కశ హృదయంతో దుష్యంతుడు శకుంతలను తిరస్కరించడం ఆమె కపకార రూపంలో జరిగిన మహోపకారం! తొలుతనే శకుంతలను స్వీకరించిడంటే అనేక హంసపదికల్లో ఆమె కూడా ఒకతె అయ్యేది! ఆమె అర్హత, విశ్వాసం అంతకన్న అధికమైనవి. సత్యమావిష్కృతమైనప్పుడు దుష్యంతుడు పశ్చాత్తప్తుడైనాడు! అతని హృదయ కాఠిన్యం కరిగిపోయింది. ఇతః పూర్వం సంతాపం అంటే తెలియని రాజు సంతాపానుభవంచే పరితప్తుడైనాడు. సమాహితచిత్తంతో సాధన చేశాడు.శకుంతలా పునఃప్రాప్తి కర్హుడైనాడు. వసంతకాల పుష్పసమృద్ధి, గ్రీష్మకాల ఫల సమృద్ధి, స్వర్గచ్యుతి, స్వరప్రాప్తి ఈ రూపకపరిధిలో ప్రదర్శిత మౌతాయన్న గెఘే మహాశయుని భావన,సత్య సమ్మతమైనది. భారతీయుల దాంపత్య ప్రణయ జీవితం కామోద్రిక్తత నతిక్రమించి సౌమనస్యంతోను, సౌజన్యంతోను శోభిల్లుతూ లోక కళ్యాణాన్ని ఆశించాలనే కాళిదాసుని సందేశం విశ్వకవి తన ప్రస్ఫుట వాక్యాల్లో వినిపిస్తాడు.

రఘువంశంమీదకన్న కుమారసంభవ కావ్యంమీదనే విశ్వకవికి విశేషమైన గౌరవం ఉన్నట్లు గోచరిస్తుంది. "కాళిదాసు నీతిబోధ" అనే విమర్శక వ్యాసంలో ఆయన శాకుంతలానికి, కుమారసంభవానికిగలతత్త్వతః ఉన్నసాదృశ్యాన్నిఉన్మీలనంచేస్తాడు!

"కామోద్రిక్తత పతన కారణమని, సంయమన సద్భావం సమగ్ర ఫలదాయకమని నైతిక శక్తిచే సముత్ఫుల్లమైన సౌందర్యం సుస్థిరమైనదని ప్రశాంత సంయమనశుభోదర్క ప్రేమయే సర్వోత్కృష్టమని సంయమనంలోనే సత్య సౌందర్య కర్షణం కలదని ప్రతిమించిన స్వేచ్ఛా సౌందర్యం వినాశ హేతువని కవిసార్వభౌముడీ మహా కావ్యద్వయంచే కాంతా సమ్మతంగా నీతి నుపదేశిస్తున్నారు." అని ఈ వ్యాసాన్ని ముగిస్తాడు విశ్వకవి. ఇట్టి విమర్శక వ్యాసద్వయంచేత సహృదయలోకం భావ వికాసాన్నిపొంది, పునః ఆ కావ్యద్వయాన్ని పఠించేటప్పుడు కల్గే ఆనందం బ్రహ్మానంద సబ్రహ్మచారికాక అన్యం కాజాలదు.

విశ్వకవి కావ్య ప్రపంచంలో ఉపేక్షితలైన పాత్రలమీద ఎంతో అపేక్ష చూపించారు. అనసూయా ప్రియంవద లిందులో ముఖ్యులు. శకుంతల కణ్వాశ్రమాన్ని విడిచిపోయిన తరువాత ఈ ఇరువురు లావణ్యవతులేం చేస్తుంటారో ఊహిస్తాడీ కవి! అదే విమర్శన కళ! అదే కవిత్వం కూడా! షేక్స్పియర్ టెంపెస్టు రూపకంలో మిరండా సరళ స్వభావాన్ని, శకుంతల సరళ స్వభావాన్ని తులనాత్మకంగా సరసంగా సమీక్షించి శకుంతల సృష్టిలోని సౌందర్యస్థాయి నాన్యతోదర్శనీయంగా ఆయన నిరూపిస్తారు.

ఏవంవిధంగా విశ్వకవి కాళిదాసునకు భక్తుడై, వ్యాఖ్యాత కూడా అయినాడు! మహాకవే మహాకవి నర్థం చేసుకోగలడు!

"విద్వా నేవ విజానాతి విద్వజ్జన పరిశ్రమమ్"

# కల్ల కాని కల

పాతికేళ్ళ రాము కౌలుదారు— చిన్నసంసారి. రోజూ అనుకుంటూ వుంటాడు:




తన కోర్కెలకు సమాధాన మన్నట్లు, గ్రామస్థులందర్నీ జీవిత భీమాను గురించిన సినిమా చూడ్డానికి గ్రామ చావడికి రమ్మన్నారు ఒకనాడు. ఆ పొలాన్ని కొనడానికి రాము ఎలా డబ్బును సమకూర్చగలడో ఆ చిత్రాలు చూపాయి.






జీవిత భీమా పట్టా తీసుకుందుకు రాము వెంటనే నిశ్చయించాడు. 20 సంవత్సరాల అనంతరం రు 3,000 లు పొందేలాగు ప్రతినెల కొద్ది మొత్తం పొదుపు చేసేవాడు.





తాను సాగు చేస్తున్న భూమికి యీనాడు రాము స్వంతదారు. తన జీవిత భీమా పట్టానుంచి వచ్చిన సొమ్ముతో ఆ భూమిని కొన్నాడు. అతడు కనిన కలలు ఫలించాయి.



జీవిత భీమా — ప్రజాహితవాది

ASP.LIC.R.S

# క ల గూ ర గం ప

## అస్తిత్వవాది జీన్ పాల్ సార్త్రే

శ్రీ కొండముది శ్రీరామచంద్రమూర్తి

ఈ మధ్య "అబ్జర్వర్" పత్రిక ఒకవిశేషాన్ని ప్రకటించింది. ఒకానొక పత్రికా రచయిత, జీన్‌పాల్‌సార్త్రే అన్న పేరు గల ఓ నాటక రచయితను "మళ్ళీ ఎప్పుడయినా అమెరికాను చూడాలనుకొంటున్నారా మీరు?" అంటూ ప్రశ్నించాడట. దానికి సార్త్రే ఇలా చెప్పాడు సమాధానం. "ఊహూ. నిజం చెప్పాలంటే, అమెరికాను మరోసారి చూడాలన్న కుతూహలం నాకేమాత్రమూలేదు. సర్వత్రా అక్కడ కన్పిస్తున్న భయంకరమైన ఆ మానసిక స్థితి, దాన్నే సర్వమూ అని భ్రమించే ఆ ప్రజలు, వీటిని నే భరించలేను. విశ్రాంతి నెరుగని వారి జీవితం, ఏదో మౌనవేదనలో ప్రొద్దుబుచ్చే ఆ బ్రతుకులు, ఇప్పటికీ నన్ను బాధిస్తున్నాయి. ఒక విచిత్రమైన పాశకవిత, మనుగడను తక్కువచేసి చూడడం—ఇవి నాకు ఇష్టంలేదు. అలా అని అమెరికాను నేను ద్వేషిస్తున్నాననా? కాదు. ఆ దేశమన్నా, ప్రజలన్నా చాలా చాలాఇష్టం నాకు" ఎవరీ సార్త్రే? ప్రజలన్నా, వారిలోని మానవత్వమన్నా అవధు లెరుగని మమతను చూపిస్తూ, వారిలోని రాక్షసత్వాన్ని, బ్రతుకులోని కన్నిటి కణాలను, మనిషిలోని యాంత్రికమైన మానసిక స్థితిని సహించలేని ఈ జీన్‌పాల్‌సార్త్రే ఎవరు? ఏమిటి ఇతను బోధించేది? ఆ బోధన ఎంతవరకు ఆచరణసాధ్యం?

### జీ వి త వి శే షా లు

పందొమ్మిది వందల అయిదో సంవత్సరం, జూన్‌నెల అయిదవ తారీఖున పాశ్చాత్య నాగరికతకు మెట్టినిల్లుగా భాసించే పారిస్ నగరంలో, మధ్య తరగతి కుటుంబంలో జన్మించాడు జీన్‌పాల్‌సార్త్రే. మహా సంక్షోభ మొకటి రాత్రింబవళ్ళను కాల్చివేస్తున్న ఆ దుర్దినాలలో పారిసులోనూ, లారోషెల్‌లోనూ విద్యాభ్యాసం సాగించాడు. మూడు పదుల జీవితం కూడా నిండకుండానే పందొమ్మిది వందల ముప్ఫయినుండీ వేదాంత శాస్త్రాన్ని బోధించే ఆచార్యుడుగా పొట్టపోసుకోవడం ప్రారంభించాడు. ఆచార్యుడుగా వుండగానే కీర్క్‌గార్డ్, హెయ్‌డెగార్ వంటి ప్రముఖ దార్శనికుల రచనలు చదివి వారి ప్రభావానికి లోనయ్యాడు. ఆ ప్రభావమే తర్వాత తర్వాత అస్తిత్వవాదంగా పరిణమించింది. అయితే ఈ అస్తిత్వవాదం, రెండవ ప్రపంచ యుద్ధానికిముందు అతడు ప్రచురించిన రచనలలో మనకెక్కడా కన్పించదు. పందొమ్మిదివందల ముప్ఫయితొమ్మిదో సంవత్సరంలో సైన్యంలో చేరాడు. నలభయి, నిండీ నిండకుండానే శత్రువుల చేతికి చిక్కి జీవన్మరణాల మధ్య ఊగిసలాడాడు. కానీ విధి అనుకూలించి, ఎల్లాగో తప్పించుకుని పారిస్‌చేరి అజ్ఞాతజీవనం ప్రారంభించి, ఆ దరిద్రస్థితిలోనే పంచమాంగదళంలో సభ్యుడుగాచేరి పని చేయడం ప్రారంభించాడు. తన జీవినవిధానాన్ని, తను నమ్మినదానినీ సర్వప్రపంచానికీ తేటతెల్లం చేయాలని, సాహిత్య కృషీవలుడై, అచిరకాలంలోనే అశేషమైన ప్రజాదరణను సంపాదించుకుని, పెక్కు నాటకాలనూ, నవలలనూ ప్రచురించాడు.

### ర చ న లు

పందొమ్మిదివందల నలభై మూడులో తన మొట్టమొదటి నాటకం "హూయిస్‌క్లోస్"ను ప్రచురించాడు. ఈ నాటకమే లండను నగరంలో "విషస్ సర్కిల్" అన్న పేరుతోనూ, న్యూయార్కులో "నో ఎగ్జిట్" అన్న పేరుతోనూ, ప్రచురింపబడి, ప్రదర్శనలో పెక్కుమంది విమర్శకులచేత "అద్భుతమైన ప్రదర్శనం" అని పొగడబడింది. అతను నాటక రచయితగా స్థిరపడటానికి ఈ రచన ఎంతో దోహదం చేసింది. ఆ తర్వాత నలభై మూడులోనే "లేమోషెస్" నలభై ఆరులో "మోర్ట్ సాన్స్ సెపుల్చర్" "లాపుటై రెస్‌పెక్టెయస్" అన్న నాటకాలనూ వరుసగా ప్రచురించాడు. ఈ నాటకాలన్నీ కూడా లండన్ నగర రంగస్థలంమీద ప్రదర్శింపబడి ప్రేక్షకులను సంభ్రమాశ్చర్యచకితులను చేశాయి. అయితే సార్త్రేకు సర్వప్రపంచంలోనూ ఎనలేని గౌరవాన్ని కూర్చిపెట్టినవి-నలభై—నలభై ఏడు మధ్య "లే కెమిన్ డిలా లిబర్టే" అన్న పేరుతో అతను వ్రాసిన నవలాత్రయం. ఈ నవలలో ఆధునిక మానవుడు అధికారదాహంతో రాజకీయ సుడిగుండాలలో చిక్కుకుని ఎలా తనను తాను హింసించుకుంటున్నదీ— అతి వాస్తవికంగా, నగ్నంగా, భయంకరంగా ఎక్సరే కళ్ళతో చిత్రిస్తాడు సార్త్రే. ఈ నగ్న చిత్రణం మూలాన అతని రచనలకు పందొమ్మిది వందల నలభై ఎనిమిదిలో బహిష్కార సన్మానం కూడా లభించింది.

### అస్తిత్వవాదమంటే....

"ఎగ్జిస్‌టెన్షియలిజమ్" అన్న పేరుతో ఆంగ్లంలో పిలువబడుతున్న సార్త్రే జీవన దృక్పథాన్ని అస్తిత్వవాదమని తెలుగులోకి అనువదించి ప్రచారం చేశారు శ్రీ పి. గణపతి

శాస్త్రిగారూ తదితరులూనూ. అస్తిత్వవాదమన్న ఈ పేరు సముచితంగాను, అర్థవంతంగాను కనుపిస్తోంది. "ఎగ్జిస్టెన్స్" మీదనుంచి వచ్చినది ఎగ్జిస్టెన్సియలిజమ్. ఎగ్జిస్టెన్స్ అన్న ఆంగ్ల పదానికి, ఉనికి, మనుగడ, అస్తిత్వం అని అర్థం చెప్పుకుంటే అస్తిత్వాన్ని గూర్చి తెలియజెప్పేది అస్తిత్వవాదమని సులభంగా అంగీకారమవుతుంది. సార్త్రే రచనలలో పెక్కింటికి ఈ వాదం జీవనాడి. మానవుని ఉనికిని, ప్రపంచపు మనుగడను తెలియజెప్పే అతని తీవ్ర వేదన, ఈ వాద రూపమై విశ్వానికి వెలుగు నిస్తోంది. ఏది నిత్యమో, ఏది చిరమో ఏది సార్వజనికమో దానినిగూర్చి తెలియ జెపుతుంది ఈ వాదం. వ్యక్తిస్వభావాన్నీ, మానవుని విచిత్రానుభూతులనూ తరచి తరచి, జగద్రహస్యసిద్ధాంతాలను తేటతెల్లం చేస్తుంది "అస్తిత్వం". సర్వ ప్రపంచమూ ముందుకు సాగడానికి ఏ కదలిక ముఖ్యమో ఏ కదలికలో జీవ గుణం నిబిడీకృతమై నడిపిస్తున్నదో ఆ జీవగుణాన్నే అస్తిత్వం తెలియజెపుతున్నది మరొక విధంగా.

ఇన్ద్రియేభ్యః పరాహ్యర్థా అర్థేభ్యశ్చపరం మనః
మనసశ్చ పరాబుద్ధి ర్బుద్ధే రాత్మా మహాన్పరః

అని కఠోపనిషత్తులో చెప్పినట్లుగా ఇంద్రియములకు కారణభూతములయిన శబ్దాది విషయాలు స్వకార్యములయిన ఇంద్రియములకంటె సూక్ష్మములూ ప్రత్యగాత్మ భూతములూ అని ఈ వాదమూ అంటుంది. ప్రొఫెసర్ శ్రీనివాస అయ్యంగార్ చెప్పినట్లుగా "It is preoccupied with the nature of being or essence, with individual human consciousness coming into a world of existences."

## అస్తిత్వవాదం అసలు ఎలా పుట్టింది?

జీన్‌పాల్‌సార్త్రే తను నమ్మిన జీవన ధర్మాన్ని ఫలానా పేరుతో పిలవాలని నిర్ణయించుకోడానికి ముఖ్యకారణం కీర్క్‌గార్డ్. ఈ కీర్క్‌గార్డ్ ఒక దార్శనికుడు. ఒక వేదాంతి. తత్వవేత్త. హెగెల్ చెప్పిన ప్రతీదానికీ ప్రతినిర్వచనం చేసేవాడు. కీర్క్‌గార్డ్ రచనలన్నీ పరిశీలిస్తే ."ప్రతీవాడూ "అహం" అనుకుంటూనే తన బ్రతుకు గతిని నిర్ణయించుకొంటూంటాడు. ఈ "అహాన్ని" గూర్చిన స్పర్శ అతని రక్తంలో జీర్ణమై వుంటుంది. తనను గూర్చిన అహంభావం జ్ఞానం లేకుండా మనిషి బ్రతకడమే కష్టం. అందుచేతనే ఈ బ్రతుకులో నిత్యమనుకునే కొన్ని కొన్ని సత్యాలు వ్యక్తిగతమైనటువంటివి, ఆ యా కాలాలకు, ఆ యా పరిస్థితులకు తగినటువంటివే కాని సార్వజనికములూ సార్వకాలికములూ అయినటువంటివికావు. అసలు అటువంటి శాశ్వత సత్యాలనేవి లేవు" అన్న భావన ఒకటి మనకు కలుగుతుంది. కీర్క్‌గార్డ్, ప్రతీసత్యమూ పూర్తిగా వ్యక్తిగతమైన కారణాలవలననే ఉద్భవించిందని చెప్పడానికి కారణం స్థూలంగా ఇది: ఆలోచన అంటే కొన్ని కొన్ని ప్రాథమిక విషయాలను ఒక మాలగా గుచ్చి వాటి రూపురేఖావిలాసాలను మాత్రమే పరిశీలించడం కాదుగదా? ఆలోచన అనేది ప్రథమంగా, మానవుడి మస్తిష్కంలోని ఒకానొక కదలిక. అంతమాత్రమేకాదు. ఈ "ఊహ లేక ఆలోచన" అన్నది సజీవమైన "మానవ చైతన్య స్వరూపం". మనిషిలోని సంస్కారం, పరిసరాల ప్రభావం, విద్య, అభిమానాలు, బలహీనతలు ఇలా అనేకం ఆలోచనను పరిపరి విధాల ప్రభావితం చేస్తుంటాయి. అందుచేతనే నిత్యసత్యములనుకొన్నవి కూడా ఆలోచనాస్వరూపములే కాబట్టి, అందునా ఈ ఆలోచన వివిధములుగా ప్రభావితమై విభాగింపబడినట్టిది కాబట్టి ఈ సత్యములు కూడా పెక్కు రీతులుగా వుండవలసి వస్తున్నది.—అని వాదిస్తాడు కీర్క్‌గార్డ్. కీర్క్‌గార్డ్, తదితరులూ వాదిస్తున్న ఈ ఆలోచనావిధానాన్ని సంక్షిప్తంచేసి చెప్పుకుంటే "ఎన్నిక చేయడం, అధిగమించడం, స్వాతంత్ర్యం పొందడం"(Choose, leap, and be free)అనిచెప్పుకోవచ్చు. అస్తిత్వవాద ప్రయోక్తలయిన హెయ్‌డెగార్, జాస్పర్స్ మొదలయినవారు ఈ సిద్ధాంతాన్ని యథాతథంగా ఆమోదించారు. నిహిలిస్టిక్ సిద్ధాంతంగా మొదట్లో పరిణమించిన కీర్క్‌గార్డ్ వేదాంతం, తర్వాత తర్వాత రెండవ ప్రపంచ యుద్ధం ముమ్మరంగా సాగుతూన్న రోజుల్లో అస్తిత్వవాదంగా రూపకల్పన పొంది ఫ్రాన్సు దేశంలో అనేక మంది వేదాంతులకు, నాటక రచయితలకు, నవలా రచయితలకు వో క్రొత్త మార్గం చూపించింది. ఈ మార్గాన్ని అవలంబించిన వారిలో ఆల్బర్ట్ కేమస్, జీన్‌పాల్‌సార్త్రే ముఖ్యమైనవారు. నాస్తికత్వమేమో అని అపోహ పడటానికి ఆస్కారం కల్పించిన సార్త్రే రచనలు, ముఖ్యంగా "హూయిస్‌క్లోస్" మొదలైనవి ఆ రోజుల్లోనే స్కాండినేవియా, బ్రిటన్, అమెరికాలలో పెద్ద గాలి దుమారాన్నిలేపాయి. మానవుడి బ్రతుకు తెరువు మరీ యాంత్రికమైపోయి, ఏకాంతసేవకు అలవాటుపడి, "చుట్టూ క్రమ్ముకొస్తున్న సంక్షుభిత పరిస్థితులకు తట్టుకోలేక నానా యాతనా పడుతున్న సమయంలో సార్త్రే తన రచనల ద్వారా, మానవుడికీ, మానవుడికీ మధ్య సంబంధ బాంధవ్యా లెట్లా వుండాలీ చెప్పి, కర్తవ్య బోధ చేశాడు.

## చిన్న కథలు

సార్త్రే నవలలూ, నాటకాలే కాదు. పెక్కు చిన్న కథలు కూడా వ్రాశాడు. అయితే ఈ చిన్న కథలను, కథలుగా ఆధునికులు, సమకాలీన విమర్శకులు ఒప్పుకోలేకపోవచ్చు. కారణం ఈ కథలలో ఓ హెన్రీ కథలలో కన్పించే "ముగింపు బిగింపు" కానీ సామర్సెట్ మామ్ రచనలలో కొట్టవచ్చినట్లుండే కథాకథనంగానీ, మనకు కన్పించవు. పైగా కొన్ని కొన్ని పూర్వ సంప్రదాయాల్లో కట్టుబాట్లలో, సాంఘిక నిబంధనలలో, ఛాందస మనస్తత్వాలలో పెరిగిన వారికి ఈ కథలు చదవగానే జుగుప్స, సాహిత్యమంటే భయం, సార్త్రేమీద కోపం అనుకోకుండానే కలుగుతాయి. ఉదాహరణకు నే నిచట పొందుపరుస్తున్న ఓ కథ యొక్క సంక్షిప్త స్వరూపాన్ని పరిశీలించండి.

అది ఒక మహా నగరంలో, అనుక్షణం ప్రతిక్షణం విశ్రాంతి నెరుగని నాలుగురోడ్ల కూడలితో, కూడలికి ప్రక్కగా ఎన్మిదంతస్థుల రాజ ప్రాసాదంలాంటి భవనంలో, చిట్ట చివరి అంతస్థుమీద పిట్టగోడమీదకువంగి, క్రింద రోడ్డుమీద పోతున్నజనాన్ని ముఖ్యంగా ఆడవాళ్ళనూ, మగవాళ్ళనూ నిశితంగా పరిశీలిస్తున్న ఓ యువకుడూ, యువకుడిమనస్సులో కొన్నికొన్ని విషపుటూహల్లు కదలిపోతున్నాయి. "ఈ ఆడవారినీ మగవారినీ నగ్నదేహాలను చేసి వీధులలో నడిపిస్తే....." ఆ యువకుడి తాపత్రయం రేణువులుగావున్న ఆ స్త్రీపురుషుల జఘనభాగాలను నగ్నంగా చూడాలని. ఇంత రాక్షసప్రవృత్తి కల ఆ యువకుని మనస్థితిని అంత రాక్షసంగానూ చిత్రిస్తాడు సార్త్రే.....సరే, ఆ యువకుడు ఆ తర్వాత స్త్రీసౌఖ్యాన్వేషణలో ఒక చీకటి గదిలోకి జొరబడతాడు. ఆ చీకటి గదిలో పట్టపగల్లా కోటి వోల్టుల దీపాలు. ప్యారిస్ నగర స్త్రీ సౌందర్యమంతా అక్కడే కుప్పపోసి వున్నది. ఒక యువతిని ఎన్నిక చేస్తాడు ఈ ఆధునిక ఉన్మాది. ఆ స్త్రీ అతనివేపు అర్థంకాని కనులతో చూస్తూంటుంది ఇంత ధర పెట్టీ యువకుడు తన నెందుకు కొన్నట్లా అని. అత డామెను మెల్ల మెల్లగా సమీపిస్తాడు. ప్రణయక్రీడావిశేషంకన్నా, అత డనిమిషుడై చూడడమే ఆమెకు ఆశ్చర్యం కలిగిస్తుంది. ఉన్నట్లుండి ఆమెను నగ్నదేహను కమ్మంటాడు. తదుపరి ఆ గదిలో ఒక మూలనుండి మరొక మూలకు నడువమంటాడు. ఆ పిదప కథావిధానాన్ని చెప్పటానికి నే నసమర్థుణ్ణి. వోపిక ఉన్నవారు సార్త్రే రచనలు చదువుకుని, అతనిని దూషించవచ్చు. అయితే సార్త్రే ఇంతటి భయంకర, రాక్షస, నగ్నచిత్రణం ఎందుకు చేసినట్లు?—వ్యాధి ఎంతటి గడ్డదో మనకు తెలిసినప్పుడేకదా, ఔషధోపచారం సరిగా మనం చేసేది. సార్త్రేకు నేటి నాగరికత "సివిలైజేషన్"గా కాదు. "సిఫిలైజేషన్"గా కన్పించింది. అందుచేతనే ఇబ్సెన్ సుతిమెత్తని రచనతో చూపించిన దానినే, ఇతను కరకు రంపపు కోతతో ప్రదర్శించి మనలను బాధించి ఆకర్షిస్తున్నాడు.

## తెలుగులో సార్త్రే

విశ్వవ్యాప్తి చెందిన సార్త్రే రచనలు అంతగా ఇంత వరకూ తెలుగులోకి రాలేదు. కాని ఆంగ్ల భాష నేర్చిన తెలుగు రచయితలపై మాత్రం సార్త్రే తన ప్రభావాన్ని అత్యద్భుతంగా చూపిస్తున్నాడు. భాస్కరభట్ల కృష్ణారావుగారి "వెలువలో పూచిన పూచిక పుల్లలు" శ్రీమతి లత చెప్పీ చెప్పకుండా అనువాదమూ అనుకరణా స్వేచ్ఛగా చేసిన "గాలి పడగలూ—నీటి బుడగలూ" "నీలి నీడలు" మొదలగు నవలలూ, శ్రీ గొల్లపూడి మారుతీరావుగారి ఒకటి రెండు కథానికలూ, శ్రీ రాజమన్నార్ ఆమధ్య రేడియోలో ప్రసారం చేసిన ఒక నాటికా, సార్త్రే ప్రభావానికి నిదర్శనాలు. ఈ ప్రభావం విషవృక్షాలనా, పూల తీగలనా పెంపుచేయునది? అన్న విషయం కాలమే నిర్ణయించవలసి ఉంటుంది. సార్త్రే రచనలు ఒకటీ—అరా చదివినప్పుడు అపోహ కలిగినా, ఆ అపోహలోని ఆవేశ స్వరూపంతో త్వరపడి కొన్ని రచనలు చేసినా, సార్త్రే అస్తిత్వవాదాన్ని సరిగా అర్థం చేసుకొన్నప్పుడు మాత్రం మన రచయితలు ఇటువంటి పొరపాట్లు చేయరు. ఆ విధంగా సార్త్రేను సరిగా అర్థం చేసుకుని ఆ ప్రభావ ప్రవాహంలో తేలిపోక, మన సంస్కారానికి అనుగుణంగా ఆ జ్ఞానాన్ని మలచుకొని రచనలు చేయగల రచయితలకోసం మనం ఇంకా కొంతకాలం నిరీక్షించాలి.

# అష్టగ్రహకూటమి పరిణామము

## శ్రీ భాస్కర కేశవయ్య

1962 వ సం. ఫిబ్రవరి నెలలో 5 వ తేదీన మకర రాశిలో 8 గ్రహముల కలయికవలన అనేక విధములయిన దుర్ఘటనలు కలుగవచ్చును. ఈ అష్టగ్రహ కూటమి సందర్భములో 5—2—62 వ తేదీ ఉదయం 5—30 గం. ఈ క్రింది విధముగా గ్రహగతులు ఉండును.

| | రా | భా | లి | | | | |
|---|---|---|---|---|---|---|---|
| రవి | 9 | 22 | 24 | శ్రవణం | 4 | వ | పాదము |
| చంద్ర | 9 | 23 | 40 | శ్రవణం | 4 | వ | పాదము |
| కుజ | 9 | 8 | 57 | ఉత్తరాషాఢ | 4 | | పాదము |
| బుధ | 9 | 23 | 18 | ధనిష్ఠ | 1 | వ | పాదము |
| గురు | 9 | 25 | 16 | ధనిష్ఠ | 1 | వ | పాదము |
| శుక్రుడు | 9 | 24 | 9 | ధనిష్ఠ | 1 | వ | పాదము |
| శని | 9 | 10 | 27 | శ్రవణం | 1 | వ | పాదము |
| రాహువు | 3 | 24 | 50 | ఆశ్లేష | 3 | వ | పాదము |
| కేతువు | 9 | 24 | 50 | ధనిష్ఠ | 1 | వ | పాదము |

ఇదివరలో ఒకే రాశిలో అధికగ్రహములు కూడిన కాలములు క్రింద సూచింపబడినవి.

# కలగూరగంప

(1) 8—5—1853 మేష రాశిలో రవి—చంద్ర—కుజ—బుధ—శుక్ర—శని—(6 గ్రహములు)
(2) 18—1—1855 మకరరాశిలో — రవి — చంద్ర—కుజ—బుధ—శుక్ర—గురు—(6 గ్రహములు)
(3) 15—9—1863 కన్యారాశిలో — రవి — చంద్ర—కుజ—బుధ—శుక్ర—శని—(6 గ్రహములు)
(4) 26—11—1867 వృశ్చికరాశిలో—రవి—చంద్ర—కుజ—బుధ—శుక్ర—శని—(6 గ్రహములు)
(5) 8—4—1880 మీనరాశిలో—రవి—చంద్ర—బుధ—శుక్ర—గురు—శని—(6 గ్రహములు)
(6) 2—10—1910 కన్యారాశిలో రవి — చంద్ర — కుజ — బుధ—గురు—శుక్ర—(6 గ్రహములు)
(7) 1—11—1910 తులారాశిలో — రవి— చంద్ర—కుజ—బుధ—గురు—శుక్ర—కేతు—(7 గ్రహములు)
(8) 9—10—1923 కన్యారాశిలో రవి—చంద్ర—కుజ—బుధ—శుక్ర—శని—(6 గ్రహములు)
(9) 26—4—1941 మేష రాశిలో రవి—చంద్ర — బుధ — గురు—శుక్ర—శని—(6 గ్రహములు)
(10) 5—2—1962 మకరరాశిలో రవి—చంద్ర—కుజ—బుధ గురు—శుక్ర—శని—కేతువులు—(8 గ్రహములు)

పై విషయము జ్యోతిశ్శాస్త్రవేత్తలు ఇదివరలోనే పత్రికలలో ప్రకటించియున్నారు. 1—11—1910 లో 7 గ్రహములు తులారాశిలో కూడినపుడు ప్రజలు అతివృష్టిచే బాధపడినారు. అపుడు కుజ, శనుల సంబంధము లేనందున అనావృష్టిగాని, అగ్నిభయముగాని యుద్ధముకాని మన దేశములో ఉండలేదు. ఈ అష్ట గ్రహకూటమివలన ప్రళయము రాబోవునని ప్రజలలో ఆందోళన బయలుదేరినది. కాని దీనివలన ప్రపంచము మునగదు. ప్రళయమురాదు. కలి యుగము పోదు.

శ్లో. ద్విగ్రహే నృపసంక్షోభం—త్రిగ్రహే నృపమారణం
చత్వారో రాజ్యనాశాయ మరణం వ్యాధిపీడనం.
పంచగ్రహే తు దుర్భిక్షం షడ్గ్రహే నృప యుద్ధతాం
సప్తగ్రహో రాజ్యనాశో మరణవ్యాధి పీడనం
అష్టమ గ్రహకే నాశం గ్రహాణాం కూటజం ఫలం.
(ప్రశ్న సంజీవిని—కనడ)

మరియు

శ్లో. రవి క్షేత్రే త్వనావృష్టిః చంద్రక్షేత్రే జలాగమం
కుజక్షేత్రే మహాయుద్ధం బుధ భే వాయుపీడనం
గురుక్షేత్రే సస్యహానిః శుక్రక్షేత్రే జలార్ణవం
మందక్షేత్రేతు దుర్భిక్షం గ్రహాణాం రాశినిర్ణయః

ఇచ్చట మనకు ఈ కూటమి శని క్షేత్రమయిన మకర రాశిలో కలుగుచున్నది గాన "అష్టమ గ్రహకే నాశం"—"మంద క్షేత్రేతు దుర్భిక్షం" అన్నట్లు ప్రజలు తిండిలేక బాధ పడుటయేకాక, నానా బాధలకు నష్ట కష్టములకు గురి యగుదురని తెలియుచున్నది.

శనిగ్రహము శ్రవణ నక్షత్రములో 1 వ పాదములో ఉండటమువలన శుక్రనాడీ గ్రంథములో వివరించిన మేరకు రాజస తత్వములో ఉంటున్నాడు. అందువలన ప్రపంచములో, రాజకీయ రంగములో ఉద్రేకములు ఎక్కువ కలుగును. ఈ ఉద్రేకములు—ఈతి బాధ, క్షామములు ఏ ఏ రూపములలో ఏ యే ఖండములలో ఏ యే దేశములలో ఏ విధముగా రాగలవు అనునదియే ముఖ్య సమస్య.

ఖగోళ, జ్యోతిష, శాస్త్రవేత్తలు, దైవజ్ఞులు, ఋషులు రాశుల వారిగా దేశములను ఈ క్రింది విధముగా నిర్ణయించినారు.

(1) మేషరాశి:— ఇంగ్లండు, జర్మనీ, పెరూ, సిరియా.
(2) వృషభం:— ఐర్లండు, పర్షియా, పోలండు, సైప్రెస్, ఆసియా మైనరు, శ్వేత రషియా.
(3) మిథునం:— లమెరికా, బెల్జియం, ఉత్తర ఆఫ్రికా, వేల్సు.
(4) కటకం:— చైనా, హాలండు, కెనడా, న్యూజిలాండు.
(5) సింహరాశి:— ఫ్రాన్సు, ఇటలీ, సిసిలీ, రుమేనియా.
(6) కన్య:— టర్కీ, గ్రీసు, స్విట్జర్లాండు, వెస్టు ఇండీసు
(7) తులారాశి:— ఆస్ట్రియా, అర్జంటైనా, జపాను, గుజరాతు, టిబెట్టు, బర్మా.
(8) వృశ్చికం :—బ్రెజిలు, నార్వే, ట్రాన్సువాల్, మొరాకో.
(9) ధనస్సు:— అరేబియా, ఆస్ట్రేలియా, హంగేరి, స్పెయిను
(10) మకరరాశి:—ఆల్బేనియా, ఇండియా, బల్గేరియా, మెక్సికో
(11) కుంభరాశి:— అబిసీనియా, పర్షియా, రష్యా
(12) మీనరాశి:—పోర్చుగలు, నార్మండి, ఈజిప్టు. ఇవి ప్రపంచమునకు సంబంధించిన స్థాన నిర్ణయములు.

ముఖ్యముగా మన హిందూ దేశమునకు మండలాధిపతులను ఋషులు నిర్ణయించిన విధం ఈ క్రింద వివరింపబడినది.

(1) కుజునకు:— లంకా పట్టణము మొదలు కృష్ణానది వరకును,
(2) శుక్రునకు:— కృష్ణానది మొదలు గోదావరికొనవరకును,
(3) గురునకు:— గోదావరీ నదికొన మొదలు వింధ్య పర్వతముల అంత్యము వరకును.
(4) బుధునకు:— వింధ్యాంతము మొదలు గంగానది అంతము వరకును.
(5) శని గ్రహమునకు :—గంగానదిమొదలు హిమాలయము వరకును. ఈవిధంగా ఈ గ్రహములు మండలములవారీగా వీనికి అధిపతులు అగుచున్నారు. రవి, చంద్రులకు ప్రత్యేకించి మండలములు నిర్ణయింపబడలేదుగనుక ఈ గ్రహములకు ప్రపంచమంతటిపైనను అధికారమున్నదని తెలియవలెను.

పై వివరములనుబట్టి మేష, వృశ్చిక రాశులు లంక నుండి కృష్ణానది వరకును, వృషభ తులారాశులు కృష్ణనుండి గోదావరి వరకును, మిథున కన్యారాశులు వింధ్యంనుండి గంగానది మైదానము వరకును, కటక సింహములు భూమండలమంతయును, ధనుర్మీనములు గోదావరినుండి వింధ్య పర్వతం అంత్యము వరకును, మకర కుంభములు గంగానది మైదానము, హిమాలయాంతము వరకునుగల ప్రదేశములచే ఆవరింపబడియున్నవి.

పై అంశములనుబట్టి 1962 వ సం. లో ఫిబ్రవరినెల 5 వ తారీఖున మకర రాశిలో అనగా గంగానది మైదానమునుండి హిమాలయప్రాంతము వరకును ఉండు మండలములో 8 గ్రహములు కలియుచున్నవని తెలియుచున్నది. మరియు ఇందులోనే ప్రపంచమున కంతటికిని అధికారము కలిగిన సూర్య, చంద్రులుచేరి ఉండడమువలన ఈ గ్రహకూట సంబంధము మన హిందూదేశపు ఈశాన్యోత్తర ప్రదేశమునకేగాక, ప్రపంచమునకంతటికీ సంబంధించి యున్నది. హిందూదేశము మాత్రమే దృష్టిలో నుంచుకొన్నపుడు గంగానది మైదానము మొదలు హిమాలయ ప్రదేశమంతటికిని విశేషించి సంబంధమున్నట్లు ఎరుగవలెను.

ఈ గ్రహకూటములో యిరుపార్శ్వములకు సంబంధించిన లేక భిన్న స్వభావముల వారైన (1) నైసర్గిక శుభులు (2) నైసర్గికపాపులు మరియు (1) శత్రువర్గమువారు (2) మిత్ర వర్గమువారు కలియడము గొప్ప విశేషము. దీనినిబట్టి ఒక మహానదిలో అంతర్వాహినులవలె శుభ పాప సమ్మేళనముతో కొన్ని దేశములకు, దేశ నాయకులకు అత్యంత కష్టములును, మరికొన్ని దేశములకు, దేశ నాయకులకు విజయము, పేరు ప్రతిష్ఠలు దర్పము హెచ్చు కాగలవు.

ఈ గ్రహ కూటములో
తే. "..... ..... ..... ..... ..... .....శూల యోగ
మలరు మూడు గ్రహములందు వసింపంగ
భయ విశేష దుఃఖభాజనుండు
రెండు రాశులందు నుండగ యుగయోగ
మగును—నిర్ధనుండు ప్రాణిహింస
కుండునై మెలంగు గోళకమగు నొక్క
ఇంటనుండ పుణ్యహీను డండ్రు" (దైవజ్ఞ యశోవిభూషణం)

ఒకటే రాశిలో తారా గ్రహములన్నియు కూడియుండుటచేత గోళకయోగ మగుచున్నది. ఇట్టి యోగము ఏర్పడుటచే ప్రజలు పాపకార్యాసక్తులై నాస్తికత్వమునకు దారి తీసెదరు. స్ఫుటరీత్యా బృహస్పతి భాగాధిక గ్రహమైనందున ఈ బృహస్పతితప్ప మిగిలిన గ్రహములు రాహు కేతువుల మధ్య ఉన్నవి. దీనికి కాలసర్పయోగమందురు. ఇందువలన విషవాయువుచే విషప్రయోగములచే, విష జ్వరములచే ప్రజలు బాధపడెదరు. ఇదే సమయములోనే గ్రహణము అగుటచేతను అచ్చటచ్చట భూకంపములు, అగ్ని పర్వతములు ప్రేలుట కూడ సంభవించును. ఈ దుర్యోగములయొక్క ప్రభావము 1961 మొదలు 1963 వ సంవత్సరాంతము వరకును ప్రాకునని ఊహింపవలయును.

కుజగ్రహ సంబంధమువలన యిచ్చట గ్రహ యుద్ధము సహా ఏర్పడినది. ఈ గ్రహయుద్ధములో కుజుడు ఉచ్చస్థితుడైనప్పటికిని పరాజితుడైనందునను, శని రాజసత్వములో నుండినను ప్రజలు యుద్ధోన్మాదులగుటయేగాని, భయోత్పాతమును, ప్రాణాంతకమును కలిగించు మారణాస్త్రములను ప్రయోగింపనుంకించి తుదకు సాహసించజాలరు. ఒకవేళ సాహసించినను ఉద్దేశ్యములు నెరవేరకపోవచ్చును.

శ్లో. "ఇన శని క్ష్మాసుతే కుమారాన్వితైః" అన్నట్లు రవి, శని, కుజుల కలయికచేత ఈ ప్రభావమునకు గురియైన ప్రాంతములలో ప్రజలు ధన హీనులగుటయేగాక, తమయొక్క కుటుంబములను సహా కోల్పోవు పరిస్థితి యేర్పడును. ఈ గ్రహకూటము ధనిష్ఠా నక్షత్రములోను, అందులోను విష నాడీ కాలములోను కలిగినందున ఈ నక్షత్రములో జన్మించిన వారికేకాక, ఈ నక్షత్రమునకు తారాబలము చాలని వారికి కూడ కొన్ని అశుభములు కలుగును.

కం. "ఒక రాశిన శనియంగా
రకు లుండిన కరువుదోచు రాజులకు తగన్
ప్రకటంబగు బహు కలహ
మ్మకలంక గుణాఢ్య వేంకటాద్రి మహీపా" (రెట్టమత శాస్త్రము)

ఈ దుష్కూట ప్రభావము ప్రజలపైననేకాక, పదార్థముల పైనను పంటలపైనను ప్రదేశములపైనను కూడ గోచరించును.

కంబళ్ళు గోధుమలు మిరపకాయలు బంగారు, పొట్టు ధాన్యము చర్మము, జీలకర్ర, మిరియాలు, ఉప్పు, చక్కెర, సైన్యోపకరణములు, శంఖ రసాయనిక పదార్థములు, చేపలు మొదలగునవి గిరాకీగా నుండును.

ప్రత్తి—పశువులు శృంగార సామగ్రి, మెట్టధాన్యము అరటి, పప్పు ధాన్యము, చింతపండు, వక్కలు, జల ధాన్యములు,

రత్నములు, గుఱ్ఱములు, బొగ్గు, ఇనుము మొదలగు వాటికి ప్రాబల్యము తక్కువ.

ఈ ప్రచండ పరిస్థితులలో యిదియొక ప్రళయమనియు, క్రొత్తయుగము రాబోవుననియు, ప్రజలలో కొంత వరకు అలజడి బయలు దేరినది. కలియుగము మారదు. క్రొత్త యుగమురాదు. కానీ ప్రళయాంతకతుల్యమైన ప్రచండ పరిస్థితులు మాత్రమేర్పడును. అవియును సర్వత్ర ఏర్పడవు. గ్రహప్రభావములు ప్రసరించిన ప్రదేశములలో మాత్రమే కలుగును.

ఈ సంఘటనలవలన ప్రపంచములో రాజకీయార్థికారోగ్య భౌతికాహార వాతావరణములలో గొప్ప మార్పులు రాగలవు. వరదలు, అతివృష్టి, అనావృష్టి, తుపాను, అగ్ని పర్వతములు ప్రేలుట భూకంపము, యుద్ధములు మొదలగునని జరుగును. రాజకీయ నాయకులలో పదవీ భ్రష్టత్వము జరుగవచ్చును.

ఈ విషయములను దృష్టియందుంచుకొని మానవుడు అహింసాతత్వమును, సత్యసంధతను పరోపకార పారీణత్వమును, దైవభక్తిని విడువక సాత్విక వృత్తిలో సంచరించిన భగవంతుడు కాపాడగలడు.

గ్రహబలము కన్నను దైవబల మెక్కువ శక్తివంతమైనది గాన దైవభక్తిని విడువక రాబోవు గ్రహణ పుణ్యకాలములలోను, యితర కాలములలోను ప్రపంచ ప్రశాంత వాతావరణమునకై జపహోమాది క్రతువుల నాచరించుట యుత్తమము.

# దోసముకాని భారత రసదోషము

## శ్రీ కేతవరపు వెంకటరామకోటిశాస్త్రి

"అర్జునుడు విరాటసుతున కిట్లను గేవల వీరరసమయాత్మకుడగుచు" "వీరరసాంబు పూరమును" "రౌద్ర రసవినోదియైన యర్జునుడు" "ఆ విల్లు ద్రుంచి రౌద్ర రసావేశం బొప్ప" "సకల భూతములు మహాద్భుత రసమున మునిగె" "కరుణ నాదమెసగ నాక్రందించె" "రౌద్ర బీభత్స కరుణ భయానక హేతువయ్యె" "సర్వజ్ఞుడు ప్రీతుడగు శాంతరస మొప్పుజూపి",

ఇట్టి వాక్యములు తిక్కన్నగారి భారతమునుండి మరియు నేరి చూపింపవచ్చును. వీటికి తోడుగా "సౌఖ్యరసము" "కోప రసము" వంటివి గూడ చూపింపవచ్చును. స్వశబ్దముచేత స్థాయిసంచారుల రసవర్ధనము అతి ముఖ్యమైన దోషముగా నాలంకారికులు కొందరు నిష్కర్షచేసిరి. అందువలన నేవం విధమైన దోషము తిక్కన్నగారి రచనయందు పూర్తిగా నున్నదని పైన ఉదాహరింపబడిన వాక్యములవలన లెస్సగా స్పష్టము కాగలదు. కాని సూక్ష్మముగా విచారించినచో మొదలది యొక దోషము కాదనియు, భారతము వంటి ఇతిహాసగ్రంథమున నది గుణమే యగుననియు తోచగలదు.

స్వశబ్దములచేత రసాదులను పేర్కొనుట వమనము అనుదోషమని మమ్మటాదులు వ్రాసిపెట్టిరి. తద్దోషకల్పనము కేవలము నిర్మూలమని బహువిధముల విచారింపబడి శ్రీ వేదాల తిరువెంగళాచార్యులవారి ఆంధ్రధ్వన్యాలోకమున సిద్ధాంతము చేయబడినది. కనుక నది దోషమే కాదు. ఆ విషయ మట్లుంచి ముందిచట అది దోషమైనను కొన్ని చోట్ల గుణ మెట్లగుచున్నదో విచారింపబడును.

నవరస గంగాధరమున నీ వమనాఖ్య దోషమును ప్రతిపాదించు సందర్భమున నీ వాక్యము లున్నవి. "స్వశబ్దోక్తి ఉంటే రసము ఆస్వాద్యము కాదు. ప్రకట మయినప్పుడు దాని అభిరుచి తగ్గుతుంధి." ఈ రెండు వాక్యముల యర్థమును విచారించినచో నిట్లుండును. ఏ రసము సహృదయుల కాస్వాద్యము కాకుండుటనే కవి యిచ్ఛగించునో దానిని స్వశబ్దముచేత చెప్పవచ్చును. వ్యంగ్యము కాదగినది వాచ్య మయినచో నది చమత్కారకారి కాదు. అందువలన సహృదయుల కది ఆస్వాద్యము కాదు. ఏఏ రసములయందు సహృదయుల కభిరుచి తగ్గించవలయునని కవి తలపెట్టునో వాటిని స్వశబ్దములతో పేర్కొనినచో సరిపోవును. ఈ ఫలానా రసము సహృదయుల కాస్వాద్యము కావలయు ననుకొన్నప్పుడు మాత్రము దానిని స్వశబ్దముచేత చెప్పరాదు. విభావానుభావసామగ్రి సమగ్రముగా వర్ణించినచో నది వ్యంగ్యమై చమత్కారకారి యగును. అట్లు విభావాదికముచేత నభివ్యక్త మగుచున్న దానిని స్వశబ్దముచేత వాచ్యము చేయుట కాపేయకల్ప మగును. కనుక నది దోషము. జగన్నాథుడు దేనిని దోషముగా సిద్ధాంతము చేసెనో అది కొండొకచో గుణమగుచున్నది. కొండొకచో ననగా నితిహాసముల యందని గ్రహింపవలయును.

మరియు సాహిత్య దర్పణకారుని మతము పరిశీలించినచో పై యర్థము సంగతపడును. "ఎచ్చట విభావానుభావకృత పరిపుష్టి లేమియే అనుగుణమో అచ్చట వ్యభిచారిని తన శబ్దముచేత చెప్పుట దోషముకాదు." మరియు నెచట "విభావాది పరిపోషము ప్రకృతరసప్రతికూలప్రాయ మగునో అచట "స్వశబ్దముచేత చెప్పుటయే న్యాయము" అని అందున్నది. (258, 259 పుటలు చూడవచ్చును.) ప్రకృత రస మనగా అంగియైన కావ్యరసము ఏ వ్యభిచారి భావమును విభావాదులతో పుష్టము చేయుట కావ్యమునందలి ప్రధాన రసమున కనుకూలముకాదో దానిని స్వశబ్దముచేత చెప్పుట

దోషము కాదనియు, మరియు నట్లు చెప్పుట తగుననియు విశ్వనాథకవిరాజు చెప్పుచున్నాడు. ఇపు డిచట సామాన్య బుద్ధితో నిట్లు శంకింప వచ్చును. వ్యభిచారులను స్వశబ్దము చేత నొకచో చెప్పుట దోషము కాదనియే కవిరా జనుచున్నాడు. కాని రసమును స్వశబ్దముచేత చెప్పుట కూడ దోషముకాదని యనుట లేదుకదా ? అని. ఇందుకు సమాధానమాయన గ్రంథమునందే రసదోష నిరూపణము సందర్భమున నున్నది. ''రసమును తన శబ్దముచేత చెప్పుట, స్థాయి సంచారిణులను సయితము స్వశబ్దముచేత చెప్పుట .... రసగత దోషము'' అని అచట వ్రాయబడి యున్నది. రస స్థాయి సంచారిణులను స్వశబ్దముచేత చెప్పుట దోష మన్నది సిద్ధాంత వాక్యము. దానినుండి సంచారిని గ్రహించి ఒకచో నది స్వశబ్దముచేత చెప్పబడుట దోషము కాదనుటవలన రసమును, స్థాయియును చెప్పినట్లే యగుచున్నది. కనుక శంక అనవసరము. అదియునుగాక ''రసము లన్నియు నించుమించుగా వ్యభిచారులే యగునను భరతోక్తిని బట్టి, వాని నామగ్రహణము దోషము కాజాలదనుట, రసనామ గ్రహణము దోషమనుట స్వవచన వ్యాఘాతమగు'' నని స్పష్టముగా శ్రీ వేదాల వారు వ్రాసిరి. అందువలన సంచారి శబ్దముచేత చెప్పబడుట దోషము కాదనుటతో రసమును స్థాయియును గ్రహింపబడనే వలయును. ఇంతకును ఫలితార్థ మిది. కావ్యము నందలి ప్రధాన రసము దృష్ట్యా ఏవి రసభావములు లెస్సగా పోషింపబడుట తగదో వాటిని స్వశబ్దములచేత చెప్పుట దోషము కాదు—అని.

భారతమున ప్రధాన రసము శాంతము. అయినను అది ఇతిహాస మగుటవలన, మరియు పదునెనిమిది దినముల మహాయుద్ధము జరుగుట వలన, మధ్య మధ్య ప్రవర్తించిన అనేకములైన ఉపకథలవలన శాంతరస ప్రతికూలములైన రసభావములు తప్పనిసరిగా చూపింపబడవలసి యున్నవి. అట్లని వాటిని విభావాదులతో విపులముగా వర్ణించినచో ప్రధాన రసమునకు దెబ్బ తగులును. ఎంత జాగ్రత్తగా తగ్గించి తగ్గించి వర్ణించినను నైదు పర్వములను వ్యాపించియున్న యుద్ధమును చెప్పుటలో వీరాదిరసము లెప్పుడేని ఆస్వాద్యములగు ప్రమాద మున్నది. అయినచో ప్రధాన రసము వీగిపోయినట్లే. అట్లు కాకుండ ప్రధానరసము దృష్ట్యా అంగభూతములై భారతమున ప్రవర్తించిన రసములను తిక్కన్నగారు స్వశబ్దములచేత చెప్పుచు వాటియందలి సహృదయుల యభిరుచిని తగ్గించిరి. ఆ యంగ రసభావములకు పరిపుష్టి లేమియే భారతమునకు వలయును. ఎచటనేని అవి కొద్దిగా విభావానుభావకృతపరిపుష్టి కలవి య్యైనను అనగా నగుచున్నను అవి రసములుగా నాస్వాద్య మగుట భారత కర్త కిష్టము కాకపోవుటయే సమంజసము గనుక స్వశబ్దములచేత నాయా రసములను పేర్కొనుటయే చేయదగినది. కనుకనే తిక్కన్నగారట్లు చేసిరి. ఆయనయే కాదు నన్నయ్యగారును భీమసేన జరాసంధుల మల్లయుద్ధమును ''భయానకంబయ్యె'' నని చెప్పనే చెప్పెను. మరియు భారతమునం దంగరసములు తత్తత్సందర్భములయందు విభావాది పరిపుష్టి లేకుండ తావన్మాత్రములుగా నూహ కందిచ్చుట కొరకు వాటిని స్వశబ్దములచేత చెప్పుట జరిగినది. అది భారతమున గుణమే కాని దోష మేమాత్రము కాదు.

స్వశబ్ద వాచ్యరూప వమనాఖ్యదోషము మొదలు దోషము కాదు. అయినను అనౌచిత్యము కొండొకచో నౌచిత్యమై కావ్యోత్కర్షకు హేతు వైనట్లు, కావ్యదోషములును కొండొకచో గుణములై కావ్యపరమార్థమున కుపబలకము లైనట్లు ఈ వమనాఖ్యదోషము కూడ నొకచో దోషము కాకపోవుట సిద్ధాంతము. అనగా నిది దోషముకాని రసదోషము.

ఇక భారతమునం దిది గుణ మెట్లగుచున్నదో కించిత్తు వివరింపబడును.

అర్జునుడు సారథిగా నుత్తరునితో కలిసి కౌరవుల సీదికి వచ్చినాడు. మధ్యలో రథికుడై వచ్చినాడు. ఆ యగుటతో తానే యుద్ధము చేయవలసి వచ్చుటచేత మహావీరుడైన అర్జునునియం దుత్సాహము ప్రబలమైనది. విరాట నగరమునుండి బయలుదేరునపుడు తాను యుద్ధము చేయవలయునని అర్జునున కున్నను, ఉత్తరుడు భయపడి పారిపోవు నంతవరకు నాతడు దానిని వెలికి రానిచ్చుటకు వీలు లేదు. అందువలన నపుడు నానియం దుత్సాహమును వర్ణించుటకు వీలుకాదు. రథికుడై నప్పటినుండి వర్ణింపబడ వచ్చును. కాని భారతమున నుత్తర గోగ్రహణ కాలమున నర్జునుడు చేసిన యుద్ధమే ప్రధాన యుద్ధము కాదు. ప్రధాన యుద్ధమునే విభావాదులచేత పుష్టముచేసి చూపుటకు వీలు కానపు డీ అప్రధాన యుద్ధమున అర్జునుని యుత్సాహమును వర్ణించుట కేమాత్రమును నవకాశము లేదు. కాని అర్జునుని యందలి ఉత్సాహము తత్ప్రకరణమున సహృదయుల బుద్ధికి తోచవలయును. రసముగా నాస్వాద్యము కారాదు. అందువలన విభావాది వర్ణన మేమియు చేయకుండ తిక్కన్నగా రూరక అర్జునుడు వీరరస మయాత్మకు డైనాడని చెప్పి వదలిరి. ఇంకను కొంచెము ముందు వెనుకలుగా విచారించినచో నదియు చమత్కారకారి యగుచున్నది. అర్జునుడు రథికుడై దుర్యోధనుని దెసకు రథము తోలుమని భూమింజయునకు చెప్పినాడు. అతడా పని చేయుచుండగా గాంగేయాదులు తమ రాజున కడ్డపడి కవ్వడి దిక్కుమొగముగా తిరిగి నిలిచిరి. అంత దుర్యోధనుడును సానుజుడు కిరీటికి అభిముఖుడై వెన్నుదన్ని నిలిచెను. ఆపై మిగిలిన కౌరవబల మంతయు కూడగట్టుకొని దళముగా గలిసినది. ఇదంతయు చూచిన అర్జునుడు వీరరసమయాత్మకు డైనాడని తిక్కన్నగారు వ్రాసిరి. అర్జునుని ఉత్సాహాతిశయము చెప్పుటకు వీరరస మయాత్మకత చెప్పబడినది. ఉత్సాహ శబ్దముచేత నప్పటి యర్జునుని పేర్కొనినను స్థాయిభావ శబ్దమును చెప్పినట్లే యగును. రసమును చెప్పినను దాని స్థాయిని చెప్పినను నొకటియే. తద్భేదమును సూక్ష్మముగా విచారించినచో కౌరవసేనా సముదయముయొక్క సమరో

# కలగూరగంప

త్సాహము పార్థునియందు వీరరస పర్యవసాయి యైనట్లు కనిపించుచున్నది. అనగా కౌరవులయొక్క ఉత్సాహము తోడి దళముగా గలిసి తన కెదురై నిలుచుట అర్జునునకు పరమ సంతోషమును కలిగించిన దన్నమాట. శత్రువుల తేజోబలము మును గుర్తించి వారిపై ఎత్తిపోవుట మహావీరుల లక్షణము కదా! అర్జును డట్టివాడు. అంతకుమునుపు కౌరవులు పరస్పర మెట్లధిక్షేపముగా మాటాడుకొనినను అర్జునుడు పైబడ వచ్చునప్పటికి వా రంచరును నెట్లుత్సాహముచేసి యెదురు దన్ని నిలిచినదియు, అది యర్జునుని మీద నెట్టి ప్రభావమును చూపినదియు తిక్కన్న గారావీర రస శబ్దమును సుయోగించి చిత్రముగా నిరూపించిరి. ప్రధానమైన భారత యుద్ధమును తన భుజస్కంధముమీద నడిపింపబోవుచున్న అర్జునన కీ యుత్తర గోగ్రహణ కాలమున కౌరవుల పూనిక లెస్సగా నుత్సాహమును కలిగించినదన్న సూచన లోకాతిశాయి రమణీయముగా నున్నది. విభావాది వర్ణనము లేనందున రసమేమో ఆస్వాద్య మగుటలేదు. రసము స్వశబ్దముచేత వాచ్యమగుటచేత మిగిలిన తత్సంబంధి బహు విషయములు కేవలము వార్తలవలె బుద్ధికి తగిలివచ్చి తత్ప్రకరణమేమో దీప్త మగుచున్నది. అందువలన వీరరసమును అర్జునాత్మకముగా వాచ్యము చేయుట మిక్కిలిగా గుణమే యగుచున్నది.

ఈవిధముగా మిగిలినవాటిని కూడ పూర్వాపరములు విచారించి యర్థము చేయవచ్చును. ఆయా రసశబ్దములు తత్తత్ప్రకరణార్థములను కొద్దిగనో, గొప్పగనో సముద్దీపింప జేయుచునే యున్నవి. కరుణ నాద మొసగ నాక్రందించినది. పది దినములు యుద్ధముచేసిన భీష్ముని అస్తమయమును చెప్పుటకు ధృతరాష్ట్రుని వద్దకు వచ్చిన సంజయుడు, ఆ సంజయుడు శోకించుట ఎట్లున్న దనగా దానిని చూచువారికి కరుణ మాస్వాద్య మగునట్లున్నది. సంజయుని దుఃఖమును మిక్కిలిగా వర్ణించకుండ కరుణ శబ్దమును ప్రయోగించుట చేత నది యంత విపరీతముగా నున్నదన్న యర్థము బుద్ధికందించుచున్నది. మరియు నది ధృతరాష్ట్రున కుద్దీపక మగుచున్నది. యుద్ధ కథనమునకు ముందట్టి శోకము ప్రవర్తించుటచేత యుద్ధ రసభావముల దీప్తి సహజముగా కొంత తగ్గిపోయినది. ప్రధానరసము దృష్ట్యా అది యవసరము. కనుక కరుణశబ్దము పేర్కొనబడుట గుణమే కాని దోషము కాదు. రౌద్ర భీభత్స కరుణ భయాన కైకహేతువయ్యెనను నీ మొదలుగా రసనామములు గుచ్చి యెత్తబడుట యున్నది. ద్రోణుని రెండవనాటి, నాల్గవనాటి యుద్ధములను వర్ణించుచో చెప్పబడిన వాక్యము లవ్వి. ద్రోణుడు సేనానాయకుడైన రెండవనాడు సంశప్తకులతో యుద్ధము చేయుట కర్జునుడు వేరుగా తొలగిపోయినాడు. అత డట్లు తొలగిపోయిన తరువాత ద్రోణుడు ధర్మరాజు మొదలైనవారి యుద్ధమింకొకప్రక్క జరిగినది. అనగా నాడు రెండుచోట్ల విడి విడిగా యుద్ధములు జరిగినవి. ద్రోణుడు పాంచాల బలంబుల మీద విజృంభించె నన్న మాత్రము చెప్పబడి ద్రోణుని యుద్ధవర్ణన మాపబడినది. సంశప్తకులతోడి యర్జునుని యుద్ధము వరుసగా వర్ణింపబడినది. అదియైన తరువాత కొంతసేపటికి తిరిగి ద్రోణుని యుద్ధమందు కొన్ని ఘట్టములో వర్ణింపబడినది. ఆ సందర్భమున మొదటినుండియు ద్రోణుని యుద్ధము తీవ్రమై కొనసాగింపబడుచు వచ్చుచున్నదను విషయము స్ఫురింప జేయుటకుగాను రౌద్ర బీభత్సాది రసములు నామములచేత వరుసగా గుచ్చి యెత్తబడినవి. అర్జునుని యుద్ధము నాపి ద్రోణుని యుద్ధమును వరుసగా వర్ణించినను, అర్జునుని యుద్ధమందుకొనుచో నైనను నట్లు చెప్పవలసినదే. అర్జును నాహ్వానించి ప్రత్యేకము ప్రక్కకు సంశప్తకులు తీసికొని పోయినారు గనుక వారితోడి అర్జునుని యుద్ధము మధ్యలో నాపబడకుండుటయే యుచితము. కనుకనే అది వరుసగా వర్ణింపబడినది. మరియు ద్రోణుడిచ్చిన అద్భుత కవచమును ధరించి దుర్యోధను డర్జునుని తాకపోవుటకు ముందుగా నర్జునుని యుద్ధ తీవ్రతను చెప్పుచు భీభత్సరౌద్ర మహాద్భుతములు వరుసగా పేర్కొనబడినవి.. అంత మహాత్మవమైన వీరుని దుర్యోధను డెదుర్కొనబోవుచున్నా డనగా వాని చేతిలో నాత డెందుకును గాకుండ బోవునన్న స్ఫురణ మందిచ్చిన ట్లగుచున్నది. సైంధవుని వధించుటకు ప్రతిన చేసిన పార్థుని నాటి వీరవిహారమును కేవల మాయా రసశబ్దములు తమ యర్థముల చేతనే స్ఫురింపజేయుచున్నవి. అందువలన నట్లు వరుసగా చెప్పబడుటయు గుణమే అగుచున్నది.

ఇది అంగరసముల విషయము. 'అంగిని కూడ శాంతరస మొప్పుజుమీ' అని ఈ మొదలుగా తిక్కన్నగారు వ్రాసిరికదా అన్నచో వ్రాసిరి. అసలు రస మెప్పుడును వాచ్యముకాదు. అది ఏవిధముగను వాచ్యము చేయబడదు. రసానందము బ్రహ్మానంద సహోదరము కదా! బ్రహ్మమునే శబ్ద మెట్లు చెప్పలేదో అట్లే రసమును శబ్దము చెప్పలేదు. సత్యజ్ఞానానందాది శబ్దము లుపలక్షణావృత్తిచేత బ్రహ్మమును సూచించినట్లే శృంగారాది శబ్దములుపలక్షణయా ద్యోతకములై రసమును సూచించును. అనగా శృంగారాది శబ్దములు రసవాచకములు కావు. రస లక్షకములు. అందువలన శాంతరస మన్నంత మాత్రమున నది వాచ్య మగుటలేదు. స్వశబ్దవాచ్య రూప వమనాఖ్యదోషము దోషము కాజాల దనుటలోని ఆంతర్య మిదియే. అసలు విషయ మిది—స్వశబ్ద వాచ్యత యను దోషము రసమునకు లేదు. ఉన్నదనుకొన్నను అది కొన్నిచోట్ల దోషము కాదు. మరియు గుణము. కొన్నిచోట్లనగా భారతము వంటి ఇతిహాసములయందని యర్థము.

# నక్షత్రాల పుట్టుపూర్వోత్తరాలు

శ్రీ వడ్డాది కామేశ్వరరావు

"ఓం సహస్ర శీర్షం దేవం విశ్వాక్షం విశ్వశంభువం
విశ్వం నారాయణం దేవ మక్షరం పరమం పదం.

విజ్ఞానాభివృద్ధి దినదిన ప్రవర్ధమానంగా సాగిపోతోంది. అనాదిగా ప్రకృతిరహస్యాలు తెల్సుకోడానికి మానవుడు కన్నకలలు ఫలిస్తున్నాయి. ఆనాడు విశ్వామిత్రుడు అంతరిక్షానికి పంపిన త్రిశంకుడు అక్కడే ఉండిపోయాడు కాని, నేటి అపరవిశ్వామిత్రులు పంపిన త్రిశంకు లిద్దరూ నింగినుంచి తొంగిచూచి తిరిగి రానే వచ్చారు. రోదసీ రహస్యాలు తెలుసుకోడానికి నిరంతరంగా జరుగుతున్న సర్వతోముఖమైన యీ కృషి ఫలితంగా ఎన్నో చిత్రవిచిత్రమైన సంగతులు తెలుస్తున్నాయి. శంభుని మకుట భూషణపు అంతరంగిక రహస్యాలు తెలుసుకోడానికి శాస్త్రజ్ఞులు విరహవేదన పొందుతున్నారు. నేడో రేపో శాస్త్రజ్ఞుల దూతలు చంద్రమండలంతో ప్రవేశించే సుముహూర్తం ఆసన్నమయింది. 'సర్వశాస్త్రప్రవక్త' దైత్యుల పరమగురువు అయిన భార్గవునికి రష్యా పంపిన సందేశం (Venus rocket) యీపాటికి అందే ఉండవచ్చు. మానవులు సృష్టించిన ఉపగ్రహాలెన్నో భూమిచుట్టూ తీతువుపిట్టల్లా అరుస్తూ తిరుగుతున్నాయి.

కాగా మనభూమి మనకి చాలా పెద్దదిగా కనపడవచ్చు. అయినా ఈ భూమి, సూర్యునితో పోల్చి చూస్తే నెరుసుకంటె చిన్నది. అంతపెద్ద సూర్యభగవానుడు సైతం, అనంతకోటి నక్షత్రాలలో ఒకనక్షత్రం మాత్రమే ననీ, భూమి నవగ్రహాలు, అజ్ఞాతంగా ఉన్న యితరగ్రహాలు, ఉపగ్రహాలు, వీటితో నిండిన మన సూర్యమండలంకన్న లక్షలాదిరెట్లు పెద్దవయిన నక్షత్రాలెన్నో అంతరిక్షంలో ఉన్నాయనీ, అంటే, చాలామందికి ఆశ్చర్యంగా కనపడవచ్చు. కాగా ఆద్యంతరహితమైన యీ విశ్వంలో అనంతకోటి నక్షత్రాలు ఉద్భవించడం విచ్ఛిన్నం కావడం మాత్రం నగ్నసత్యం.

ఖగోళంలో మన భూమికి దగ్గరగాఉన్న నక్షత్రం సూర్యుడు. సూర్యుడు మనకి తొమ్మిదికోట్ల ముప్ఫయి లక్షల మైళ్ళ దూరంలో ఉన్నాడు. ఈ నక్షత్రాలకి మధ్య నుండే దూరం చాలా ఎక్కువ కనుక, వీటిని మనకి తెలిసిన మానంలో, అంటే ఇన్నికోట్ల మైళ్ళని చెప్పడం సాధ్యపడదు. సూర్యుడికీ, అన్నిటికంటే సూర్యుడికి దగ్గరయిన మరో నక్షత్రం 'ఆల్ఫా సెంటారీ' కి మధ్యగల దూరాన్ని కోట్ల మైళ్ళలో చెప్పాలంటే, ఏనుగు బరువు నువ్వుగింజలతో తూచినట్లుంటుంది. అందుకని శాస్త్రజ్ఞులు నక్షత్రమధ్యస్థమయిన దూరాలు కొలవడానికి ఒక కొత్త మానం కనిపెట్టారు. దీనినే కాంతి సంవత్సరం అంటారు. అంటే కాంతి కిరణం సెకండుకి ఒకలక్షా ఎనభయి ఆరువేల మూడువందల మైళ్ల చొప్పున ఒక సంవత్సరములో ఎంతదూరం ప్రయాణం చేస్తుందో ఆ దూరాన్ని ఒక అంశగా తీసుకున్నారు. 'అణోరణీయాన్, మహతో మహీయాన్' అయిన యీ విశ్వాంతర రహస్యాల జిజ్ఞాసకి నూతన పరికరాలూ, అధునాతనమైన ఈ మానాలూ ఎంతైనా అవసరం. ప్రస్తుతం ఉన్న దూరదర్శినులు, రేడియో దూరదర్శినులు సుమారు వెయ్యికోట్ల కాంతిసంవత్సరాల దూరంవరకూ మాత్రమే పరీక్షించగల్గుతున్నాయి. వీటివల్ల కనిపెట్టిన నక్షత్రమండలాలు కాక యితర నక్షత్రమండలాలు ఎన్నో అసంఖ్యాకంగా ఉన్నాయని శాస్త్రజ్ఞుల నమ్మకం.

ఖగోళంలో నక్షత్రమండలాలు కదలకుండా నిశ్చలంగా ఉన్నాయా ? వాటిలోకూడా సంచలనం ఏదైనా ఉందా ? అన్న సందేహం చాలాకాలంగా విజ్ఞానవేత్తలకి కలుగుతూనే వచ్చింది. కడచిన శతాబ్దంలో నక్షత్రమండలాలు ఏవిధమైన కదలికలేకుండా ప్రశాంతంగా ఉన్నాయనీ, భవిష్యత్తులో కూడా అలాగే ఉంటాయనీ అనుకునేవారు. కాని యీ శతాబ్దంలో నూతన పరిశోధనలఫలితంగా ఆ అభిప్రాయం మార్చుకున్నారు.

జర్మన్ శాస్త్రవేత్త క్రిస్టియన్ డాప్లర్ కనిపెట్టిన సిద్ధాంతం, శబ్దవిషయంలోనేకాక, తరంగరూపంలో ప్రసరించే ప్రతి శక్తికీకూడా వర్తిస్తుందని కనుగొన్నారు. దీనిననుసరించి, కదులుతున్న గ్రహంగాని, నక్షత్రంగాని మనవైపు వస్తున్నట్టయితే, దానినుంచి వచ్చే కాంతియొక్క తరంగ దైర్ఘ్యం (Wave length) తగ్గుతుందనీ, ఇదేవిధంగా ఆ నక్షత్రం మననుంచి దూరంగా పోతూంటే దాని తరంగదైర్ఘ్యం హెచ్చుతుందనీ కనిపెట్టారు. నక్షత్రమండలాలనుంచీ నక్షత్రాలనుంచీ వచ్చే కాంతితరంగాలని పరీక్షించి చూడగా, వాటి తరంగదైర్ఘ్యం హెచ్చినట్లు తేలింది. అంటే ఖగోళంలో నక్షత్రాలూ, నక్షత్రమండలాలు నిశ్చలంగా లేవనీ అవి ఒకదానినుంచి ఒకటి ఊహాతీతమైన వేగంతో దూరంగా వెళ్లిపోతున్నాయనీ, యీ విశ్వం యితోధికంగా పెరిగిపోతోందనీ తెలిసి శాస్త్రజ్ఞులు విస్తుపోయారు. అంతేకాదు. మననుంచి నక్షత్రమండలం దూరం హెచ్చినకొలదీ దాని వేగం హెచ్చుతోంది. అంటే మనకి వందకోట్ల కాంతిసంవత్సరాల దూరంగా ఉన్న నక్షత్రమండలంకన్న రెండు వందల కోట్ల కాంతిసంవత్సరాల దూరంలో ఉన్న నక్షత్రమండలం ఎక్కువ వేగంతో దూరంగా వెళ్లిపోతోందన్నమాట. దీని కర్థం విశ్వం అనంతంగా, అవ్యయంగా గాలిబుడగలా పెరిగిపోతోందన్నమాట. దీనినే ఆంగ్లంలో (Expanding universe) అంటారు.

ఈ పెరుగుదలకి గల కారణాల గురించి రెండు సిద్ధాంతా లున్నాయి. ఒకటి అమెరికన్ ఖగోళ శాస్త్రజ్ఞుడు జార్జిగేమావ్ ప్రతిపాదించినది. రెండవది ఆంగ్ల

శాస్త్రజ్ఞుడు ఫ్రెడ్ హొయల్ ప్రతిపాదించినది. గేమావ్ సిద్ధాంతం ప్రకారం ఈ సృష్టికంతటికీ మొదలు ఎప్పుడో ఒకప్పుడు ఉందంటాడు. సృష్టి ప్రారంభసమయంలో, ఇన్ని నక్షత్రమండలాలు, నక్షత్రాలు మొదలయినవి లేవనీ, వీటి అన్నిటికీ బదులుగా ఖగోళంలో ఉన్న పదార్థం యావత్తూ, ఒక్కటే ఒక్క మహాణువులో ఇమిడిఉండేదనీ అతని వాదం. ఈ మహాణువు ఏదో అజ్ఞాతమైన కారణంవల్ల విచ్ఛిన్నమయి అణువులూ, పరమాణువులూ ఉద్భవించాయని అతని ఊహ. ఖగోళం పెరగడం యీ మహాణువు విచ్ఛిత్తి యొక్క ఫలితమని గేమావ్ సిద్ధాంతం. ఈ సిద్ధాంతం అంగీకరిస్తే మనకొక సందేహం కల్గుతుంది. అసలీ సృష్టికి కారణభూతమైన ఆ మహాణువుకి కావలసిన మూలపదార్థం ఎక్కడినుంచి వచ్చింది? దీనికి సమాధానంగా గేమావ్ అంతకు పూర్వం ఉన్న ఖగోళంలో గల పదార్థం యావత్తు ఒకచోట ఏకత్రితమవడం వల్ల ఈ మహాణువు తయారయిందంటాడు.

ఇక ఫ్రెడ్ హొయల్ సిద్ధాంతంప్రకారం ఖగోళంలోగల ఖాళీస్థలాలలో ఉదజని అణువులు ఎల్లప్పుడు ఉద్భవిస్తూ ఉంటాయనీ ఇవే నక్షత్రమండలాలక్రింద తరువాత మారతాయనీ తెలుస్తోంది. దీనివల్ల ఖగోళం నిర్విరామంగా పెరుగుతోందంటాడు. ఇది ఆదిమధ్యాంతరహితంగా జరుగుతున్న సంఘటన అని అతని వాదం. ఈ ఉదజని అణు ఉద్భవం చాలా నెమ్మదిగా జరిగినా, ఒక పరిమాణపు స్థలంలో (Unit space) చాలా కొద్ది అణువులే ఉత్పన్నమయినా, ఖగోళంలో ఉన్న స్థలం అంతులేనిది కావడంచేత, మొత్తం ఉదజని చాలానే ఉంటుందని ఫ్రెడ్ హొయల్ అభిప్రాయం. అయితే, నక్షత్రాలలో ఖర్చు అయే ఉదజని, కొత్త నక్షత్ర మండలాల జననంలో ఉపయోగించబడే ఉదజనికూడా ఖగోళంలో ఉద్భవించే ఉదజనితో సుమారు సమానమే అవుతుందని హొయల్ సిద్ధాంతం. దీనినే క్షరాక్షరసమత్వము లేక వ్యయావ్యయసమత్వము (Dynamic balance)అంటారు.

ఇక నక్షత్రాల జననంగురించి తెలుసుకుందాం. ఏదో ఒక కారణంచేత ఖగోళంలో ఉదజని ఉత్పన్నమయిందనుకుందాం. ఈ ఉదజని విశ్వాంతరాళంలో ఉన్న ధూళితో కలిసి నక్షత్రజననానికి కారణమవుతుంది. వాయురూపంలో ఉన్న ప్రతీ పదార్థంలోనూ అణువులు ఎప్పుడూ నిశ్చలంగా ఉండవు. అవి ఎప్పుడూ కదులుతూ ఉంటాయి. వీటి వేగం వాయువుయొక్క ఉష్ణోగ్రతకి సంబంధించి ఉంటుంది.

ఆంగ్ల గణితశాస్త్రజ్ఞుడు సర్ జేమ్స్ జీన్సు, వాయువులోగల అణువులు అనేకచోట్ల ఏకత్రితమౌతూ ఉంటాయని నిరూపించారు. భూమిచుట్టు గల వాయుమండలంలో కూడా యిటువంటిది తరుచు జరుగుతూనే ఉంటుంది. కాని భూమి ఆకర్షణశక్తివల్ల యివి ఏకత్రితం కాకుండా విడిపోతాయి. కాగా ఖగోళంలో యిటువంటి నిరోధం ఏదీ లేకపోవడంచేత, ఇటువంటి అణువులు సన్నిహితమయి ఏకత్రితమయినప్పుడు వాటిలో చాలా ఉదజని చిక్కుకుంటుంది. ఈవిధంగా సన్నిహితమవడంచేత ఉదజని సంయోజనం జరుగుతుంది. దీనినే ఆంగ్లంలో (Condensation of inter stellar hydrogen) అంటారు. ఈ సంయోజనం జరిగిన వెంటనే దానిలో గల ఉదజని అణువులయొక్క ఆకర్షణ శక్తి మిగిలిన అణువులపై ఎక్కువ అవుతుంది. అందుచేత ఆ అణువులు మరింత దగ్గరగా వస్తాయి. తత్ఫలితంగా ఆ అణువుల ఆకర్షణశక్తికూడా పెరుగుతుంది. ఈ సంయోజనం ప్రక్రియవల్ల ఆ ప్రాంతంలో నక్షత్ర మండలాలు ఏర్పాటుకావడంలో ప్రథమ దశ ఏర్పడుతుంది. ఇక ఆ నక్షత్రమండలంలో కూడా అంతకన్న చిన్న ఛాయాలో ఇదే రకపు అణుసంయోజనం జరుగుతూ వస్తుంది. దీనివల్ల నక్షత్రాల జననం ప్రారంభమవుతుంది.

ఈవిధంగా సంయోజనమయిన ఉదజనివాయువుకి దాని పీడనశక్తి హెచ్చుతుంది. కాని జౌల్, థాంప్సన్, అన్నవారి సిద్ధాంతంప్రకారం వాయువుయొక్క పీడనశక్తి హెచ్చినకొద్దీ దాని ఉష్ణోగ్రత కూడా హెచ్చుతుంది. ఈవిధంగా ఉదజనివాయువు ఉష్ణోగ్రత హెచ్చుతూ సుమారు 70 లక్షల డిగ్రీల సెంటిగ్రేడ్ దాటేసరికి, ఆ ఉదజని వాయువులో గల అణువులచుట్టూ తిరిగే ఋణ విద్యుత్కణాలు (ఎలక్ట్రానులు) ఆ అణువుని విడిచిపెడతాయి. అందుచేత ఆ ఉదజనివాయువు ఋణవిద్యుత్కణ రహితమైన అణుగర్భాలుగా మారుతుంది. కాగా ఈ ఉష్ణోగ్రత కల్గడంవల్ల ఆ అణుగర్భాలు (ఎలక్ట్రానులు) వేటికవి అతి వేగంతో సంచరిస్తూంటాయి.

అణుగర్భాలు (Atomic nuclei) ఎల్లప్పుడు ధన విద్యుచ్ఛక్తి కలిగిఉంటాయి. అంచేత అవి ఒకదానితో ఒకటి విముఖత కలిగిఉంటాయి. అయితే 70 లక్షల డిగ్రీల ఉష్ణోగ్రత కలిగినప్పుడు అణుగర్భాలయొక్క వేగం, వాటి విముఖతాశక్తికన్న అతీతం అవడంవల్ల అవి ఒకదానికొకటి చాలా దగ్గరగా వస్తాయి. అప్పుడు వాటిలో అణుసమ్మేళనం (Atomic fusion) ప్రారంభమవుతుంది. అయితే సమ్మేళనం అయేవి ఉదజని అణువులు కాబట్టి దీనిని హైడ్రోజన్ ఫ్యూజన్ అంటారు. ఇదే ఉదజని బాంబులు లేక హైడ్రో

బాను బాంబులలో మూలశక్తి. ఇదే సూర్యుని అంతరాళంలో జరిగి భూమిని మానవనివాసయోగ్యంగా చేయడానికి తోడ్పడుతున్న శక్తి. ఇదే నక్షత్రాల తళుకు బెళుకులకి కారణం. ఇదే బహుశః, రాజకీయవేత్తలు తప్పటడుగువేస్తే, తృతీయ ప్రపంచ సంగ్రామంలో మానవజాతి విధ్వంసానికి కారణభూతం కావచ్చును. లేదా దీనిని శాంతియుతప్రయోజనాలకి వినియోగిస్తే, అణుయుగానికీ మానవాభ్యుదయానికీ నాంది ప్రస్తావన జరుగుతుంది.

# విచిత్రపు వీరశిల

## శ్రీ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి

నెల్లూరు కటారి వీధికీ (పంట) కాలువకీ నడుమ చర్మకారుల గుడిసెలు కలవు. వాటిముందు నల్లరాతి పానవట్టమొకటి కలదు. దీని పొడవు గజమూ, వెడల్పూ ఎత్తూ అడుగున్నర. పై భాగములో అభిషేకజలము అంచు అంతటా పార్లిపోకుండా పావిక అంగుళము ఎత్తైన అంచు పట్టీ ఉన్నది. ఒక పొడవు టంచుకు చేరువగా ఈ పానవట్టముమీద అమర్చిఉండిన విగ్రహము అడుగునవుండే కుళిని బిగించడానికి జానెడు లోతుగల రంధ్రమున్నది. వింతలలో వింతగా ఈశిల నిలువు పార్శ్వము మీద మూడు మానవ శీర్షకములూ ఇటూ అటూ ఒంటెలూ? అర్ధశిల్పంగా చెక్కి ఉన్నాయి. జైనులు నిర్మించిన పానవట్టములమీద సింహాలూ, అంచు పొడుగునా ఎత్తు మీద శాసనాలూ వుండడము అమరాపురమువంటి బస్తీలలో కానవస్తుంది. మానవ శీర్షము లుండడము క్రొత్త. ఈ శీర్షములకు జుట్లు చక్కగా ముడిచి పైకికట్టియున్నవి. చెవులకు వ్రేలాడుతూన్న కుండలాలున్నవి. చిరకాలముగా ఇది ఏమి కావచ్చునని చింత చేస్తూ వుంటిని.

ఈ నడుమ 'ధర్మపాల విజయము' అనే కాంస్యకార వీరచరిత్రము చూడ లభించినది. దానిలోని కథ యిది. ధర్మపాలుడనే కల్యాణ నగర శిల్పి శంకరుడనే మునిప్రోత్సాహమువల్ల కంచిలో తన లోహ నిర్మాణములను అమ్మబెట్టెనట. కంచికి రాజు చోళాంగుని కూతురు, చూడికుడుత, ఆ శిల్పాలలో రెండు అద్దములను మంత్రిచేత తెప్పించుకొనెనట.దాని మూల్యమును అడిగినాడని కినిసి రాజు ఆ శిల్పికుమారుడు రుద్రసేనుణ్ణి అవమానింపగాఅతడు మంత్రశాస్త్రవేత్త గనుక అదృశ్యుడై తమఅంగడికి చేరుకొని తండ్రితోనూ, సోదరులు భద్రసేన ఇంద్రసేనుల తోనూ చెప్పి, యుద్ధసన్నద్ధుడై రాజు సేనాధిపతులనందరినీ మట్టుబెట్టెనట. రాజు శంకరమునిని బ్రతిమాలి, వారు శనివారమునాడు అస్త్రశస్త్రములను ముట్టరన్న రహస్యమును రాబట్టి, శనివారము నాడు ముకురమూల్యమునిచ్చి సన్మానింతునని పిలిపించి, ముగ్గురు కొడుకుల తలలూ కొట్టించెనట. కామాక్షీ దేవ్యుపాసకుడైన వారి తండ్రి ధర్మపాలుడు ఆ తలలను కామాక్షీదేవి పాదములకడనుంచి ప్రార్థించి, వారందరినీ పునర్జీవితులనుచేసి అమ్మవారికి ఆ మూడు శీర్షములూ పీఠముమీద నమర్చిన రూపముతో, పాదములకు—ఆ శీర్షములు కూడా పూజింపబడవలెననే ఊహతో—మాత్రమే పూజ జరుగవలెనని కోరి వరము పొందెనట.

ఇది కంచిలో జరిగిన కథ. కంచిలోవున్న మూడు కామాక్షి ఆలయాలలోనూ, కాంస్యకారుల ధర్మ కర్తృత్వములో వున్న ఒక్క కామాక్షి ఆలయములోని కామాక్షీదేవి పీఠము మీద రుద్రసేన, భద్రసేన, ఇంద్రసేనుల శీర్షములు—పైన చెప్పిన నెల్లూరి పానవట్టముమీదనున్నట్లే—ఉన్నవి. ధర్మపాల విజయములో ఆ బొమ్మ వున్నది.

కనుక నెల్లూరి శిల కాంస్యకారశిల్పులు నిలిపిన వీర శిలయేనన్నమాట. దానిమీది కామాక్షి అమ్మవారి విగ్రహమును మతాంతరులు విరగగొట్టిఉండవచ్చును.

ఆ కంచిరాజు చోళాంగుడెవరు? అన్న ప్రశ్నకు ఊహాలే ఆధారము. ధర్మపాల విజయములో చోళాంగుడొకచోట "మా శత్రువు కళింగుడు నవ్వడా?" అన్నట్లు చెప్పబడినది. కంచికి శత్రువులైన కళింగులు కపిలేశ్వర గజపతీ, ఆతని కుమారుడు పురుషోత్తమ గజపతీవి. వీరి పరిపాలనాకాలము 1435 నుండి 1497 వరకూను. పురుషోత్తమ గజపతి కాంచీపుర రాజకన్య నడిగి తిరస్కృతుడై దండయాత్రకుపోయి ఆ రాజును చంపి ఆమెను తెచ్చుకున్నట్లు కథ లున్నవి. ఈ గాథ అప్పటిది కావచ్చును.

ఈ ధర్మపాల చరిత్ర పేర్కొనే మరియొక వింత తిరుపతి సుబ్రహ్మణ్య క్షేత్రమనీ, శ్రీమద్రామానుజులు వెంకటేశ్వరక్షేత్రముగా మార్చినారననీ. సుబ్రహ్మణ్య స్వామి శంఖచక్ర త్రిశూలధారియట. నాగాభరణుడట! తిరుపతి స్వామి మూల రూపమేదో ఆయనకే తెలియనీయక, అర్చకులాయన కళ్ళమీదకు సున్నపు నామము పూసినారు. మరి యీనాడైనా ఆయన అసలు రూపమేదో ప్రచురింతురా దేవస్థానము వారు?

ఈ రకముగా శిల్పించిన కామాక్షి విగ్రహము ఎప్పటిదై ఉంటుందీ? అన్నది చక్కని ప్రశ్న. కల్యాణి నగరము శోభ క్రీ. శ. 970 నుండి సుమారు 1150 వరకూ—అనగా కల్యాణి చాళుక్యుల పరిపాలనాకాలం—అనుకుంటే ఈ శిల్పము అప్పటిది అనవచ్చును.

"అలంపురములో బాల బ్రహ్మేశ్వరాలయ మహాద్వారములో ఉత్తరము వైపు గుడిలో ఉన్నతమైన కామాక్షి విగ్రహమును 14 వ శతాబ్దమున హోమాడిరాయని మంత్రి అయిత రాజు ప్రతిష్ఠించినాడ"ని వ్రాస్తూ శ్రీ గడియారము రామకృష్ణశర్మగారు ఆమె విగ్రహము ఫొటోను ప్రచురించినారు. ఆదేవి చేతిలోని ఆయుధాలు చాముండాదేవి చేతి ఆయుధాలే. డమరుక, త్రిశూల, ఖడ్గ, రక్తపాత్రలు. (చూ. దక్షిణ వారణాసి' ఏడవ చిత్రము) అయితే ఈమె వాహనము పూజారులు ఆమెకు కట్టబెట్టిన చీర కుచ్చెళ్ళలో మరుగుపడిపోయినది. అది ఏదని వారిని

అడిగికొంటిని. వారు దయతో "నడిమి వరుసలో మూడు శిరము లున్నవి. వాహనమూ చిహ్నమూలేవు" అని వ్రాశారు. పైన వర్ణించిన కామాక్షియే ఈమె కూడాను. ఈ విగ్రహము క్రీ. శ. 1353 నాటిది (చూ అలంపూరు శిథిలములు—14 శాసనము) ఈ విధముగా కంచి గుడిలోని విగ్రహమూ, నెల్లూరి శిథిలపైన వట్టమూ, అలంపురములోని విగ్రహమూ సామరస్యమును చూపడము ముచ్చటకాదా?

# అప్పయ్యదీక్షిత వంశ్యుల ప్రతిభ

శ్రీ కోన వెంకటరాయశర్మ

తంజావూరును పరిపాలించిన శహాజీ మహారాజు సంస్కృతమున "శబ్దరత్నసమన్వయము" "శబ్దార్థ సంగ్రహము" నను నిఘంటువుల రెండింటిని రచించినాఁడు. ఇంతియకాక క్రీ. శ. 1693 వ సంవత్సరమున "తిరుశనల్లూరు" గ్రామమునకు "శహాజీ రాజపుర"మను నామకరణ మొనర్చి యా గ్రామమునకు "అభినవ పతంజలి" శ్రీ రామభద్ర దీక్షితుఁడు, శ్రీధర వేంకటేశార్యుఁడు, "సిద్ధాంత సిద్ధాంజనము"నకు "రత్న మాలిక" యను వ్యాఖ్యను రచించిన శ్రీ భాస్కర దీక్షితుఁడు "కవితార్కిక సార్వభౌమ" శ్రీ పెరియప్పకవి "విద్యాపరిణయము" "జీవానన్దము"ల రచించిన శ్రీ వేదకవి "అద్భుత దర్పణము"ను రచించిన శ్రీ మహాదేవకవి, "వల్లీ పరిణయము" లోనగునవి రచించిన శ్రీ వీరరాఘవకవి 'అభినవ పతంజలి' యను శ్రీ రామభద్ర దీక్షితుని శిష్యుఁడు, బంధువు నైన శ్రీ భూమినాథకవి,—మొదలగు నలుబది యార్గురు విద్వాంసులకు ధారాపూర్వముగ నొసంగినాడు.

ఇమ్మహారాజునొద్ద మంత్రిసత్తముఁడగు త్ర్యంబకరాయమఖి, యేకోజీ మహారాజునొద్ద సచివోత్తముఁడై ప్రతిభ గాంచిన గంగాధరమఖి,—వీ రిద్దఱును అప్పయ దీక్షితుని వంశ్యులు.

గంగాధరమఖికి నరసింహరాయమఖి, త్ర్యంబకరాయమఖి, భగవంతార్యమఖి,—అను మువ్వురు కొమాళ్ళు గలరు. నరసింహరాయమఖి యేకోజీమహారాజునొద్ద గంగాధరమఖి యనంతరము మంత్రిగాఁ దేజరిల్లినాఁడు. "త్రిపుర విజయ చంపువు"ను నరసింహరాయమఖి విరచించినాఁడు. త్ర్యంబకరాయమఖి శహాజీ మహారాజునొద్దను, ఆవల శరభోజీ మహారాజు దగ్గఱను, గూడ సచివత్వము నెఱపినాఁడు. అంతతో దనివోక రామాయణమునకు "ధర్మకూతము"నను, వ్యాఖ్యను "స్త్రీ ధర్మము"నను మఱియొక గ్రంథమును,—రచించినాఁడు. శహాజీ మహారాజు ప్రోత్సాహముకతమ్మున గ్రీస్తుశకము 1696 వ సంవత్సరమున గుంభఘోణము (Kumbakonam) నొద్ద బ్రహ్మాండమైన యజ్ఞమొకటి జరపించినాఁడఁట !

భగవంతార్యమఖి త్ర్యంబకరాయమఖి యనంతరము శరభోజి మహారాజునొద్ద మంత్రిత్వముఁ జేసినాఁడు. "రాఘవాభ్యుదయము (నాటకము), "ముకుంద విలాసము" (కావ్యము), "ఉత్తర చంపువు" నను గ్రంథమును గూడ నిమ్మహాసచివుఁడు విరచించినాఁడు.

నరసింహరాయమఖి కుమారుఁడును, గంగాధరమఖి మనుమఁడును నగు ఆనందరాయమఖి శహాజీ యొద్దను, మొదటి శరభోజీ దగ్గఱను, ఖ్యాతిఁ గాంచిన మంత్రిసత్తముఁడు. ఇమ్మంత్రి చూడామణి ఆశ్వలాయన గృహ్యసూత్ర వ్యాఖ్యను రచించినాఁడు. ఆనందరాయమఖి మంత్రియు, విద్వత్తిలకము నౌటచే వేదకవి "విద్యా పరిణయము"ను, అప్పాధ్వరి "ఆచార నవనీతము"ను,— రచించి యానందరాయమఖికి గ్రంథకర్తృత్వ ఖ్యాతి నినుమడించిరని చెప్పఁబడుచున్నది. కావుననే వేదకవి రచియించిన "విద్యాపరిణయ"మందలి—"సకలరాజ్య ధురంధరస్య శరభ మహారాజ మంత్రిశిఖామణే రస్య జనక సనక.......... ధౌరంధ రేయ మితిమే మహదాశ్చర్యమ్.

"ఆ బాల్యాదపి పోషితోఽజని మయా
 ప్రేమ్ణా తయా లాలితః
తేనాసౌ సరసా ముష్మైతు కవితా
 మానందరాయాధ్వరీ
ఇత్యేక క్షితిపాల వంశ జలధీ
 ర్దేవ్యా గిరా జాతయా
ధీర శ్రీ శరభావనీంద్ర వపుషా
 నూనం ప్రసాదః కృతః"

అను వాక్యములు ఆనందరాయమఖి యొక్క ప్రతిభను జాటుచున్నవి.

"మన్నారుగుడి" వాస్తవ్యుఁడయిన త్యాగరాజమఖి అప్పయ దీక్షిత వంశ్యుఁడు. ఇతఁడు శాస్త్రము లన్నిఁటి నాఱితేఱినవాఁడు. ఈ త్యాగరాజమఖి నారాయణ యతీంద్రునొద్దఁ దర్కశాస్త్రమును, గోపాలాచార్యుల కుఱంగటు ముక్తావళిని, కుంభఘోణము వాస్తవ్యుఁడగు చిన్నన్న దీక్షితునియొద్ద వ్యాకరణ శాస్త్రమును, కుంభఘోణము నివాసియేయగు రఘునాథ శాస్త్రి దగ్గఱ మీమాంసా శాస్త్రమును, స్వయంప్రకాశస్వామి యొద్ద వేదాంతశాస్త్రమును,—అభ్యసించి ముప్పది గ్రంథములకుఁ బైగా రచించినట్లు తెలియుచున్నది. ఈ ముప్పది గ్రంథములలో జెప్పుకోఁదగ్గ గ్రంథము "సద్విద్యా విలాసము" అను గ్రంథము మాత్రమే. ఈ గ్రంథము ఛాందోగ్యమునందలి సద్విద్యను, వైష్ణవగ్రంథమగు "న్యాయభాస్కరము"నకు విమర్శగ్రంథమైన "న్యాయేందుశేఖరము"లోని సద్విద్యను,— దెలుపును.

ఈ త్యాగరాజమఖి క్రీ. శ. 1813 వ సంవత్సరమున జన్మించి క్రీ. శ. 20 వ శతాబ్దారంభమునఁ జనిపోయినట్లు విదితమౌచున్నది.

దక్షిణాపథమున నాయకరాజ్యము లేర్పడు నప్పుడు తెలుఁగు దేశమునుండి వెడలిన మంత్రి కుటుంబములకుఁ జెందిన అప్పయదీక్షితాదులు స్తవనీయులు. ఆ మహనీయుని వంశ్యులగు గంగాధరమఖియు, నాతని కొమాళ్ళు మువ్వురును పరిపాలనా ధురంధరులు, ప్రజ్ఞానిధులు నౌటయేగాక సుప్రసిద్ధ విద్వాంసులును గ్రంథ రచయితలును నని తెలిసికొనినప్పు డొడలు జలదరింపకుండునా? ఆంధ్రప్రతిభ యట్టిది!

# గ్రంథవిమర్శనము

## జ్ఞానసిద్ధాంతం

మూలం : మారిస్ కారన్ ఫోర్త్. అనుసరణ : పాముల పర్తి సదాశివరావు, ప్రచురణ : విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ. 340 పుటలు. వెల : రు. 3—75 న. పై.

మారిస్ కారన్‌ఫోర్త్ అనే ప్రఖ్యాత బ్రిటిష్ రచయిత వ్రాసిన గ్రంథానికిది తెలుగు సేత. ఈ గ్రంథం మూడు భాగాలుగా ఉంది. ప్రథమభాగంలో మనస్సు, దాని స్వభావం, పుట్టుక అనే దాన్నిగురించి, రెండవ భాగంలో భావాల పరిణామాన్నిగురించి, మూడవ భాగంలో సత్యం స్వాతంత్ర్యం అనే దాన్ని గురించి మొత్తం పధ్నా గధ్యాయాలుగా వ్రాయబడింది.

ఈ గ్రంథం గతి తార్కిక భౌతికవాద మార్గంలో వ్రాయబడింది. తక్కిన తాత్త్విక ప్రస్థానాలకంటె ఈ భౌతిక వాద మార్గం సరైనదని ఈ మార్గానుయాయుల విశ్వాసం.

ఇందలి విషయం ముఖ్యంగా ఇటు మనో విజ్ఞాన శాస్త్రానికి అటు తత్త్వశాస్త్రానికీ చెందింది. గ్రంథాదిని పరిచయం లోనే ప్రకాశకులు భావవాద మార్గాన్ని నిరసించి విడిచి పెట్టినా వాని పరంగా కొన్ని మాట లిక్కడ చెప్పవలసి యున్నది. మనస్సు, జ్ఞానము అన్న రెండు ఇందలి ముఖ్యవిషయాలు. ఉపనిషదృషులు ఇంద్రియమే (వీర్యమ్) మనస్సని, అది శరీర మంతటా ఉంటుందనీ చెప్పినారు. నేనన్నభావ మహంకారమని చిత్తం సంస్కారస్థానము స్మృతిస్థానమూ అని, మనస్సు సంకల్ప వికల్పాత్మకమైనదని, బుద్ధి నిశ్చయాత్మకమైనదని చెప్పి ఈ నాల్గింటినిచేర్చి అంతఃకరణమని ఒక్కటిగానే వ్యవహరించినారు. ఇపుడు పాశ్చాత్య దేశాల్లో మనో విజ్ఞానవేత్తలు ఫ్రాయిడియన్లు, జంగ్ అనుయాయులుకాక నియత ప్రవృత్తివాదులు (Behaviourists) క్రియావాదులు (Action Psychologists,) జెస్టల్ట్ సైకాలజిస్టులనని పలు సిద్ధాంతానుయాయులున్నారు. అమెరికాలో క్రియావాదు లెక్కువగా నున్నారు. కాని ఈ సిద్ధాంత మార్గము లేవియు మనస్స్వరూపమును సరిగా నిర్ధరింపలేదు. వీరిలో అనేకులు మనస్సు ఒక పరాయత్తమైన నాడీ మండల కేంద్రముగా భావిస్తారు. భారతీయ తత్త్వశాస్త్రంలో మనస్సు స్వతంత్ర ప్రవృత్తిగలది. (Active Principle) భౌతిక వస్తువే ప్రధాన మన్నపుడు వ్యక్తి అన్య మనస్కుడై దారిలో పోవుచున్నపుడు దృష్టి పథమున బడిన వస్తుజాత మెరుకకు రావలసిఉన్నది. కాని అనుభవంలో అట్లు జరుగుటలేదు. మనస్సు అభిముఖంగా ఉన్నప్పుడే ఎరుక కలుగుతున్నది. పైగా మస్తిష్కములోని 'మేదస్సు' మనో వ్యాపార మున కంతటికి కేంద్రమని, అదే మనస్సని చెప్ప వీలులేదు. మనస్సు స్వతంత్రమనుటకు స్మృతి గూడ ఒక కారణము. ఆ మనస్స్థానము, అందులో స్మృతిస్థానము పాశ్చాత్యవిద్వాంసులు స్ఫుటంగా చూపలేదు.అందుచేత ఇంద్రియమైన మనస్సు స్వతంత్రమని అది కరణముల ద్వారా తత్తద్జ్ఞానము నెరుకకు దెచ్చుకొనుచున్నదనియు తలంపవలసి యున్నది.

ఇవికాక దూరశ్రవణాది అతీంద్రియశక్తులు, స్వప్నము వ్యక్తి జాతిమతములకు సంబంధించని మంత్రాదుల స్మృతి మొదలుగా ననేక విశిష్ట విషయములకు లోకమున నిదర్శనము లున్నవి. జిజ్ఞాసువులు వాటిని గూర్చి పరిశోధనలు జరుపుచునే ఉన్నారు. అందుచేత మనస్సు దేహాతిరక్తమైనది కాదనిగాని ఆత్మ అన్నది వట్టి బూటకమనిగాని అనుకొనుట కంటె కొంచె మోపిక పట్టుట శ్రేయస్కరంకాదా. ముందు చెప్పిన మనో విజ్ఞాన ప్రస్థానములేవి కూడ ఆ యా అతీంద్రియ విషయాలను సరిగా సమన్వయింపలేక పోతున్నవి. ఇంక జ్ఞాన విజ్ఞానములనుట కృత్రిమమైన విభజనమని చెప్పుటకంటె ఆజ్ఞానము పలు భూమికలలో పలు విధములుగా నుండవచ్చునని ఏల తలంపరాదు? ఆ జ్ఞాన మీశ్వరత్వము. ప్రజ్ఞానం లోకమునందంతట తత్త్వమును జూచుట. సంజ్ఞానం మనో బుద్ధ్యాద్యంతః కరణ చతుష్టయముతో తెలియుట (Realisation) విజ్ఞానం లౌకికమైన వస్తుకలాది పరిజ్ఞానం. బుద్ధితో నాలోచించుట, మనసుతో నెరుగుట, సర్వాత్మనా ఎరుకగల్గుట అన్న పృథగనుభవములు నిత్య జీవితమున నుండగా వీటిని త్రోసి పుచ్చుట ఎట్లు ?

ఎంత విజ్ఞాన శాస్త్రము నంతటిని ఆకళించుకొన్నను గతితార్కిక భౌతిక వాదము గూడ తక్కిన వానివలె నున్నదని తలపవలెను. భారతీయ తాత్త్వికులలో సాంఖ్యులు, వైశేషికులు, లోకాయతికులు ప్రకృతికి పట్టము గట్టిన భౌతికవాదులే. కాని వానికంటె విశేష మిందున్నదని ఏతన్మార్గానుయాయుల విశ్వాసము.

జ్ఞానమును గూర్చి మనవారి సిద్ధాంతము మాట అట్లుండగా పాశ్చాత్య తాత్వికులు చేసిన సిద్ధాంతములనేకము లున్నవి. ప్రతినిధి భావ సిద్ధాంతం (Theory of representative ideas) తో మొదలైన డెకార్టీస్ సిద్ధాంతం పూర్వపు స్టాయిక్ తాత్త్వికులలో గుప్తంగా ఉండి ఇతనిలో ఒక విధమైన ద్వైతానికి దారితీసి విషయైక లక్ష్యం (Objective idealism) గా మారింది. బ్రిటిష్ తాత్త్వి

కుడు లాక్ దృష్టి భిన్నమై బెర్కిలీ ఆత్మాశ్రయమైన ఏకతా వాదానికి (Subjective idealism) దారితీసింది. హ్యూమ్ సంశయగ్రస్తుడైనాడు. తర్వాత రీడ్ ద్వైత యాథార్థ్య వాదం, కాంట్ సవిమర్శవాదం ఏర్పడినవి. కామ్టి, స్పెన్సర్‌వంటి వారు పరసత్యము దుర్జ్ఞేయమని మానవతా వాదానికి మొగ్గి నారు. విలియమ్ జేమ్స్ ప్రాగ్మాటిజమ్ బెర్గ్‌సన్ స్మృతి వాదం (Intuitional idealism) మెయ్‌నాంగ్ మొదలగువారి నవీనయథార్థవాదం, హెగెల్, ఖండితలక్ష్యవాదం (Obsolute idealism or Cosmism) అనేవి ఈ జ్ఞాన సిద్ధాంతంలో ఏర్పడ్డమతాలు. ఆ పరిణామ మెరిగి ఈ గ్రంథం చదువవలెను. తాము విశ్వసించిన సిద్ధాంతానికి స్వదేశ శాస్త్ర వాక్యాలనన్వ యించి చూచుకోవడ మీ అనువాదంలో యత్కించిద్విశేషం.

జటిలమైన శాస్త్రవిషయాలతో పారిభాషిక పదా లతోఉన్న మూలగ్రంథం అనువదించడంలో ఎంత సాధ్యమౌ తుందో అంతవరకు అనువాదకులు సరళంగానే వ్రాయజూచి నారు. అయినా సామాన్యుల కిది సరళ రచన కాదు. కథలాగ, నవలలాగ చదువుకొనేదికాదు. శ్రద్ధగా శ్రమకోర్చి ఆలో చిస్తూ కొంచెం కొంచెం చదువవలసింది.

అనువాదకులను, విశాలాంధ్రప్రచురణాలయం వారిని ఈ విజ్ఞాన శాస్త్రగ్రంథాన్ని అందించినందుల కభినందించ వలసి ఉన్నది.

ఎస్. కె.

## భగవద్వచనము

సృష్టి ప్రకారోద్దేశములు : కర్త : శ్రీ మెహర్‌బాబా. అనువాదకులు : శ్రీ మొసలికంటి తిరుమలరావు. ప్రచురణ : ఆంధ్ర మెహర్ మండలివారు, కాకినాడ. పుటలు 402. వెల : అమూల్యము.

అనుత్తమమైన భగవత్సృష్టిలో మానవుడుత్తమోత్త ముడు. చరాచరమైన సృష్టితోపాటు, సత్యము, ధర్మము, తపస్సు కూడ భగవంతుని వలననే కలిగినవి. అట్టి సత్య ధర్మ ముల నండగాగొని తపస్సానరించి భగవత్సాక్షాత్కారము నొందిన ఉపనిషదృషి

> "శృణ్వంతు విశ్వే అమృతస్య పుత్రా
> ఆ యే ధామాని దివ్యాని తస్థుః
> వేదాహమేతం పురుషం మహాన్తం
> ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్"

అని మానవ లోకమున కెలుగెత్తి యుద్ఘోషించినాడు. సత్యధర్మ ములు తపస్సు లోకము నిలుచుటకు కారణములు. వాని నాశ్ర యించిన మహర్షులు నాడున్నట్లే నేడును ఋషులు, ఋషి కల్పులు మన్నారు. లోకము నుద్బోధించుచున్నారు. అట్టి మహాత్ములలో శ్రీ మెహర్‌బాబాగా రొకరు. శ్రీ బాబాగారి భక్త వర్గము మెహర్ మండలులు ఈదేశముననేకాదు విదేశములం దును ఉన్నవి. శ్రీవారి లోకసంగ్రహతత్పరత కిదియే నిదర్శ నము.

'భగవద్వచన'మను ఈ గ్రంథము శ్రీ బాబాగారి (God Speeks) అను ఆంగ్ల గ్రంథమున కనువాదము. అనువాదకులు వింధ్యప్రదేశ్ మాజీ లెఫ్టినెంట్ గవర్నరు శ్రీ మొసలికంటి తిరు మలరావుగారు. బాబాగారి ఆదేశమే ఈ అనువాద హేతువు. బాబా గారి యనుగ్రహమును శ్రీ రావుగా రిట్లు తెలుగులకు పంచి పెట్టి చరితార్థులైనారు.

బ్రహ్మవిద్యాపరమైన ఈ పవిత్ర గ్రంథము పది భాగములుగా నున్నది. ప్రథమభాగమున అంతఃకరణ ప్రవృ త్తులు జీవాత్మయే పరమాత్మ యను యాథార్థ్యము చెప్ప బడినవి. రెండవ భాగమున అనాదియైన యాత్మకు ప్రథమ ప్రేరణ మొకటి కలుగుట, పరిణమదంతఃకరణమునకు దేహాం తర ప్రాప్తియనునవి వివరింపబడినవి. మూడవ భాగమున జీవ రాశి సప్తవిధవర్గీకరణము ప్రపంచితమైనది. శిలా లోహ ములు, ఉద్భిజ్జములు, సరీసృప, మత్స్య, పక్షి, జంతు, మానవ వర్గము లిందుల్లేఖింపబడినవి. నాలుగవ భాగము పునర్జన్మ మును గూర్చియు సంస్కారహీనచేత్య సామ్యావస్థను గూర్చియు చెప్పును. ఐదవ భాగమున జీవాత్మ అంతర్ముఖమైనపుడు కలుగు పరిణామము, సప్తవిధ భూమికా వివరణము చెప్పబడినవి. ఆరవ భాగమున భగవత్సాక్షాత్కారమునందలి సోపాన సంగ్రహ మభి వర్ణింపబడినది. ఏడవ భాగమున కబీరుదాసు చెప్పిన సప్త యవ నికాభేదనము వివరింపబడినది. ఎనిమిదవ భాగము పరాత్పరతర బ్రహ్మ ప్రతిపాదకము. భగవంతుని అవస్థా దశకము తొమ్మి దవ భాగమున ప్రతిపాదింపబడినది. పదియవ భాగమున గ్రంథ పరిసమాప్తి. గ్రంథమున 276 పుట తర్వాత 402 పుట వరకు ఆ యా భాగములలోని క్లిష్ట విషయముల వివరించు అను బంధమున్నది.

'ఏకం సత్ విప్రా బహుధా వదన్తి'. శ్రీ బాబాగారు క్రొత్త మతమునుగాని, ప్రస్థానమునుగాని స్థాపింప నిశ్చయించినవారు కారు. తత్త్వమెరిగినవారు. ఈ గ్రంథమున బాబాగారి యుప న్యాసమున చాల చోట్ల యోగ వేదాంత సూత్రములు, గీతా వాక్య ములు, శంకరుల పలుకులు సమన్వయించి చెప్పబడినవి. భగ

వంతుని అవస్థా దశకమును ప్రతిపాదించు తొమ్మిదవ భాగము శ్రీ బాబాగారు స్వేచ్ఛముగా నిర్మించినది. వారి పర్యవేక్షణక్రింద శ్రీ యెరుచ్ డి జస్సావాలాగారీ భాగము వ్రాసినారు. బాబాగారు స్వయముగా నిర్మించిన చిత్ర మొకటి యిచట నున్నది. భగవంతుని అవస్థాదశకమును శ్రీ బాబాగారిట్లు గణించినారు. 1. పరాత్పరతర బ్రహ్మస్థితి. 2. పరమాత్మస్థితి. 3. సృష్టిస్థితిలయ కారకుడైన భగవంతుడు. 4. జీవుడుగానున్న భగవంతుడు. 5. పరిణామాంతర్గత బ్రహ్మ. 6. అవతరన్మానవ రూప బ్రహ్మ. 7. దివ్య విభూతియోగ పురోగామిబ్రహ్మ. 8. బ్రహ్మీభూతత్వము. 9. జీవన్ముక్తాత్మత్వము. 10. గురు స్వరూపము.

తొలి భాగములందంతటను హైందవ యోగ వేదాంత పరిభాష తరచుగా కనబడుచు వచ్చినను సిద్ధాంత దృష్టికి ఈ గ్రంథము ఇస్లామునకు యోగదర్శనము వంటిదైన సూఫీ మార్గమునకు చెందినది. గ్రంథాంతమునగల అనుబంధ మంతయు సూఫీ సిద్ధాంత పరిభాషను వివరించునదే. గ్రంథ నామము, సృష్టికారణము, సప్తవిధభూమికా వివరణమున చెప్పబడిన 'ఫనా' 'బఖా'లు, భగవదవస్థా దశకమున శ్రీ బాబాగారు చెప్పిన గురు స్వరూప మనునది—ఇందలి సూఫీయోగ మార్గమునే చూపుచున్నవి. పరాత్పరతర బ్రహ్మస్థితితో నంతగా భేదములేని పరమాత్మ స్థితిలో భగవంతునియందు ఆద్య చిద్విలాస మొకటి కలిగి 'నే నెవరు?' అను ప్రశ్న వచ్చుటయే సృష్టికి మూలకారణముగా చూపబడినది. ఇస్లామునకు కొరాన్ శ్రుతిగ్రంథమైనట్లే 'హదీద్'(Traditions)స్మృతి గ్రంథము. అల్ ఖ్రరాజు సేకరించినది గాబోలు నికల్సన్ ఒక వాక్యము నిట్లనువదించినాడు : "I was a hidden treasure, and I desired to be known; therefore I created the creation in order that I might be known." ఇంక సప్తవిధ భూమికా వివరణమున ప్రసక్తమైన 'ఫనా' 'బఖా'లు సూఫీ సిద్ధాంతమున విశేషములు. సాధకుడు ప్రథమ ద్వితీయాది భూమికలు చేరుచురాగా ప్రతి భూమికలోను 'ఫనా' 'బఖా'లు కలుగును. 'ఫనా' అనగా ఆవరణ విచ్ఛేదమగుట. ద్వంద్వములనించుక అతిక్రమించుట. 'బఖా' యనగా ఆ జ్ఞాన భూమికలో పాదుకొనుట. ఇవికాక సప్తమ భూమికలో ప్రత్యేకముగా అనగా బ్రహ్మీభూతస్థితి కలుగుటకుమునుపు 'ఫనా పిలా' 'బఖా బిలా'లు తటస్థించును. మరి, భగవదవస్థాదశకమున శ్రీ బాబాగారు చెప్పిన గురు స్వరూపము సూఫీ సిద్ధాంతమునందలి 'కుతుబ్' స్థితి. ఇస్లామునందేమి సూఫీ సంప్రదాయమునందేమి పరమాద్వైత స్థితి నంగీకరింపరు. పదియవ అవస్థగా చెప్పబడిన ఈ స్థితికి 'హకీకతు—యే—మహమ్మద్' అని పేరు. సద్గురువును 'కుతుబ్' అన్నట్లే అవతారమును 'రసూల్' అందురు. భగవంతుని కార్యకర్తృత్వమును మహమ్మద్ పేరిట సూఫీలు 'మకామ్—యే—మహమ్మేదీ' అందురు. మహమ్మద్ భావమే అనుట. మొత్తముమీద భగవల్లక్షణములు సంప్రాప్తించినను కుతుబ్ భగవంతునిలో నైక్యము కాదు. ఇది మన విశిష్టాద్వైతము వంటిది కావచ్చును. కాని శ్రీ బాబాగారు కొన్ని యెడల నద్వైత సిద్ధాంతమునకు మొగ్గు చూపుదురు. కురాన్, హదీద్‌లలోని అనేక వాక్యములకు సూఫీలు చెప్పెడి అర్థమును ఇస్లాములోని సనాతనులంగీకరింపరనుట గమనించినచో బాబాగారు అద్వైతమును బలపరచుట సహజమే అనిపించును. మరి భారత దేశమున నద్వైత మార్గమునకు ఇస్లామ్ ప్రభావమే కారణమని డాక్టర్ తారాచంద్‌వంటివారు వ్రాసినారు.

యోగ ప్రతియోగ దృష్టికి హైందవ యోగదర్శనమునకును సూఫీ సంప్రదాయమునకును చాల పోలిక లున్నవి. కొన్ని భేదములు నున్నవి. మనవారు చెప్పెడి సప్త వ్యాహృతులు సప్త భూమికలు. ఒక్కొక్క భూమిక చేరిన సాధకుని కొక్కొక్క పేరు. సూఫీలు చెప్పెడి 'తౌబా' కలిగినవారు మన 'భూమికావాన్'. అట్లే మొదటి మూడు భూమికలలో చరించువాడు ముముక్షువు. చతుర్థ భూమికలో విహరించువాడు బ్రహ్మవిత్తు. పంచమ భూమికలో బ్రహ్మవిద్వరుడు. అరవ దానిలో బ్రహ్మవిద్వరీయుడు. చివరిదాని కెక్కినవాడు బ్రహ్మవిద్వరిష్ఠుడు. (వరాహోపనిషత్తు.) ఆ పాతాళబ్రహ్మలోకము—బ్రహ్మాండముగా కీర్తింపబడుచున్న పదునాల్గు లోకములు కృత్రిమములని బ్రహ్మవైవర్త పురాణము: ఏవం సర్వం కృత్రిమం తద్బాహ్యాభ్యంతర ఏవచ, నిత్యౌ గాలోకగోవైకుంఠౌ సత్యౌశాశ్వత కృత్రిమౌ" కనుక నీలోకములు జ్ఞానభూమికలనవలెను. సూఫీలు అయిదవ భూమికచేరిన సాధకుని 'వలీ' యనియు, ఆరవ భూమిక చేరిన వానిని 'పీర్' అనియు, ఏడవ భూమిక కెక్కిన వానిని 'కుతుబ్' అనియు వ్యవహరింతురు—మహమ్మద్ అన్న భావమే భగవంతుని కార్యకర్తృత్వమును ఒక్కొక్క బ్రహ్మాండమున (Logos) నెరపుననువ్యూహమార్గ భావన పాంచరాత్రాది వైష్ణవాగమములలో కనబడును. పరవాసుదేవ, ప్రద్యుమ్న, అనిరుద్ధ, సంకర్షణాది వ్యూహమార్గము—అదేకాకపోయినను తత్సదృశభావన యనుకొందును.

సూఫీ సంప్రదాయమున చాల తెగ లున్నవి. బాబాగారి రచన పర్షియన్ ప్రస్థానమునకు చెందినది కావచ్చును. సూఫీ యోగ సంప్రదాయమున కొక నిర్దిష్ట స్వరూప మిచ్చినవాడు అల్-కుషేరీ (D 438–1046) దానిని సనాతన సున్నీమతాను సారముగా సమన్వయించినవాడు అబూ హామిద్ అల్—ఘజాలీ (D505–1111)అల్—కుషేరీ తన 'రిసాలా' అనుగ్రంథమున యోగ సాధనలో నలుబదియైదు అంశములు చెప్పినాడు. 'తౌబా' (Conversion) మొదలుకొని 'రిదా' (Satisfaction) వరకు నొక ఇరువది. ఈ వీనిని 'మకామ్' (Stations) లందురు. ఆ 'రిదా' మొదలు 'మరిఫా'(Gnosis) మహబ్బా (Love), 'షౌక్' (Yearning to be constantly with God) వరకు 'హాల్' (Stages) అందురు. ఇతనికి పూర్వుడైన అల్‌సర్రాజు అనునాతడు ఏడు 'మకాము'లను పది 'హాల్'లను చెప్పినాడు. శ్రీ బాబాగారివి యన్నియు చెప్పి బరువు గొలుపక సరళమగు ధ్యాన పద్ధతిని వివరించినాడు.

# గ్రంథ విమర్శనము

మన విశిష్టాద్వైతమునందువలెనె సూఫీ సంప్రదాయమున భక్తిప్రపత్తులు, భగవద్విరహానుభవము, నిర్మలమగు ప్రేమము మొదలగు భావములు ప్రధానములు. అందుచే నెల్లరకు సుబోధములు.

గ్రంథ మాద్యంతము సామాన్యులకు గూడ నర్థమగునట్లు సులభముగా చెప్పబడినది. సూఫీ సంప్రదాయానుసారి యని తెలియకుండునంతగా హైందవ యోగ వేదాంతముల సమన్వయించుచు వచ్చినది. కనుక జిజ్ఞాసువులు ముముక్షువులైన సాధకులు అవశ్యము పఠింపదగిన గ్రంథము.

సూఫీ యోగ సంప్రదాయమును గూర్చి తెలుగున గ్రంథము లున్నట్లు సమీక్షకు డెరుగడు. శ్రీ తిరుమలరావుగారి పవిత్ర గ్రంథము ననువదించుటతో ముముక్షు వర్గమునకేకాక, తదితర జిజ్ఞాసు వర్గమునకును, తెనుగు వాఙ్మయమునకును ఉపకారము చేసినట్లైనది. ఇట్లు శ్రీ రావుగారు ఇంకొక విధముగా కూడ మన కృతజ్ఞతకు పాత్రులైనారు. ఎస్. కె.

## నాలుగు నవలలు

### మా ఘంటం

రచయిత : శ్రీ పుల్లాభొట్ల వెంకటేశ్వర్లు ఎం. ఏ. ప్రతులకు : రచయిత, ఖమ్మం. వెల : రు. 3—50.

### సుమంగళి-పన్నీటిజల్లులు

రచయిత : హరికిషన్. ప్రతులకు : సుబ్బరాయ పబ్లికేషన్సు, నర్రావారి వీధి, సత్యనారాయణపురం, విజయవాడ 2. పన్నీటిజల్లు. వెల : రు. 2—50. సుమంగళి వెల : రు. 2—00.

### ఋణానందలహరి

రచయిత : శ్రీముళ్ళపూడి వెంకటరమణ. ప్రతులకు : జయా పబ్లికేషన్సు, విజయవాడ. వెల : రు. 1—50.

ఆంధ్రదేశంలో పఠనాసక్తి విపరీతంగా పెరుగుతూంది అనడానికి నిదర్శనం నేడు వెలువడుతున్న పుస్తకాల సంఖ్య. ఎంత లేదన్నా అందరి దృష్టినీ ఆకర్షించే పుస్తకాలు చాలా వస్తున్నాయి మార్కెట్టులోకి. కాని వాటన్నిటిలోనూ మంచి నవలలు చదవడానికీ దాచుకుందుకూ కూడా బాగుండేవి ఎన్ని అని ప్రశ్నించుకుంటే సమాధానం అంత ఆశాజనకంగా ఉండడం లేదు.

ప్రచురణల సంఖ్య పెరుగుతున్న కొద్దీ రచనల పాటవం తగ్గిపోతూందేమో అనిపిస్తూంది. ప్రచురణ వ్యయం తగ్గించే దృష్టిలో చవక కాయితాలు, అందంగా లేని ముద్రణ, అచ్చు తప్పులు అన్నీ ఎక్కువ అయిపోతున్నాయి.

అదృష్టవశాత్తూ పై పేర్కొన్న నాల్గు నవలలూ యీ రకం 'తొందర' కి నిదర్శనాలు కావు. ఈ నాల్గు నవలలూ ముద్రణలో కొంత బాగున్నాయి. ముఖచిత్రాలు బాగున్నాయి. అన్నిటిలోకీ ముఖచిత్రంలో ముళ్లపూడివారి రచనదేపై చేయి.

ఇక నవలలను గురించి. 'మా ఘంటం' అన్నది పల్లెటి సీమలలో జీవితాన్ని చిత్రించే వచన రచన. ఇది ఆత్మకథ కావచ్చు. ఆత్మీయ కథ కావచ్చు. ఇందులో నాయకులు ఘంటం, నీలకంఠాలు. ఘంటం తక్కువ కులంలో పుట్టినా ఎక్కువ గుణంకల కుర్రాడు. నాయినమ్మనీ అందరినీ కాదని కూడా వాడి స్నేహం వదలలేని ఉన్నత కులజుడు నీలకంఠం. ఎప్పటికప్పుడు ఘంటంతో స్నేహం మానేద్దా మనుకున్నా అశక్తుడై ఫూరుకునేవాడు నీలకంఠం. కృష్ణాతీరంలోని పల్లెలో ప్రకృతీ, మనుష్యులూ అన్నీ కూడా అచ్చతెనుగు జాతీయత ఉట్టిపడేలా చిత్రించారు రచయిత. సంఘంలో జాతి కులాల పేరిట మనిషి మనిషికి చేసే అన్యాయ్యం, ఎవరికీ పట్టని పూరి మురికి, అనారోగ్య పరిస్థితులు అన్నీ చక్కగా యీ నవలలో మనకి కన్పిస్తాయి. దీనిలోని పాత్రలు కూడా సజీవంగా, సహజంగా ప్రవర్తిస్తాయి. మాట్లాడతాయి. అనుమానాస్పదం అయిన పరిస్థితులలో వో కుటుంబ యజమాని చనిపోతాడు. తాడూ బొంగరం లేకుండా వో అన్నా చెల్లెలూ మిగులుతారు. ఈ యిద్దరి జీవితం ఏ ఆధారమూ లేని సంసారంలో పడి నిలదొక్కుకున్న కథే యీ నవలలో గాథ. ప్రతి అడుగునా సంఘర్షణ నెదుర్కొంటూ అన్యాయాలని ఎదిరిస్తూ సాగగా, చివరికి సత్యమే జయించి అన్యాయాన్ని ఆదరంతో క్షమిస్తుంది. కథంతా కొత్త పాతల మేలు కలయిక. ప్రవాహంలాగా సులభమైన శైలిలో నడుస్తుంది. ప్రారంభించిన పాఠకులు పూర్తి అయేదాకా ఆగరు. ఇంతకన్నా నవలకి ఉత్తమలక్ష్యం ఏముంటుంది?

శ్రీ ముళ్ళపూడివారు యీనాడు హాస్యానికి పెట్టింది పేరుగా చెలామణీ అవుతున్నారు. వారి యీ ఋణానందలహరి 'ఎంతో బాగుంది' అనేసి యీ నా రుణం కాస్తా తీర్చుకుంటే

అన్యాయమే అవుతుంది. ఋణ విముక్తుడికి యీ ప్రపంచంలో స్థానం లేదుకదా! ప్రతిమాట మలుపులోనూ వ్యంగ్యం, హాస్యం కన్పించి చదువుతున్నంతసేపూ ఎంత కూడదనుకున్నా ఒక్కసారి అయినా పైకి నవ్వక మానం. పుస్తకం తనలో తను చదువుకొంటూ పైకి నవ్వకల్గడం అదే నిజమైన జోక్. ఇవి నవ్వించే దృశ్యాలు అని చీటీ కట్టనక్కర లేకుండా—యీ ఋణానందలహరిలో ప్రతి వాక్యం మనని నవ్విస్తుంది. ఆ హాస్యంలోనే ఆవేదన, అసహాయత, బేలతనం అన్నీ చిత్రించకల్గిన రమణగారు కథ చెప్పడంతో తనకి ఋణపడనివాడు లేడని రుజువు చేసుకున్నారు. 'అబద్ధాలకి మనిషే కావాలేమిటి? మా ఆడంగులు చాలరూ?' అనే మొగ నాగుల కోరలు పీకేశారు కాబోసు సుబ్బన్నకి పాపం! అంటూ జాలిపడే కాకమ్మ—ఇలాగే చీమలూ, సుబ్బన్నా, నాగలక్ష్మి—వీరంతా కలిసి మానవ ప్రకృతిలో అతి సహజం అయిన అప్పు చేసే గుణాన్ని యితోధికంగా చెస్తాయి పాఠకులకి. ఆ చెప్పించడంలో చూపిన చమత్కారం, వ్యంగ్యం అన్నీ రమణగారి మార్కు వేసుకొని చదువరులకి ఆహ్లాదాన్ని కల్గిస్తాయి.

ఇక పోతే హరికిషన్‌గారి రెండు నవలలు. సుమంగళీ, పన్నీటిజల్లూ. సుమంగళిలోనూ, పన్నీటిజల్లులోనూ ఆడవారి సమస్యలు, మగవారి సమస్యలూ రెండూ కల్పి గుచ్చెత్తి—చివరికి సాఫీ చేశారు. దాంతో దానంతట అదే నవల పూర్తి అయిపోతుంది.

పన్నీటిజల్లులో కాళిదాసు నాయకుడు. ఇంకోపాత్ర తక్షణం లేకపోతే తన వూహాలని ఉపన్యసించడం కష్టం అన్నట్లు—రాయలుని అప్పుడే ప్రవేశపెట్టారు రచయిత. అంతేఆ క్షణంనుంచీ—సంఘం స్త్రీ, నీతి నియమాలు, ప్రేమ స్వార్థం—వీ టన్నిటిమీదా తాను ఉదాత్తం అని నమ్మిన వూహాలని మాటల్లో అనిపింపచేశారు రచయిత—పాత్రలచేత.

కాళిదాసు అసలు వివాహం చేసుకోనని ఒట్టు పెట్టుకున్నవాడు. రాయలు ప్రేమించిన స్త్రీని పొందలేనివాడు. వారిద్దరి జీవితాలూ వలయాల్లాగా తిరిగి తిరిగి రాయలు వివాహం చేసుకున్న స్త్రీ కాళిదాసు 'పొందిన' స్త్రీగా తేలుతుంది. చివరికి రాయలు కాంతం అనే స్త్రీని వివాహం చేసుకుంటాడు. కాళిదాసు బైరాగి చావు చస్తాడు. చస్తూ చస్తూ 'నీ వెనుకటిభార్యసుమీ నా పొందుకోరి నన్ను కాదన్న స్త్రీ' అంటూ చెప్పి మరీ చనిపోతాడు. చివరికి సుశీల—రాయలు ఒదిలేసిన భార్యా, కాళిదాసు ప్రేమించిన స్త్రీ యీమె. ఈమె స్వైరై జీవితం చూసిచూసి ఎప్పుడో వదలి వెళ్లిపోయిన భర్త పాదాలముందు క్షమాభిక్ష కోరుతూ కనుమూస్తుంది.

ఈ నవలను గురించి ప్రత్యేకించి చెప్పుకోవలసినదేమీ లేదు. పాత్రలు—అసహజంగా మాట్లాడతాయి, ప్రవర్తిస్తాయి. భాష ఎబ్బెట్టుగా ఉంది. సంఘట్టనలూ, సమావేశాలూ, కథ గమనమూ, అన్నీ కూడా అసహజంగానే వున్నాయి. ఏదో చెప్పాలన్న ఆత్రుతతో విపరీత ధోరణిలో మాట్లాడించారు పాత్రలచేత. ఇది నవల అనేకంటే సంఘటనల పజిల్ అనాలేమో.

ఇలాగే ఉంది వారి రెండవ నవల సుమంగళి. అసలా పేరు ఎందుకు పెట్టారో అర్థంకాలేదు. దానిలో సుజాత ఏదో తప్పుచేసినట్టుంది. అదేదో స్పష్టంగా తెలియదు. 'అమృతమయం అయిన నా జీవితంలో ఒక్క విషబిందువు పడినమాట నిజమే. అది పెద్దలు చేసిన తప్పు. అందుకు నేను బాధ్యురాల్నిగాను. నా మాంగల్యం నిలుపుకోవాలనే మిషతో నన్ను ఆ నీచకార్యానికి ఒక్కసారి పురిగొల్పారు. లేకపోతే నేను సుమంగళిగా ఉండలేనన్నారు. తెలిసీ తెలియని అజ్ఞానంవల్ల పెద్దవారి మాటలు నిజమే అనుకుని ....'' అంటూ విడమర్చి చెప్తుంది సుజాత. ఈ అఘాయిత్యం ఏ సంఘపు కట్టుబాటో తెలియదు. ఏరకం సుమంగళీవ్రతమో తెలియదు. భర్త వదలడమే దాని ఫలితం. రవీంద్రుడనే యువకుడు యిలాంటి అయిదారుగురు స్త్రీలతో సాన్నిహిత్యం ఏర్పరచుకొని వారిని—నీ కథ ఏమిటి? అన్నట్లు ప్రశ్నించి సమాధానం తెలుసుకుని వారి జీవితాలు తిరిగి సవ్యం చేయడానికి ప్రయత్నిస్తాడు. సుజాత మొదటి భర్త కాంతారావు. అతని రెండవ భార్య లోలాక్షి. వితంతువు అసలు. రవీంద్రుని స్నేహితుడు నారాయణ చెల్లెలు పద్మ. పద్మ భర్త రంగనాథం. వారందరి జీవితాలూ పీట ముళ్ళుపడిపోయాయి. పడేలా చేశారు రచయిత. చివరికి నవల చెప్పే సాకుతో యీ ముళ్లన్నీ విప్పుకుంటూ పోయారు. ఆ సందర్భంలోనే—ఆశయాల కేకలు, ఆవేదనల ఆక్రందనలు, మనుష్యుల చేతకానితనం వగైరాలన్నీ గుచ్చెత్తించారు. ''ఈరీతిగా నాకు తారసిల్లిన ప్రతి స్త్రీ జీవితంలోనూ ప్రవేశించి నాకు తోచిన సలహాలు చెప్పి వారి జీవితాలు తీర్చిదిద్ది, సంసారాలు నిలబెట్టటమేనా, నా జీవితంలో నేను ఆదరించి చేయవలసిన కర్తవ్య నిర్వహణ!'' అంటూ హీరో ప్రశ్నించుకుంటాడు. అదే కర్తవ్యం చివరికి హీరోచేత నిర్వహింపచేశారు రచయిత. అందరికీ అందరూ నిలబడ్డారు అండగా. సుజాత మటుకు ఒంటరి అయిపోయింది. అందుకే ఆమె మాజీభర్త కాంతారావు ఆదేశ ప్రకారం సుజాత జీవితాన్ని తీర్చిదిద్దడానికి నిర్ణయించుకుంటాడు రవీంద్రుడు. నైతికంగా ఒక స్త్రీ పతనం కావడానికీ, దీర్ఘసుమంగళీతనానికీ ఎందుకు ముడివేశారు రచయిత? కులస్త్రీలు—యీ 'వ్రతం' ఎందుకు చేయించారు? ఇదేం ఆచారం? ఎక్కడ అమలులో ఉందీ. వీటన్నిటికీ వివరం చెప్పలేదు రచయిత. వ్యంగ్య దృష్టితో చూస్తే—ఇల్లు కలవాడిది ఒక్కటే ఇల్లు గాని అద్దెకున్నవాడికి అన్నీ యిళ్లే—అన్నట్టు పతితలు దీర్ఘసుమంగళులే కదా! రచయిత ఉద్దేశ్యం అర్థంలేనిది. భాషా, పాత్రలూ, సన్నివేశాలూ అన్నీ పేలవంగా ఉన్నాయి. నవల రాయడానికి పాత్రలూ, సన్నివేశాలూ, సంఘటనలూ గుచ్చెత్తి తిరిగి సాఫీ చేస్తే చాలదు. పాత్రపోషణ ఉండాలి. నాయకుడు ఒక్కడూ అందరి జీవితంలోకీ అలా జొరబడిపోతూంటే మిగిలిన వాళ్లు యిదే నా కథ అని చెప్తారే గాని వారూ యితని జీవితంలో భాగాలుగా ఎక్కడా కన్పించరు. ఇది అసహజం.

శ్రీమతి కె. రామలక్ష్మి.

# గ్రంథ విమర్శనము

## కృష్ణా స్రవంతి
### విద్వన్మణిమాల

రచయిత : పండిత దీవి నరసింహాచార్యులు. ప్రాప్తిస్థానం : రచయిత, అవనిగడ్డ. కృష్ణాజిల్లా.

ఈ గ్రంథం కేటలాగు లాంటిది. దివి తాలూకాలోని ఆ పరిసర పల్లెపట్లలోని ప్రముఖుల జాబితాలన్నీ ఇందులో పొందుపరుపబడ్డాయి. కృష్ణా మండలంలోనూ, విశేషించి దాని తాలూకాలోనూ ఉద్భవించిన కవులు, గాయకులు, తదితర ప్రముఖుల జీవిత చరిత్రలను యిందు క్లుప్తంగా పొందుపరచారు.

దివిసీమ చరిత్ర కెక్కినదని నిరూపించుతూ భాషా పండితులకు, వేదబ్రాహ్మణులకు, శాస్త్రజ్ఞులకు యిది ఆలవాలమనీ, యీ ప్రాంతాన సంచరించిన ప్రముఖు లందరూ వన్నెకెక్కినవారనీ చాటుతూ వారి నామధేయాలను పొందుపరచిన స్రవంతే యీ గ్రంథం. దివి ప్రాంతంలో కృష్ణ నీరు తాగిన ఉన్నతుల వివరణ యీ మణిమాల. కె. రా.

## అమరవీణ

స్వతంత్ర కావ్యము. రచయిత : శ్రీ వజ్ఝల వేంకటేశ్వర్లు, బి. ఏ., బి. ఇడి, భూపతివీధి, జయపురం, కోరాపుట్టిజిల్లా, ఒరిస్సా. క్రౌను 32 × 118 × 16 పుటలు. వెల రు. 2—00. ప్రతులు కావలసినవారు రచయితకు వ్రాయవలెను.

గ్రీక్ పురాణ కథను ఒకదానిని ఆధారం చేసుకుని భారతదేశ సంప్రదాయాలకు అనుగుణంగా చేసిన మార్పులతో కూర్చబడిన గేయ కావ్యం యిది.

కాశ్మీరదేశ ప్రభువు రుచిప్రియుడు, గానకళా ప్రవీణుడు, నారదునివల్ల గానతత్త్వాన్ని గుర్తెరిగి అమరవీణను సంపాదించాడు. అన్నివిధాలా ఆనుకూల్యం గల మాధురి అతని భార్య. వీరి దాంపత్యాన్నీ, గౌరవాన్నీ చూచి, ఓర్వలేక అసూయాపరులైన దేవతలు వారికి ఎడబాటు కలిగించారు. పాతాళాధిపతి నాగరాజు మాధురిని తన లోకానికి తీసుకుపోయాడు. రుచిప్రియుడు తన వీణాగాన ప్రభావంవల్ల పాతాళానికి పోయి నాగరాజును స్తుతించి, అతని దయను సంపాదించి, పునర్జీవితురాలైన మాధురిని తనవెంట తీసుకుని పోవుటకు వరాన్ని సంపాదించాడు. కాని నాగరాజు ఏర్పరచిన నియమాన్ని ఉల్లంఘించినందున—తన భార్య తన వెనుక వస్తున్నదో, లేదో—అని వెనకకు చూచినందున అతని సంకల్పం భగ్నమై మాధురి మరణించినది. విరక్తుడైన రుచిప్రియుడు తన వీణను తీసుకుని పర్వతాగ్రం ఎక్కి నిలుచున్నపాటున కిందికి దుమికి విగతజీవు డైనాడు. అతని వీణ సింధు నదిలో పడి, పశ్చిమ సముద్రంలోకి కొట్టుకొనిపోయి ఒక నిర్జన ద్వీపాన్ని చేరి అమరవీణయై మ్రోగుతూనే ఉన్నది. ఇదీ యిందలి కథ.

ఈ కథ యీ కావ్యంలో పన్నెండు ప్రకరణాల్లో వివరించబడినది. గ్రంథనామానికి అనుగుణంగా ప్రతి భాగానికీ 'శ్రుతి' అని పేరు పెట్టడం ఎంతో మనోహరంగా ఉన్నది. ఆయా శ్రుతులు వివిధ చంధస్సులలో కూర్చబడి, గానానికి అనుకూలములయి, తమ ప్రత్యేకతను వ్యక్తపరుస్తున్నవి. మృదుమధురాలయిన జాను తెలుగునుడికారాలు ఈ గ్రంథమంతటా కానవస్తున్నవి.

భావ ప్రకటనకయి రచయిత వాడిన పదాలు అపూర్వమైనవి. అందువల్లనే ఆయన భావాలు చదివేవారి హృదయాల్లో బాగా హత్తుకుపోతున్నవి. కథను చెప్పుటలోను, వర్ణనలను కూర్చుటలోను రచన ఏకధాటిగా, నిరాటంకంగా సాగినది. రచయిత తన రచనకు కేవల వ్యాకరణ సాధ్యాలైన పదాలనే కాకుండా హృదయంగమంగా ఉండే వ్యావహారికాలను కూడా గ్రహించడం రచనా సహజత్వాన్ని వెల్లడిస్తున్నది. ప్రాచ్య, నవ్య సంప్రదాయాలు రెండింటిలోనూ సిద్ధహస్తులైన రచయిత క్రొత్త పాతల మేలి కలయిక క్రొమ్మెరుంగులు జిమ్మేటట్లు ఈ కావ్యాన్ని కూర్చి, ఈ పద్ధతికి మార్గదర్శకులైన శ్రీ గురజాడ—అప్పారావుగారికి అంకితం చెయ్యడంఎంతో సమంజసంగా ఉన్నది. దీనివల్ల కావ్యగౌరవం ఇనుమడిస్తుంది.

ఈ గ్రంథాన్ని మెచ్చుకొని, అమూల్యమైన భాషాసేవ చేస్తున్న తెలుగు భాషాసమితివారు ఉత్తమ కావ్యంగా పరిగణించి ఐదువందల రూపాయలు బహుమతి యిచ్చారు. దీనికి విద్వాన్ శ్రీగంటి జోగి సోమయాజిగారు 'తొలిపలుకు' వ్రాసీ, డాక్టరు గిడుగు సీతాపతి పంతులుగారు 'పరిచయ వాక్యాలు' కూర్చీ వన్నెపెట్టారు.

అనాదిసిద్ధంగా గేయవాఙ్మయాన్ని అభిమానిస్తూ, ఆదరిస్తూ ఉన్న ఆంధ్రానీకం ఉత్తమ గేయ కావ్యమైన ఈ 'అమరవీణ' ను తప్పక ఆదరించగలదని నా దృఢవిశ్వాసం.

## బూచీ

(పెద్ద కథ). శోభా ప్రచురణలు—4. కర్త : శ్రీ బలివాడ కాంతారావు, క్రౌను 131 పుటలు. వెల రూ. 1—25. ప్రకాశకులు—శోభా ప్రచురణలు, విజయనగరం సిటీ.

మధ్య తరగతి కుటుంబాలకు సంబంధించిన సంఘటనలను ఈ పెద్ద కథ వివరిస్తున్నది. రాఘవయ్యగారి కుటుంబంతో రమణకు పరిచయం కలగడమూ, అది మొదట తిరస్కార భావంతో ప్రారంభమయినా క్రమంగా గౌరవప్రదంగా మారడమూ, లక్ష్మణరావుకూ, అతని భార్య ఉమకూ రమణపైని అభిమానం ఏర్పడడమూ, మొదట రమణను నిరసన భావంతో 'బూచీ' అని ఆక్షేపించిన తులసియే చివరకు అతన్ని ప్రేమించడమూ చాలా చక్కగా చిత్రించబడినవి. రచయిత పాత్రల సంభాషణలలో తన చాకచక్యాన్ని బాగుగా చూపించాడు. ఇందులోని పాత్రలన్నీ, వాటివాటికి తగినట్లు చక్కగా పోషించబడినవి. రచన ధారాళంగా సాగినది.

ఈ కథ ఇదివరకు 'భారతి' లో ప్రకటించబడినదే ! ఇప్పుడు పుస్తకరూపంగా వెలువరించబడినది.

జాతిమత భేదాలనుగానీ, ప్రాంతీయ దురభిమానాలనుగానీ పాటించకుండా, రచయితల మధ్య స్నేహాన్నీ, సౌహార్దాన్నీ పెంపొందిస్తూ, ఉత్తమ రచనలను ప్రచురిస్తూ ఉన్న శోభా ప్రచురణ సంస్థవారు వర్తమాన రచయిత శ్రీ కాంతారావుగారి కథను అచ్చువేయడం సంతోషించదగిన విషయం !

# వార్తలు

## రాష్ట్రపతి అస్వస్థత

రాష్ట్రపతి డాక్టర్ రాజేంద్రప్రసాద్ శరీరారోగ్యం పాడయినదనీ, అయితే శస్త్రచికిత్స చెయ్యవలసిన ఆవశ్యకత ఏర్పడకపోవచ్చుననీ అధ్యక్షునికి చికిత్స చేస్తున్న వైద్యసంఘం జూలై 21 వ తేదీన ఒక ప్రకటన చేసింది.

ఈ ప్రకటనపై జనరల్ భాటియా, ఎ. కె. బేల్ మొదలయినవారు సంతకాలు చేశారు. ఉపరాష్ట్రపతి డాక్టరు రాధాకృష్ణ, ప్రధానమంత్రి శ్రీ నెహ్రూ, శ్రీమతి ఇందిరా గాంధి, శ్రీ జయప్రకాష్‌నారాయణ్, శ్రీ భూపేష్‌గుప్తా, కేంద్ర మంత్రులు, రాయబార కార్యాలయోద్యోగులు, నర్సింగ్ హోంకు వెళ్ళి డాక్టర్ రాజేంద్రప్రసాద్‌ను సందర్శించారు.

అధ్యక్షుని పరిస్థితి గత గురువారం రాత్రి కొంచెం ఆందోళనకరంగా ఉన్నట్టు కనబడింది. కాని పరిస్థితి కుదుట బడవచ్చునని వైద్యులు భావిస్తున్నారు.

## ఆంధ్రరాజధానిలో విద్యార్థుల సమ్మె

ఆంధ్ర రాజధానిలో విద్యార్థుల సమ్మెవల్ల ఉస్మానియా విశ్వవిద్యాలయము, దానికి అనుబంధించిన కళాశాలలు నిరవధికంగా మూసివెయ్యాలని విశ్వవిద్యాలయం సిండికేటు జూలై 20 వ తేదీన ఒక తీర్మానం చేసింది.

విశ్వవిద్యాలయంలో జీతాల హెచ్చింపుపట్ల నిరసనగా కొందరు విద్యార్థులు చేసిన విధ్వంసక చర్యలపట్ల సిండికేటు తీవ్రాందోళన వ్యక్తీకరించింది. ఫీజుల హెచ్చింపు పట్ల నిరసన తెలియజేసేందుకు విద్యార్థు లీవిధంగా ఒక ఉద్యమం లేవదీయడం పూర్తిగా న్యాయ్య విరుద్ధమని సిండికేటు భావిస్తున్నది. తిరిగి ప్రశాంతపరిస్థితి ఏర్పడేవరకు మూసివేత కన్న మరి గత్యంతరం లేదని సిండికేటు నిర్ణయించింది.

ఇది ఇలా ఉండగా జంట నగరాలలో గల పాఠశాలలన్నీ తిరిగి ఉత్తరువు జారీ అయ్యేంతవరకు మూసిఉంచవలెనని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నిశ్చయించింది.

## బ్రహ్మాండమైన తోకచుక్క

అత్యధికమయిన బరువు కలిగిన ఒక తోకచుక్కను రష్యా ఖగోళ శాస్త్రజ్ఞులు ఒకరు కనుగొన్నారని మాస్కో రేడియో నేడు ప్రకటించింది. దీని వ్యాసం చంద్రగోళం కన్న పదిరెట్లెక్కువని తెలుస్తున్నది. 1957 లో కనిపించిన తోకచుక్క లన్నిటికన్నా చాలా పెద్దవి. వాటి తరువాత ఇంత పెద్ద తోకచుక్క కనబడలేదని రష్యా శాస్త్రజ్ఞులు భావిస్తున్నారు.

## రష్యాలో ఆహారవస్తుసామగ్రి సరఫరా

1880 వ సంవత్సరం నాటికి రష్యన్ ప్రజలకు సరుకులు, ఆహారపదార్థాలు ఉచితంగా సరఫరా చేసే పద్ధతిలో నూతన సోవియెట్ కమ్యూనిస్టు కార్యక్రమం రూపొందించబడగలదని తెలుస్తున్నది. ఈ కార్యక్రమం ప్రకటన ఈ వారాంతంలోగా వెలువడగలదని జూలై 28 వ తేదీని విశ్వసనీయంగా తెలియవచ్చింది.

ఆట్టే సంవత్సరాలు గడవకముందే రష్యాప్రజ లందరికి ఉచితంగా ఆహారం సరఫరా చేసే పద్ధతి ఏర్పరచగలమని సోవియెట్ ప్రధాని శ్రీ నికితా కృశ్చేవ్ త్వరలోనే వాగ్దానం చేయవచ్చునని పరిశీలకులు భావిస్తున్నారు. కమ్యూనిస్టుపార్టీ చరిత్రలో ఈ వినూతన కార్యక్రమము అత్యంత ప్రధానమైనది. ఇతర దేశాల కమ్యూనిస్టుపార్టీల కన్నింటికి ఆదర్శప్రాయమైనది.

## న్యూఫౌండ్‌లాండ్‌లో అగ్నిప్రమాదం

జూలై 30 వ తేదీన న్యూఫౌండ్‌లాండ్‌కు తూర్పు ప్రదేశం మధ్యభాగంలో ఉన్న విశాలమైన అడవులలో పన్నెండుకు పైగా పెద్ద పెద్ద అగ్నిప్రమాదాలు సంభవించాయి. ఈ అడవులవల్ల కాగితం పరిశ్రమకు కావలసిన గుజ్జు విశేషంగా లభిస్తున్నది. ఈ అడవులలో చాలాభాగం పరశురామప్రీతి కావడంతో అక్కడ ఉన్న మూడు తెగలవారు తండోపతండాలుగా తామున్న ప్రదేశాలు ఖాళీచేసి వెళ్లిపోయారు. నేటి రాత్రి మరో రెండు తెగలవారు దూర ప్రదేశాలకు ప్రయాణమవుతున్నారు. అయితే వీరి నివాసాలకు చుట్టూ పెద్ద పెద్ద కందకాలు ఉండడంవల్ల ప్రమాదా లెక్కువగా జరుగలేదని తెలుస్తున్నది.

**Printed & Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna, at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor : S. Sambhu Prasad.**